

# వచన మహాభాగవతం

4

శ్రీ పోతన మహాభాగవతమునకు అనుకృతి

అయినంపూడి గురునాథరావు

# ఎమెస్కో వచన మహాభాగవతం

## (నాల్గవ సంపుటం)

శ్రీ పోతన మహాభాగవతమునకు అనుకృతి

అయినంపూడి గురునాథరావు



యం. శేషాచలం అండ్ కంపెనీ
మచిలీపట్నం - సికింద్రాబాద్

# EMESCO VACHANA MAHA BHAGAVATAM-4

As retold by
Sri AYINAMPUDI GURUNATHA RAO

Publishers :
M. SESHACHALAM & Co.,
Machilipatnam - Secunderabad-3



First Edition :
FEBRUARY, 1986




Printers :
PUSHPA PRINTERS,
Tilak Nagar,

Distributors :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
3237, Rashtrapati Road, Secunderabad-500 003

PRICE : Rs. 15-00



# మహాభాగవతం

## (అష్టమస్కంధం)

పరీక్షిజ్జనపాలుడు శుకయోగీంద్రుని జూచి - మునినాథా! నీ వలన స్వాయంభువ మను వంశక్రమం సమస్తం విన్నాను. వర్ణాశ్రమ ధర్మాలు తెలిసికొన్నాను. మనుజులు, దనుజులు,[1] దేవతలు, ప్రజాపతులు ఎలా జన్మించారో బోధపడ్డది. అసలు మనువులెందరు? వారెవ్వరు? ఏ మనువు కాలంలో శ్రీహరి ఎలా అవతరించి యేంచేశాడు? యోగీంద్రా! శ్రీహరి గతించిన మన్వంతరాల్లో ఏం చేశాడో, ఇప్పుడేం చేస్తున్నాడో, రాబోవు మన్వంతరంలో ఏం చేస్తాడో, సాకల్యంగా చెప్పు—అని అర్థించేసరికి శుకయోగి యిలా అన్నాడు:-

రాజేంద్రా! విను. మనువులు పదునాలుగురు. వారిలో ఈ కల్పంలో[2] ఆర్వురయ్యారు. ఇంతవరకు జరిగిన సృష్టి విశేషాన్ని గురించి నీకు ఇదివరకే చెప్పాను. మొదటి మనువగు స్వాయంభువునకు ఆకూతి, దేవహూతి అను ఇద్దరు కుమార్తెలున్నారని కూడా చెప్పాను కదా! లోకాలకు ధర్మం జ్ఞానం బోధించడానికి శ్రీహరి ఆకూతి కడుపున కపిలుడుగా, దేవహూతి గర్భాన యజ్ఞుడుగా, అవతరించాడు. కపిలుని చరిత్ర యింతకుముందే నీకు చెప్పాను. ఇక యజ్ఞుని చరిత్ర చెపుతాను విను.

స్వాయంభువ మనువు తన భార్య శతరూపవలన సకల భోగాలూ అనుభవించి విరక్తిచెందాడు; రాజ్యభారం విడిచిపెట్టి ఆమెతోగూడి అరణ్యానికి వెళ్ళి సునందానదీతీరాన నేలపై ఒంటికాలితో నిలబడి నిష్ఠతో నూరేండ్లు దారుణ తపం చేశాడు. అలా తపస్సుచేస్తూ ఆతడు తన మనస్సులో ఈరీతిగా వితర్కించాడు.

పరమేశ్వరుడు సృష్టికర్త. కాని ఆ సృష్టి అతణ్ణి తెలిసికోలేదు. ప్రళయ సమయంలో లోకాలన్నీ నిద్రాముద్రితాలైనపుడు ఆతడొకడే మేల్కొని సమస్త

---

1 దను వనువానికి పుట్టిన రాక్షసులు 2 కల్పం = బ్రహ్మదేవునకు ఒక పగటికాలం.

బ్రహ్మాండాన్ని విలోకిస్తూ ఉంటాడు. ఆత్మకు అతడు ఆధారభూతుడు. ఆతని నిజస్థితి ఇంతవరకు ఎవనికీ తెలియదు. ఆతని దృష్టికి ఎదురులేదు. అతనికి పుటుకలేదు. పెంపులేదు. లయంలేదు. అతడు సర్వాంతర్యామి. అతడు విశ్వరూపుడు, నిరహంకారుడు, నిరాధారుడు, పరిపూర్ణుడు, అనన్య ప్రేరితుడు, నరులను స్వీయాచారపరులనుగా చేయాలనేది ఆతని దీక్ష. అతడు నిఖిల ధర్మభావనుడు. నిజమార్గ సంస్థితుడు. ఆ పరమేశ్వరునకు నా నమస్కారాలు—

అని స్వాయంభువమనువు ఉపనిషదర్థాలను పలుకుతుండగా క్షుధాతురులైన రాక్షసులు ఆతనిని చంపి తినడానికి ఉద్యమించారు. సర్వగతుడైన శ్రీహరి వారి దుశ్చింత తెలిసికొని యజ్ఞుడను పేరుతో అవతరించి తన చక్రధారలతో ఆ రాక్షసులను సంహరించాడు. ఇది ప్రథమ మన్వంతరం. రాజేంద్రా! ప్రతిమన్వంతరంలోను, మనువులు, మనుపుత్రులు, దేవతలు, ఇంద్రుడు, ఋషులు, హరి తప్పకుండా ఉంటారు. మొదటి మన్వంతరంలో మనువు స్వాయంభువుడు. మనుపుత్రులు ప్రియవ్రతాదులు. మరీచి ప్రముఖులు ఋషులు, యజ్ఞపుత్రులు యామాదులు దేవగణాలు. యజ్ఞావతారం ధరించిన హరి ఇంద్రుడు. ఇక ద్వితీయ మన్వంతరగాథ చెపుతాను విను.

రెండవమనువు అగ్నికుమారుడైన స్వారోచిషుడు. ద్యుమంతుడు, సుషేణుడు, రోచిష్మంతుడు మొదలైనవారు మనుపుత్రులు. వారు రాజ్యపాలనం చేశారు. వారిలో రోచనుడు ఇంద్రుడయ్యాడు తుషితాదులు దేవతలయ్యారు. ఊర్జస్తంబుడు మొదలైనవారు సప్తర్షులయ్యారు. ఆ కాలంలో వేదశిరుడను ఒక బ్రహ్మర్షి ఉన్నాడు. అతని భార్య తుషిత. పరమేశ్వరుడు ఆమె కడుపున జన్మించి విభుడను పేరుతో విశ్రుతుడయ్యాడు. ఎనభైఎనిమిది వేలమంది దృఢవ్రతులైన ఋషుల అనుగ్రహ విశేషంచేత అతడు కౌమార బ్రహ్మచర్య వ్రతాన్ని పాలించాడు.

ప్రియవ్రతుని పుత్రుడగు ఉత్తముడు మూడవ మనువు. అతని కొడుకులు పవనుడు, సృంజయుడు, యజ్ఞుడు, హోత్రుడు మొదలైనవారు సమస్త భూభారం వహించి చక్కగా పాలించారు. వశిష్ఠకుమారులైన ప్రమథాదులు సప్తర్షులయ్యారు. సత్యజిత్తనువాడు దేవేంద్రుడయ్యాడు. సత్యులు, దేవశ్రుతులు, భద్రులు అనువారు దేవగణాలయ్యారు. ధర్ముడనువానికి సూనృతయను భార్యయందు శ్రీహరి సత్యసేనుడనే పేరుతో జన్మించి ఇంద్రునకు బాసటగా ఉండి లోకాలు సన్నుతిస్తుండగా యక్షరాక్షసులను నిర్మూలించాడు.

రాజేంద్రా! ఇక నాల్గవ మనువు కథా విశేషాలు చెపుతాను విను. ఉత్తముని సోదరుడు తామసుడు నాల్గవ మనువు. కేతువు, వృషుడు, నరుడు,

ఖ్యాతి మొదలైన మను పుత్రులు పదిమంది పృథ్వీపతులయ్యారు. వారందఱు మహాబలాఢ్యులు. సత్యకులు, హరులు, వీరులు అనువారు దేవగణాలయ్యారు. త్రిశిఖుడనువాడు దేవేంద్రుడయ్యాడు. జ్యోతిర్వ్యోముడు మొదలగువారు సప్తర్షులయ్యారు. ఆ తామసమన్వంతరంలోనే విధృతి కొడుకులు వైధృతులు దేవతలై కాలవశంచేత నశించిన వేదాలను స్వీయ తేజంతో సముద్ధరించారు. భగవంతుడు హరిమేధునకు హరిణియందు హరియను పేరుతో జన్మించాడు. మొసలిచే పట్టువడిన గజేంద్రునకు ప్రాణభిక్ష పెట్టాడు. హరి దయాసాగరుడు. సకలలోకేశ్వరుడు — అనిన శుకయోగిని చూచి పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు.—

మునీంద్రా! ఆశ్చర్యంగా ఉందే! మొసలి జలచరమయ్యె. గజేంద్రం కాఱడవిలో ఉంటుందయ్యె. అలాంటప్పుడు మొసలి దాన్ని ఎలా పట్టుకున్నదీ, శ్రీహరి గజేంద్రాన్ని ఎలా రక్షించాడూ? ఈ కథ వినాలని నాకు వేడుకగా ఉంది. ఏ కథల్లో పుణ్యశ్లోకుడైన శ్రీహరి కీర్తింపబడతాడో, ఆ కథలు పుణ్యప్రదాలు. అంచేతనే అందఱూ ఆ కథలను చెవులకు పండువుగా వింటారు- అని పరీక్షిన్నరేంద్రుడనేసరికి శుకయోగి ఇలా చెప్పడం మొదలు పెట్టాడు.

## గజేంద్ర మోక్షణ కథా ప్రారంభం

రాజేంద్రా! విను. పాల సంద్రంలో త్రికూటమను పర్వతం ఒకటుంది. అది పదివేల యోజనాల ఎత్తూ, అంతే వెడల్పు కలిగి మనోహరంగా ఉంటుంది. దానిక మూడు శిఖరాలున్నాయి. ఒకటి కాంచనమయం, రెండవది లోహమయం, మూడవది రజతమయం. ఆ కొండ చరియల్లో గైరికాది ధాతు రంజితాలైన మఱికొన్ని శిఖరాలు దిశలను, భూమ్యాకాశాలను ప్రకాశింప జేస్తూ ఉంటాయి.

ఏపుగా పెరిగిన చెట్లూ, తీవల్లూ, పొదరిండ్లూ; గలగలమని ధ్వనిస్తూ నిరంతరం ప్రవహించెడి సెలయేళ్లూ ఆ త్రికూటాద్రికి వన్నె కూరుస్తూ ఉంటాయి. ఆ కొండపై దివ్య విమానాలు నయనపర్వంగా తిరుగుతూ ఉంటాయి. కిన్నెరులు ఆ కొండ చరియల్లో మహోల్లాసంగా క్రీడిస్తూ ఉంటారు.

ఆ త్రికూట నగంమీద లేని చెట్టులేదు. మాదిఫలాలు, లవంగాలు, పుల్లమాది ఫలాలు, మొగిలి పొదలు, జీడి చెట్లు, దేవదారువులు, పనసలు, రేగులు, పొగడలు, అశోకాలు, మర్రి చెట్లూ, అవిసెలు, గన్నేరులు, ఎఱ్ఱ గోరింటలు, పచ్చ గోరింటలు, మేడిచెట్లు, ఖర్జూరపు చెట్లు, కొబ్బరి చెట్లు, పొదిలిచెట్లు, మంచిగంధపుచెట్లు, వేపలు, మందారాలు, నేరేళ్ళు, నిమ్మలు,

విప్పచెట్లు, తాళ్ళు, గిఅకతాళ్ళు, చీకటిమ్రాకులు, మామిడిచెట్లు, మద్దిచెట్లు, మారేడులు, ఉసిరికలు, పోకలు, కడిమిచెట్లు, కరివేపలు, అనంట్లు, వెలగచెట్లు, కలజువ్విచెట్లు, దిరిసెనచెట్లు, అశోకవృక్షాలు, పొన్నలు, సురపొన్నలు, మోదుగుచెట్లు, మల్లికలు, మరువకాలు మొదలైన నానాజాతి వృక్షసంతతులు ఏపుగా పెరిగి, చిగిర్చి, మొగ్గలుతొడిగి, సుమించి, ఫలించి ఆ నగశోభను ఇనుమడింపచేస్తూ ఉంటాయి.

ఆ కొండపై ప్రవహించెడి సెలయేళ్ళలో మణుల యొఅపిడికి రాలిన రేణువులతో ఏర్పడిన తిన్నెలపై పనసపు చెట్లతోపులు దట్టంగా పెరిగి ఉన్నాయి. ఆ చెట్లకొమ్మల నడుమ మాగినపండ్లను చిలుకలు, కోయిలలు, వాడి ముక్కులతో పొడిచి రంధ్రాలుచేస్తే ఆ ఫలరసం వాటిగుండా స్రవించి కాల్వలు కట్టుతూ ఉంటాయి.

స్వర్ణమయమైన నీటితో నిండిన అచటి తటాకాల్లో ఎఱ్ఱదామరలు, చెంగలువలు, నల్లకలువలు, వెలిదమ్ములు నలుదిక్కులా పరిమళాన్ని విరజిమ్ముతూ ఉంటాయి. ఆ పరిమళానికి పరవశించి మదించిన గండు తుమ్మెదలు మధుకరాంగనలు గాఢంగా కౌగిలించుకొని ఆనందంలో మునిగి తేలుతూ ఉంటాయి. ఆ తుమ్మెద జంటలకు దగ్గఅగా విహరిస్తూ కలహంసలు బెగ్గురులు, నీటికోళ్ళు, జక్కవపిట్టలు, కొంగలు, పెద్దకొక్కెరలు చేసెడి రొదలతో భూనభోంతరాళం బ్రద్దలైపోతుంది.

చంద్రకాంతశిలలు.మరకతమణులు, పద్మరాగాలు,వైడూర్యాలు ఇంద్ర నీలాలు,గోమేధికాలు, పుష్యరాగాలు, మొదలైన అనర్ఘమణిగణాలతో నిండిన ఆ గిరిశిఖాగ్రాలను, గుహాప్రదేశాల్లోను, విద్యాధరులు, విబుధులు, చారణులు, గరుడులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు నిజాంగనలతో గూడి చేసే సరస సల్లాపాలతో సంగీత ప్రసంగాలతో మార్మ్రోగుతూ అదొక నిత్య మంగళా యతనంగా ఉంటుంది.

గంధగజాలు, గవయమృగాలు, గండభేరుండాలు, ఖడ్గమృగాలు, పులులు, సింహాలు, శరభమృగాలు, తోడేళ్ళు, చమరీమృగాలు, ఏదుపందులు, ఎనుబోతులు, కోతులు, మహోరగాలు పరస్పరం కావించెడి కలహ సన్నాహ సంరంభానికి దిక్కులు దద్దరిల్లిపోతూ ఉంటాయి.

ఆ పర్వత సమీపంలో ఒక ఘనారణ్యం ఉంది. అది బోయతలకు బోయలకు ఆటపట్టు. ఆ అడవిలో కాఱుదున్నలు, భల్లూకాలు, ఖడ్గమృగాలు, గవయ మృగాలు, కోతులు, ఈలపురుగులు, చమరీమృగాలు, సింహాలు, శరభ మృగాలు, ఏదుపందులు, గుడ్లగూబలు స్వేచ్ఛగా తిరుగుతూ ఉంటాయి.

ఆ అడవిలో దిగ్గజాలను సైతం ధిక్కరించెడి మదగజయూథాలు ఎన్నో ఉన్నాయి. అవి చూడడానికి ఎంతో భయంకరంగా ఉంటాయి. అవి గుంపులు కట్టి కొండగుహల్లో కేళీ విలాసాల్లో మునిగితేలుతూ అలసి దప్పికగొని సాయం సమయంలో ఆ కొండ గుహలనుండి వెల్వడి నీటిగాలి ననుసరించి జలాశయానికి అభిముఖంగా మందగమనంతో వస్తుంటే, సూర్యరశ్మికి వెఱచి కాఱుచీకట్లు పగలంతా పర్వతకందరాల్లో దాగి సాయంవేళ సూర్యకాంతి మందగించాక నెమ్మదిగా బయటకు అడుగుపెడుతూన్నట్లు తోస్తుంది.

ఆ మదేభాలు కొండలకైనా తలగవు. సింహాలను చూచియైనా వెనుకంజ వేయవు. పిడుగులకు కూడా జంకవు. వాటి బలసంపత్తి అనుపమానం. ఆభద్రగజాల గాలి సోకితేచాలు పులులు పొదరిండ్లలో దూఱుతాయి. ఎనుగుబంట్లు కొండగుహల్లో చొరబడతాయి. అడవిపందులు నేలలోని బొరియలలో దాక్కుంటాయి. లేళ్ళు దిగంతాలకు పారిపోతాయి. దున్నపోతులు మడుగుల్లో అణగి ఉంటాయి. కోతులు కొండకొనలకు ఎగబ్రాకిపోతాయి. మహాసర్పాలు పుట్టల్లో చుట్టలుచుట్టుకొని నక్కి ఉంటాయి. నెమిళ్ళు ఆకాశానికి ఎగిరిపోతాయి. చమరీమృగాలు భయపడి తమ తోకలతో విసరి ఆ భద్రగజయూథాల బడలికను పోగొడ్తాయి.

ఆ గజయూథాల మదజలగంధాన్ని తమకంతో తనివితీరా గ్రోలి తుమ్మెదకొదమలు ఝంఝుమ్మని గానంచేస్తూ పరవశించిపోతాయి. అపుడొక మగతుమ్మెద ఏనుగుల మదజల గంధంకోసం ఆడుతుమ్మెదలు తహతహలాడడం భావ్యంకాదని అధిక్షేపించగా సిగ్గిలి తన దగ్గఱకు వచ్చిన తన ప్రియురాలికి తానే మగటిమితో ఆ మదజలాన్ని తెచ్చి అందించింది. అది చూచి మిగిలిన తేంట్లుకూడా అలాగే మదజలాన్ని తెచ్చియీయగా వాటి ప్రియాంగనలా మదజలాన్ని అంగీకరించి ఆనందంతో మైమరచి ఝుంకృతులు చేస్తున్నాయి. అలాకాక ఒకవేళ కొన్ని ఆడుతుమ్మెదలు మదజలంకోసం ముందుగాపోయి ఆ ఏనుగుల చెక్కిళ్ళపై మునరగా మగతేంట్లు ఏమీ వ్యథ చెందకుండా మనసులో మహోల్లాసం చెందుతూ ఉంటాయి.

ఆ సమయంలో—

అచటి ఏనుగు గున్నలు చేసే సంరంభం చెప్పనలవికాదు. చిన్న చిన్న మడుగుల్లో చొరబడి వాటిని చిందరవందర చేస్తాయి. ఫల వృక్షాలను ఒరసికొని పడగొడ్తాయి. చివురు మొత్తాలను ఇష్టం వచ్చినట్లు తింటాయి. పులులను, కాఱెనుబోతులను, మృగాలను పోనీకుండా అడ్డగించి అదలిస్తాయి. కొలకుల్లో దిగి కలచివేస్తాయి. కొండపైకెక్కి క్రీడిస్తాయి. తొండాలతోనూ, మదజలంతో నిండిన చెక్కిళ్ళతోనూ, కుంభస్థలాలతోనూ దట్టిస్తే కొండలు

తల క్రిందై పడిపోతూంటాయి. దిక్కులు బెండువడి కంపిస్తాయి. ఆ భీభత్సానికి లోకాలు గజగజలాడి పోతాయి.

లెక్కింప నలవికాని ఏనుగుల గుంపులలా అడవిలో స్వైరవిహారం చేస్తూండగా ఒక గజేంద్రం వెనుకపడిపోయింది. ఆ గజరాజుతో ఒక కోటి ఆడేనుగులు కూడా వెనుకపడి అతణ్ణి సేవిస్తూ అతనితోపాటు ఉండిపోయాయి. దప్పికగొని తమతోపాటు వస్తూన్న ఇతర గజయూథాలు ఏమయ్యాయో తెలియక దారితప్పి ఆ కరీంద్రం తన కరిణీ సమూహంతో మరోదారిపట్టి వెళ్ళింది. విధి విలాసం దుర్జ్ఞేయం కదా!

మదించిన ఆ గజరాజు తన ప్రియురాంద్రయందలి అనురాగాతిశయం చేత వల్లపు నేలల్లో ఏపుగా పెరిగిన లేబచ్చికను వాటికి అందిస్తుంది. చివురు జొంపాలతో మనోహరంగా ఉన్న పూవుగొమ్మలను త్రుంచి వాటికి పంచి పెడుతుంది. మదజలంలో చల్లనైన చెవులనెడి విసన కఱ్ఱలతో సూక్ష్మములైన వాటి (ఆడేనుగుల) మర్మస్థానాలయందలి చెమటలుపోగొడుతుంది. తొండాలతో మృదువుగా వాటి మెడలు నిమురుతూ వలపులు చిందిస్తుంది. పిఱుదుల వెనుక జేరి ప్రేమతో వాసనచూస్తూ ఋతు సమయం కనిపెట్టి తొండం పైకెత్తి వాటితో రతిక్రీడలో మునిగితేలుతుంది. రతిఖేదంతో కొంతసేపు విశ్రమిస్తుంది.

ఆ కరినాథుని సోయగం వర్ణనాతీతం.

దాని కుంభస్థలాల సౌష్ఠవానికి సరిరాక జవ్వనుల పాలిండ్లు పైట కొంగును చాటుచేసుకుంటాయి. దాని నడకయొక్క గంభీరతకు చాలక స్త్రీల నడకలు అందియల అండనాశ్రయిస్తాయి. దాని తొండంయొక్క సొంపునుచూచి కలతచెంది నవ యువతుల తొడలు ఒడ్డాణాన్ని తోడు తెచ్చుకుంటాయి. దాని దంతకాంతికి సరిరాక జవరాంద్ర నవ్వులు ముఖ చంద్రకాంతుల ముసుగు మాటున చేరుతాయి. దాని లావణ్యాన్నీ, రూపసౌందర్యాన్నీ పరిశీలించి చూడాలనే కుతూహలంతో దిక్కరుల భార్యలు దానివెంటపడి నడుస్తాయి.

అలా కరేణువులు వెంటరాగా ఆ మదకరి అడవుల్లో దారితప్పి తిరిగి తిరిగి అలసిపోయింది. దప్పికతో ఆ గజయూథం అలమటించిపోయింది. పోగా పోగా తుదకు వాటికొక కాసారం (కొలను) కంటపడ్డది. అప్పుడే వికసించిన తామరపూలతోను, కెందామరలతోను ఆ కొలను కనువిందు చేస్తోంది. తుమ్మెదలు మధురంగా ఝుంకృతులు చేస్తూ పూవు పూవునకు తిరుగుతున్నాయి. తాబేళ్ళతోను, చేపలతోను, మొసళ్ళతో అది దుష్ప్రవేశంగా ఉంది. ఆ కొలను గట్టున మ్రరిచెట్లు, గిరక తాడిచెట్లు, మామిడిచెట్లు ఏపుగా పెరిగి అందంగా ఉన్నాయి. నానా విధాలైన పూతీవియలు వాటిని పెనవేసుకుని ఉన్నాయి. రాయంచలు, చక్రవాకాలు, కొంగలు కోలాహలంగా

సంచరిస్తున్నాయి. పురుష సంచారం లేకుండా నిర్మలంగా ఉన్న ఆ తామర కొలను చూచి ఆ గజయూధం పరవశించిపోయింది.

తామర పూవుల సుగంధం వహించి చల్లగా మెల్లగావీస్తున్న గాలులకు వాటి శరీరాలుపులకించిపోతున్నాయి. తామర తూండ్లు తినడంవలన స్ఫుటంగా ఉన్న రాయంచల కూజితాలు చెవులకు విందుచేస్తున్నాయి. వికసించిన కలువలయొక్కయు తామరల యొక్కయు సుగంధం ఘ్రాణతర్పణం చేస్తోంది. ఆ కొలను చిఱుతరగల నుండి వెల్వడెడి నీటి తుంపరలు వాడిపోయిన వాటి ముఖాలకు సేదతీరుస్తున్నాయి. ముల్లోకాలకు క్రొంగ్రొత్త కాంతిని కల్పించెడి ఆ కొలను వైభవం కనువిందు చేస్తోంది. గజయూధం పారవశ్యంతో ఇంద్రియ వ్యాపారాలు మఱచి ఆ మడువులో ప్రవేశించాయి.

తొండాలనిండా నీళ్ళు పూరించి పరస్పరం చెక్కిళ్ళపై చల్లుకొంటూ, గళగళమని ధ్వనులు చేస్తూ ఆ యేనుగులు కడుపునిండా నీళ్ళు త్రాగాయి. అలా దప్పిక తీర్చుకొన్నాక గజేంద్రుడు తన తొండంనిండుగా నీరు పూరించి ఆకాశానికి ఎత్తి చిమ్మేసరికి ఆ నీటిలో పైకి ఎగసిన పెద్ద చేపలు మొసళ్ళు ఆకాశమందున్న మీనమకర రాసులను పట్టుకొని బాధించాయి. దేవతలది చూచి నిశ్చేష్టులయ్యారు.

ఆ గజరాజు అలాకొలనులో విహరిస్తున్నప్పుడు ఆడేనుగులు తొండాలతో నీరు నింపి ఏకధారగా దానిపై చల్లగా అది సెలయేళ్ళతో గూడిన కాటుక కొండలాగా ఉంది. తామర పూవులను త్రుంచి దానిపై నుంచగా అది సహస్రాక్షుడైన ఇంద్రుడులాగా గోచరించింది. ఎఱ్ఱదామర పూవుల పుప్పొడిని గ్రహించి దానిపై చల్లగా అది మేఱు పర్వతంగా కన్పడింది. తెల్ల తామరల కాడలను పెఱికితెచ్చి దాని శరీరంనిండా నింపేసరికి అది సర్పభూషణుడైన శివుడులాగా ఉంది. అంతేకాదు ఆ ఆడేనుగులు కరీంద్రునిపై ముత్తెపు చిప్పలు చిమ్మగా అది మెఱుపులతో గూడి నీలమేఘం యొక్క సోయగాన్ని ధిక్కరిస్తున్నట్లుంది.

మదించిన ఆ గజేంద్రుని జలక్రీడా వినోదాల వలన కలతవారిన ఆ సరోవరలక్ష్మి నూతన కాంతిని సంతరించుకొని, మన్మథ విద్యాపారీణుడైన కోడెకాని కౌగిలింతలతోను, రతి బంధాలతోను చెదిరిన శరీరాలంకారాలు గల పూబోణిలాగా - చిక్కువడిన వెంద్రుకలనెడి మదించిన తుమ్మెదలతోనూ, రస విహీనమై కాంతితప్పిన కోమల వనమను ముఖముతోనూ, ఉన్న పట్టును వదలిన చనుదోయియను జక్కువ పిట్టల జంటలోను, కదలబాఱిన పిఱుదు చట్టలనెడి ఇసుకతిన్నెలతోనూ మనోజ్ఞంగా ఉంది.

గజేంద్రుడలా కరేణువులతో మడువును అల్లకల్లోలం చేస్తుండగా బుగబుగమను ధ్వనించెడి నీటి బుడకలతో కదలుతూ కెరటాలు ఉవ్వెత్తుగా

లేచి ఆకాశాన్ని అంటుతున్నాయి. లోకభీకరంగా ఏనుగుల గుంపులు ఫూత్కారం చేస్తూ నీరు పైకి చిమ్ముతూంటే మడువులోని మొసళ్ళు మొదలైన జలజంతువులు తల్లడిల్లిపోతున్నాయి. తోక విసరుల వలన కలిగిన పెనుగాలి రొదలో కలిసి నీటిసుడుల సడి ఇనుమడిస్తోంది. అలల తాకిడికి ఆ సరోవరతీరమందున్న చెట్లు మొదళ్ళు తెగి కూలిపోతున్నాయి.

అపుడా సరస్సులో ఉన్న మహామకరం (మొసలి) ఒకటి ఆ బీభత్సం అంతా చూచి ఆగ్రహించింది. హుంకరిస్తూ కుప్పించి పైకెగిరి రాహువు సూర్యుని పట్టుకున్నట్లు ఆ గజేంద్రుని ఒడిసి పట్టింది. గజేంద్రుడు వెంటనే పట్టుతప్పించుకుని తొండంతో దాన్ని మోదేసరికి అది చటుక్కున నీటిలోపడి వెంటనే మళ్ళీ విజృంభించి గజరాజు ముందుకాళ్ళు రెంటిని పట్టుకుంది.

అయినా ఆ మదకరీంద్రం ఏ మాత్రమూ కలవర పడకుండా మహా శౌర్యంతో రెండు దంతాలూ ఎత్తి మొసలి వీపుచిప్పలు పాదులదాకా ఊడి పడేలా కొట్టింది. అపుడామొసలి ఏనుగు పాదాలు వదలి దాని తోకయొక్క కుదురును గోళ్ళతో గీరింది.

మకరి కరిని సరస్సులోనికి లాగాలని తీవ్రంగా యత్నిస్తోంది. కరి మకరిని నేలమీదికి లాగడానికి తన శక్తినంతా పణం పెడుతోంది. కాని రెండూ సమాన బలసంపత్తి కలవవడంచేత ఒకదాని కొకటి లొంగడం లేదు. భయంకరమైన వాటిపోరు చూచి అతల కుతల వాసులు[1] అదలిపోతున్నారు.

అలా మద్దగజ మకరేంద్రాలు రెండూ పరస్పరం విజిగీషతో[2] సర్వశక్తినీ వినియోగించి తెగపోరాడుతుంటే చూచి లోకాలు కంపించిపోయాయి. సరోవరం సంక్షుభితమైంది. సింహం సింహాన్నీ, కొండ కొండనూ ఎదుర్కొని ఒకదాని కొకటివెన్నుదీయకుండా పోరుతూన్నట్లు ఆ జలచర వనచరాలుభీకరంగా పోరాడు తున్నాయి. నీటి నడుమ జరిగే ఆ పెనుకువలో ఏనుగు మొసలిని ఒకసారి వెలికి లాగుతూంటే మొసలి ఏనుగును ఒకసారి లోనికి లాగుతోంది. అయినా అవి తడబడక నిబ్బరంగా ఉన్నాయి. ఆ సంరంభానికి కొలను కలకవారి బీభత్సంగా ఉంది. కొలనులోని నీరు నురువుకట్టి బుడగల బుగులు బుగుల్లను రొదలతో పైకి లేచేలా చఱుస్తూ గుహల్లాంటి నోళ్ళతో దానిని త్రాగుతున్నాయి.

వాడికుంతాల్లాంటి (ఈటెల వంటి) దంతాల గాట్లకు కరిమకరాల తల పుత్రెలు కుదుళ్ళుతప్పి తుత్తునియలై నెత్తురుతోడుతున్నాయి. అయినా అవి చెక్కుచెదరక పెనుగులాడుతున్నాయి. మొసలి ఎంత యత్నించినా గజరాజు

1. అతలం = పాతాళం, కుతలం = భూమి. 2. ఒకదాని నొకటి జయించాలని కోరికతో

తన పాదాల పట్టు వదలకుండా నిలబడిఉంది. అవి ఒకదాని నొకటి ఢీకొని కొలనంతా కలియదిరగడం వలన వాటి త్రొక్కిడికి అందున్న తామెళ్ళు, మొసళ్ళు, ఎండ్రకాయలు, చేవలు, కప్పలు మొదలైన జలచరాలు నలిగి కలగి మృతప్రాయాలవుతున్నాయి.

కరి మకరాలు ఆ రీతిగా మహా సంరంభంతో పరస్పరం ఢీకొని పోరాడు తుండగా ఒక్కొక్కపుడవి స్థాన చలనం పొందు తూంటాయి. ఒక్కొక్కప్పుడు ప్రాణాలు కొడగట్టగా బెండువారి పోతాయి. అయినా అవి పోరు మానక పాటిపోక పరస్పర తాడనాలకు (దెబ్బలకు) నాచుమొత్తాన్నీ గుల్లలసముదాయాన్నీ అడ్డంపెట్టుకొని విజయాకాంక్షతో రెట్టించి రేబవళ్ళులాగా క్రమక్రమంగా విజృంభిస్తూ దీర్ఘకాలం నిద్రాహారాలు లేకుండా పరాక్రమాతిశయంతో పోరాడాయి.

జవం (వేగం)తో, బలంతో, చలం (పట్టుదల)తో నేలమీద పట్టు విడువకుండా తనశక్తినంతా ధారపోసి నానా విధాలా పోరాడుతూన్న కరిరాజు వీరాటోపానికి భయపడి ఆకాశమందున్న మకర మీన కర్కటాలు (రాసులు) భయపడి సూర్యుని మరుగు చేరాయి.

నీటిలోనికి మాటిమాటికీ తనను ఈడ్వాలని యత్నించెడి మొసలిని పోరాటంలో ఎలాగైనా ఓడించాలనే పట్టుదలతో గజేంద్రుడు బీరాలు పలుకుతూ వజ్రకఠినాలైన తన దంతాలతో దాని బొమ్మను చీల్చివేస్తుంది. మృగేంద్రుని భుజదండంతో సాటియైన తొండంతో దాని మెడను చుట్టిపట్టి తాటిస్తుంది. మకరితో అలా సాటోపంగా పోరాడుతూన్న కరినాథుని ఒంటరిగా విడిచి వెళ్ళడానికి కాళ్ళాడక కరేణువులు ఊరకే నిలబడి చూస్తున్నాయి.మగువలకు, మగలపై మమకారానురాగాలు ఉండడం సహజమే కదా!

మొసలి జలచరం. దానికి నీటిలో స్థానబలం ఎక్కువగా ఉంటుంది. అంచేత దానికి బలం, చలం (పట్టుదల) క్రమక్రమంగా పెరుగుతూండగా గజేంద్రం బహుళపక్ష చంద్రుడిలాగా క్రమక్రమంగా క్షీణించి దస్సిపోవడం మొదలుపెట్టింది. అపుడు మొసలి చెలరేగి సింహంలాగా హుమ్మని గజేంద్రుని కుంభస్థలంపైకి ఉరుకుతుంది. దాని అడుగులు తడబడేలా దాని మెడమీదా వీపుమీదా మోదుతుంది. ఎగిరి దూకుతుంది. అలవోకగా దాని తోకను నుగ్గు నుగ్గు చేస్తూంది. దాన్ని పట్టుకొని నీటిలో ముంచుతుంది. తాను మునుగుతుంది. దాని ఎముకలను దంతాలను విటిచివేస్తుంది. పొంచి పొంచి దగ్గరకు వచ్చిన గజరాజును నానాబాధలు పెడుతుంది.

కొంచెంసేపు దాని కంటబడకుండా దాక్కుంటుంది. అపుడది బయటికి వెళ్ళడానికి యత్నిస్తే వెంటనే బయటపడి దాని కడ్డం నిలిచి కాళ్ళు చుట్టి

వేస్తుంది. దాన్ని పోనీయదు. రానీయదు. క్రింద పడవేస్తుంది. అది లేవ డానికి యత్నిస్తే అదిమి పెడుతుంది. ఎగిరెగిరి పడుతుంది. గోళ్ళతో చీరు తుంది. అది ఎదురు తలపడితే తప్పుకుంటుంది. ఇలా ఆ మొసలి దాన్ని పెట్టే తిప్పలు, చేసే ఆగడం ఇంతా అంతాకాదు. అలా మొక్కవోని పరాక్రమంతో అల్పమైన మనోజ్ఞాన దీపాన్ని మహామాయ యనెడి కాఱుచీకటి ఆక్రమించినట్లు అంతకంతకు విజృంభించి నీటిలో మునుగుతూ తేలుతూ పోరాడుతూంటే తోడి మొసళ్ళు విస్మయం చెందుతున్నాయి.

రెండు పాదాలూ నేలపై మోపి ప్రాణవాయువును బంధించి పంచేంద్రి యాల వ్యాపారాలను నిగ్రహించి బుద్ధిని పెంచి శోక విహితమైన బ్రహ్మ పదంపొంది ఆనందించెడి యోగీంద్రునిలాగా మొసలి ఏనుగు పదద్వంద్వాన్ని ఆక్రమించి మొక్కవోని పరాక్రమంతో ప్రకాశించింది. మకరి అలా వన గజాన్ని వేధిస్తుంటే ఇంద్రుని యేనుగు ఐరావతం తాను కూడా వనగజమే[1] కనుక సానుభూతితో వెల్లనై[2] తనపై నెక్కిన దేవేంద్రునిత్రోసివైచి దేవగణం పట్టుకొనడానికి యత్నించినా పట్టువడకుండా ఆకాశమార్గం పట్టి పరువు లెత్తింది.

భయంకరమైన ఆ మొసలి తన దురంత దంతపంక్తితో ఏనుగు కాలి గిట్టల కొనలయందలి ఎముకలను విరుగగొట్టగా అది (ఏనుగు) మతిచెడి ఏమీతోచక జీవనపుటోలంలోపడి[3] పోరాడుతూ మోహమనెడి తీగచే బంధింప బడిన పదం[4] విడిపించుకోలేక సంశయగ్రస్తుడైన దేహిలాగా దీనావస్థ చెందింది.

అయినప్పటికి గజేంద్రం అలయకుండా, సొలయకుండా, విసుపు చెందకుండా, రాత్రియనక, పవలనక, సంధ్యలనక-నిర్విరామంగా ఒక వేయి సంవత్సరాలు పోరాడింది. కాని ఏమీ ఫలితం లేకపోయింది. క్రమ క్రమంగా తన శక్తి ఉడిగిపోతోంది. తన బలాన్ని వైరి బలాన్ని సమీక్షించు కున్నది. తన ఆశ ఇక అడియాస అనుకుంది. మకరిని గెల్వడం తనవలన కాదని నిశ్చయించుకుంది. అప్పటికి పూర్వ పుణ్య ఫలమైన జ్ఞాన సంపత్తితో దైవాన్ని స్మరిస్తూ ఇలా అనుకున్నది—

దీన్ని నేను ఏ రూపంలో జయిస్తాను? నేనిక ఏ దేవుని స్మరిస్తాను? ఎవరిని పిలుస్తాను? ఈ జలచరేంద్రుని వారించి నన్ను రక్షించగల వారెవ్వరు?

---

1. వనం=అడవి, నీరు. వనగజం = i) అడవి యేనుగు ii) నీటిలో పుట్టిన ఏనుగు-ఐరావతం 2. తెల్లవోయి (ఐరావతం తెల్లగా ఉంటుంది). 3. జీవనం = నీరు, బ్రతుకు. ఓలము=చాటు, రక్షణ. జీవనపుటోలం = i) నీటిచాటు, ప్రాణరక్షణ 4. పదం=పాదం, స్థానం.

నా మొఱ వినడానికి సకల కార్యాకరణ సమర్థులైన పుణ్యాత్ములెవ్వరూ లేరా? గణింప నలవికాని గజయూధాల సన్మానా లందుకుంటూ దశలక్ష కోటి కరేణువులకు (ఆడేనుగులకు) నాథుడనై అరణ్యంలో చిరకాలం మహా వైభవం అనుభవించిన నేను నా మదజల ధారలతో దట్టంగా పెరిగి సుమించిన గందపుచెట్ల చిక్కని నీడల్లో నిశ్చింతగా ఉండక నీటి యానతో ఇటు వచ్చి లేని బెడద తెచ్చిపెట్టుకున్నాను. నా అహం, గర్వం అణగిపోయాయి. సర్వశక్తి సంపన్నుడైన ఆ సర్వాత్మకుడే నాకు దిక్కు- అని భగవంతుని ఇలా ప్రార్థించడం మొదలు పెట్టింది—

ఈశ్వరా! ఈ జగత్తు నీవలన జనించింది. నీలో లీనమై ఉంటుంది. తుదకు నీలోనే లయమవుతుంది. నీవు సమస్తానికి మూలకారకుడవు. ఆది మధ్యాంత రహితుడవు. చరాచరాత్మకమైన సమస్తం నీవే. నీకంటే అన్యమైనది లేదు. నీవు స్వయం భువుడవు. నేనిదే నిన్ను శరణు వేడుతున్నాను.

ఒకప్పుడు లోకాలను నీలో నిముడ్చుకుంటావు. ఒకప్పుడు బహిర్గతం చేస్తావు. అయితే లోకాలు వేఱూ నీవు వేఱూ కాదు. నీవు సమస్తానికి సాక్షి భూతుడవై ఉంటావు. అకలంకుడవు. ఆత్మకు మూలమైన వాడవు. లోకాలు, లోక పాలకులు, లోకస్థులు లయంచెందిన పిమ్మట కానరాని కటిక చీకటి కావల నీ వొక్కడవే ప్రకాశిస్తూ ఉంటావు. అలాంటి నిన్ను నేను సేవిస్తాను.

నర్తకుడులాగా అనేక రూపాలతో నీవు నటిస్తూ ఉంటావు. ఋషులు, దేవతలు కూడా నిన్ను కీర్తించలేరు. నీ వర్తనం ఎవరికీ తెలియదు. నిస్సంగులైన మునులు, ఆత్మ సాక్షాత్కారాన్ని కాంక్షించే జ్ఞానులు, సకలభూత హితులు, సాదుచిత్తులు వ్రతదీక్షతో నిష్ఠతో నిన్ను సేవిస్తారు. అలాంటి నీవే నాకు దిక్కు.

నీకు జన్మకర్మములు కాని, నామరూపాలు గాని లేవు. నీవు గుణరహితుడవు. లోకాలను సృజించి పెంచి లయం చెయ్యడానికి నిజమాయచే నీవు అన్నీ ధరిస్తావు. నీవు పరాత్పరుడవు. నీ శక్తి అనంతం. నీవు పర బ్రహ్మవు. జ్వాలద్రూపుడవు. చిరాకారుడవు. నీ చరిత్ర విచిత్రమైనది. నీవు సర్వసాక్షివి. స్వయం ప్రకాశుడవు. పరిశుద్ధుడవు. వాక్కునకుగాని, మనస్సునకు గాని నీవు గోచరుడవుకావు. సత్యగమ్ముడవు, కర్మత్యాగాన్ని మెచ్చుకుంటావు. నీకు నా నమస్కారాలు.

నీవు శాంతువు. మోక్షసౌఖ్యాన్ని ఎఱిగినవాడవు. మోక్షాధిపతివి. నీ కంటె భిన్నమైనదేదీలేదు. నీ వర్తనం నిగూఢం, నీవు సౌమ్యుడవు, జ్ఞానమయుడవు. నీకు గోచరం కాని ఇంద్రియ వ్యాపారములేదు. నీవు సర్వాంతర్యామివి. దయా సముద్రుడవు. మూలప్రకృతివి. సత్త్వాదిగుణాల కాధారుడవు. దుఃఖ నాశకుడవు. మాయయనెడి నీడలో నీవు ఏకాకివై వెలుగొందుతూ ఉంటావు.

నీవు మహోత్తరుడవు. నిఖిల కారణుడవు. నిష్కారణుడవు. నీవే నన్ను రక్షింప సమర్థుడవు. నీకు నా ప్రణామాలు.

యోగాగ్నిచే కర్మజాలాన్ని దహింపజేసుకొన్న యోగీశ్వరులు అన్యమేదీ యెఱుగక యోగనిష్ఠమైన మనస్సుతో మహానుభావుడవైన నీ సాక్షాత్కారం కోసం తపిస్తారు. సకలాగమాలకు వేదాలకు నీవు జలధిలాంటి వాడవు. ముక్తి కారకుడవు. నీ నెలవు మహోత్తమమైనది. గుణత్రయమనెడి అరణి[1] చేత కప్పబడిన జ్ఞానాగ్ని కలవాడవు. గుణాలు నశించాక ప్రకాశించెడి ఆత్మ కలవాడవు. ప్రకృతిచే ప్రవర్తింపబడిన కర్మలను అణచివేయగల దక్షుడవు. నాలాంటి దీనుల పాపాలను తొలగించగల శక్తిసంపన్నుడవు నీవు. సమస్తాంతరాత్ముడవై ప్రకాశిస్తూ ఉంటావు. నీవు స్వయం జ్యోతివి. ఛేదింప నలవికాని వాడవు. భగవంతుడవు. దారసుతాదుల వ్యామోహంలో పడిన వారికి నీవు చిక్కవు. నీకివే నాకై మోడ్పులు.

ధర్మకామార్థములందు కాంక్షవహింపక జ్ఞానులు నిన్నే సేవించి ఇష్టార్థాలను పొందుతారు. అంతేకాదు వారికి నీవు కరుణాతిశయంతో మోక్షాన్ని కూడా ఇస్తావు. ముక్తాత్ములు నిన్ను చింతిస్తూ ఆనందాబ్ధిలో మునకలిడుతూ అవ్యయసుఖం అనుభవిస్తారు. ఏ ప్రయోజనాపేక్ష లేని ఏకాంతులు నీ చరిత్రను గానం చేస్తూ సంతృప్తి చెందుతారు. నీవు మహేశుడవు, ఆద్యుడవు. అవ్యక్తుడవు. అధ్యాత్మయోగ గమ్యుడవు. పూర్ణుడవు. ఉన్నతాత్ముడవు. అతీంద్రియుడవు. ప్రకృతి వ్యాపారాలకు దూరంగా ఉంటావు. అణువు కంటెను సూక్ష్మమైన వాడవు. నీకు నా ప్రణతులు.

అగ్నినుండి జ్వాలలు, సూర్యుని నుండి కిరణాలు నిర్గమించి తిరిగి అచ్చటే లీనమైపోతాయి. అలాగే బ్రహ్మాదులు, దేవతలు అఖిల జంతు సమూహాలు నామరూప భేదాలతో నీ నుండి నిర్గమించి తిరిగి నీలోనే అణగిపోతాయి. మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, సమస్తం నీవే యై గుణముల యొక్క వ్యాపారాన్ని నిర్వర్తిస్తూ ఉంటావు. నీవు స్త్రీవీకాదు. పురుషుడవూకాదు. నపుంసకుడవూకాదు. తిర్యక్కు (జంతువు) వూ కాదు. నరుడవూకాదు. అమరుడవూ కాదు. కర్మగుణ భేదాలచేత సదసత్ప్రకాశకుడవూ కాదు. కాని వాస్తవంగా ఆలోచిస్తే అయన్నీ నీవే. అలాంటి దేవదేవుడవైన నిన్ను ధ్యానిస్తాను.

నీవు దీనులయెడలను, యోగుల యెడలను ఉంటావంటారు. సకల దిక్కులయందును ఉన్నావనీ అంటారు. కాని దీనస్థితిలో నున్న నన్ను రక్షించడానికి నీవు రాకపోవడం చేత నీవు ఉన్నావో లేదో అని నేను సందేహిస్తున్నాను. ఈశ్వరా! నేను భ్రమపడుతున్నాను. నీవు లేకపోవడమేమిటి?

---

1 అరణి=మథించి నిప్పు పుట్టించెడి జమ్మికొయ్య మొదలైనవి.

నీవు శాశ్వతుడవు. నిత్యసత్యుడవు. నా దైన్యాన్నీ, దౌర్బల్యాన్నీ గణించి నీవు నా యెడల ఉండకుండా ఉంటావా? అసాధువులచేత వ్యధలవు సాధువులకు అడ్డువడెడి దయాసముద్రుడవు నీవు. దారుణ విపత్తిలో నున్న నన్ను ఆదుకొనవా? బాహ్య నేత్రాలతో కాక జ్ఞాననేత్రంతో చూచెడివ్వారిని కరుణించెడి నీవు నన్ను చూడవా? ఆర్తుల మొరలు నీకు తెలుసు. కానిట్లై తెలియనట్లు కనుమరుగైయుంటావు. నీవు నా మొఱ వినవా? అన్ని రూపాలూ నీవే. నీవు అనాది మధ్య లయుడవు. భక్తులను దీనులను పాలిస్తావు. నీవు నా మొఱ వినవా? నన్ను చూడవా? నన్ను తలచవా? నన్ను రక్షించడానికి వెంటనే రావా?

నీవు విశ్వస్రష్టవు. విశ్వదూరుడవు. విశ్వాత్ముడవు. విశ్వవేద్యుడవు. ఈ విశ్వం నీవే.అయినా నీవు ఈ విశ్వానివికావు; నీవు శాశ్వతుడవు. అజుడవు. బ్రహ్మకుకూడా నీవే అధిపతివి. ఈశ్వరుడవు. పరమ పురుషుడవు. నీకు నా మనఃపూర్వక నమస్కారాలు— అని గజేంద్రం తన మనస్సులో ఈశ్వర సన్నిధానం కల్పించుకొని ఇంకా ఇలా మొఱ పెట్టింది—

ఈశ్వరా! బలం క్షీణించి పోయింది. ధైర్యం సడలిపోయింది. స్థానచలనం పొంది ప్రాణాలు కడగట్టు తున్నాయి. మూర్ఛపైకొన్నది. శరీరం దస్సిపోయింది. అలసిపోయాను. ఇక నీవు తప్ప నన్ను రక్షించగల వారెవ్వరూ లేరు. ప్రాణికోటి మాటలన్నీ నీకు వినబడతాయట! ఎవరికీ వెళ్ళడానికి సాధ్యంకాని ప్రదేశాల్లోకి కూడా నీవు వెళ్ళగలవట! నీ కంటికి సమస్తం కనబడుతుందట! శరణార్థులు పిలిస్తే వెంటనే మారుపలుకు తావట! కాని నాకు సందేహంగా ఉంది. దీనాతి దీనంగా నేను నిన్ను ఎంతసేపటి నుండి పిలుస్తున్నాను? అయినా రావేమీ?

నీవు దయా సముద్రుడవు. వరదుడవు. శ్రియఃపతివి. సర్వసముడవు. నీ సుగుణాలను కవులూ, యోగులూ ముక్త కంఠంతో సన్నుతిస్తారు. శరణాగతులపాలి కల్పలతవు. అసాధారణమైన ప్రభావం కలవాడవు. నేను శరణార్థిని. నన్ను కరుణించవా?—అని పలికి దిక్కులేనివారికి ఏకైక రక్షకుడగు ఈశ్వరుడు నన్ను రక్షించుగాక! అని ఆకాశం వంక చూస్తూ, నిట్టూరుస్తూ ఆ దేవదేవుని రాకకోసం గంపెడాశతో ఆ గజరాజు నిరీక్షిస్తోంది.

బ్రహ్మాదులు సర్వ వ్యాపకులు కాకపోవడంచేత గజేంద్రుని మొఱ వినికూడా నిస్సహాయులై ఊరకున్నారు. కాని సర్వ వ్యాపకుడూ, పరమాత్మ కావడంచేత శ్రీ విష్ణువు గజరాజు ఆక్రందనం చెవిని బడగానే దాన్ని రక్షించాలని నిశ్చయించుకున్నాడు.

అప్పుడాతడు వైకుంఠంలో అంతిపురిలోని ప్రధాన మందిరానికి ఎడమ వైపున ఉన్న మందార వనంలో అమృత సరస్సు దగ్గఱ చంద్రకాంత శిలా వేదికమీద కలువపూవుల పాన్పుపై శయనించి లక్ష్మీదేవితో కేళీ వినోదంలో

మునిగి తేలుతున్నాడు. ఆ సమయంలో గజేంద్రుని ఆర్తనాదం అతని చెవిని పడ్డది. కంపించి పోయాడు. తత్తరపాటుతో హఠాత్తుగా లేచి బయలుదేరాడు.

ఎక్కడకు వెళ్ళేదీ లక్ష్మీదేవికి కూడా చెప్పలేదు. శంఖచక్రాలు తీసుకో లేదు. పరివారాన్ని పిలవలేదు. గరుడుని సిద్ధపడచమనలేదు. చెదరి చెవిలక్కాకుల్లో చిక్కుకొన్న కురులను సరిదిద్దుకోలేదు. లక్ష్మీదేవి ఏదో తగవులాడి పొలయలుకతో లేచిపోతూండగా తాను ఒడిసిపట్టుకున్న ఆమె పైటచెంగునైనా విడిచిపెట్టలేదు. గజేంద్రుని రక్షించాలనే సంభ్రమపాటులో తాను ఏంచేస్తున్నాడో తనకే తెలియదు.

భక్తజనపాలన పరాయణుడూ, నిఖిలప్రాణి హృదయాంతర్యామీ, అయిన శ్రీహరి కరినాథుని ఆర్తనాదం వినగానే ప్రియా వినోదం చాలించి దాన్ని రక్షించాలనే తహతహతో ఒక్కసారి నిజాయుధాలను స్మరించుకొని గగనమార్గాన బయలుదేరేసరికి-

అతనివెంట లక్ష్మి, లక్ష్మివెంట అంతఃపుర స్త్రీ జనం, వారివెంట పక్షీంద్రుడు, ఆ వెనుకనే ధనుఃకౌమోదకీ శంఖచక్రనికాయ్యమూ, దేవర్షి నారదుడూ, సేనాని విష్వక్సేనుడూ, బయలుదేరారు. వారందఱూ అలా హఠాత్తుగా వెళ్ళడం జూచి కలవరపాటుతో వైకుంఠంలో ఉన్న ఆబాల గోపాలమూ వారివెంట వెళ్ళారు.

లక్ష్మీదేవి పైటచెంగు శ్రీహరి చేతిలోనే చిక్కుకొని ఉండడంచేత ఆమె అతని అడుగులో అడుగువేసి వెళ్ళుతూ-ఏమిదీ? తానెక్కడకు పోతున్నాడో చెప్పడే! అనాథ స్త్రీ జనాలాపమే విన్నాడో! ఎవరైనా దుష్టులు వేదాలను అపహరించారో! రాక్షసులు దేవలోకంపై దండెత్తారో! లేక దుర్మార్గులు భక్తులను అదలించి 'శ్రీహరియేడీ? ఉంటే చూపండి" అని వేధిస్తున్నారో-అని తనలో తాను వితర్కించుకొనడం మొదలు పెట్టింది.

ఆమె గమనవేగానికి ఆమె చెవి కమ్మలు ముందుకూ, వెనుకకూ ఊగుతున్నాయి. జారుముడిగావేసిన ఆమె జుట్టు భుజాలమీద నాట్యం చేస్తూన్నట్టుంది. పైట జారిపోయింది. ఒడ్డాణం వదులై క్రిందకి పైకి కదలుతోంది. నుదుట అలదికొన్న గంధం చెదరిపోయింది. ఆమె ఉత్తరీయం శ్రీహరి చేతిలోనే ఉండిపోయింది. స్తనభారంచేత ఆమె లేతనడుము అల్లల్లాడుతోంది. కోటి చంద్రుల కాంతితో ఆమె మేను ధగధగలాడుతోంది.

ఈ ప్రయాణం ఎక్కడికో అడగాలని ఆమె వడివడిగా అడుగులు వేస్తుంది. కాని "నీకెందుకంటాడేమో!" అని తిరిగి వస్తుంది. అడుగులువేస్తూ చిడిముడిపాటుతో తడబడిపోతుంది. అలా శ్రీహరి వెంట లక్ష్మి వెళ్ళుతుండగా-

ఆమె ముఖాన్ని చూచి పద్మమనుకొని తుమ్మెదలు వ్రాలడం మొదలు పెట్టాయి. ఆమె వాటిని ఎలాగో తప్పించుకొంది. ఇంతలో ఆమె ఎట్టని. క్రి

బెదవిని జూచి దొండపండను భ్రాంతితో చిలుకలు వచ్చిచేరాయి. ఆమె వాటిని కూడా ఎలాగో అదలించి చెదరగొట్టింది. ఆ బెదద తప్పించుకొనే సరికి బేడిన చేపల్లాంటి ఆమె కళ్ళను చూచిన ఆకాశగంగలోని చేపలు వచ్చి పడ్డాయి. లక్ష్మీదేవి వాటిని తరిమివేసేసరికి తీగెలాంటి ఆమె శరీరంతో సరిపోల్చుకునేందుకు ఆకాశాన మెఱపు తీగెలు బారులు తీరాయి. కాని అవి ఆమె శరీర కాంతి ముందు నిల్వలేక చెదరిపోయాయి. అనంతరం చక్రవాక పక్షులు సగర్వంగా ఆమె స్తనాలను తాకి సౌందర్యంలో వాటికి తాము సాటి రాలేమని తెలిసికొని రివ్వున ఎగిరిపోయాయి.

ఈరీతిగా మేఘం వెంట మెఱపు తీగలాగా రమాదేవి మేఘశ్యాముడైన శ్రీహరి వెంట వెళ్తూండగా దేవతలు, రాక్షసవిరోధీ, కరుణావారిధీ, భక్తజనుల పాలిట పెన్నిధీ, యోగింద్ర హృదయోద్యాన వనవిహారీ, అయిన శ్రీహరిని చూచి చేమోడ్చి "అడుగో! శ్రీహరి వేంచేస్తున్నాడు. అదిగో అతని ప్రక్కనే లక్ష్మీదేవి! ఆ వినబడేదే శంఖధ్వని! అదిగో! ఆ కనబడునది చక్రాయుధం! ఆవెనుక సర్పధ్వంసి గరుత్మంతుడు"- అని 'నమోనారాయణాయ' అని ఆనంద బాష్పాలు రాలుస్తూ సన్నుతించగా-

శ్రీహరి గజేంద్రుని రక్షించాలనే తహతహతో ఆ దేవతా నమస్కారాలు గాని సన్నుతులుగాని స్వీకరించకుండా మనోవేగంతో పోయి పోయి కొంత దూరంలో మనోహరమైన ఒక కొలనును చూచాడు. అందులో మకర, కుళీర మీనమిథునాలు[1] ఉండడంచేత అది రాశిచక్రంలాగా ఉంది. వరకచ్ఛపాలు[2] ఉండడంచేత కుబేరుని ధనాగారంలాగా ఉంది. మధురజీవనం[3]తో నిండిన దవడంచేత భాగ్యవంతుని భాగ్యం లాగా ఉంది. అందులోనూ, శంఖాలూ, చక్రాలు[4] పద్మాలూ ఉండడంచేత అది శంఖ చక్ర కమలాలంకృతమైన వైకుంఠంలాగా ఉంది. అది ద్వంద్వ(జల పక్షుల జంటలు)సంకులమూ, పంక (బురద) సంకీర్ణమూ అయిఉండడంచేత సుఖ దుఃఖాది ద్వంద్వ భూయిష్ఠమూ పాపపంకిలమూ అయిన సంసార చక్రంలాగా ఉంది.

కరినాథుని బంధించిన మొసలి ఆ కొలనులోనే ఉంది. అంచేత శ్రీహరి వెంటనే ఆ మకరిని వధించడానికి సుదర్శన చక్రాన్ని పంపేసరికి దాని గమన

---

1. మొసలి, ఎండ్రకాయ, చేపల జంటలు. ఈ పేరులుగల రాశులు కూడా ఉన్నాయి. 2. మకరం = మొసలి, కచ్ఛపం = తాబేలు - కుబేరుని భాండాగారంలో మకరం, కచ్ఛపం అను నిధులున్నాయి. 3. జీవనం=నీళ్లు, జీవితం. 4. చక్రవాకాలు.

వేగానికి భూమి కంపించిపోయింది. నిప్పు రవ్వలురేగి ఆకాశాన్ని క్రమ్మి వేశాయి. నానావిధ బ్రహ్మాండ ఖాండాల్లో దానికి అడ్డులేదు. దేవసమూహాన్ని రక్షించెడి ఆ చక్రాయుధం అలా మనోవేగంతో క్రౌంచామరతీగను కౌగిలించు కొనడానికి ఉద్యుక్తుడైన ఉష్ణాంశుబింబంలాగా ప్రకాశిస్తూ వెళ్ళి కొలనును అల్లకల్లోలంచేస్తూ క్రూరమైన ఆ మొసలి ఉన్న చోటికి వెళ్ళింది.

ఆ మొసలి మేరు పర్వతంలాగా మహోన్నతంగా ఉంది. వనగజ యూథాలు దాన్ని చూచి అదలిపోతున్నాయి. కామక్రోధాలకు అది ఆటపట్టుగా గోచరిస్తోంది. గజేంద్రుని శరీరం నుండి స్రవించెడి రక్తాన్ని అది గటగట త్రాగుతోంది. దాని ఉత్సాహానికి అవధిలేదు. ఎలాగైనా ఆ గజనాథుని క్రుంగ దీసి విజయం సాధించాలని దాని ఆకాంక్ష. అలా కన్నూ మిన్నూ కానక మహోద్రేకంతో ఉన్న ఆ భీకర మకరేంద్రాన్ని సమీపించి శ్రీహరి చక్రం దాని తలను ఖండించేసరికి అది వెంటనే ప్రాణాలు విడిచింది

అలా నిమిషమాత్రంలో చక్రం మొసలి మూర్ధాన్ని ఖండించేసరికి భయోద్వేగంతో ఒక మకరం (మకరరాశి) సూర్యమండలంలో ప్రవేశించింది. మరో మకరం (నిధి) కుబేరుని చాటున నక్కింది. ఆ మకరాలయం (కొలను)లో సంచరించెడి ఇతర మకరాలు క్రిందికిపోయి కూర్మరాజును ఆశ్రయించాయి.

అనంతరం గజేంద్రుడు మొసలి పట్టునుండి విడివడి, రాహు గ్రహం నుండి బయటపడిన చంద్రబింబం లాగా, సంసార దుఃఖం నుండి విముక్తమైన యోగి జనచిత్తం లాగా ప్రకాశిస్తూ దిక్కుల కొనలయందలి ఆడేనుగులు తొండాలతో చిమ్మిన అమృత జలంలో స్నాతుడై సేదదేరి ఎంతో ప్రకాశించాడు

అపుడు శ్రీహరి సంతోషంతో తన శంఖం పాంచజన్యం పూరించాడు. ఆ శంఖధ్వనికి చరాచరాత్మకమైన ప్రాణికోటి అంతా కంపించిపోయింది. ఇంద్రాదులు సైతం దాని మహోజ్జ్వల కాంతులకు చకితులయ్యారు. విపద్దశలో ఉన్నవారి ధైర్యం తొలగిపోయింది. శత్రుసైన్యాలు చెల్లాచెదరయ్యాయి.

ఆ శుభ సమయంలో శ్రవణ సుభగంగా దేవదుందుభులు మ్రోగాయి. పద్మసుగంధం వహించి వాయువు మందంగా వీచింది. పూలవానల జల్లులు పడ్డాయి. అప్సరసలు నాట్యం చేశారు. జయజయధ్వానాలతో దిక్కులు పిక్కటిల్లాయి సముద్రం ఉప్పొంగి తరంగాలతో ఆకాశగంగ ముఖపద్మాన్ని చుంబించింది

అనంతరం కరుణా సముద్రుడైన శ్రీహరి తన దీర్ఘబాహువుతో గజేంద్రుని మడుగునుండి బయటకు లాగి దాని మదజలరేఖలు తుడిచి దాని శరీరాన్ని నెమ్మదిగా నిమురుతూ దాని దుఃఖాన్ని పోగొట్టాడు. శ్రీహరి చల్లని చెయ్యి తగిలేసరికి గజేంద్రుని దేహతాపం తీరిపోగా మహానందంతో ఘీంకారం

చేసింది. కరిణీ సమూహం కూడా శ్రీహరి కృపచే మరల బ్రతికిన కరినాథుని చూచి సంతోషం పట్టలేక చిరవిరహ దుఃఖం విడిచి దానిపై కలియబడి తొండాలతో దాన్ని నిమురుతూ ప్రణయ క్రీడలతో దాన్ని ఉక్కిరి బిక్కిరి చేశాయి.

## కరి మకరముల పూర్వగాథ

రాజేంద్రా! మకరేంద్రుడు పూర్వజన్మలో 'హూహూ' అనేది గంధర్వుడు. దేవలుడను మహర్షి శాపంచేత అతడు మొసలిగా జన్మించాడు. ఇప్పుడు శ్రీహరి చక్రంచేత నిహతుడై శాప విముక్తిచెంది తన పూర్వరూపం ధరించి అవ్యయుడైన శ్రీహరికి భక్తితో మ్రొక్కులిడి ఆ దేవదేవుని సన్నుతిస్తూ నిజలోకానికి వెళ్ళాడు.

ఆ సమయంలో శ్రీహరి కరస్పర్శచేత కరీంద్రుడు అజ్ఞానం తొలగిపోగా సాక్షాత్తు విష్ణుస్వరూపుడై ప్రకాశిస్తున్నాడు. ఆ గజేంద్రుని పూర్వ చరిత్ర చెపుతాను విను. అతడు పూర్వజన్మలో ఇంద్రద్యుమ్నుడను పేరుగల ద్రవిడ దేశాధిపతి. అతడు పుణ్యాత్ముడు. విష్ణుభక్తుడు. అతడొకప్పుడొక కొండపై కూర్చుండి మౌనంగా శ్రీమన్నారాయణుని పూజిస్తూండగా అగస్త్య మహర్షి అక్కడకు వచ్చాడు. కాని ఆ రాజు లేవనూ లేదు. ఆ మహర్షిని పూజించనూలేదు. అపుడా మునీంద్రుడు పట్టరాని కోపంతో సమాధి నిష్ఠుడై ఉన్న ఆ రాజేంద్రుని 'మదపుటేనుగు యోనియందు జనింపు'మని శపించాడు.

ఆ కారణంచేత ఇంద్రద్యుమ్నుడు ఏనుగు కడుపున పుట్టాడు. ఎంతటి ఘనులకైనా, పుణ్యాత్ములకైనా విప్రులను అవమానించటం తగదు. అతడు గజేంద్రుడు కాగా అతని భటులు గజయూథా లయ్యారు. కరి జన్మం ఎత్తినా అతడు తొంటి జన్మలో హరిచరణసేవ చేసి యుండడంచేత అతనికి ముక్తి కలిగింది.

కర్మాచరణం చేస్తూ కమలాక్షుని సేవిస్తూ రెండింటను నియతవృత్తిలో ఉంటే కర్మ క్రమంగా శిథిలమై నశిస్తుంది. కాని హరి భక్తి మార్గం చెడదు. అది క్రమంగా ప్రబలమౌతుంది. భౌతికమైన సమస్తం చెడిపోయేదే. ఏనుగులు, గుర్రాలు, ధనరాశులు అన్నీ చెడిపోతాయి. సతులు, సుతులు నశిస్తారు. కాని చెడని పదార్థం శ్రీహరిసేవ ఒకటే.

గజేంద్రమునకు కరిబారి నుండి విముక్తి కల్పించాక జగజ్జనకుడైన పరమేశ్వరుడు శ్రీహరి, మందహాసం చేస్తూ తన యెదుట ఉన్న రమాదేవిని చూచి— దేవీ! ఆకాశ మార్గాన సవిలాసంగా నా వెనువెంట వస్తున్న నీ పైట చెంగు విడువని నన్ను గురించి నీవు నీలో ఏమనుకొంటివో,

తరుణీ! నాకు 'సర్వం' తెలుసు. అందరూ నన్ను మరచినా నేను మాత్రం ఎవరినీ మరువను. నేను మరచి పోతానని భావించి నన్ను అర్థించకుండా అన్యులను అర్థించినా కూడా నేను మాత్రం మరచిపోతానను కొనడం కల్ల - అని అనేనరికి పద్మాలయయైన రమాదేవి ముఖ పద్మంపై మందస్మితం చిందిస్తూ ముకుందునితో ఇలా అన్నది.

దేవా! నీ పాద పద్మాలను మనస్సులో నిలిపికొలవడం మాత్రమేనా పని. భక్తికాని నిన్ను గురించి నే నేమంటానూ? ఊరకే నిన్ను వెన్నంటి వచ్చాను. దీనదయాళూ! దీనుల మొఱ వినడానికీ వారిని రక్షించడానికీ నీవే సమర్థుడవు-

అని మధురోచిత వాక్కులతో తనను ప్రశంసించిన ఆ వైష్ణవీ రత్నాన్ని గాఢంగా కౌగలించుకొని మందస్మిత పూర్వకంగా సరస సల్లాపాలాడుతూ ఆమెకు మనోనందం కల్పించాడు. అనంతరం గరుడులూ, గంధర్వులూ, సిద్ధులూ, ఇతర దేవ గణాలూ కీర్తిస్తూండగా గరుడ వాహనం అధిరోహించి శ్రీహరి సపరివారంగా నిజ నిలయానికి నిర్గమించాడు - అని శుకుడింకా ఇలా అన్నాడు.

రాజేంద్రా! శ్రీకృష్ణుని మహిమానుభవాన్ని తెలిపెడి ఈ గజరాజు మోక్షణ గాథ విన్నవారికి యశస్సు లభిస్తుంది. పాపాలు తొలగి పోతాయి దుస్స్వప్నాలు రావు. దుఃఖాలు నశిస్తాయి. ప్రొద్దున నిద్ర మేల్కొని నిర్మల మనస్సుతో ఈ కథ పఠించెడి విప్రులకు అనేక విధాలైన వైభవాలు సంపదలు కలుగుతాయి. పీడలు శాంతిస్తాయి. సుఖం లభిస్తుంది. మోక్షం కరతలామలకం అవుతుంది- అని శ్రీహరియే అన్నాడు. అంతేకాదు ఆ దేవదేవుడు ఇంకా ఈ రీతిగా ఆనతిచ్చాడు.

ఎవరైనా సరే తెలతెలవారుతుండగా మేల్కొని - నన్నూ, నిన్నూ, ఈ సరోవరాన్నీ, శ్వేత ద్వీపాన్నీ, నాకు ప్రియమైన సుధార్ణవాన్నీ, మేరుపర్వతాన్నీ, ఆ గిరి గుహలనూ, అరణ్యాలనూ, అందలి వెదురుపొదళ్ళనూ, దేవవృక్షాలనూ, నేనూ, బ్రహ్మ, శివుడూ నివసించెడి కొండ కొనలనూ, కౌమోదకినీ, కౌస్తుభ రత్నాన్నీ, సుదర్శన చక్రాన్నీ, పాంచజన్యాన్నీ, శ్రీదేవినీ, శేష, గరుడ, వాసుకి, ప్రహ్లాద, నారదులనూ, మత్స్య, కూర్మ, వరాహాద్యవతారాలనూ, ఆ అవతారాల్లో నేను చేసిన వివిధ కార్యాలనూ, సూర్య చంద్రాగ్నులనూ, ఓంకారాన్నీ, ధర్మ తపస్సత్యాలనూ, వేదవేదాంగాలనూ, శాస్త్రాలనూ, చంద్రునకు కశ్యపునకు భార్యలైన దక్షతనయలనూ, గో బ్రాహ్మణులనూ, సాధువులనూ, పతివ్రతలనూ, గౌరీ, గంగా, యమునా, సరస్వతీ అలకనందా మొదలైన పుణ్య నదులనూ, దేవతలనూ, దేవ తరువులనూ, ఐరావతాన్నీ, అమృతాన్నీ, ధ్రువునీ, బ్రహ్మర్షి సమూహాన్నీ, పుణ్య శ్లోకులైన మానవులనూ నిశ్చల మనస్సుతో స్మరించేవారికి ప్రాణావసాన సమయంలో నిర్మలమైన హరి పదం

అనుగ్రహిస్తాను. అని ఆదేశించి శ్రీ మహా విష్ణువు శంఖాన్ని పూరించి సకల దేవతా పూజలందుకొని వెంచేశాడు. దేవతలు మహానందం చెందారు - అని పలికి శుకయోగి పరీక్షిత్తుతో- నరేంద్రా! ఈ గజేంద్ర మోక్షణ కథను నియమ నిష్ఠలతో పఠించెడి వారికి గజవరదుడు గజ హయ రథ సంపదలనూ, కైవల్యాన్నీ ఇస్తాడు. ఇక ఇతర మనువులను గురించి చెపుతాను. విను—అని శుకుడు ఇలా చెప్పడం మొదలు పెట్టాడు.

జనపాలకా! తామసుడు నాల్గవ మనువని చెప్పాను కదా! అతని తర్వాత అతని తమ్ముడు రైవతుడు మనువయ్యాడు. అర్జునుడు బలి మున్నగువారు మను పుత్రులై రాజ్య పాలనం చేశారు. భూతదయాదులు దేవతలుకాగా హిరణ్యరోముడు, ఊర్ధ్వబాహుడు, వేదశీర్షుడు మొదలగువారు సప్తర్షులయ్యారు. శుభ్రుడను వానికి వికుంఠ యను భార్యయందు శ్రీహరి వైకుంఠుడను పేరుతో అవతరించి భూమి యందు చక్రవాళ పర్వతం మీద వైకుంఠ నగరాన్ని కల్పించాడు. లోకాలన్నీ ప్రణుతిస్తూండగా రమాదేవి ఆ దేవదేవి ఎదుర్కోలు చేసింది. రాజేంద్రా! భూమిమీద గల రేణువులనైనా లెక్కించవచ్చును గాని ఆ మహానుభావుని గుణాలను మాత్రం లెక్కించడం ఎవరికీ సాధ్యం కాదు.

చక్షువు కొడుకు చాక్షుషుడనేవాడు ఆరవ మనువు. పురువు, పురుషుడు సుద్యుమ్నుడు మొదలైన వారు మను పుత్రులు. మంత్రద్రుముడు ఇంద్రుడు ఆప్యాదులు దేవగణాలు. హవిష్మంతుడు, వీరకుడు మొదలగువారు సప్తర్షులు. అపుడు పరమేశ్వరుడు వైరాజునకు సంభూతియను నామెయందు జనించి అజితుడను పేరు వహించాడు. అతడు పాల సముద్రాన్ని మథించి దేవతలకు అమృతం ఇచ్చాడు. కూర్మమై సముద్రంలో మందరాద్రిని మోసిందికూడా అతడే.

## క్షీ ర సా గ ర మ థ నం

అని శుకుడనేసరికి పరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రునకు ఇలా అన్నాడు. మునీంద్రా! పాలకడలిని మథించారా? ఎందుకూ? శ్రీహరి కూర్మాకారంతో సముద్రంలో ప్రవేశించి మహోన్నతమైన మందరగిరి ఎలా మోశాడూ? దేవగణం అమృతాన్ని ఏ రీతిగా పొందిందీ? జలధిమథనంవలన అమృతంతో పాటు ఇంకా ఏవేవి జనించాయీ! ఎంతో చోద్యంగా ఉంది. నాకు సమస్తం చెప్పు. ఎప్పటినుండో నీవు భగవత్కథా విశేషాలు ఎన్నో చెపుతున్నావు. అయినా నాకు తనివి తీరడం లేదు. ఇంకా చెప్పవా? [illegible] పరీక్షిజ్జనపాలుడు పరమ కుతూహలంతో అర్థించేసరికి శుకయోగి [illegible] నభినందించి శ్రీహరి ప్రసంగాలు ఇంకా ఈరీతిగా చెప్పడం మొదలు పెట్టాడు.

రాజేంద్రా! విను. సురలకూ అసురులకూ ఎప్పుడూ వైరమే కదా! రణరంగాల్లో అసురులధాటికి నిలవలేక దేవతలు కుప్పతెప్పలుగా మరణించడం మొదలుపెట్టారు. ఆ కారణంచేతనూ, దుర్వాస మహర్షి శాప[1]వశం చేతనూ ఇంద్రుడూ, దేవగణాలూ నిర్వీర్యులై శోభదూరులయ్యారు.

అపుడు వారందరూ భయార్తులై బ్రహ్మలోకానికి వెళ్ళి ఆ దేవదేవునకు రాక్షసుల దుష్కృత్యాలనూ, దేవతల దైన్యాన్నీ విన్నవించారు. తేజోహీనులై అలావచ్చిన దేవగణాలను జూచి సురజ్యేష్ఠుడు ప్రణతుడై శ్రీహరిని స్మరించి ఇలా అన్నాడు-

విబుధులారా! వినండి. నేనూ, మీరూ, కాలమూ, మానవులూ, పశు పక్ష్యాదులూ, లతలూ, తరువులూ స్వేదజాలూ - అందరం ఆ శ్రీహరి అంశాంశాలచేత జనించాం. మనందరికీ అతడే దిక్కు. అతనికి అందరూ సమానులే. "వీడు రక్షింపదగినవాడు, వీడు వధింపదగినవాడు, వీడుమాన్యుడు, వీడు సాధ్యుడు"అనే భావం అతనికి ఏమాత్రమూలేదు. సృష్టి స్థితి సంహారాలకు అతడే కారణభూతుడు. అతడు కరుణాపరతుడు. వరదుడు. పరముడు. జగద్గురువు. అతన్ని దర్శించి మన కష్టాలు విన్నవించుకుంటే అతడు వాటిని ఇట్టేతీర్చి మనల్ని రక్షిస్తాడు-అని పలికి బ్రహ్మదేవుడు వారందరినీ వెంట బెట్టుకొని ఆ మన్వంతరంలో అజితుడుగా అవతరించిన శ్రీహరి నిలయానికి వెళ్ళి ఉపనిషద్వాక్యాలతో ఇలా స్తుతించాడు-

దేవా! నీ మాయ దాటరానిది. ఎంతటి మునులూ కూడా నిన్ను సులభంగా దర్శింపలేరు. సకలభూతకోటినీ నీవు సమభావంతో ఆదరిస్తావు. నీచే సృజింపబడిన భూమి నీకు పాదాలు. చంద్రుడు మనస్సు. అగ్నిముఖం, సూర్యచంద్రులు కన్నులు. దిక్కులు చెవులు. జలం రేతస్సు. గగనం మూర్ధం. అలాంటి నీ విరాడ్రూపానికి నా ప్రాంజలి.

పరమేశ్వరా! నీ బలం వలన ఇంద్రుడూ, అనుగ్రహం వలన దేవతలూ, కోపం వలన రుద్రుడూ, పౌరుషం వలన బ్రహ్మ, ఇంద్రియాల వలన వేదాలూ, మునులూ, గుహ్యేంద్రియం వలన ప్రజాపతీ, వక్షం నుండి లక్ష్మి, ఛాయవలన పితృదేవతలూ, స్తనాలనుండి ధర్మమూ,

---

1. పూర్వం ఒకప్పుడు ఇంద్రుడు ఐరావతం అధిష్ఠించి పోతూండగా దుర్వాసుడెదురై అతనికి ఒక పుష్పమాలిక ఇచ్చాడు దాన్ని సగౌరవంగా దాన్ని తాను ధరించక ఐరావతం కుంభస్థలానికి చుట్టాడు. అది దాన్ని నేలపై విసరికొట్టి కాలితో త్రొక్కింది. అదిచూచి దుర్వాసుడు ఆగ్రహించి-నీవు ముల్లోకాల్లో సూశోభావిహీనుడవవుతావు-అని శపించాడు.

పృష్ఠంనుండి అధర్మమూ, శిరస్సునుండి నాకం, నవ్వునుండి అచ్చరులూ జనించారు. అలాగే నీ ముఖంనుండి బ్రాహ్మణ కులమూ, ఇంద్రియాతీతపదార్థాలను తెలిపే వేదమున్నూ, భుజాలవలన క్షత్రియకులమూ-బలమున్నూ, తొడలనుండి వైశ్యకులమూ-నైపుణ్యమున్నూ, పాదాలవలన శూద్రకులమూ-అవేదమున్నూ, క్రింది పెదవినుండి లోభమూ, పై పెదవినుండి ప్రీతీ, నాసికవలన కాంతీ, స్పర్శవలన కామమూ, కనుబొమలవలన మృత్యువూ, కనురెప్పలనుండి కాలమూ సంభవించాయి. అలాంటి నీ విరాట్పురుషరూపం మాకు ప్రసన్న మగుగాక!

దేవ దేవా! ద్రవ్యం, వయస్సు, కర్మగుణ విశేషాలూ అన్నీ నీ మాయ వలన జనించినవే. నాలువిధాలైన సృష్టిజాలం నీ ఆత్మతంత్రం. లోకాలు లోకపాలురు నీ వల్లనే సిద్ధించి జీవిస్తారు. వృద్ధిచెందుతాయి. దేవతలకు ఆయువు, ఆహారం, బలం ఇచ్చేది నీవే. పర్వతాలకు అధిపతివి. ప్రజారక్షణం కోసం చేసే క్రియాకాండనిమిత్తం సంభూతమైన అగ్నివి. అంతస్సముద్రంలో ధాతువులను వ్యాప్తిచేసేది బ్రహ్మమయుడవు. ముక్తిద్వారానివి. అమృత స్వరూపుడవు. మృత్యురూపుడవు. చరాచర ప్రాణికోటికి ప్రాణానివి. ఓజస్సహోబల నాయురూపాలైన ప్రాణేంద్రి యాత్మ శరీరాలకు ధ్వజంలాంటి వాడవు. మహాభూతివి. పరమేశ్వరుడవు అయిన నీవు మాకు ప్రసన్నుడ వగుదువు గాక!

దయా సముద్రుడా! కుదురులో నీళ్ళు పోస్తేచాలు. అది వృక్షాని కంతటికీ చల్లదనాన్ని ఇస్తుంది. అలాగే మొదలు శ్రీహరివైన నీకు మ్రొక్కితే తక్కిన వేలు లందరూ సంప్రీతు లౌతారు. మేము అవన్నీ లం...నీ ముఖ కమలం చూచి ఆనందించాలని కాంక్షిస్తూన్నాం. మా కనుల కలవుదీరా, మాకు నీ దివ్యదర్శనం లభించు గాక!—అని అనేక విధాల కీర్తిస్తూన్న పరమేష్ఠి యందు కరుణించి శ్రీహరి సాక్షాత్కరించాడు.

ఆ సమయంలో అతడు వేయిమంది సూర్యులు కూడి అసాధారణ మైన తేజంలో ఒకే రూపంలో వచ్చినట్లు గోచరించాడు. ఆ మహాతేజం చూచి దేవతలు విభ్రాంతులయ్యారు. వారి కనులు మిరుమిట్లు గొన్నాయి. మనస్సు మొద్దువారి పోయింది. ఎదుట నున్న లోకేశ్వరుని కానక కొంతసేపు ప్రశంసించారు. ఔను! శ్రీహరి సందర్శనం అంత సులభమా? కొంతసేపు అయ్యాక కాని వారికి ఆ దేవ దేవుని దివ్యమంగళ విగ్రహం దృగ్గోచరం కాలేదు. ఆ దివ్య స్వరూపం చూచి వారు మహానందం చెందారు.

రత్నమణిఖచితాలైన హారాలతో, కిరీటంతో, బాహుపురులతో, నూపురాలతో, మొల నూలుతో, కంకణాలతో, కౌస్తుభంతో శ్రీహరి శరీరం

ధగధగ లాడుతోంది....కౌమోదకి, శంఖం, చక్రం, శార్ఙ్గం, నాలుగు చేతుల్లో వెలుగులు చిమ్ముతూన్నాయి. అతని శరీరకాంతి ఇంద్రనీల మణి లాగా శ్యామలంగా ఉంది. కనులు తామర రేకుల్లాగా ఉన్నాయి. కర్ణాభరణాల కాంతులు చెక్కిళ్ళపై ప్రతిఫలిస్తున్నాయి. అతడు ధరించిన పీతాంబరం తప్త కాంచనరలా ప్రకాశిస్తోంది. వక్షస్థలానికి వనమాల క్రొత్త వన్నెను చేకూర్చుస్తోంది. బ్రహ్మాది దేవతలు ఆ దివ్యమంగళ రూపం చూచి పరవశించి పోయారు. అపుడు పరమేష్ఠి కేల్మోడ్చి శ్రీహరిని ఇలా ప్రార్థించడం మొదలు పెట్టాడు.

దేవా! మహానుభావా! నీకు జననం కాని, స్థితి కాని, లయం కాని లేదు. మునులు సైతం నిన్ను నుతిస్తారు. అనంతమూ, దుఃఖరహితమూ అయిన దివ్యానందానికి సముద్రంలాంటి వాడవు. నీవు అణువుకంటె అణుస్వరూపుడవు. మహత్తుకంటె మహద్రూపుడవు నీకు నా ప్రణామాలు. పురుషోత్తమా! నీ రూపం సకలలోకాలకూ శ్రేయస్సును సమకూరుస్తుంది స్థిరమైన వైదిక యోగంవలన నీ దివ్యస్వరూపంలో మాకు సకల లోకాలూ దృగ్గోచరాలవుతున్నాయి. కావున విశ్వం నీ కంటె భిన్నమైనది కాదు. ఇది మొదటను, మధ్యను, అంత్యకాలమందును నీలోనే కానవస్తుంది. ఉపాదాన కారణమైన మంటి కంటె కుండ వేఱుకానట్లు ఉపాదాన కారణమైన నీ కంటె ఈజగత్తు భిన్నంకాదు. ఆ కారణంచేత జగత్తునకు సంభవించెడి ఆద్యవస్థ గాని, మధ్య మావస్థగాని, అంతిమావస్థ గాని నీవే. అన్యమేదీ కాదు.

దేవా! నీవు నీకు వశంగతమైన మాయచే నీవు పదే పదే లోకాలను సృజిస్తావు. అలా సృజించిన జగత్తులో నీవు అంతరాత్మ రూపంలో ప్రవేశిస్తావు. సగుణుడవైన అలాంటి నిన్ను ధీమంతులు సన్నుతిస్తారు భూమిలో అన్నాన్నీ, గోవుల్లో పాలనూ, సమిధల్లో అగ్నినీ యోగవశంచేత పొందునట్లు ఆత్మవిదులైనవారు చేతనాచేతనములైన వస్తుజాలమందు బుద్ధి బలంతో గుణహీనుడవైన నిన్ను దర్శిస్తారు.

జగన్నాథా! మేమిప్పుడు నిరాధారులం. మహావిపత్తులో ఉన్నాం. భయంకరమైన కార్చిచ్చుచే వేగిన ఏనుగు గుంపులకు గంగాజల దర్శనం వలన ఎంత ఆనందం కల్గుతుందో మాకు నీ శుభ సందర్శనం వలన ఇప్పుడు అంతటి ఆనందం కలిగింది. మా కోర్కెలు తప్పక నెరవేరుతాయి. నీవు సర్వమయుడవు. నీవు లోకాలన్నీ నిండి ఉంటావు. నీకు తెలియని దేదీ ఉండదు. అలాంటి నీకు మేము ఏమని విన్నవిస్తాం? నీ పాద సందర్శనం మాకు సకల శుభాలు చేకూర్చుస్తుంది అగ్నికణాలు వేఱూ అగ్ని వేఱూ కాదు. అలాగే లోకపాలకులూ నాక నివాసులూ నేనూనీ కంటె భిన్నులం కాము- అని బ్రహ్మాదులు సన్నుతించేసరికి శ్రీహరి సంతుష్టాంతరంగుడయ్యాడు. దేవతలు పులకించిపోయారు. అప్పటికప్పుడే తమ విపత్తులు తొలగిపోయినట్లు మహా-

నందం చెందారు. పూర్వకర్మమను భయంకర సముద్రమందు త్రచ్ఛబడిన కోరికలు గలవారై తన యెదుట నిలబడిన ఆ దేవతల నుద్దేశించి ఆ దేవ దేవుడు మేఘ గంభీర స్వరంతో ఇలా అన్నాడు:

ఓ విరించీ! ఓ సురేంద్రా! ఓ ఫాలనేత్రా! ఓ సుర్శలారా! మీరిప్పుడు రాక్షసులతో యుద్ధం చెయ్యకుండా ఉండడమే శ్రేయస్కరం. కాలం కలిసి రానప్పుడు బలవంతమైన సర్పం కూడా దుర్బలమైన ఎలుకను చూచి తప్పుకు తిరుగుతుంది. మీకు కూడా ఇది అనువైన కాలం కాదు. అంచేత మీకు తిరిగీ బలం చేకూరే దాకా మీరు మీ శత్రువుల నెదుర్కొని పోరాడకుండా వారితో స్నేహంగా ఉండటమే ఇప్పటికి తగిన పని.

మీరు నామాటవిని అమృతాన్ని ఉద్పాదించడానికి యత్నం చెయ్యండి. అమృతం త్రావితే ఆయుర్వృద్ధి కలుగుతుంది. మృత్యి ఉండదు. పాల సముద్రంలో నానావిధాలైన తృణాల్తూ, ఓషదులూ తెచ్చివెయ్యండి. మందర పర్వతాన్ని కవ్వంగా వాసుకిని తర్త్రాడుగా చెయ్యండి. మీరందరు సముద్రాన్ని మథించరండి. నేను కూడా మీకు సహాయపడతాను. దాని ఫలితం మీకు దక్కుతుంది. దుఃఖాలు, పాపాత్ములైన దైత్యుల పాలవుతాయి. అలసట అణుమాత్రం కూడా లేకుండా అఖిలార్థాలూ కరగత మౌతాయి. మీరు సముద్రమథనం చేసేటప్పుడు అందుండి హాలాహలంగా ఉద్భవిస్తుంది. అయినా భయపడకండి. వస్తుసముదాయమందు, కామరోషాలు వహించడం సంభావ్యం కాదు— అని ఆద్యంత రహితుడైన అచ్యుతుడు అంతర్ధానం చెందాడు. బ్రహ్మాదులు కూడా సంతోషంతో నిజాలయాలకు వెళ్ళారు.

అనంతరం ఇంద్రాది దేవతలు శ్రీహరి ఆదేశాన్ని పాటించి కాన్కలు తీసికొని రాక్షసేంద్రుడైన బలిని దర్శించి నతులతోనూ నుతులతోనూ అతణ్ణి సంతృప్తి పరచి అతనికి శుశ్రూష చెయ్యడం మొదలు పెట్టారు. కాని రాక్షసులకది నచ్చలేదు. దేవతలపై వారికి మచ్చరం తగ్గలేదు. వారిని తుద ముట్టించాలని యత్నించారు. అపుడు బలి రాక్షసుల నుద్దేశించి దేవతలు కలహంమాని స్నేహభావంతో సద్వర్తనులై మనతో కూడి మాడి యుండగా వారిని వధించాలని యత్నించడం తగదని వారించి - రాక్షస వీరులారా! మీరు పౌరుషవంతులే యగుదురు గాక! అయినా శత్రువులు శరణు చొచ్చినప్పుడు మాత్రం వారిపై మగటిమి చూపరాదు. సమయా సమయాలు తెలిసికొని చరించాలి. ఇప్పుడు మనకు అమరులతో వైరం తగదు-అని హెచ్చరించాడు.

అప్పటి నుండి దేవతలు కూడా బలిచక్రవర్తి కొల్వుకూటంలోనే ఉండి అతణ్ణి సేవిస్తూ ఉండడం వల్ల అతడు సకల లోకాధిపతి అయ్యాడు. దేవ గణాన్ని నిర్జించడం చేత అతడెంతో వెలుగొందుతున్నాడు. అలా సురాసురులతో నిండుకొలువున్న వైరోచనుని (బలిని) ఇంద్రుడు సాంత్వన వాక్కులతో

శాంతింప చేస్తున్నాడు. పురుషోత్తముని ఉపదేశానుసారం రాక్షస వీరులతో సఖ్యం పాటిస్తున్నాడు.

శంబరాసురునితో ప్రియోక్తులాడుతున్నాడు. అరిష్టనేమిని తనునయిస్తున్నాడు. త్రిపురాసురులను లోబరచుకున్నాడు. జంభాసురుని వశంగతుని చేసికొన్నాడు. హయగ్రీవుని ఆదరిస్తూన్నాడు. నముచితోను, తారకాసురుని తోను, బాణాసురునితోను సఖ్యం పాటిస్తున్నాడు. విప్రచిత్తితో వైరం మానాడు. శకుని, విరోచన, ప్రహేతులను శాంతింప జేశాడు. మయమాలి సుమాలి మున్నగువారితో మైత్రి పాటించి వర్తిస్తున్నాడు. కుంభ నికుంభులతో బాంధవం ప్రకటిస్తూన్నాడు. పౌలోమ కాలకేయులతోను, నివాత కవచాదుల తోను చెలిమి వహిస్తూన్నాడు. వజ్రదంష్ట్రిని ప్రశంసిస్తున్నాడు. ఇతర దానవులయెడలను, దైత్యుల యెడలను అనితరమైన గౌరవభావం చూపిస్తున్నాడు.

సురేంద్రుడలా అందఱిని యథోచితంగా ఆదరిస్తూ వారిని ఉద్దేశించి- మనం అక్కచెల్లెండ్ర బిడ్డలం. మనలో మనకు వైరం ఎందుకూ? ఏక కార్యాసక్తులమై మనం అందఱం కలిసిమెలిసి సుఖంగా ఉందాం. ఇంతవరకు పరస్పర కలహాలతో ఎంతో నలిగిపోయాం. ఇకనుండి మన యందఱకు వైరోచనియే రాజు. అందఱం అతని ఆజ్ఞావర్తులమై ఉందాం. మన ఉభయ కులాలు సుఖంగా వృద్ధిచెందే ఉపాయం చెపుతాను వినండి - అని అమృత జలథి మథన వృత్తాంతం చెప్పేసరికి దైత్యులు అత్యంత సంతోషంతో 'అలాగే' అని అంగీకరించారు.

వెంటనే వారందరు బలిచక్రవర్తిని, దేవేంద్రుని వెంటబెట్టుకొని సుధా సంపాదనమందు సక్తచిత్తులై శీఘ్ర గమనంతో మందరనగం సమీపించారు. దేవశిల్పి విశ్వకర్మ వాడిగా చఱచి యిచ్చిన గొడ్డళ్ళతోను గడ్డపాఱలతోను ఆ పర్వతాన్ని కొంత త్రవ్వారు. నిడుపాటి రోకళ్ళు జొనిపి క్రిందిపాతును కదలించారు. దీర్ఘ పాశాలతో దాన్ని చుట్టారు. బాహువులతో పట్టి పీడించి పెకలించారు. మహోద్రేకంతో అఱుస్తూ ఆ మహానగాన్ని పెకలించి తలలపైనా భుజాలపైనా కదలకుండా ఎత్తి నిలిపి నెమ్మదిగా తప్పటడుగులు వేస్తూ బరువును లెక్కచెయ్యకుండా వారందఱు మందరనగాన్ని సముద్రపు తెరువును బట్టి తీసికొని రావడం మొదలుపెట్టారు.

కొంతదూరం వచ్చేసరికి దాన్ని మోయలేక పోయారు. అది ధభాలున వారిపై పడ్డది. కొందఱు కుప్పకూలి నేల కలిశారు. కొందఱు నుగ్గునుగ్గయ్యారు. కొందఱు భీతితో పాఱిపోయారు.

అపుడు సురేంద్రులు - అయ్యో! మనం శ్రీహరికడకు ఎందుకు వెళ్ళాం? పర్వతాన్ని పెకలించి ఎందుకు తెచ్చాం? మధ్యలో ఇంతమంది

చావదమేమిటి? శ్రీహరి మనల్ని ఈ పనికి నియోగించి ఎందుకిలా శిక్షించినట్లు? అయినా మా వంటి వారు ఇంతలేసి పనులకు తలొగ్గడం ఏటికి? ఆ దేవదేవుడు తానుకూడా సాయపడతా నన్నాడే? ఏడీ? ఎందుకు రాలేదో? ఎందుకు ఉపేక్షించాడో! మనల్ని ఎందుకు మఱచాడో? - అని కులపర్వతం తమపైన కూలి పడటంచేత వ్యథితులై విలపిస్తున్న సురాసురుల భయాన్ని పోగొట్ట దలచి సర్వవ్యాపకుడైన శ్రీహరి వెంటనే గరుడారూఢుడై కోటి సూర్యుల కాంతితో అక్కడకు వచ్చి - భయపడకండి - భయపడకండి - అని వారిని హెచ్చరించి తాను ఒకే చేతితో ఆ మహామహీధరాన్ని బంతిలాగా ఎత్తి అమృతపూర్ణాలైన కృపాపాంగ దృక్కులతో వారి ప్రాణాలను సముద్ధరించాడు. అనంతరం వారందఱు వెంటరాగా గరుడుడు హరినీ గిరినీ తన వీపుపై నిడుకొని అవలీలగా సుధా సముద్ర తీరానికి తీసికొనివెళ్ళి అక్కడ దింపి, సురాసురులు అందఱు ఆశ్చర్యచకితులై సన్నుతిస్తుండగా ఆ పక్షీంద్రుడు నిజ నిలయానికి వెళ్ళాడు.

రాజేంద్రా! అనంతరం ఏం జరిగిందో చెపుతాను విను. సురాసురుల సంప్రార్థనంపై వాసుకి అక్కడకు వచ్చాడు. వారందరూ అతన్ని సన్నుతించి పిలిపించిన పని చెప్పారు. అమృతంలో ఫలభాగం ఇవ్వడానికి అంగీకరించి సమ్మతి పరచారు. ఆదర భావంతో అల్లనల్లన అతని మేను నిమిరారు. నీవుకాక ఈ పని ఇంకెవ్వరివల్ల అవుతుంది అని అతన్ని ప్రశంసించారు. అతడు కాదనకుండా అంగీకరించాడు.

అనంతరం వారు మందరనగాన్ని నిష్కంటకం గావించి వాసుకిని కవ్వపుత్రాడుగా చుట్టారు. పాల సముద్రాన్ని కలశంగా చేసి అమృత మథనానికి ఉద్యుక్తులై నడుముకు బట్టలు బిగించారు. జుట్టు జారకుండా ముడులు వేశారు. అపుడు శ్రీహరి సుర సమూహంతో గూడి వాసుకి తలవైపు పట్టుకున్నాడు. అది రాక్షసులకు ఆగ్రహ కారణమైంది. హరిమాయా పరవశులై వారిలా అన్నారు-

"మేం పౌరుషవంతులం. కులీనులం. మహా తపస్సంపన్నులం. స్వాధ్యాయపరులం మేం వాసుకి తోక పట్టుకుంటామా? అలాంటి నీచ వృత్తికి మేం పాల్పడం. మాకు ఫణాగ్రం ఇవ్వండి మీరు తోక పట్టుకోండి- అనేసరికి శ్రీహరి మాఱు పలుకకుండా మందహాసం చేసి రాక్షసులకు వాసుకి శిరోభాగం ఇచ్చి తాను దేవతలతో కలిసి తోకవైపు పట్టుకున్నాడు. రాక్షసులు విస్మయం చెంది ఆనందంతో కేకలు వేశారు. దేవతలు మెదలకుండా తోకను పట్టుకున్నారు.

ఇలా స్థాన విభాగం చేసుకొని దేవదానవులు మందర నగాన్ని మహార్ణవం మధ్యలో నిలిపి నిశ్చల మనస్కులై అమృతం నిమిత్తం సముద్ర

మథనం చెయ్యడం మొదలు పెట్టారు. ఇంతలో హఠాత్తుగా "ఆగండి ఆగండి" అని వాసుకి కేకలు పెట్టారు అమితమైన భారంగలదవడంచేత పర్వతానికి మొదలు కుదరక ఒక ప్రక్కకు ఒరిగి బుడబుడమని ధ్వనిచేస్తూ సముద్రంలో మునిగిపోయింది. ఆ మహాధ్వనికి లోకాలన్నీ కంపించిపోయాయి.

ఓ పాండవేయా! దుర్భరమైన కవ్వపు కొండ అలా నీట మునిగేసరికి దేవదానవ ఉభయులూ దాన్ని ఎత్తలేక భుజబలాన్ని కోల్పోయి సముద్ర తటంమీద కూలిపడి ఎంతో సిగ్గు చెందారు. వారి పౌరుషం ఎందుకూ కొఱగాకుండా పోయింది. బలవంతమైన దైవాన్ని అతిక్రమించడం ఎవరికి సాధ్యం కాగలదు? జలధి నీటిలో మునిగిన తరి కొండను చూచి దుఃఖంతో చింతాజలధి నిమగ్నులైన సురాసురులను ఊఱడిస్తూ శ్రీహరి ఏం చేశాడో చెపుతాను విను.

## కూర్మావతార కథ

శ్రీహరి వెంటనే ఒక మహా కూర్మమయ్యాడు. దాని తల పుట్టె లక్ష యోజనాల వెడల్పు కలిగి చదునుగా మిక్కిలి కఠోరంగా ఉంది. దాని నోరు పెద్ద గుహలాగా సమస్త బ్రహ్మాండాన్ని మింగివేయ గలిగినంత విశాలంగా ఉంది. కడుపు సకల చరాచర జీవకోటిని ఇట్టే తినివేయ గలదిగా ఉంది. విశ్వం మీద మఱో విశ్వం వచ్చి పడినా చలించని బలిష్ఠమైన కాళ్ళు దానివి. మిక్కిలి దీర్ఘమైన దాని తుండం వెలికీ లోనికీ వస్తూంటుంది. కళ్ళు తామర రేకుల్లాగా ఉన్నాయి. శ్రీహరి అలా చక్కని ఒక పెద్ద తాబేలుగా అయ్యేసరికి అమరులు ఆశ్చర్య చకితులయ్యారు.

అపుడంతటి మహా కూర్మమున్నూ చిన్న ముత్తెపు చిప్పలాగా జలనిధిలో చొచ్చిన మందరగిరిని వాసుకితోగూడ సవిలాసంగా పైకి ఎత్తే సరికి అమరేంద్రాదులు అమితానందంతో తల లూపుతూ - ఔరా! ఆశ్చర్యం! కమల నయనా! శరణు శరణు - అని భూనభోంతరాళం బ్రద్దలయ్యేలాగా హర్ష ధ్వానాలు చేశారు.

శ్రీహరి లీలావైచిత్ర్యం శ్రీహరికే తెలియాలి. తరికాంద్రలో ఒకడైన తానే తరికడవకు కుదురా! తానే కవ్వపు త్రాడా! తానే కవ్వమా! ఎంతటి ఆశ్చర్యం? సముద్రాన్ని కడవగా, పర్వతాన్ని కవ్వంగా సర్పరాజును త్రాడుగా చేసి త్రచ్చుగా ఉద్భవించెడి సిరినీ, సుధనూ గ్రహించడానికి శ్రీపతికి కాక ఇతరులకు శక్తి ఎక్కడిదీ? గొల్లల్లాగా పాల కడలి మథించి దేవతలు గొల్లలయ్యారు.విష్ణువు గొల్లవాడయ్యాడు.నిరపాయమైన అమృతాన్నీ, సిరినీ పొందారు. గొల్లల బ్రతుకు మాత్రం తక్కువదా?

శ్రీహరి మందరగిరినితిరిగియథాస్థానంలోనిలిపాకదేవదానవులు సముద్ర మథనానికి మళ్ళీ సముద్యుక్తులయ్యారు. దృఢమైన కవచాలు ధరించారు; కట్టు బట్టలను పిరిచుట్లు చుట్టారు. మహోత్సాహంతో చేతులు చేతులు చరుస్తూ భుజాలు భుజాలు ఒరుస్తూ "లెండి లెండి. తిరిగి మథిద్దాం. రండు రండని" పెరుగును త్రచ్చేడి గొల్లల్లాగా కేకలువెట్టడం మొదలు పెట్టారు. మహా సముద్రంలో తరిగొండలో చిక్కుకొని పోయిన వాసుకి పడగలను విడదీసి సరిదిద్దారు.

సంతోషాతిశయంతో వారు పెట్టే పెడబొబ్బలకు బ్రహ్మాండ భాండం చలించి పోతోంది. మథనసమయంలో గుబ్బు గుబ్బున ఎగిరిపడుతూ కొండ కవ్వపు గుత్తి జిరజిరమని దిరుగుతూ ఉంటే దానివేగం వలన బుగులు బుగుల్లను ధ్వనులు వెల్వడి ఆకాశ పర్యంతం వ్యాపిస్తున్నాయి. సురాసురులు క్రమక్రమంగా కవ్వపు త్రాడుగా అమరిన అహిరాజును గట్టిగా లాగడంవలన ఆ యొత్తిడికి దాని పడగల నుండి విషాగ్ని జ్వాలలు బయలుదేరడం మొదలు పెట్టాయి. అయినా ఆకాశాన అసంఖ్యాకంగా ఉన్న నక్షత్రాలనెడి నలినాక్షుల నునుచెక్కిళ్ళ తవిలిజారెడి మీగడ పాలతేట తుంపరలవలన ఆ విషాగ్ని దాహం వారిని తపింపచేయలేదు. వారిగమనం మందగించలేదు. సముద్ర తటమందలి కొండగోగు పూగుత్తుల తేటతేనియల సువాసన వహించి వీచెడి మంద మారుతం వలన వారి మేనులయందు పట్టిన చెమటనీటిప్రవాహం ఇంకి పోతోంది.

వారు మహోత్సాహంతో ఒకప్పుడు పరస్పరం పరిహాసా లాడతారు. ఒకప్పుడు మేలుమేలని ఒకరినొకరు మెచ్చుకుంటారు. ఒకప్పుడు అమిత శ్రమవలన దీనంగా విలపిస్తారు. పరస్పర మాత్సర్యంతో వారలా సముద్రాన్ని కరిచేటప్పుడు సముద్రంలో గిరగిర తిరిగెడి తరికొండ మ్రోతలూ, కవ్వపు త్రాడైన వాసుకి ముఖ నిర్గతాలైన పూత్కార ధ్వనులూ, మందర పర్వత భ్రమణం వలన సంక్షోభంచేత భీతిల్లి చెల్లాచెదరయిన నానావిద జలజంతువుల ఆక్రందన నినాదాలూ, ముప్పిరి కొనగా, వాటి రోదు దేవదానవుల అట్టహాసాలూ, సింహనాదాలూ సాల్గవపునై అతిశయించి దిగంతాలను బ్రద్దలు చేసి వేస్తుంటే హర్షాతిరేకంతో వారు త్రుళ్ళుతూ పంకాలాడుతూ ఒకరి నొకరు మించి వడివడిగా మథిస్తున్నారు. అమృతోత్పత్తి కోసం తహతహలాడుతున్నారు. ఏ యే నూతన వస్తువులు ఉద్భవిస్తాయో అని ఎదురు చూస్తున్నారు. ఇంకా ఎంతసేపు తరచాలి? అని నడుమ నడుమ శ్రీహరిని ప్రశ్నిస్తున్నారు. పట్టువిడువక ఉతురపాటుతో మథిస్తున్నారు.

అపుడా పాలవెల్లిలో మందర నగం వడివడిగా తిరగడం వలన మరింతగా జనించిన ధ్వని, బ్రహ్మాండం అంతా నిండిపోయింది. ఆ మహా

ఘోషకు బ్రహ్మదేవుని చెవులు కూడా దిబ్బెడవేశాయి. దేవదానవులలా వాసుకి మొదలు తుదలను పట్టుకొని మందరనగాన్ని ఎడమనుండి కుడికి కుడి నుండి యెడమకు కదలిగట్లు ఒరసికొనేలాగా ససంభ్రమంగా త్రిప్పుతూంటే అందున్న పక్షులు, తాబేళ్ళు, మొసళ్ళు, సర్పాలు సుడిగొని సముద్రపు టంచులకు వచ్చిపడుతూ భీతితో పైకెగిరి త్రుళ్ళి పడుతున్నాయి. సురాసురులు ఎంత వేగిరపాటుతో త్రిప్పినా మందరనగ భ్రమణం ఆ ఆదికూర్మం వీపుటీటను అణుమాత్రం కూడా శ్రమింపజేయలేకుండా ఉంది. ఇంతలో పాలకడలి నుండి అగ్ని జ్వాలలు కక్కుతూ హాలాహలం ఉద్భవించింది. అది చూచి అదలి దేవదానవులు సర్పాన్ని విడిచిపెట్టి నలువైపులకు తలకొక దారిని పట్టి పారి పోయారు.

సముద్రమథన సమయంలో జనించిన ఆ హాలాహలం ప్రళయ సమయ రుద్రుని ఫాలనేత్రం నుండి వెల్వడెడి అగ్నిజ్వాలలకంటె నూరురెట్లు తీక్షణంగా ఉంది. విలయ కాలాగ్నికంటె వేయిరెట్లు వడిగలదిగా ఉంది. అంత్య కాలంలోని పట్ట పగలింటి లక్షసూర్యుల కాంతికంటె దుర్నిరీక్షంగా ఉంది. లయకాలం నాటి రాత్రి ఉద్భవించెడి మేఘసముదాయం నుండి పడెడి లెక్కకు మించిన పిడుగుల్లాగా భయంకరంగా ఉంది.

అంతేకాదు. పంచభూతాలు తేజోరూపాలైనట్లు దుస్సహంగా ఉంది. భుగ భుగమని పొగలు క్రక్కుతోంది. చిటచిటమని అగ్నికణాలను చిమ్ముతోంది. ధగధగమని మంటలను నలువైపులా పఱుస్తోంది. పటపటమని ఆకాశానికి పొంగుతోంది. దశదిశలా వ్యాపిస్తోంది. బయళ్ళను క్రమ్మివేస్తోంది.

మహార్ణవ మధ్యంలో మందరనగ భ్రమణంవలన జనించిన ఆ హలాహలం ఆ నగప్రాంతంలోనే నిల్వక సాగి సముద్రం నలుగడలకువ్యాపిస్తోంది. గట్టుపైకుబికి సురాసురులను తపింప చేస్తోంది. కుల పర్వత శిఖరాలను దహింపజేస్తోంది. అడవులను భస్మం చేస్తోంది. జనపదాలను నాశనం చేస్తోంది. నదీనదాలను ఇంకింపజేస్తోంది. దిగ్గజాల కుంభస్థలాలు చలించునట్లు ఉరుకుతోంది.

సూర్యమండలం మీదికి నక్షత్రమండలంపైకి ఎగిరెగిరి పడుతోంది. మహర్లోకాన్ని తపింప జేస్తోంది. ఉపరిలోకాన్ని తారుమారు చేస్తోంది. బ్రహ్మండగోళాన్ని చుట్టు ముట్టి చిటిలజేసి దాన్నిదాటి పాతాళంలో చారుడుతోంది. ఈ రీతిగా ఆ మహావిషాగ్ని సర్వలోకాలను ఆక్రమించి ఎక్కడ చూచినా అదే గోచరిస్తోంది. కురంగం (లేడి) లాగా గ్రేళ్ళుఱుకుతుంది. భుజంగం (సర్పం) లాగా ఒడిసి పట్టుకుంటుంది. సింహంలాగా లంఘిస్తోంది. పక్షిలాగ ఎగురుతుంది; మదపుటేనుగు లాగా స్తంభించి నిలబడుతుంది.

హాలాహలాగ్ని ఆ రీతిగా లోకాలను చీకాకు పరస్తూంటే దాని సెగలను భరించలేక దేవతలు కాలి పోయారు. రాక్షసులు నేల కరిచారు. పక్కులు రాలి పడ్డాయి. కిన్నర మిథునాల కీటు అణగి పోయింది. గంధర్వుల విమానాలు కమరిపోయాయి. సిద్ధులు చీకాకు పడ్డారు. గ్రహాలు చిక్కువడి పోయాయి. వర్ణాశ్రమాలు ఛిందర వందరయ్యాయి. నదులు ఇగిరి పోయాయి. సముద్రాలు ఇంకిపోయాయి. అడవులు దగ్ధమయ్యాయి. నగరాలు నాశనమయ్యాయి. స్త్రీలూ పురుషులూ తేజోహీనులై దుఃఖపరవశులయ్యారు. పర్వతాలు పగిలి పడి పోయాయి. ప్రాణికోట్లు భస్మీభూతాలయ్యాయి. లోకాలు తపించి పోయాయి. దిశలు వివశలయ్యాయి. తరువులు (చెట్లు) తల్లక్రిందులయ్యాయి. భూమి బీటలు వారింది. అప్పుడు అకాల విలయమేదో వచ్చి పడ్డట్టయింది. ఘోరమైన ఆ విషాగ్నిని ఎదుర్కొని రక్షించే వారెవ్వరూ లేకపోవడం చేత దిక్కుసెడి జనులు ఆలుబిడ్డలతోగూడి ప్రమ్మగిపోయారు.

అప్పుడు బ్రహ్మేంద్రాదులు శంకరుని సహాయం అర్థించి కైలాసానికి వెళ్ళారు. అక్కడ ద్వారపాలకులు వారించినా లక్ష్యపెట్టక వారిని త్రోసిపుచ్చి ఆర్త రక్షణ పరాయణుడైన ఆ దేవదేవుని ఉద్దేశించి "కుయ్యో మొర్రో మమ్ములను కరుణించు. మా విన్నపం ఆలించు" అని ఎలుగెత్తి అర్థించారు. వారలా దీనంగా ప్రార్థించేటప్పటికి శివుడు పార్వతితోకూడి కొలువు తీర్చి వారికి దర్శనం ఇచ్చాడు. అప్పుడు వారందరూ ఫణి భూషణునకు సాష్టాంగ దండ ప్రణామాలు చేసి ఇలా స్తుతించారు.

భూతాత్మా! భూతేశా! భూతభావనరూపా! దేవా! మహాదేవా! దేవవంద్యా! ఈ లోకాలన్నింటికి నీవే ఈశ్వరుడవు. బంధ మోక్షాలకు నీవే అధిపతివి. ఆపదలలో వున్నవారికి నీవే శరణ్యుడవు. బుద్ధిమంతులైన వారు నిన్నే కోరి సేవిస్తారు. బ్రహ్మ, విష్ణువు, శివుడు అనెడి పేర్లతో నీవే సృష్టి, స్థితి, సంహారాలు చేస్తావు. పరమ రహస్యమైన బ్రహ్మ వస్తువు నీవు. నీవు మహాశక్తి మయుడవు. శబ్ద జనకమైన ఆకాశము స్వరూపముగా కలవాడవు. సర్వాంతర్యామివి. సమస్తమునకు ప్రాణమైన వాడవు.

లోకాలన్నీ నీయందే జనిస్తాయి. నీయందే వసిస్తాయి. నీయందే లయం చెందుతాయి. సర్వ భూతకోటికి నీ ఉదరం నిలయం. అగ్ని నీకు ముఖము,

నీ ఆత్మ పరాపరాత్మకం[1]. నీ గమనం కాలం. నీ పాదం భూమి. నీ ఊర్పు వాయువు. నీ నాలుక-వరుణుడు. దిక్కులు చెవులు. స్వరం నాభి. సూర్యుడు కన్నులు. శుక్లం నీరు. కడుపు నముద్రాలు. శిరస్సు ఆకాశం. నకల ఓషధులు. రోమాలు.-పర్వతాలు ఎముకలు. చంద్రుడు మనస్సు. వేదాలు ధాతువులు హృదయం ధర్మ నమూహం. ఉపనిషత్తులు నీ ముఖపంచకం[2]. పరతత్వము, స్వయం ప్రకాశము, శివనామకము అయిన నీ స్వరూపం ఆద్యం.

కొందరు నీవు ఉన్నావంటారు. కొందరు లేవంటారు. కొందరు నీవు ఉన్నావని, లేవని అంటారు. కొందరు నిన్ను గుణరహితుడవంటారు. కొందరు నిన్ను చూచి భయకంపితులవుతారు. ప్రాణేంద్రియాలు, ద్రవ్యగుణాలు స్వభావంగా గలవాడవు నీవు. నీవే కాలానివి. నీవే యజ్ఞరూపుడవు. నత్యం, ధర్మం, మోక్షం నీవే. నీవు అవినాశివి. నమస్తానికి నీవే ముఖ్యుడవు. నీవు ఛందోమయుడవు. నత్వరజస్తమో గుణాలు మూడును నీ మూడు కన్నులు. దృశ్యమానమైన నమస్తమూ నీ రూపమే. నీ నేత్రాగ్ని జ్వాలలచే అంతకాదులను కూడా కాల్చిన నీకు కామదహనం. త్రిపురనాశనం, దక్షాధ్వరభంగం మొదలైనవి ఒక లెక్కలోనివి కావు. నీవు చంద్రమౌళివి. పురాణపురుషుడవు. దీన రక్షకుడవు. కరుణాతరంగుడవు. దేవదేవుడువు.

మూడు మూర్తులకూ, మూడు లోకాలకూ, మూడు కాలాలకూ నీవే మూలం. మొదట భేదంగా కనపడి తుదకు అభేదమై గోచరించు బ్రహ్మం నీవే. నదనత్తత్వాలకు, పరాపరాలకు నీవు నిలయానివి. బ్రహ్మాదులు కూడా నిన్ను పొగడటానికి పెదవి కదల్చలేరు. అలాంటి మహాశక్తి నంపన్నుడవైన నిన్ను నుతించటానికి మేమెంతటి వారము?

సురాసురులు తమ భుజబలంతో పాలనముద్రాన్ని మధిస్తూండగా హాలాహలం పుట్టింది. దాన్ని ప్రతిఘటించేశక్తి ఎవరికీ లేదు. అది లోకాలన్నింటిని చీకాకు పరుస్తోంది. ఈశ్వరా! నీ వా మహాగ్నిని నేర్పుతో గ్రహించి ప్రాణినమూహాన్ని బ్రతికించు. కరుణించు. చంద్రశేఖరా! ఆపదలు పోగొట్టటానికి కాని, నంపదలు అనుగ్రహించటానికి కాని, జయం సాధించటానికి కాని, హంతకులను హతమార్చటానికి కాని నీకొక్కనికే సాధ్యం. నీ కంటె అన్యుని ఎరుగం. ఈ లోకాలను నీవు గాక ఇతరులెవ్వరూ రక్షింపలేరు. నమస్త లోకాలకు నీవే అధిపతివి-అని అభినందిస్తూన్న బ్రహ్మాదులను చూచి, నకల భూతనముడైన ఆ దేవదేవుడు తన ప్రియనతి పార్వతితో ఇలా అన్నాడు—

---

1. ఇహ పరములు కలది. 2. ఈశ్వరునికి ఐదు ముఖాలు 1. నద్యోజాతం 2. వామ దేవం 3. అఘోరం 4. ఈశానం 5. తత్పురుషం.

దేవీ! లోకాలకు తటస్థించిన కష్టం చూచావా? సముద్రంలో పుట్టిన హాలాహలం చేసే భీభత్సాన్ని విన్నావా? ప్రభువునైనందుకు ఆర్తుల కష్టాలని తొలగించటం నాకు కర్తవ్యమూ, కీర్తి ప్రదమూ కాదా? బ్రతుకుపై ఆశతో వచ్చి శరణు వేడిన వారి ప్రాణాలు కాపాడాలి. సాధువులైనవారు ఇతరుల కోసం క్షణ భంగురాలైన ప్రాణాలను త్యజిస్తారు. ఇతరులకు హితం చేయటమే పరమ ధర్మం. అలా చేసేవానికి ఎదురులేదు. పరహితం చేసేవాడు భూత పంచకానికి కూడా పరమహితుడవుతాడు. దేవీ! శ్రీహరి మనస్సులో ఆనందిస్తే లోకాలన్నీ ఆనందిస్తాయి. కనుక శ్రీహరీ, లోకాలూ మెచ్చేలాగా హాలాహలాన్ని వారించటం అవసరం. కనుక ఆ విషాగ్నిని ప్రతిఘటిస్తాను. మధుర ఫలాన్ని భక్షించినట్లు ఆ హాలాహలాగ్ని భక్షిస్తాను. ప్రాణికోటిని రక్షిస్తాను. నీవు చూస్తూ వుండు- అని పలికేసరికి పార్వతి సంతసించి—దేవా! మీ చిత్తం వచ్చినట్లు చేయండి-అన్నదని శుకుడు అనగా నరేంద్రుడు ఇలా అన్నాడు.

శివుడు లోకహితంకోరి ఆ విషాగ్నిని మ్రింగటానికి అంగీకరించాడనుకో! దేవతలు భయాక్రాంతులై విషాగ్నిని మ్రింగమని ఆయన్ను అర్థించారనుకో! బ్రహ్మాదులు ఆత్మరక్షణకోసం "హరా! లే, లే. మమ్ములను రక్షించు" అని బలవంతపెట్టారనుకో. పార్వతి చూస్తూ చూస్తూ తన కళ్ళఎదుట ప్రాణేశ్వరుని మహోగ్రాలైన ఆవిషాగ్ని జ్వాలలను మ్రింగమని ఎలా అన్నదీ?—అనేసరికి శుకమహర్షి ఈ రీతిగా అన్నాడు.

నరేంద్రా! విను. మ్రింగేవాడు తన భర్త అనీ, మ్రింగేది గరళమనీ, దానివలన ప్రజలకు మేలుకల్గుతుందనీ భావించి పార్వతి మహేశ్వరుని విషాన్ని మ్రింగమన్నది. ఆమెకు తన మంగళసూత్రంమీద ఎంతో నమ్మకం ఉంది- అనగా అతడు విషభక్షణం చేసినా ఏమీ ప్రమాదం కల్గదని ఆమె భావన.

సురసంఘాలు తనచుట్టూ చేరి జయ జయ ధ్వానాలు చేస్తూండగా మేఘ గంభీర స్వనంతో శివుడు హుంకరించి లోకద్రోహీ! పోకు, పోకు రా. రమ్మ అని చేతితో దానిని పట్టుకొని, కూర్చి ముద్దగా చేసి నేరేడు పండులాగా ఆ విషాన్ని అలవోకగా మ్రింగాడు. ఈశ్వరుడు ఆ విషాన్ని ఆహ్వానించినప్పుడు కానీ, దాన్ని పట్టుకొని ముద్దగా చేసి భక్షిస్తున్నప్పుడు కానీ అతని ఒడలుపై గల సర్పహారాలు కదలలేదు. చెమట బిందువులు పుట్టలేదు. కళ్ళు ఎఱ్ఱ పడలేదు. జటాజూటంలో ఉన్న బాలచంద్రుడు కందలేదు. వదనకమలం వాడలేదు.

తన ఉదరం లోకాలన్నింటికి నిలయం అవటంచేత ఆ విషాగ్నిని మ్రింగితే అది లోకాలన్నింటిని భస్మం చేస్తుందని గ్రహించి శివుడు దాన్ని ఫలరసంలాగా తన కంఠ మధ్యమందే నిలిపాడు మెచ్చినా, మచ్చిక (ప్రేమ)

కల్గినాఏమైనా ఇవ్వవచ్చు. కాని ఇతరులకోసం విషాగ్నిని ముద్దగాచేసి ఎవరైనా భక్షిస్తారా? అగ్నిస్వరూపుడైన శివునికొక్కనికే అది చెల్లింది. రాజేంద్రా! ఈశ్వరుడు అలా కంఠమందు హాలాహలాన్ని నిలిపేసరికి అక్కడ నల్లని మచ్చ ఏర్పడి అది ఆ దేవదేవునికి అలంకారప్రాయమైంది. సజ్జనులకు సాధు రక్షణం భూషణంకాదా? శివుడు అలా గరళాన్ని కంఠబిలంలో ధరించినందుకు శ్రీహరీ, బ్రహ్మేంద్రాదులూ, పార్వతీ ఆనందించి నిశ్చలమనస్సుతో అతన్ని అనేక విధాల నన్నుతించారు. ఈ హాలాహల భక్షణకథ వినోదార్థం విన్నా, వ్రాసినా, పఠించినా ఎవరికీ సర్పభీతికాని, అగ్నిభయంకాని, వృశ్చికబాధకాని ఉండదు.

## పాల సముద్రంలో ఐరావతాదులు పుట్టటం

అనంతరం ఆ పాల కడలిని సురాసురులు తిరిగి మథిస్తూండగా అందుండి కామదేనువు పుట్టింది. దాని శరీరం తెల్లగా ఉంది. కొమ్ములున్నూ తెల్లగా ఉన్నాయి. పొదుగు జిల్లున పాలు స్రవిస్తోంది. అది అర్థుల కోరికలన్నీ తీరుస్తుంది. దేవతలకు యజ్ఞాల్లో హవిస్సులు పెట్టడం కోసం దేవర్షులు అగ్నిహోత్రి అని ఆ గోవును తీసుకొన్నారు.

అనంతరం ఆ జలరాశిలో 'ఉచ్చైశ్శ్రవం' అనెడి గుఱ్ఱం ఒకటి జనించింది. అదికూడా చంద్రుడు లాగా తెల్లగా, నిర్మలంగా ఉంది. ఈశ్వరుని ఆదేశానుసారం ఇంద్రుడు దాన్ని తీసుకోలేదు. దాని తొమ్మూ, పిఱుదూ దృఢంగా ఉన్నాయి. తోక అందంగా ఉంది. ముఖం కాంతులు చిందుతోంది. గిట్టలు నిర్మలంగా ఉన్నాయి. చెవులు కురుచగా ఉన్నాయి. కన్నులు తెల్లగా ఉన్నాయి. మూపు దట్టంగా ఉంది. ఆ తురంగం చూడడానికి ఎంతో ముచ్చటగా ఉంది. దాన్ని బలి చక్రవర్తి తీసుకొన్నాడు.

అనంతరం ఆ పాలసముద్రంలో ఐరావతం అనే ఏనుగు ఉద్భవించింది. దానికి నాలుగు దంతాలున్నాయి. వాటితో అది పర్వత శిఖరాలను విరగ గొట్టుతోంది. అదిన్నీ తెల్లగా రాజులకు మనోహరమైనదిగా ఉంది. దాని నడక గంభీరంగా, నిశ్చలంగా ఉంది. తొండం దీర్ఘంగా ఉంది. కుంభ స్థలాలు విశాలంగా ఉన్నాయి. చక్కని దాని మంద గమనాన్ని యువతులు అనుక రిస్తారు. ఆ తరువాత కల్ప వృక్షం పుట్టింది. అది అన్ని ఋతువులలోనూ పరువంగా ఉంటుంది. అది నందన వనానికి కూడా వన్నె తేగలది. కోరిన వారి కోర్కెలు తీర్చగలది.

తరువాత ఆ క్షీర సాగరం నుండి అప్సరసలు జనించారు. వారి శరీరాలు క్రొక్కారు మెరుగులు లాగా మెరిసి పోతున్నాయి, వారి స్తనాలు సందు లేకుండా క్రిక్కిరిసి ఉన్నాయి. నడుములు శుష్కించి ఉన్నాయి. జుట్టు

ముడులు దట్టంగా, అందంగా ఉన్నాయి. చూపులు మనోహరంగా ఉన్నాయి.

ఆ పైన సముద్రంలో చంద్రుడు ఉద్భవించి, బ్రహ్మ ఆదేశానుసారం తన యథాస్థానంలో ఉంటున్నాడు. ఆ పైన పాల కడలి నుండి లక్ష్మీదేవి పుట్టింది. తొలకరి మెరుగు లాగా ఆమె శరీరం ధగ ధగ మెరిసిపోతోంది. ఆమె చూపులు సిరులు క్రక్కుతోంది. సౌందర్యానికి ఆమె మూలస్థానం. బ్రహ్మ ఆమె శరీరాన్ని పాల సముద్రంలోని మీగడ మిసిమి కాంతులతో సృజించాడు. తొలకరి మెరుగుల కొనల తళుకులతో ఆ శరీర కాంతికి మరింత వన్నె తెచ్చాడు. అనుదినం ప్రోది చేయటం వలన నవనవలాడెడి క్రొందీవెల నునుపునూ, సొగసునూ ఆమె మేనికి కల్పించాడు. మనోహరమైన ఎఱ్ఱ దామర కొలకులో ఉషఃకాలమందు వ్యాపించెడి వలపులతో ప్రోది పెట్టాడు. పసిడి వన్నెగల సంపెంగ దండయొక్క సౌందర్యాన్ని, క్రొన్నెల చెలువునూ కూర్చి తీర్చిదిద్దాడు. ఎంతో నైపుణ్యంతో బ్రహ్మ రమాదేవిని సృజించాడు. ఆమె క్రీ పెదవి ఎర్రగా ఉంది నడుము చలిస్తోంది. ఆమె ముఖమూ, కన్నులూ మెరపు తళుకులను విరజిమ్ముతున్నాయి. ఆమె కొప్పు, పిఱుదులు, కుచములు మనోహరంగా ఉన్నాయి. ఆమెని చూచిన వారందరూ ఆమెను వేయి విధాల నుతిస్తున్నారు.

అనంతరం లక్ష్మీదేవికి మంగళ స్నానం చేయించటానికి ఇంద్రుడు వెలలేని మణిమయ పీఠం ఒకటి ఇచ్చాడు. మంగళవతులైన దేవాంగనలు జల పూర్ణాలైన పుణ్యాహ కలశాలు ఇచ్చారు. భూదేవి చిగురాకులను ఇచ్చింది. పడిఘి గోవులు పంచగవ్యా[1]లిచ్చాయి. వసంతుడు మధువును ఇచ్చాడు. మునులు సంకల్పం చెప్పారు. మేఘాలు ఉడుక, గోముఖం,[2] బాకా, తప్పెట, మృదంగం, శంఖం, వీణ, వేణువు మొదలైన వాద్య ధ్వనులు కల్పించారు. గంధర్వులు పాడారు, ఆడారు.

లక్ష్మీదేవికి దిగ్గజాలు సమస్త తీర్థాల నుంచి తెచ్చిన జలంలో తొండాలు ముంచి పైకెత్తి పండితులు మంత్రపఠనం చేస్తూండగా స్నానం చేయించాయి. సముద్రుడు ఆమె కట్టుకొనేందుకు రెండు పచ్చని పట్టుచీరలు తెచ్చి ఇచ్చాడు. వరుణుడు, మధువు నందలి ఆశతో మదించిన తుమ్మెదలు మూగిన వైజయంతీ మాలను ఇచ్చాడు. బంగారు బాహుపురులు, కంకణాలు, మువ్వలు, కడియాలు మొదలైన ఆభరణాలను విశ్వకర్మ బహూకరించాడు. వాణి ఒక చక్కని తార హారాన్ని ఇచ్చింది. బ్రహ్మ చేత దాల్చెడి లీలా పద్మాన్ని

---

1. పంచగవ్యము = ఆవు వలన లభించు ఐదు వస్తువులు. అవి 1. పాలు 2. పెరుగు 3. నెయ్యి 4. పేడ 5. మూత్రం; 2. వాద్య విశేషాలు.

సమర్పించాడు. సర్ప సమూహం కుండలాలు ఇచ్చాయి. వేదాలు ఆమె శ్రేయస్సుని కోరుతూ నుతించాయి. లోకాలన్నింటికీ ఏలిక సానివై జీవిస్తావని దిక్కులు పలికాయి.

వల్కులలో అమృతాన్ని చిలుకుతూ, ఆమె ఎవనితో భాషిస్తుందో అతడే బ్రహ్మ అవుతాడు. ఎఱ్ఱని కాంతులను చిమ్ము తన చేతితో ఎవ్వని చేతిని గ్రహిస్తుందో అతడు లోకాలన్నింటికి అధిపతి అవుతాడు. తీగలాంటి తన శరీరంతో ఎవ్వని శరీరాన్ని స్పృశిస్తుందో అతడు సర్వజ్ఞమూర్తి అవుతాడు. ఆమె ఎల్లవేళలా ఏ ఇంట నివసిస్తుందో ఆ ఇల్లు అమృతపదం అవుతుంది. ఆమె చూపు ఎచ్చట ప్రసరిస్తుందో ఆ చోటున జయం, ధర్మం, ధనం తాండవిస్తుంది. ఆమె చిరునవ్వు దుఃఖ నివారణం. సృష్టికారణం. ఒకమాటు ఆమె బ్రహ్మాండాన్ని చూచి తన మనస్సులో అది ఒక ఆటల బొమ్మరిల్లు అనుకుంటుంది. ఒకమాటు లోకాలన్నింటినీ పోల్చిచూచి అవి తన ఇంటిలో ఒకదానిపైనొకటి ఉంచిన వివిధ వస్తుసమూహం అని భావిస్తుంది. మరొకమారు బ్రహ్మాదిదేవతలను చూచి తన ఇంటిలోని బొమ్మలని భావిస్తుంది. ఇంకొకమారు భూమండలం చూచి అది ఒక బొమ్మపీట అని ఊహిస్తుంది. సూర్యచంద్రుల కాంతులను చూచి వేరొకమాటు దీపకళికలని అనుకొంటుంది మరొకమాటు భారతిని, దుర్గను చూచి తన ఆత్మ సఖులని వారిని ఆదరిస్తుంది. అనంతరం ఆమె తుమ్మెదల ఝుంకార ధ్వని అతిశయింపగా ఒక చక్కని కలువదండను చేదాల్చి మేఘ సముదాయం మధ్య మెరసెడి బంగరు బొమ్మలాగా వచ్చి దేవతలనడుమ నిలపడ్డది.

ఆ కన్నులు, ఆ కుచములు, ఆ కురులు (వెండ్రుకలు), ఆ పిఱుదులు, ఆ నడుము, ఆ ముఖము, చక్కని ఆ ఆకారము చూచి వేల్పులు వ్యాకులపాటుతో చీకాకు చెందారు. శ్రీహరి మాత్రం నిశ్చలంగా ఉన్నాడు. అలా నిలబడి లక్ష్మి దశదిశలా పర్యవేష్టించి ఉన్న యక్షులనూ, రక్షస్సులనూ, సిద్ధులనూ, సాధ్యులనూ, దివ్యజులనూ, గరుడులనూ, గంధర్వులనూ, చారణప్రముఖులనూ చూచి తన మనస్సులో ఇలా వితర్కించింది. ఒకచోట దీర్ఘ సుమంగళిగా ఉండటం సాధ్యంకాదు. ఒకచోట సవతితో పోరుతప్పదు. ఒకచోట నిరంతర వైభవం ఉండదు. ఒకచోట వలసిన వేడుకలు లభింపవు. ఎంత వెదికినా ఒకచోట కరుణ కరువవుతుంది. ఒకచోట కలసి వుండటం కష్టం ఒకచోట నిలుకడ లభింపదు. ఒకచోట చైతన్యం ఉండదు. కొన్ని చోట్లు కామ, గుణ గరిష్టాలు, కొన్ని యెడలు క్రోధ సంయుతాలు, కొన్ని మోహలోభకుంఠితాలు, మరికొన్నిచోట్లు మదమత్సరాస్పదాలు అని సకల సత్పురుష జనన వర్తనాలను మనస్సులో వితర్కించి చూచి పరిహరించింది.

అనంతరం ఆమె శ్రీహరిని కనులారా చూచి ఇలా అనుకుంది.- ఈదేవ దేవుని వరిస్తే నేను అమర ముత్తైదువనై యుండవచ్చు. సవతిపోరు ఉండదు. ఇతని నిలయం యెడతెగని వైభవంతో ప్రకాశిస్తూ ఉంటుంది. శృంగార మూర్తి. చందనంలాగా చల్లనైనవాడు. ఏనాడూ కలత చెందడు. కారుణ్యా మయ స్వరూపుడు. నిర్మలుడు. ఎప్పుడూ దరిచేరి సేవించవచ్చును. ఇతడు నిలకడ కలవాడు. ఏ పనియందునూ జడత్వం లేదు. సాధు రక్షకుడు. కామ క్రోధాదులు లేనివాడు. ఇతడు నాకు నాథుడైన ఎడల ఏ లోపము ఉండదు. కనుక ఇతడే నా ప్రాణేశ్వరుడు - అని ఆమె శ్రీహరిని పుష్పదామంతో పూజించింది. అలా నల్లకలువల దండతో నళినాక్షుని పూజించి ఆతనితో కూడి నివసించటానికి మందిరంగా ఆతని వక్షస్థలం అనువుగా ఉంటుందని భావించి ఆమె సిగ్గుతో దాని వంక చూచింది. మోహాతిశయం చేత ఆమె తల ఎత్తి చూస్తుంది కాని వెంటనే సిగ్గుతో తల వొంచి వేస్తుంది. ఆ రీతిగా ఆమె తన ప్రాణేశ్వరుని చూచి తల ఎత్తనూ ఎత్తదు. వంచనూ వంచదు.

అతను చూస్తే ఆమె చూడదు. ఆమె చూస్తే అతడు చూడటానికి సిగ్గు పడతాడు. అలా హరియూ, సిరియూ తమలో తాము సరిచూపులతో ఒకరి నొకరు చూచుకొంటూ ఉండే మన్మథుడు వారి హృదయాలను కలచి వేస్తు న్నాడు. లోకాలకి తండ్రియైన శ్రీహరి, లోకాలకి తల్లి అయిన లక్ష్మిని తన వక్షస్థలమందు ధరించాడు. అప్పుడాతని కరుణా దృష్టిచే ప్రజలు తిరిగి పూర్వపు రీతిగా శ్రేయస్సును, సంపదను ఆధిపత్యాన్ని పొంది సుఖించారు.

అంతకు ముందు సముద్రుడు తనయందున్న, అమూల్యమగు కౌస్తుభ మణిని శ్రీహరికి సమర్పింపగా దానిని ఆతడు వక్షస్థలాన ధరించాడు. అప్పుడు ఆ ఆదిలక్ష్మి శ్రీవత్సవం, కౌస్తుభం, వైజయంతి, వనమాల మొదలైన తార హారాలతో అలంకృతమైన పుండరీకాక్షుని ఉరస్సీమయందు అధివసించింది. అప్పుడు నానావిధ వాద్య ధ్వనులు శ్రవణ శుభగంగా మ్రోగాయి. చీకట్లు తొలగిపోయాయి. దేవతలు ఆనందంతో పాడుతూ నృత్యం చేశారు. అప్పుడు లోకవాసులు బ్రహ్మ రుద్రాదులు ఆయా గుణుతులు గల మంత్రాలతో పూల జల్లులు కురిపిస్తూ శ్రీహరిని సన్నుతించారు.

ఆ పాలకడలి కూతురు తీపులను, చూపులను చూచి ప్రజలు పరవశించి పోయారు. వారికి సకల సంపదలూ ఇట్టే లభించాయి. సకల శుభాలు ప్రాప్తించాయి. లోకాలన్నీ బ్రతికాయి. కాని ఆ లక్ష్మీదేవి రాక్షసులను కన్నెత్తి అయినా చూడక పోయేసరికి వారు ఆగ్రహంతో మిడిసిపడి పురపురపొక్కుతూ ఆదొక కీడుగా భావించి చలించిపోయారు.

అనంతరం వారు తిరిగి సముద్రాన్ని త్రచ్చగా అందుండి వారుణి అను ఒక కన్య జన్మించింది. రాక్షసులు శ్రీహరి సమ్మతిమీద ఆ కమలాక్షిని స్వీక

రించారు. జలధిని ఇంకా తరువగా తరువగా కొంతసేపటికి దానినుండి ధన్వంతరి అను దేవవైద్యుడు ఉద్భవించాడు. అతడు తరుణ వయస్సులో ఉన్నాడు. అతని భుజాలు దీర్ఘంగా ఉన్నాయి. మెడ శంఖంలాగా ఉంది. పీతాంబరం ధరించి ఉన్నాడు. మెడలో పూలదండ ఉంది. నానావిధ భూషణాలచే అతడు అలంకృతుడై ఉన్నాడు. అతని కళ్ళు ఎఱ్ఱగా ఉన్నాయి. బొమ్మ సమున్నతంగా ఉంది. అతని కేశపాశం నల్లగా వంకరలు తిరిగి ఉంది. అతని శరీరం మేఘ శ్యామలంగా ఉంది. అతడు సింహసత్వుడు. మణి కుండలాలు, మంజీరాలు ధరించాడు. స్వచ్ఛమైన ఆకృతి గల అతడు శ్రీహరి అంశాంశ సంభవుడు. అతడు యాగభోక్త. ఆయుర్వేద వైద్యశాస్త్రమందతడు అత్యంత నిపుణుడు. అతని చేతిలో అమృత కలశం ఉంది.

ఆ అమృత కుంభాన్ని చూచి రాక్షసులు అమితానందంతో ఉప్పొంగిపోయారు. మాఱులేని బలంతో ఆ రాక్షసులు దేవతలను వంచించి ధన్వంతరి చేతినుండి దానిని లాక్కొన్నారు. అమృతం తమకే లభిస్తుందని దేవతలు ఎంతో ఉబలాట పడ్డారు. కాని రాక్షసులు దానిని అపహరించేసరికి భయపడి "అయ్యో! అమృత పూర్ణఘటం పోయింది" అని శ్రీహరికి మొర పెట్టారు.

## శ్రీహరి మోహినీరూపం ధరించడం

భృత్యుల కోర్కెలు తీర్చేవాడు కనుక శరణాగతులైన వేల్పుల దైన్యం చూచి శ్రీహరి హృదయం ద్రవించింది. వారిని ఊరడిస్తూ "మీరు దుఃఖించకండి. నేను నా మాయాబలం చేత మీ కోర్కె సాధిస్తాను' అని వారికి అభయం ఇచ్చాడు.

ఆ సమయంలో అమృతం అంతా తామే త్రాగాలని సంభ్రమించెడి దైత్యదానవ జనంలో అమంగళమైన కలి ప్రవేశించేసరికి వారిలో వారికి కలహం తటస్థించింది. వారిలో దుర్బలులైనవారు కొందరు "సత్రయాగంలో ప్రవర్తించినట్లుగా మనతో సమాన ప్రయాస పడిన సురలు కూడా అమృత భాగానికి అర్హులవుతారు. కనుక వారికి కూడా అమృతం పంచటం కర్తవ్యం అది సనాతన ధర్మం. కనుక ఆ అమృత భాండాన్ని విడిచి పెట్టండి" అనేసరికి వారితో బలవంతులైన వారు మాత్సర్యంతో వారిని వారించారు. అపుడు వారిలో అత్యంత బలిష్ఠుడైన ఒకడు అమృత భాండాన్ని గట్టిగా చేతితో పట్టుకొని ఉన్న వానిని త్రోసిపుచ్చి ఆ భాండం తీసుకొని పారిపోయాడు. మిగతా వారందరూ అప్పుడు 'కుయ్యో, మొఱ్ఱో" అని గగ్గోలు పెట్టారు. అప్పుడు మాయానాటక సూత్రధారి అయిన శ్రీహరి ఆశ్చర్యకరంగా లోకాలను మోహింపచేసెడి ఆడుదాని రూపం ధరించాడు.

అలా వనితాకృతి ధరించిన వనజాక్షుని అడుగులు మృదువుగా ఉన్నాయి. మోకాళ్ళు మెరుస్తున్నాయి. తొడలు అరటి కంబాల్లాగా ఉన్నాయి. జఘనభాగం విశాలంగా ఉంది. నడుము సన్నంగా ఉంది. చేతులు చిగురాకుల్లాగా ఎఱ్ఱగా ఉన్నాయి. పాలిండ్లు బలిసిఉన్నాయి. కంఠం శంఖంలాగా ఉంది. క్రింది పెదవి దొండ పండులాగా ఎఱ్ఱగా ఉంది. ముఖం చంద్ర బింబంలాగా ఉంది. కనుదోయి తెల్ల తామరలను తిరస్కరిస్తోంది. శిరోజాలు తుమ్మెదబారుల్లాగా ఉన్నాయి. నుదురు బాల చంద్రుని లాగా ఉంది. కుండలాలు, బాహుపురులు, హారాలు, కంకణాలు ఆమెకు ఎంతో వన్నె కూరుస్తున్నాయి. కాలి అందెల రవళి కర్ణమధురంగా ఉంది. పెదవులపై చిఱునవ్వు తొణికిసలాడుతోంది.

అలా ఆ జగన్మోహిని తన చనుదోయిపై ఉన్న పైటను జాఱవిడుస్తుంది. అలా జాఱవిడిచి తిరిగి మెల్లగా సరిదిద్దుకుంటుంది. తళతళ మెరిసెడి చెక్కిళ్ళను బయలుపరుస్తుంది కానీ వెంటనే కెంగేలతో కప్పుకొంటుంది. కాంతులీనెడి కడకన్నులను అల్లనల్లన అరుస్తుంది. అర్చి వెంటనే రెప్పలతో వాటిని మూసివేస్తుంది. నవరసాలతో కూడిన వెన్నెలలాంటి చిరునవ్వును చిందిస్తుంది. అలా చిందించి కెమ్మోవితో దాన్ని కనపడనీయ కుండా చేస్తుంది. కొప్పున తురుముకొన్న పువ్వుల పరిమళాన్ని ఫలువైపులా చిమ్ముతుంది. కంకణాదుల ఝణం కృతులు అంతటా వ్యాపింపచేస్తుంది. ఆమె పైటగా వేసుకొన్న వస్త్రం అత్యంత సూక్ష్మమైనది అవటంచేత ఆమె శరీర కాంతులు అడ్డులేకుండా బయటకి ప్రసరిస్తున్నాయి.

ఈ రీతిగా కపట యువతి అయిన జగన్మోహిని నెమొగముతావికి మత్తిల్లి మూగిన తుమ్మెద గుంపులను అదలిస్తూ చిగురు జొంపాలకు దూరంగా తొలగిజడుస్తూ, ముఱుస్తూ ఉండగా రాక్షసులు ఆమెను చూచి ఇలా అన్నారు—ఓ జవ్వనీ! ఏమీ నీ లావణ్యం? ఏమీ నీ మాధుర్యం? ఏమీ నీ నవ యవ్వనం? నీ రాక ఎక్కడ నుండి? నీ కోర్కె ఏమిటి? నీ పేరేమి? అమరాంగనలకు కానీ, గంధర్వస్త్రీలకు కానీ, సిద్ధవనితలకు కానీ, అసుర చారణ మనుజ కన్యలకు కానీ నీ మహిమలేదు. ప్రాణం, చిత్తం, ఇంద్రియాలు- వీటికి పరిపూర్ణత్వాన్ని కల్పించాలనే ఊహతో విధి నిన్ను సృజించి ఉంటాడు. ఓ పూబోణీ! మేము కశ్యపుని సంతతి వారం. అన్నదమ్ములం. జ్ఞాతులం. మేముభయులం ఒకే ప్రయోజనం ఆకాంక్షించి ఇక్కడ చేరాం. నీవు మాధ్యస్థం వహించి ఎవరిపాలు వారికి పంచిపెట్టు. ఓ గజగమనా! మేమంతా ఇక్కడ సభ తీర్చి ఉంటాం. నీవు విపక్ష పక్ష భావం లేకుండా సమదృష్టితో ఎవరికి వచ్చేది అమృతాన్ని వారికి పంచి పెట్టు—అనివారు అరించే సరికి మాయా

యువతీ రూపుడైన హరి వాడి అయిన వాలు చూపుల ములుకలచే దైత్యుల సహనాన్ని భేదించి మందహాసంచేస్తూ మొగం ఎత్తి ఇలా అన్నాడు.

దేవవిరోధులారా! అందంగా ఉన్న మొగవారిని చూచి పొంగెడు నాయందు మీకు నమ్మకం కలదా? పెద్దలైనవారు కామినులను ఎన్నడూ విశ్వసింపరు. స్త్రీల పలుకులు మధురంగా ఉంటాయి. కాని తలపులు మాత్రం దావాగ్ని తుల్యంగా ఉంటాయి. వాటితో స్నేహం చేయటం తోడేళ్ళతో స్నేహంచేసినట్లు ఉంటుంది. స్త్రీలను నమ్మటం వేదవిహితం కాదు. అయినా నేను శక్తివంచన లేకుండా అమృతాన్ని మీకు పంచి ఇస్తాను. సందేహించకండి - అనేసరికి దానవులు అమృతభాండాన్ని ఆ జగన్మోహిని కిచ్చారు. ఆమె ఆ శాంత దృక్కులు ఆ శీతల వాక్కులు, ఆ లాలింపులు పాశాలై వారి నోళ్ళను బంధించాయి.

ఇలా సుధా కలశాన్ని చేదాల్చి చిరునవ్వులు చిలికెడి వాక్కులతో సుందరీ రూపం దాల్చిన ముకుందుడు మేలని, కీడని భావింపక 'నేను ఎలా పంచి ఇస్తే దానికి మీరు అంగీకరించాలి" అనేసరికి అలాగేనని సురాసులు దైత్యదానవులు ఉపవసించి, స్నానాలు చేశారు. హోమాలు ఆచరించారు. బ్రాహ్మణులకు గోవులు, భూమి, హిరణ్యం (బంగారం) దానం చేశారు. వారి ఆశీర్వాదాలు పొందారు. తెల్లని బట్టలు ధరించి గంధమాల్యాలతోనూ, ధూప దీపాలతోనూ అలంకృతమైన కనకరత్నశాలలో తూరుపుకొనలు గల దర్భాసనాల మీద పూర్వదిశాభిముఖులై బారులు తీర్చి కూర్చున్నారు. అప్పుడు మోహిని జఘనభారంతోనూ, కుచభారంతోనూ, వేణీభారంతోనూ డస్సినట్లయి నానావిధాలైన ఆభరణాలూ ధ్వనిస్తూండగా హస్తకమలమునందు అమృత భాండం ధరించి వచ్చింది కుండల కాంతికి ఆమె ముక్కు, ముఖం, చెవులు, చెక్కిళ్ళు, క్రీగన్నులు మెరిసిపోతున్నాయి. ఆమెను చూచి దేవరాక్షససమూహం మోహపరవశం అయింది. అప్పుడామె 'రాక్షసులకు అమృతం పోయడం పాములకు పాలుపోసినట్లు ఉంటుంది. అంచేత వారికి అమృతం ఇవ్వటం తగదు" అని వారిని వేరొకచోట కూర్చోపెట్టింది.

దేవదానవులు అలా వేరువేరుగా రెండు పంక్తులుగా ఏర్పడి కూర్చుండగానే సరికి జగన్మోహిని దానవులారా! తొందరపడకండి వినండి. సురలారా! అలసిపోక ఇప్పుడే వస్తున్నా ఉండండి-ఆ ప్రక్క కూర్చోండి-అని కన్నులల్లార్చి చనుగవమీది పైయెద జారవిడిచి, వదిన మరదుల వావులు కల్పించి, మర్మస్థానాలను వెల్లరిచి వెంటనే మరుగుచేస్తూ చిరునవ్వులతో అందరూ మైమరచేలాగా చేసింది. చతుర వాక్కులతో వారిని ఉక్కిరి బిక్కిరి చేసింది. రాక్షసులను వంచించి 'ఆలస్యం చేయకుండా తాగండి" అని దేవతలను హెచ్చరిస్తూ

వారికి వీలైనంత అమృతాన్ని పంచి ఇచ్చింది. దేవతలు సంతుష్టులై ఎంత గానో పొగిడారు.

అప్పుడు రాక్షసశ్రేష్ఠులు తమలో తామిలా వితర్కించు కొన్నారు- మనకూ వేల్పులకూ ఏపోరూ లేకుండా అమృతం పంచి పెడతానని ఈమె ప్రతిజ్ఞ చేసింది. ఆ ప్రతిజ్ఞను ఆమె ఎందుకు తప్పుతుంది? తప్పదు. కాక మనవైపు రమ్మని పిలుస్తామనుకో, ఆమె కోపించి మఱుమాట ఆడదేమో! మన వంక చూడదేమో! చనుగవ్వను కనుపరచకుండా కప్పివేస్తుందేమో! మనపై ఆగ్రహం చెందుతుందేమో! మనయెడల విముఖత్వం చూపుతుందేమో!- అని మోహపరవశులైన రాక్షసులు ఆమె చూపులకు నీరై కరిగిపోతూ ఎక్కడ ప్రణయ భంగం కల్గుతుందో అనెడి భీతితో కట్టువడి మెదలకుండా ఉన్నారు. అంతేకాని మాకున్నూ అమృతం తెచ్చి ఇమ్మని అడుగలేక పోతున్నారు.

అప్పుడు దేవ సమూహంలో రాహువు దివిజాకారంతో ప్రవేశించి అమృతం త్రాగాడు. సూర్యచంద్రులు అది చూసి సైగచేయగా వనితాకృతిలో ఉన్న శ్రీహరి తన చక్రంతో వాని శిరస్సు ఖండించాడు. అమృతం త్రాగటం చేత అతని మూర్ధం (తల) అమరత్వం చెందింది. మిగిలిన శరీరం మాత్రం నేలకూలింది. బ్రహ్మదేవుడు వాని శిరస్సును ఆకాశవీథిలో గ్రహంగా కల్పించి వానిని గౌరవించాడు. కాని వాడు పర్వదినాల్లో వైరం విడిచిపెట్టకుండా సూర్యచంద్రులను గ్రసిస్తూ ఉంటాడు. రాక్షసులకు అమృతంలో ఒక బొట్టు కూడా చిక్కకుండా చేసి అంతా దేవతలకే పోశాడు. అనంతరం తన సహజ రూపం ధరించాడు. రాక్షసులు తల్లడిల్లిపోయారు. దేవతలూ, రాక్షసులూ శ్రమలోకాని; శక్తి సామర్థ్యాల్లో కాని, అభిమానంలో కాని సమానులైనప్పటికీ రాక్షసులు తమ సంకల్పంలో విఫలు లయ్యారు. దేవతలు మేలు పొందారు. రాక్షసులకు ఆ దుస్థితి కల్గటానికి కారణం వారి భుజగర్వం. శ్రీహరిని శరణు వేడని వారికి శుభం కల్గుతుందా ?

## దేవాసుర యుద్ధం

అమృతం త్రాగాలనే ప్రయత్నంతో రాక్షసులు సముద్ర మథనం చేసి తుదకు హతాశులై ఎలా దుఃఖించారో అలాగే శ్రీహరికి విముఖులైన హీనులు ఇష్టార్థాలు పొందలేరు. శ్రీహరి ఆ రీతిగా జలధిలో అమృతం సాధించి రాక్షసులను వంచించి అమృతం అంతా అమరులకి ఇచ్చి గరుడారూఢుడై నిర్గమించాడు.

అమృతం అంతా దేవతల పాలయ్యేసరికి రాక్షసులు క్రుద్ధులై నానావిధ శస్త్రాస్త్రాలు ధరించి దేవతలతో యుద్ధానికి తలపడ్డారు. మదాభిమానులైన బలి

చక్రవర్తి, దేవేంద్రుడూ మొదలైనవారు రణరంగంలో ఒకరినొకరెదుర్కొని భుజవిన్యాసాలతోనూ, ఖడ్గవిన్యాసాలతోనూ అతిశయించి దారుణ యుద్ధం చెయ్యడం మొదలుపెట్టారు. బలిచక్రవర్తి మయ నిర్మితమైన విమానం అధిరోహించి పూర్ణచంద్రుడులాగ మెరిసిపోతున్నాడు. ఆ విమానం అరుదైనది. కామగమనం కలది.దృశ్యాదృశ్యంగా ఉంటుంది. అందులో సకల శస్త్రాస్త్రాలూ ఉన్నాయి. రాక్షస యోధులెందరో దానిలో ఉన్నారు. అది ఆకాశాన స్వేచ్ఛగా సంచరిస్తుంది. చామరాలతోనూ, ధ్వజాలతోనూ అది ఎంతో శోభాయమానంగా ఉంటుంది. అలాంటి అద్భుత విమానాన్ని అధిరోహించి బలి అపార సేనా సముదాయంతో యుద్ధానికి వచ్చాడు.

నముచిశంబరబాణాదులనూ, శుంభనిశుంభ ప్రముఖులనూ, నివాతకవచ ప్రభృతులనూ, ఇంకా తక్కిన అనేక దండనాథులను కూడి రథాలు, గుఱ్ఱాలు, ఏనుగులు ఇంకనూ నానావిధ జంతు పక్షి సమూహాలనూ ఆరోహించి తమ తమ గురుతులు గల గొడుగులు, టెక్కెములు, ఆయుధాలు, కవచాలు, శిరస్త్రాణాలు ధరించి వేరు వేరు వ్యూహాలు పన్ని బలిచక్రవర్తి ముందు నిలబడ్డారు. దేవేంద్రుడు కూడా ఐరావతాన్ని అధిరోహించి అగ్ని, వరుణ, వాయు, దండధరులు మొదలగు అనేక సురయోధులతోనూ, అసంఖ్యాకమైన అమరసైన్యంతోనూ రాక్షససేనను ఎదిరించి మోహరించాడు. అలా ఉభయ సేనలు మహోత్సాహంతో సంరంభించి వీరాలాపాలు పలుకుతూన్న సమయంలో రవ్వలు పొదిగిన వింజామరాలూ నెమలిపించాలతో నిర్మింపబడిన చామరాలూ, వెల్లగొడుగులూ, రంగురంగుల ధ్వజాలూ, కట్టుపుట్టాలూ, గాలికి కదలెడి చెంగుల తలపాగాలూ, నానావిధ భూషణ నిక్వణాలూ, సూర్యకాంతుల వంటి కాంతులుచిమ్ము శస్త్రాలూ, డాలువాలులూ, వీరమాలికలూ, బాణాలతో నిండిన అంబులపొదలూ మొదలైనవాటితో పెచ్చురేగి దేవదానవ సైన్యాలు నానావిధ జల జంతువులతో కూడి పరస్పరం పోరాటానికి సిద్ధపడిన సముద్రాల్లాగా గోచరించాయి.

నరేంద్రా! ఆ సమయంలో రణభేరీ ఝాంకారాలు, మదగజ ఘీంకారాలు, తురంగ హేషలు (సకిల్రింతలు), రథచక్రాల మహాధ్వనులు అతిశయించి కులపర్వతాలను కూడా పెకలించి వేస్తున్నట్లున్నాయి.

ఆ రీతిగా ఉభయబలాలు మోహరించి బలితో ఇంద్రుడూ, తారకునితో గుహుడూ, కాలనాభునితో యముడూ, మయునితో విశ్వకర్మ, నముతో పరాజితుడూ, వృషపర్వునితో అశ్విదేవతలూ, బాణాసురాదులతో సూర్యుడూ, రాహువుతో చంద్రుడూ, పులోమునితో వాయుదేవుడూ, శుంభనిశుంభులతో భద్రకాళీ, జంభునితో వృషాకపీ, మహిషునితో విభావసుడూ, ఇల్వల వాతాపులతో బ్రహ్మపుత్రుడూ, దుర్మర్షణునితో కామదేవుడూ, ఉత్కలునితో

శనైశ్చరుడూ, నివాతకవచులతో మరుత్తులూ, కాలేయులతో వసువులూ, పౌలోములతో విశ్వేదేవగణాలూ, క్రోధవశలతో రుద్రుడూ కలిసి పెరగి ద్వంద్వయుద్ధం చేయటం మొదలుపెట్టారు.

అలాగే రథికులను రథికులు, కాల్బలాలను కాల్బలాలు, వాహనారూఢు లను వాహనారూఢులూ ఎదిరించి, సింహనాదాలు చేస్తూ అట్టహాసాలతో ఒకరి నొకరు ఆహ్వానిస్తూ, తిరస్కరిస్తూ, భుజాలుచరుస్తూ విజృంభించి కేకలు పెడుతూ హుంకరిస్తూ, అహంకరిస్తూ నానావిధ శస్త్రాస్త్రాలతో దారుణంగా యుద్ధం చేయటం మొదలుపెట్టారు.

పరస్పరం వాడిబాణాలు ప్రయోగిస్తున్నారు. గొడ్డళ్ళతో నరుక్కుంటు న్నారు. చక్రాలతోనూ, శక్తులతోనూ దునుమాడుతూన్నారు. కొరడాలతో కొడుతున్నారు. ఈటెలతో పొడుస్తున్నారు. గదలతో అణచి వేస్తున్నారు. కత్తులతో వ్రేస్తున్నారు. పాశాలతో బంధిస్తున్నారు. అడకత్తులతో ఖండి స్తున్నారు. గుదియలతో మొత్తుతున్నారు. నమ్మెటలతో మోదుతున్నారు. పిడికిళ్ళతో పొడుస్తున్నారు. చిల్లకోలలతో కొడుతున్నారు. బరిసెలు విసురు తున్నారు. గోళ్ళతో చీరుతున్నారు. చెట్లనూ కొండలనూ పెరికి ఋవ్వుతున్నారు. కొఱవులతో దహింప చేస్తున్నారు. అలా ఉభయసైన్యాల్లోని వీరులూ రణ విహారం చేస్తూండగా,

యుద్ధరంగం తెగిపడిన తలలతో, ఛిన్నాభిన్నాలైన పుఱ్ఱెలతో, వికలాలైన చెక్కిళ్ళతో, చిక్కుపడ్డ కేశబంధాలతో, విరిగినదంతాలతో, తెగిన భుజాలతో, విచ్ఛిన్నాలైన చేతులతో వికృతాలైన ముఖాలతో, వికలాలైన నేత్రాలతో, వికీర్ణాలైన (చెదరిన) చెవులతో, ఊడిపడిన నాసికలతో, విరిగిపడిన తొడలతో, సందులు విడిన చరణాలతో, చిరిగిన కవచాలతో, రాలిన భూషణా లతో, వ్రాలిన ధ్వజాలతో, కూలిన గొడుగులతో, ప్రమ్రగ్గిన ఏన్గులతో, నుగ్గయిన రథాలతో, ఊబుమైన గుర్రాలతో, చిందరవందరయైన భట సమూహాలతో, కొఱప్రాణాలతో కొట్టుమిట్టాడుతూన్న మొండెములతో, రణభూమి భయంక రంగా ఉంది.

రక్తం కాలువలుకట్టి ప్రవహిస్తోంది. మాంసం కుప్పలు కుప్పలుగా పడ్డది. భూతాలు మహోత్సాహంతో ఆడుతూన్నాయి. తల తెగిన శరీరాలు ఎగిరెగిరి పడుతున్నాయి. గద్దలూ, రాబందులూ కలకలం చేస్తూన్నాయి. ఆ దేవాసురయుద్ధం అమిత భయంకరంగా ఉంది.

అపుడు రాక్షసేంద్రుడు బలి, ఇంద్రునిపై దారుణ శరాలు పదీ, ఐరావతంపై మూడూ, గుర్రాలమీద నాలుగేసీ, సారథిపై ఒకటీ ప్రయోగించే సరికి, ఇంద్రుడు ఆయన్నింటిని అన్ని బాణాలతోనూ, త్రుంచివేశాడు. శత్రు

వర్గాన్ని అరికట్టాడు. బలి ఇంద్రుని యుద్ధ నైపుణ్యం చూచి విస్మితుడై అతణ్ణి కొనియాడాడు.

ఇంద్రుడిలా మహా పరాక్రమంతో తన బాణాలన్నింటినీ వరుస పెట్టి సరికివేసే సరికి బలి చక్రవర్తి మహాశక్తిని చేదాల్చాడు. ఇంద్రుడు దాన్ని కూడా అతని చేతిలో ఉండగానే ఆశ్చర్యకరంగా ఖండించి వేశాడు. అనంతరం బలి ఈటెను, శూలాన్ని, గదను గ్రహించేసరికి ఇంద్రుడు వెనువెంట నే వాటిని కూడా త్రుంచి వేశాడు. అంతటితో పోక రాక్షసేంద్రుడు ఏ ఏ ఆయుధాలు ప్రయోగించటానికి యత్నిస్తే ఇంద్రుడు త్రుటిలో వాటిని ధ్వంసం చేశాడు. తుదకు ఇంద్రుడు బలి రథాన్ని కూడా విరిచి వేశాడు. బలి విరథుడైనా వెనుదీయకుండా కపట వృత్తితో దేవతలు ఆశ్చర్యపడగా ఆకాశాన నానావిధ మాయలు కల్పించాడు.

దానవేంద్రుని మాయా విశేషం చేత సుర సమూహాల మీద పర్వతాలు వచ్చి పడుతున్నాయి. కార్చిచ్చుతో దగ్ధాలైన చెట్లు వర్షిస్తున్నాయి. వాడి శిఖరాలు గల శిలలు పడి కప్పివేస్తున్నాయి. మహా సర్పాలు కరుస్తున్నాయి. తేళ్ళు మీటుతున్నాయి. పులులూ, సింహాలూ, అడవి పందులూ మీదపడి విదళిస్తున్నాయి. అడవి ఏనుగులు ఎదిరించి మట్టి మల్లాడుతున్నాయి. వేలకొలది రాక్షస వీరులు శూలాలు చేదాల్చి దిగంబరులై "సుర వీరులను నరకండి, పొడవండి" అని కేకలు పెడుతూ ఎదిరిస్తున్నారు. వికృత వదనాలతో జుట్లు విరియబోసుకొని గదా దండాలు ధరించి ఇంకను రాక్షస వీరులు అనేకులు దేవసైన్యం వెంటపడి తరుముతున్నారు. పిడుగులతో కూడిన మేఘ సమూహాలు గాలి తాకిడికి చెలరేగిన మంటలను కురుస్తున్నాయి. అలాగే పెనుగాలికి చెలరేగిన కార్చిచ్చు ప్రళయ సమయాగ్నిలాగా చెలరేగి దహింప చేస్తోంది. ప్రచండమైన వాయువుచే కదల్చబడిన ఉత్తుంగ తరంగాలతో, సుడులతో భయంకరంగా ఉన్న మహా సముద్రం చెలియల కట్ట దాటి వెల్లి విరిసి నట్లుంది. ఆ సమయంలో ప్రళయకాలంలో లాగా మిన్నూ మన్నూ, రేయి పగలూ తెలియరాకుండా ఉంది.

అప్పుడు రాక్షసేంద్రుని మాయాజాలానికి మారు ఏమి చేయాలో తెలియక ఇంద్రాది దేవతలు అపాయంలో చిక్కుపడి - ఈ రాక్షసుల చేత చిక్కాం. ఏది దారి? ఎక్కడికి పోతాం? శ్రీహరీ! దేవా! ఇటురావా? అని దేవతలు మొరపెట్టారు. దేవతలు అలా దైన్యంతో కుయ్యిడగా వెంటనే అక్కడకు శ్రీహరి గరుడారూఢుడై వచ్చాడు. అతని వక్షస్థలం కౌస్తుభ మణితోనూ, లక్ష్మీదేవితోనూ మెఱసిపోతోంది. భుజాల మీద నానావిధ శస్త్రాస్త్రాలూ ఉన్నాయి. మణి కాంతులతో మెఱసెడి కిరీటం ధరించాడు. పచ్చని పట్టు దువ్వలువ ధరించాడు. అతని నేత్రాలు వికసించిన పద్మాలలాగా

ఉన్నాయి. నానావిధ మణి కాంచన భూషణాదులతో మెఱసిపోతూ మాధవుడు అలా అక్కడ సాక్షాత్కరించే సరికి రాక్షస మాయలన్నీ తొలగి పోయాయి. దేవతలు నిద్రనుండి మేల్కొన్నట్లు సంతోషంతో అతిశయించారు. శ్రీహరి పాద పద్మాలు సేవిస్తే ఆపదలు పోకుండా ఎలా ఉంటాయి?

అనంతరం కాలనేమి యనువాడు సింహ వాహనా రూఢుడై గరుడుని శూలంతో పొడవగా శ్రీహరి ఆ శూలాయుధాన్ని తన చేతితో వడిసిలాగి దానితోనే ఆ రాక్షస వీరుని పొడిచి చంపాడు. అనంతరం మాలి, సుమాలి అనువారలు బెదరించి ఎదిరించే సరికి శ్రీహరి చక్రాహతితో వారి తలలు త్రుంచాడు. అప్పుడు మాల్యవంతుడను మరొక రాక్షసుడు గదతో గరుడుని రెక్కలు విరుగగొట్ట యత్నించగా శ్రీహరి అతని శిరస్సుకూడా ఖండించాడు. సేనలన్నీ తల్లడిల్లి పోయాయి.

ఇలా పరమ పురుషుడైన శ్రీహరి కరుణాతిశయం చేత తిరిగి మనస్స్వాస్థ్యం పొంది వరుణుడు, వాయువు, ఇంద్రుడు మొదలైన వారందరూ పూర్వం ఎవరు ఎవరితో తలపడి యుద్ధం చేశారో వారు తిరిగి వారిని ఎదుర్కొని నొప్పించారు. అప్పుడు దేవేంద్రుడు బాహుబలంతో సాహసించి బలి చక్రవర్తిని ఏ విధంగానైనా జయించాలనే పట్టుదలతో వజ్రాయుధాన్ని ఎత్తాడు. అప్పుడు అందరూ హాహాకారాలు చేశారు. వజ్రహస్తుడైన ఇంద్రుడు తన ఎదుట పరాక్రమించి నిలబడి ఉన్న బలిచక్రవర్తిని చూచి ఇలా అన్నాడు - దానవేంద్రా! లోకంలో వైరిని కనుగప్పి గెలవటం కూడా శౌర్యమేనా? ధైర్యమేనా? పౌరుషం,సామర్థ్యం కలిగిన మగవా డెవరైనా శత్రువు కంటపడకుండా మాయా జాలంతో దాగితే బంధువులు నవ్వరా? బుధులు తిట్టరా? కన్నెలు అభిమానిస్తారా? కనుక నీవు మాయలు చేయడం తగదు. మాతో పోరాటం నవ్వులా? నా వజ్ర ధారతో నిన్ను ఇప్పుడే చీల్చి చెండాడుతాను.నీ ఇష్టార్థాలు ఏమైనా ఉంటే చూచుకో. నీవు చూడదల్చిన వారిని చూచుకో. దేవేంద్రుడు ఈనాడు రణరంగంలో నీ ఆటోపాన్ని అణచివేయ నున్నాడు - అని ఇంద్రుడు నిందించే సరికి బలి చక్రవర్తి ఇలా అన్నాడు.

సురేంద్రా! ఎందుకు ఈ దర్పోక్తులు? నీవే పోటరివా? నీకు మాత్రం గెలుపూ ఓటమీ లేవా? ఎవరికైనా మేలు కీడులు తప్పవు. బ్రహ్మాదులు కూడా వాటిని త్రోసివేయజాలరు. ఎవరికీ హర్ష శోకాలు తప్పవు. దైవం కరతలా మలకం అనుకొన్నావా? జయాప జయాలూ సంప దాపదలూ వాయు చలితాలైన దీపపు కొనలవంటివి. వృద్ధి క్షయాలకు లోనైన మేఘాల వంటివి. చలించెడి సముద్రతరంగాల వంటివి.ఇట్టే కనపడి మరల మరుగుపడి పోయెడి విద్యుల్లతల లాంటివి. కనుక మిట్టి పడకు- అని ఆక్షేపించి మహావీరుడైన

దానవ నాథుడు నిశిత బాణాలతో ఇంద్రుని శరీరం నొప్పించాడు. అంతేకాక దారుణాయుధ తుల్యములైన శూరాలాపాలతో అతనికి వ్యధ కల్పించాడు.

సత్యవాది అయిన బలిచేత ఈ రీతిగా నిరాకరింపబడిన ఇంద్రుడు క్రుద్ధుడై అంకుశంచే కొట్టబడిన ఏనుగులాగా త్రుళ్ళుచూ అతనిపై వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. బలిచక్రవర్తి ఆ వజ్రాహతికి రెక్కవిరిగిన పర్వతంలాగా నేల కూలాడు రణరంగంలో అలా నేల కూలిన తనచెలికాని దీనస్థితిని చూచి జంభాసురుడు తన భుజబలంతో సురేంద్రుని ఎదిరించాడు. అతడు సింహవాహనారూఢుడై గద చేదాల్చి ఇంద్రుని ఎదిరించాడు. సుర గజాన్ని నొప్పించాడు. సంరంభించి సింహనాదం చేశాడు. జంభాసురుని గదాహతికి దిగ్గజం తోకకూడా కదిలించలేక పోయింది. దుర్భరమైన వేదనతో అది మోకరిల్లి సుడివడి నేలపై వడ్డది అప్పుడుఇంద్రసారథి అయిన మాతలి వేయి గుర్రాలు పూన్చిన రథాన్ని ఆయత్తపరచి తీసుకొనిరాగా దేవేంద్రుడు దానిని అధిరోహించాడు. అపుడు జంభాసురుడు మాతలిని శూలంతో పొడిచాడు. కాని మాతలి ఏమాత్రం వ్యధ చెందక సింహనాదం చేశాడు. అపుడు దేవేంద్రుడు సూతుని 'భయపడవల'దని హెచ్చరించి వజ్రాహతితో జంభుని శిరస్సు ఖండించాడు. అది చూచి రాక్షససేనలు తల్లడిల్లిపోయాయి.

ఇంద్రునిచే జంభాసురుడు నిహతుడయ్యాడని నారదుని వలన విని అతని సోదరులు బలాసురుడు కాకాసురుడు నముచి దేవేంద్రుని చూచి పరుషోక్తులతో తూలనాడుతూ మేఘజలధారలతో పర్వతాన్ని కప్పినట్లు శర వర్షాలు కురిపించి అతన్ని ముంచెత్తారు. బలాసురుడు సురేంద్రుని వేయి గుర్రాలపై వేయి బాణాలు ప్రయోగించి వాటిని అదరచేశాడు కాకాసురుడు రెండేసివందల బాణాలతో సారథిని, రథాన్ని ఇంద్రుని ప్రతి అవయవాన్ని వేధించాడు. వాడు మహాధానుష్కుడు. వాడు ధనువున బాణాన్ని ఎప్పుడు తొడిగేదీ ఎప్పుడు విడిచేది కూడా ఎవరికీ తెలియదు. అలాగే నముచి కూడా బంగారు కొనలుగల పదిహేను బాణాలు ఇంద్రునిపై ప్రయోగించి గర్జించాడు. ఈ విధంగా ఆ ముగ్గురు రాక్షసవీరులు వర్షాకాలంలో మేఘసమూహాలు పద్మమిత్రుడైన సూర్యుడిని ముంచి వేసినట్లు ఇంద్రుని, అతని రథాన్నీ, సారథినీ అస్త్రసమూహాలతో ముంచివేశారు.

అపుడు దేవతలందరూ రోదన ధ్వనులు చేస్తూ — మహేంద్రా! నీవు రాక్షసుల బాణసమూహముల పాలైపోయావా? అన్ని భిన్నులై సముద్ర మధ్యంలో నావ పగిలిపోవటంచేత భీతిఖొంది ఆత్మరక్షణకై విలపిస్తూ సముద్రంలో దూకే వర్తకజనుల్లా రాక్షసేంద్రుని వ్యూహ మధ్యంలో చిక్కుకొని పోయారు. అపుడు కొంతసేపటికి ఇంద్రుడు రాక్షసేంద్రుడు కల్పించిన బాణ పంజరాన్ని చించుకొని అశ్వాలతోనూ, రథంతోనూ నిశావసానమందు

తూర్పుదిక్కున ఉదయించు సూర్యుడులాగా మహాతేజంతో బయటపడి– 'దేవతలారా! నేనున్నాను. దుఃఖించకండి" అని హెచ్చరించాడు.

అలా శత్రువ్యూహంలో నుండి బయటపడిన ఇంద్రుడు చెల్లాచెదరైన సుర సేనను చూచి వారిని తిరిగి యుద్ధానికి పురికొల్పి తన వజ్రాయుధంతో కాకాసుర బలాసురుల శిరస్సులు ఖండించి నేలకు కూల్చాడు. ఆ రక్కసుల చుట్టాలు వారి సేనాధిపతులు వారు అలా నేలకొరగటం చూచి దుఃఖంతో భయాకులులై పారిపోయారు.

అపుడు నముచి నిలువబడి 'ఔరా! ఈతడు నా వారిని చంపివేశాడే!' అని శోకిస్తూ క్రుద్ధుడై ప్రబలమైన ఒక శూలాన్ని సారించి ఇంద్రునిపై విసిరాడు. ఆ శూలం లోహమయమైనది. బంగారుపు కొనతోనూ, గంటలతోనూ అది చూడటానికే దుస్సహంగా ఉంది. దానితో ఇంద్రుడు హతుడవుతాడని భావించి సింహంలాగా గర్జించాడు. కానీ ఆకాశాన వస్తూన్న ఆ శూలాన్ని దేవేంద్రుడు ఖండించి వాని కంఠాన్ని త్రుంచటానికి అనేక బాణాలు ఉపయోగించాడు. వజ్రాయుధాన్ని కూడా విసిరాడు. కానీ అవి ఏవీ వాని కంఠాన్ని ఖండించలేక పోయాయి. వాడు నిశ్చలంగా ఉన్నాడు. అది చూచి దేవేంద్రుడు ఆశ్చర్యచకితుడయ్యాడు.

తన వజ్రాయుధం అలా ప్రతిహతమయ్యేసరికి సురాధిపుడు శంకించి తన మనస్సులో ఇలా అనుకొన్నాడు– కొండల రెక్కలు ఖండించేటప్పుడు ఈ వజ్రాయుధం వాడి చెడలేదు. వృత్రాసురాదులను విదలించేటప్పుడు కూడా ఇది తన పని నెరవేర్చుకొంది. కాని ఎన్నడూ వెనుతిరగలేదు. నేను ఇంద్రుడను కానో! లేక ఇది వజ్రాయుధం కాదో? కాక దీని ప్రయోగం చెడెనో? రాక్షసాధముడు దీని మొన తాకును తప్పించాడో! ఈనాడు ఇలా వజ్రాయుధం పెండువడి పోవటానికి హేతువు ఏమిటో! అని ఇంద్రుడు శోకాకులుడై ఉండగా – సురేంద్రా! ఈ రాక్షసుడు ఆర్ద్రమైన(తడిగల)ఆయుధంచే గాని, శుష్కమైన ఆయుధంచే కాని చావకుండా పూర్వం తపస్సు చేశాడు. నీ వజ్రాయుధం శుష్కమైనది. అందుచేత అది వీనిని చంపలేకపోయింది. కనుక వీని మరణ నిమిత్తం మరొక ఆయుధాన్ని దేనినైనా ప్రయోగించు"– అని దివ్యవాణి పల్కింది. అలా ఆదేశించిన ఆకాశవాణి పలుకులు విని ఇంద్రుడు ఆర్ద్రము, శుష్కము కాని ఆయుధం ఏదై ఉంటుందా? అని మనస్సులో, ఎంతో ఆలోచనచేసి చివరకు అలాంటిది ఫేనం (నురుగు) అని నిశ్చయించుకొన్నాడు. దానిని తెచ్చివెంటనే వజ్రాయుధానికి అమర్చాడు. వెంటనే దానితో నముచి శిరస్సుని ఖండించి వేశాడు. అపుడు దేవతలు ఆనందంతో పులకించిపోయారు.

మునులు దేవేంద్రుని పొగిడి పుష్పాంజలలు పట్టి దీవించారు. గంధర్వ ముఖ్యులైన విశ్వావసు పరావసులు ఉల్లాసంతో గానంచేశారు. దేవాంగనలు నాట్యం చేశారు. దేవతలు దుందుభులు మ్రోగించారు. వాయువు, అగ్ని, యముడు,వరుణుడు మొదలైన సురశ్రేష్ఠులు తమ్మెదిరించిన ప్రతిద్వంద్వులను, అల్పమృగాలను సింహం సంహరించినట్లు సంహరించారు. అలా యుద్ధంలో దానవ నాశనం జరగటం చూచి దాన్ని వారించటానికి బ్రహ్మ నారదుని పంపాడు. నారదుడు వెంటనే వచ్చి "సురలారా! మీకు అమృతలం సిద్ధించింది. శ్రీహరి అనుగ్రహంచేత మీరందరూ వృద్ధిచెందారు. మీ వైరులు నశించారు. మీకింకా కలహం దేనికి? చాలు చాలు ఆపండి, ఆపండి" అని సరసంగా మాట్లాడేసరికి దేవతలు సంతుష్టులై రాక్షసులతో యుద్ధం చాలించి స్వర్గ నిలయానికి వెళ్ళారు. హతశేషులైన దైత్యులూ దానవులూ వజ్రప్రహారంచేత మూర్ఛిల్లిన బలిని తీసుకొని అస్తాచలానికి వెళ్ళారు.

అప్పుడు శుక్రుడు రణరంగంలో ఖండితాంగులైన రాక్షసులందరినీ తన మృతసంజీవినీ విద్యచే బ్రతికించాడు. బలిదైత్యేంద్రునకున్నూ, శుక్రా చార్యుల అనుగ్రహంచేత శరీరవేదన తొలగి పోయింది. అతడు యుద్ధంలో పరాజితుడైనా లోకజ్ఞానం, కాలజ్ఞానం కలవాడు కనుక దుఃఖపడకుండా నిశ్చలంగా ఉన్నాడు - అని శుకమహర్షి పరీక్షిన్నరేంద్రునితో ఇంకా ఇలా అన్నాడు.

కైలాసపర్వతం మీద చంద్రశేఖరుడు ఒకనాడు కొలువుతీర్చి ఉండగా శ్రీహరి అంగనయై అసురలనువంచించి అమరులకు అమృతం ఇచ్చాడని విని వెంటనే సతీసహితుడై వృషభ వాహనం అధిరోహించి భూత సంఘాలు సేవిస్తూండగా శ్రీహరి నిలయానికి వెళ్ళాడు. శ్రీహరి మహేశ్వరునకు అర్ఘ్య పూజలు చేశాడు. శివుడున్నూ,రాక్షసాంతకుడైన హరిని యథోచితంగా పూజించి "మీకు కుశలమేనా? మేము కుశలంగా ఉన్నాం" అని మధురోక్తులతో శ్రీహరి యెడల తన స్నేహభావాన్ని వ్యక్తంచేస్తూ ఇలా అన్నాడు-

దేవా! దేవేశా! జగదీశా! జగన్మయా! నీవు కాలజగద్వ్యాపకస్వరూపుడవు. చేతనాచేతనాలైన సకలపదార్థాలకు నీవు ఆత్మవు. నీవు సమస్తమునకూ కారణ భూతుడవు. ఆది మధ్యాంత రహితుడవు. పూర్ణము, అమృతము, ఆనంద చిన్మాత్రము, అవికారము, అద్యము, అనవద్యము, అశోకము, అగుణము, సకల సృష్టి స్థితి లయమూలము,అయిన బ్రహ్మం నీవే. మహర్షులు కైవల్యాన్ని కాంక్షించి ఎల్లప్పుడూ నిన్ను కొలుస్తూంటారు.

కొందరు నిన్ను బ్రహ్మమని భావిస్తారు. కొందరు ధర్మమని విశ్వ సిస్తారు. కొందరు చర్చించి సదసదీశ్వరుడవని నిర్ణయిస్తారు. కొందరు శక్తి సహితుడవని తలపోస్తారు.మరికొందరుచిరతరుడవనియూ,అవ్యయుడవనియూ,

ఆత్మతంత్రుడవనీ, వరుడవనీ, అధికుడవనీ ఊహిస్తారు కానీ తుదకు నీవు అద్వయుడవు. సదసద్విశిష్ట సంశ్రయుడవు. బంగారముతో చేయబడిన కంకణాదులూ బంగారమూ ఒక్కటే. అలలు ఎన్నిఅయినా సముద్రం ఒక్కటే. వాటికి భేదంలేదు. అలాగే కార్యమైన జగత్తునకూ కారణమైన నీకున్నూ భేదం లేదు. కార్యకారణరూపుడవైన నీయందు వస్తుభేదము కల్పింపబడుచున్నది. అది అజ్ఞానకృతమని వేరే చెప్పవలయునా!

నేనూ, మరీచీ మొదలైన ఋషులుకూడా నీ విలాసాలను ఎరుగము. నీ మాయకు వశులై దేవాసురులు వ్యథల పాలవుతున్నారంటే వారలెంతటివారు? నీవు రూపరహితుడవు. అయినా సకలస్వరూపాలు నీవే. రక్షించటానికి గానీ, సంహరించటానికి గానీ కారణభూతుడవు నీవు. చరాచరాత్మకమైన ప్రతివస్తువూ నీవు. ఆకాశాన వాయువువలె నీవు సకలమునందూ అంతరాత్మమూలకంగా వ్యాపించి ఉంటావు. లోకాలన్నింటికీ నీవే బంధమోక్షాలు కల్పిస్తావు. నీవే సర్వం.

కమలనేత్రా! నీ మగపోడుములను అనేక పర్యాయాలు చూచాం. నిన్నుగురించి ఎన్నోగాథలు విన్నాం. కానీ నీ స్త్రీరూపం మాత్రం చూడలేదు. నీవు మోహినివై రాక్షసుల కనులుగప్పి ఇంద్రాది దేవతలకు అమృతం ఇచ్చిన నీ స్త్రీ రూపం చూపించు. చూడాలని నాకు ఎంతో కుతూహలంగా ఉంది. మగవాడవై ఉండి లోకాలను వశంగతం చేసుకుని చిక్కులను పెట్టగల సమర్థుడవు నీకు ఆడురూపంతో లోకాలను చీకాకు పరచటం ఏమంత కష్టం? అని శివుడు అర్థించేసరికి విష్ణువు భావగంభీరంగా నవ్వుతూ — మహేశా! నీ కోర్కెతీర్చి నీ మనస్సును రంజింపచేస్తాను. కాని ఏమఱుపాటుతో నీవు నీమతి చలించకుండా ఉండేలా చూచుకోవాలి సుమా! రాక్షసులను వంచించడానికి నేను ఆనాడు ధరించిన జగన్మోహినీ రూపాన్ని నీవు చూడాలనుకుంటే చూపిస్తాను. కాముకజనులు తమ సంకల్ప ప్రభావాలను కైకొంటానికి అర్హులని అంటారు - అని పలికి శ్రీహరి అంతర్హితుడయ్యాడు.

## శ్రీహరి మోహినీ రూపంతో ఈశ్వరుని మోహింప చెయ్యడం

శ్రీహరి అలా అంతర్హితుడయ్యేసరికి ఉమాసహితుడైన ఈశ్వరుడు "శ్రీహరి ఎక్కడికి పోయాడో! ఎక్కడున్నాడో!" అని దశ దిశలూ కలయ చూస్తుండగా తన పురో భాగాన ఒక యెల దోటలో ఒక వీథిలో ఒక చెట్టు నీడను ఒక ఎల జవ్వనిని చూచాడు.

ఆమె కుచ కుంభాలమీద కొంగు తొలగి పోయింది. జుట్టుముడి చలిస్తోంది. నుదుటిపై ముంగురులు చిక్కుపడి ఉన్నాయి. నడుం ఉందా!

లేదా! అన్నట్లు అల్లాడుతోంది. చెక్కిళ్ళయందు కర్ణ కుండల కాంతులు ప్రసరిస్తున్నాయి. జఘన భారంచేత అడుగులు తడబడుతున్నాయి. దృక్కుల కాంతులు దిక్కులను కప్పివేస్తున్నాయి. చీరె జారిపోతోందే ఎడమ చేతితో జారకుండా దాన్ని పట్టుకొని ఉంది. బంగారపు టందియలు గల్లు గల్లు మనగా చేతి కంకణాలు ఝణ ఝణమని మ్రోయగా ఆమె కందుక క్రీడ (బంతియాట) లో నిమగ్నమై ఉంది.

పార్వతి యందలి అనురాగంచే అర్ధ శరీరాన్ని యిచ్చిన ఈశ్వరుడు ఆ మగువ వయో రూప గుణ విలాసాలు తనను ఊరింపగా కనురెప్ప వేయకుండా ఆమె వంక చూడడం మొదలు పెట్టాడు. అతని హృదయం ప్రేమతో ఆర్ద్రమైంది. ఈ కాంతా రత్నం ఎవ్వరిదో! ఇంతటి మనోహరమైన స్త్రీ మూర్తిని ఏ కల్పంలోకానీ నేను చూచి యుండలేదు. ఈమెను సృజించిన వాడు బ్రహ్మ అయి ఉండడు. ఈ లతాంగిని ఏ అదృష్టశాలి చేపట్టెనో! కేళీ విలాసమునందు నాకు ఈమె లభిస్తుందా!- అని భావించాడు. అప్పుడు మన్మధుడు తన పుష్ప బాణాలు ప్రయోగించి అతనిని తరమడం మొదలు పెట్టాడు. ఎంతటి మనోధృఢిమ కలవానినైనా ఈ మోహనాంగి విలాస చేష్టలు చలింప చేస్తున్నాయి. ఆమె తుఱిమిన బిగిముడి వదులై మెడమీదనూ, భుజముల మీదనూ నాట్యం చేస్తోంది. అదరి చెదరిన ముంగురులు నొసట పెట్టుకొనిన కస్తూరి తిలకాన్ని చెరిపివేస్తున్నాయి. విస విసమను నగు మొగపు కాంతులు దశ దిశలా వ్యాపిస్తున్నాయి. చిఱు చెమటలు పడుతున్నాయి. శరీరం పులకరింతలతో మనోహరంగా ఉంది. ఆమె మనస్సునకు ఆనందం కల్పించెడి కందుకాన్ని (బంతిని) చేదాల్చి దానితో క్రీడ లాడుతోంది. ఆ బంతిని ఆమె ఒకప్పుడు రొమ్ముకు చేర్చుకుంటుంది. ఒకప్పుడు చెక్కిలికి హత్తిస్తుంది. ఒకప్పుడు గడ్డానికి మోపుతుంది. చనుమొనలకు గదిస్తుంది. గోళ్ళతో మీటుతుంది. చేతి మణి కంకణాలు ఝణ ఝణ మని మ్రోగగా కుచ కలశాలు ఒకటి నొకటి నొరయగా ఎడమకూ కుడికీ తడపడుతూ ఆమె బంతిని పైకి విసురుతుంది. అలా విసిరి తనకు తానే కొన్ని చిన్న పందాలు వేసుకొంటుంది. అలా పందాలు వేసుకొని బంతితో ఆడునపుడు ఆమె సన్నని నడుము పట పట వణకుతుంది. మెడలోని హారాలు కలియబడి చిక్కుపడు తుంటాయి చెవిపోగుల కాంతులు చెక్కిళ్ళపై నాట్యం చేస్తూంటాయి.

ఆమె పైకి విసిరిన బంతిని తిరిగి పైకి ఎగిరి పట్టుకొంటుంది. పట్టుకొని ప్రక్కలకి విసురుతుంది. ఆ సందరంభంలో ఆమె కట్టు పుట్టం జారి పోగా ఆమె ధరించిన మణిమయమైన ఒడ్డాణపు మువ్వల రవళి శ్రవణ శుభగంగా వినబడుతూ ఉంటుంది. కాలి యందెలు గల్లు గల్లు మని మ్రోగు తున్నాయి. కర కంకణాల మణుల కాంతులు చిమ్ముతున్నాయి. ఆమె ఎలాగో

బంతివెంటబడి ఉఱికి దాన్ని పట్టుకొని మాటిమాటికి చేతితోనేలకు కొడుతోంది. అది తిరిగి పైకి ఎగిరే సరికి నీలపు కాంతుల సోగ వగ్గాల వలలు విసిరి క్రిందికి లాగినట్లు తన చూపులు పఱచి దాన్ని తిరిగి క్రిందికి మరలిస్తుంది. అలా ఒకసారి కాదు, పదిసార్లు కాదు, వేయిమార్లు బంతిని నేర్పుతో తట్టుతుంది.

ఎఱ్ఱని ఆమె చరణ కమల కాంతులు ఉదయాద్రిపై బాల సూర్యుని కిరణ కాంతుల్లాగా ఉన్నాయి. ముఖచంద్ర చంద్రికలు చంద్ర మండలాన్ని సృజిస్తున్నట్లున్నాయి. సడుమ సడుమ ఎత్తైన చనుదోయి నుండి జాఱెడి పైట చెఱగును ఒత్తుకుంటుంది. చెక్కిళ్ళపై పొటమరించిన చెమట బిందువులను కొన గోళ్ళతో మీటుతుంది. దొండపండు లాంటి ఎఱ్ఱని క్రింది పెదవి ఆరుణిమకు భ్రాంతిపడి మూగిన రాచిలుకలను తోలివేస్తుంది. ఆమె మంద గమనాన్ని అభ్యసించాలనే కుతూహలంతో దరి చేరెడి రాయంచల జంటను అదల్చి తరిమి వేస్తుంది. ఆమె విలాస దృక్కులకు ఆనందించి వచ్చిన నెమిళ్ళ జంటలకు తొలగిపోతోంది.

పొదరిండ్ల తీగల దగ్గరకు పోకుండా తొలగి పోతుంది. చిగురాకులు మెసవెడి కోవెల దంపతులకు అందకుండా దూరంగా పోతుంది. తీగ ఉయ్యాల లూగుతుంది. ఆ మాధవీలత మండపాలు ఎక్కుతూ, కొండ గుట్టల్లాగా కూడిన సమూహంపై ప్రాకుతూ, కాలువలుకట్టిన పూదేనియనుదాటుతూ కేళీ పర్వతాలు ఆరోహిస్తూ, చిగురాకుపీరాలపై దారిబడలికను పోగొట్టుకుంటూ కూర్చుంటుంది.

అలసట తీరాక, లతలతో కల్పింపబడిన సౌధభాగాల్లో చొరబడుతుంది. ఎత్తైన మొగలి స్తంభాలకు ఒరగి నిల్చుంటుంది. పూరేకులచేత కూర్చిన గవాక్షాల నుండి (కిటికీల నుండి) బయటకి తొంగిచూస్తుంది. తామరతూడుల పతునలను ఆధారంగా చేసుకొని సంపెంగ తోపుగదపై నిలబడుతుంది. అరటి ఆకులతో నిర్మితాలైన కవాటాలను తొలగిస్తుంది. పుప్పొడితో చేయబడిన బొమ్మలను ఆదరిస్తుంది మణిమయాలైన తిన్నెలను చూచి మురిసిపోతుంది. చంద్రకాంత శిలా వేదికలపై మేను వాలుస్తుంది. రత్నపంజరాల్లో ఉన్న చిలుకలకు చదువులు చెబుతుంది. కోరి ప్రతిదీ చూస్తుంది చూచి మెచ్చు కొంటుంది. మెచ్చి ఆశ్చర్యపడుతుంది. ఆశ్చర్యపడి పారవశ్యం చెందుతుంది. ఏకాంతంగా ఆ ప్రాంతంలో అనంత విలాసాలు చూపిస్తూ విహరిస్తున్న జగన్మోహినిని చూచి శివునికి మతిచెడ్డది. ఆమె వాలుచూపులకు శివుని ధైర్యసారం తగ్గిపోయింది. జ్ఞానం నశించింది. స్వగుణాలను మరిచాడు. ఉన్న ఆలినీ, ప్రమథగణాళినీ కూడా మరిచిపోయాడు.

అప్పుడు మోహిని బంతిని, ఎగురవేసి చేతితో తిరిగి పట్టుకోలేక క్రింద పడి దొర్లిపోతూన్న దాని వెంటపడి దానిని పట్టుకోవటానికి వడివడిగా వస్తుండగా గాలి తాకిడికి ఆమె బట్ట ఊడి క్రిందపడింది. అలా నగ్నంగా



ఉన్న. ఆమెనుచూచి చంద్రశేఖరుడు చలించిపోయాడు. ఆమె వెంటనే క్రీగంటి చూపులతో వస్త్రాన్ని తిరిగి పట్టుకొనేందుకు యత్నిస్తోంది. అప్పుడామె శరీరం గగుర్పాటు చెందింది. కుచభారంచేత ఆమె వంగిపోయింది. రెండు చేతులతో ఆమె తన రహస్యాంగాన్ని కప్పుకున్నది. ఆమె జుట్టుముడి జారిపోయిరెది. అప్పుడు శివుడు కామాతురుడై కంపించిపోయాడు. సిగ్గువిడిచి తన సతి చూస్తుండగా మోహిని పాణిపద్మం పట్టుకునేందుకు ఆమెకు దగ్గరగా వెళ్ళాడు.

అలా తన దగ్గరికి వస్తున్న ఫాలాక్షునిచూచి చీర జారిపడడంవల్ల సిగ్గుతో నవ్వుతూ ఆమె చెట్ల చాటునకుపోయి దాగింది. అయినా శివుడు విడువక ఆమె వెంటపడ్డాడు కరీంద్రుడు కరిణితో రమించటానికై వస్తున్నట్లు శివుడు "అబలా! పోకు, పోకు" అంటూ ఆమె దగ్గరకి వచ్చాడు. చేతితో ఆమె జుట్టుముడి పట్టుకొన్నాడు. సంభ్రమపాటుతో ఆమెను తన బిగికౌగిట నోలార్చాడు. అయినా ఆమె ఎలాగో అతని భుజాలింగనం నుండి తప్పించు కొన్నది.

అలా తప్పించుకొని వీపుపై అల్లలనాడు వేణీభరంతో, జఘన భారం వలని బడలికతో మాయామోహినియై మరలి మరలి చూస్తూ పారిపోయెడి అద్భుత కర్ముడగు శ్రీహరివెంట ఈశ్వరుడు వెంటపడగా మన్మథుడు తిరిగీ ఈశ్వరుని జయించాడన్నట్లు తోచింది. ఆడేనుగువెంట పడెడి మదపుటేనుగు లాగా ఆమె వెంటపడి కొండలూ, ఏళ్ళూ, సరస్సులూ, వనాలూ దాటి పోగా పోగా ఆ మహాత్ముని అమోఘ వీర్యం నేలమీద పడ్డది అది పడినచోట సువర్ణ క్షేత్రాలు రజతక్షేత్రాలు అయ్యాయి.

నరేంద్రా! రేతస్ఖలనమయ్యాక రుద్రుడు భగవన్మాయ వలన కల్గిన జడత్వాన్ని విడిచి ఆత్మజ్ఞానం పొందాడు. జగదాత్మకుడైన శంకరుడు వెను తిరిగాడు. శ్రీహరి తన స్త్రీత్వాన్ని విడిచి మగవాడయ్యాడు. కాముని గెలువ వచ్చు. మృత్యువును జయించవచ్చు. కాని స్త్రీల వాల్చూపులనెడి బాణాలను గెలవటం త్రిపుర వైరికికూడా వశంకాదు. అలాతిరిగి పురుషాకారం వహించిన శ్రీహరి హరునికిలా అన్నాడు.

దేవోత్తమా! నామాయ నీకొక్కనికి దక్క ఇతరులకు తెలియదు. స్త్రీనైన నా మాయచే మోహితుడవయ్యావన్నా నీ వాత్మజ్ఞానంకల్గి తుదకు అందులో చిక్కక్కుండా ఉండగల్గినావు. కాలరూపంతో నా యందున్నా నీమాయ అధివసిస్తుంది. నీ మాయ నన్ను జయించలేదు. అకృతాత్ములగు వారికి అది పొందనలవికానిది నీవు మహాత్ముడవు. కావున నిష్ఠతో నీవు తెలుసుకోగల్గావు- అని శ్రీహరి శివుని సత్కరించగా నాతడు దాక్షాయణితోనూ, ప్రమథగణాల తోనూ కూడి నిజభవనానికి వెళ్ళిపోయాడు.

సముద్రాన్ని మథించేటప్పుడు దుర్భరమైన మందర నగాన్ని కూర్మాకారంతో లేపిన శ్రీహరి చరిత్రవిన్నా, కీర్తించినా సంసారసముద్రంలో మునిగిన మూఢులు కూడా అమిత సుఖాలను పొందుతారు. అందులో సందేహం ఏమీ లేదు. ఆడురూపంలో దైత్యుల్ని మోహింపచేసి అమృతాన్ని విభజించి ఇచ్చి మహాతేజంతో ప్రకాశించేది శ్రీహరి మాయా వధువు రూపాన్ని, పాపమనేది చీకటిని పారద్రోలేది రవి స్వరూపంగా భావించే ఆత్మలో నమస్కరిస్తాను- అని చెప్పి శుకుడు ఇలా అన్నాడు.

రాజేంద్రా! ఇక తక్కిన మన్వంతరాలను గురించి చెబుతాను విను. ప్రస్తుత కాలమందు ప్రబలవివస్వత మనువు వర్తిస్తున్నాడు. అతని పేరు శ్రాద్ధదేవుడు. అతడు వివతస్వంతుని కుమారుడు. అతడు ఏడవ మనువు. అతనికి మహాబలాఢ్యులైన ఇక్ష్వాకువూ, అభంగుడూ, ధృష్టుడూ, శర్యాతీ, అరిష్యంతుడూ, నాభాగుడూ, దిష్టుడూ, కరూశకుడూ, వృషద్ధుడూ, వసుమంతుడూ అనే పదిమంది కొడుకులున్నారు. వారు రాజ్యపాలకులు. ఈ సప్తమ మన్వంతరంలో ఆదిత్యులూ, వసువులూ విశ్వేదేవులూ, మరుత్తులూ, రుద్రులూ దేవతలు. పురంధరుడనువాడు ఇంద్రుడు, గౌతముడూ, కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, జమదగ్ని, భరద్వాజుడు, వశిష్ఠుడు అనువారు సప్తఋషులు. వారిలో కశ్యపునకు అదితి కడుపున విష్ణువు వామనుడై పుట్టి ఇంద్రునకు తమ్ముడయ్యాడు. ఇపుడు ఏడు మన్వంతరాలను గూర్చి చెప్పాను కదా! ఇక రాగల మన్వంతరాలనూ, శ్రీహరి పరాక్రమాన్ని చెబుతాను. సావధానుడవై విను - అని శుకుడు ఇలా చెప్పటం మొదలు పెట్టాడు. విశ్వకర్మ పుత్రికలైన సంజ్ఞా, ఛాయా అనేవారు సూర్యుని భార్యలు అని ఇదివరకే చెప్పాను. వీరిరువురూ కాక అతనికి బడబయను మూడవ భార్య కలదని కొందరంటారు. సంజ్ఞాదేవియే బడబారూపం ధరించిందని కొందరి వాదన. సంజ్ఞాదేవికి యముడు, శ్రాద్ధదేవుడు, యమునా ఉద్భవించారు. ఛాయాదేవికి తపతీ సావర్ణి, శనైశ్చరుడూ జన్మించారు. తపతిని సంవరణుడు పెండ్లాడాడు. బడబకు అశ్వనీదేవతలు ఇద్దరూ జన్మించారు. రాబోయే ఎనిమిదవమనువు సావర్ణి. అతడు తపోనిష్ఠుడై ఉన్నాడు. రాజా! ఒకప్పుడు చూస్తే కనబడి మరొక్కపుడు చూస్తే కనబడని చంచలమైన సంపదలకోసం చేటుకలిగినపుడు అందరూ మనువును కాపాడుతూ ఉంటారు.

సూర్యసావర్ణి మన్వంతరంలో అతని కుమారులు నిర్మోహుడూ, విరజస్కుడూ మొదలైనవారు రాజులు. సుతపులూ, విరజులూ, అమృతప్రభులూ దేవతలు. గాలవుడూ, దీప్తిమంతుడూ, పరశురాముడూ, అశ్వత్థామా, కృపుడూ నా తండ్రి పారాశరుడూ, ఋశ్యశృంగుడూ, సప్త ఋషులు. వారందరూ ఇప్పుడు తమ తమ ఆశ్రమాల్లో యోగనిష్ఠులై ఉన్నారు. విరోచనుని పుత్రు

దైన బలి ఇంద్రుడవుతాడు—అని చెప్పి శుకయోగీంద్రుడు ఇంకా ఇలా చెప్పటం మొదలుపెట్టాడు.

పూర్వం బలి బలవంతంగా స్వర్గాన్ని ఆక్రమించుకోగా శ్రీహరి వామనావతారం ధరించి వచ్చి పాదత్రయ పరిమితమైన భూమిని యాచించగా బలి "అలాగే" అని ఇచ్చాడు. శ్రీహరి అపుడు భూమినీ, స్వర్గాన్నీ ఆక్రమింధాడు. దానవేశ్వరుడిక గత్యంతరం లేక భగవన్నిబద్ధుడై స్వర్గంకంటే కూడా మనోహరమైన సుతలంలో సుఖంగా నివసిస్తున్నాడు. ఎనిమిదవ మన్వంతరంలో శ్రీహరి దేవగుహ్యుడనునతనికి సరస్వతి అనునామె యందు కుమారుడై పుట్టి సార్వభౌముడనే పేరు వహిస్తాడు. అతడు తన శక్తిచే పురందరుని పదభ్రష్టుని చేసి ఆ పదవిలో బలిని నిలుపుతాడు.

ఆ తరువాతి కాలంలో వరుణుని కుమారుడైన దక్షసావర్ణి తొమ్మిదవ మనువవుతాడు. అతనికి ధృతకేతువూ, దీప్తకేతువూ మొదలైనవారు జన్మించి రాజులవుతారు. పరుడూ, మరీచీ, గర్గుడూ మొదలైనవారు దేవతలు. అద్భుతుడను వాడు ఇంద్రుడూ, ద్యుతిమంతుడు మొదలగువారు ఋషులూ అవుతారు. శ్రీహరి, అంబుధారకు ఆయుష్మంతుని వలన పుట్టి రక్షిస్తూండగా అద్భుతుడను పేరుతోగల ఇంద్రుడు ముల్లోకాలనూ చక్కగా పరిపాలిస్తాడు.

ఉపశ్లోకుని సుతుడైన బ్రహ్మసావర్ణి పదవ మనువు అవుతాడు. అతని కొడుకులు భూరిషేణాదులు రాజులు కాగా హవిష్మంతుడు ఆదిగా గలవారు మునులవుతారు. శంభుడనువాడు ఇంద్రుడును, విబుద్ధ ప్రభృతులు దేవతలు అవుతారు. ఆ మన్వంతరంలో విష్ణువు విశ్వజితుడను వానికి విషూచి అను నామెకు స్వాంశముచే అవతరించి ఇంద్రుడైన శంభునితో చెలిమిచేసి విష్వక్సేనుడనే పేరుతో ప్రఖ్యాతి వహించి లోకాలను సంరక్షిస్తాడు.

అనంతరం ధర్మసావర్ణి పదునొకండవ మనువు అవుతాడు. ఆ మను పుత్రులు సత్యధర్మాదులు పదిమంది రాజ్యపాలనం చేస్తారు. విహంగములు, కామగములు, నిర్వాణులు, రుచులు దేవగణాలవుతారు. వారికి వైధృతుడు ఇంద్రుడవుతాడు. అరుణుడు మొదలగువారు సప్తఋషులవుతారు. అపుడు శ్రీహరి ధర్మసేతు వనే పేరుతో సూర్యసుతుడై అవతరించి ముల్లోకాలనూ రక్షిస్తాడు. ఇంద్రునికి ధృవుడనే పేరుకూడా ఉంది.

ఆ తరువాత భద్రసావర్ణి పంద్రెండవ మనువవుతాడు. దేవవంతుడు, ఉపదేవుడు, దేవజ్యేష్ఠుడు అతని కుమారులు. వారే రాజ్యపాలనం చేస్తారు. ఋతుధాముడనువాడు ఇంద్రుడు, హరితాదులు వేల్పులు, తపోమూర్తి మొదలగువారు సప్తఋషు లవుతారు. అపుడు పరమేశ్వరుడు సత్యతపుడనే వానికి సూనృత యను నామె యందు జన్మించి స్వధాముడనే పేరుతో ఆ మన్వంతరాన్ని రక్షిస్తాడు.

పదమూడవ మనువు దేవసావర్ణి. అతని కుమారులు చిత్రసేన విచిత్రాదులు రాజ్యపాలనం చేస్తారు. సుకర్ములు, సుత్రాములు అనువారు దేవత లవుతారు. దివస్పతి అనునాతడు ఇంద్రుడూ, నిర్మోహుడు, తత్వదర్శుడు మొదలగువారు ఋషులూ అవుతారు. అపుడు శ్రీహరి దేవహోత్రుని భార్య యగు బృహతికి కుమారుడైన యోగ విభుడనుపేరుతో ఇంద్రుడగు దివస్పతికి తోడ్పడుతాడు.

ఇంద్రసావర్ణి అనువాడు పదునాల్గవ మనువు. గంభీరుడు, పసువు మొదలగువారు మనుపుత్రులు. పవిత్రులూ,చాక్షుషులు అనువారు దేవతలు కాగా, శిచి అనువాడు ఇంద్రుడవుతాడు. అగ్ని, బాహువు, శుచి, శుక్రుడు, మాగధుడు మొదలగువారు సప్తఋషు లవుతారు. అపుడు శ్రీహరి సత్రాయణు డనువానికి వితాన యను నామెయందు ఉద్భవించి బృహద్భాను వను పేరుతో స్వర్గవాసులు సంతోషించునట్లుగా యజ్ఞాది కర్మలను విస్తరింపచేస్తాడు.

రాజేంద్రా! మూడు కాలాలయందూ వర్తించు మనువులు పదునలువురు. వారి చరిత్రలు సంగ్రహంగా చెప్పాను. యుగాలు నాలుగునూ వేయిమారులు ప్రవర్తిస్తే పదునాలుగు మన్వంతరాలు గతిస్తాయి. అప్పటికి బ్రహ్మదేవునికి ఒక దినం అవుతుంది.

అని శుక మునీంద్రుడు చెప్పగా పరీక్షిన్న రేంద్రుడు—యోగీంద్రా! ఈ మనువులు మొదలగువారిని ఈ పదవులలో నియమించేవారు ఎవరు? ఏ కారణంచేత వారికి అలాంటి మహత్తు కల్గింది? శ్రీహరి భూలోకంలో అవతరించటం ఎందుకు?— అని ప్రశ్నించాడు. అపుడు శుక మునీంద్రుడు ఇలా చెప్పటం మొదలు పెట్టాడు.

రాజేంద్రా! మనువులూ, మనుపుత్రులూ, మునులూ, ఇంద్రులూ, దేవతలూ అందరూ శ్రీహరి ఆజ్ఞానువర్తులే. యజ్ఞాదుల్లో వారందరూ శ్రీహరి పౌరుషాకృతులే. వారు శ్రీహరి సహాయంతోనే లోకాలను నడుపుతూంటారు. ఎలాగంటే ఆ మన్వాదులలోని మునులు మన్వంతరం తుదను అధ్యయనం చేసేవారు లేకపోవటంచేత కాలగ్రస్తమైన వేదాలను నిజతపోబలం. చేత మరల తెలిసికొంటారు. పూర్వం లాగానే ధర్మం నాలుగు పాదాల వర్తిస్తుంది. శ్రీహరి ఆజ్ఞానుసారంగా మనువులు నడుస్తారు. రాజులు లోకాన్ని విభజించి వారి వారి సమయాల్లో రాజ్యపాలనం చేస్తారు. యోగులైనవారిని శ్రీమన్నారాయణుడే ఇంద్ర పదవుల్లోనూ, దేవ పదవుల్లోనూ ప్రతిష్ఠిస్తాడు. వారు విహిత కర్మలు నిర్వర్తిస్తూ ముల్లోకాలనూ పాలిస్తారు. లోకాలు సుదృష్టులై ఉంటాయి.

శ్రీహరి యోగీశ్వర రూపంతో యోగం చూపిస్తాడు. మునిరూపంతో కర్మాచరణం వహిస్తాడు. ప్రజాపతి రూపంతోసృష్టించేస్తాడు.ఇంద్రుడై దేవతల నణచివేస్తాడు. సిద్ధాకృతితో జ్ఞానోపదేశం చేస్తాడు. కాలరూపంతో సర్వ సంహా

రం చేస్తాడు. నానావిధాలైన ఆకార నామరూపాలతో కర్మ దృక్కులైన వారికి కనపడడు. పూర్వం ధరించిన రూపాలతోనూ, ఇప్పటి రూపాలనూ, ఇక ముందు ధరించేది రూపాలతోనూ అతడు నానావిధాత్మకుడై అనేక వ్యవహారాలను నిర్వహిస్తాడు. విష్ణుడు అవ్యయుడు—అని శుకుడనేసరికి పరీక్షన్మహారాజు మునీంద్రా! శ్రీహరి బలిచక్రవర్తిని ఎందుకోసం మూడడుగుల నేల అర్థించాడు? శ్రీహరి నిశ్చలుడు, పూర్ణుడు, లబ్ధకాముడు. లక్ష్మీసంపన్నుడు. అలాంటివాడు పర్ణస్థలానికి దీనునివలె ఎందుకు వెళ్ళినట్లు? తప్పేమీలేని నిష్కల్మషులను ఎందుకు బంధించాడు. నాకు వినాలని కుతూహలంగా ఉంది—అని అర్థించేసరికి శుకయోగీంద్రుడు ఇలా అన్నాడు.

## వామన చరిత్ర కథా ప్రారంభం

రాజేంద్రా! దేవాసుర యుద్ధంలో బలి ఇంద్రుని వలన ఓడి ఇంచుమించు మృత ప్రాయుడై శుక్రుల దయవలన ఎలాగో బ్రతికి బయటపడ్డాడు. వారికి శిష్యుడై వారి మనస్సు చూరగొన్నాడు. శుక్రులున్నూ అతని భక్తికి మెచ్చి అతనిచేత శాస్త్రోక్తంగా విశ్వజిద్యాగం చేయించాడు. ఆ యాగంలో హవిస్సుచే సంతృప్తుడైన అగ్నిదేవుడు బలికి కనకమయ పరికరాలతో గూడిన రథాన్నీ, సూర్యుని గుర్రాలవంటి గుర్రాలనూ, సింహ ధ్వజమూ, మిక్కిలి శ్రేష్ఠమైన ధనువూ, అక్షయ తూణీరాలూ, కవచమూ ఇచ్చాడు. తన తాత ప్రహ్లాదుడు అతనికి వాడని పద్మమాల బహూకరించాడు. గురువైన శుక్రుడు అతనికి చంద్ర సమానమైన శంఖాన్ని అనుగ్రహించాడు.

ఈ రీతిగా రథమూ, రథ తురంగాలూ, ధనువూ, అమ్ముల పొదలూ, కంఠహారమూ, కవచమూ, మణి కనక వలయాలూ గ్రహించి బలి మిక్కిలి ప్రకాశించాడు. బ్రాహ్మణులకు అపారమైన దానాలు ఇచ్చాడు. వారి ఆశీర్వచనాలు పొందాడు. పెద్దలకు నమస్కరించాడు. దేవతలను మనస్సులో పూజించాడు. తాత అయిన ప్రహ్లాదునకు తలవాల్చినమస్కరించాడు. అనంతరం రథారూఢుడై కొండనెత్తము నందలి కార్చిచ్చువలె ప్రకాశిస్తూ విశ్వ విజయానికి బయలుదేరాడు.

మృత్యు దేవతనూ, యమునీ కూడా దండింపగల వారున్నూ, సురలనూ, సిద్ధులనూ, సాధ్యులనూ, గంధర్వాదులనూ ఖండించగల శక్తివంతులున్నూ, దిక్కులను కలిపి ముద్దగా చేసివేయగల బలాఢ్యులనూ, అయిన రాక్షస సేనానులు అతనిని సేవిస్తూ అతని రథంవెంట బయలుదేరారు. బలి మహోత్సాహంతో చూపులతోనే ఆకాశాన్ని మ్రింగేలాగా ఉన్నాడు. దివిని భువిని తారుమారు చేసేలాగా ఉన్నాడు. రథాన్ని స్వర్గమార్గం పట్టించాడు.

ఆ రీతిగా బలి దేవేంద్రుని సాధించాలని నడుంకట్టి సేనావాహినితో వెళ్ళి స్వర్గాన్ని చూచాడు. ఆ స్వర్గం పుణ్య జనులకు నివాస భూమి, అక్కడ రోగాలూ, స్వప్న పీడలూ ఉండవు. ఎక్కడ చూచినా పువ్వులతోనూ, చిగురాకులతోనూ నిండిన వృక్ష పంక్తులు గోచరిస్తాయి. రథ పతాకాలు రెప రెప లాడుతుంటాయి, వైమానిక సమూహాలు సంచరిస్తుంటాయి, పవిత్రమైన గంగా జలం ప్రవహిస్తూ ఉంటుంది. అచ్చట దేవేంద్రుడు సకల సంపదలతో తులతూగుతూ ఉంటాడు. ఆ దేవేంద్ర నగరాన్ని వర్ణించడం ఎవరికీ సాధ్యంకాని పని. రాక్షస రాజు బలి దేవ నిలయాన్ని సమీపించి దాని వైభవానికి విస్మితు డయ్యాడు.

అచటి తోటల్లో చిగుళ్ళూ, ముడుచుకొని ఉన్న మొగ్గలూ, అరవిరిసిన పువ్వులూ, గుత్తి పిందెలూ, దోరకాయలూ, పండ్ల గెలలూ కలిగి వాటి బరువు మోయలేక వంగి ఊగెడు ఫల వృక్షాలు కనువిందు చేస్తున్నాయి. ఆ తోటల్లోని చెట్లపై వికసించిన పువ్వులను ముసురుకొని తేనియ లానుచూ క్రొవ్వి తుమ్మెద గుంపులు ఝుం ఝుం అని చెవికి ఇంపుగా రొదలు చేస్తున్నాయి. కోయిల జంటలు అచటి లేమామిడి కొమ్మల మునరి నవనవలాడు చిగురాకులను తింటూ కొసరి కొసరి కూస్తున్నాయి. చిలుకలు గుంపులు గుంపులుగా వచ్చి తత్తరపాటుతో తీయని పండ్లకోసం పోట్లాడుచూ విజృంభించి మెత్తని పండ్లను తింటూ పలు విధాలుగా తియ్యని పలుకులు పలుకుతూ ఆనందింప చేస్తున్నాయి.

చిలుకలతో సరితూగుచూ పావురాలు ఆకాశాన్ని అందేలాగా ఎగిరి పెట్టలను (మగవాటిని) పట్టుకొని తమ నెలవులకు తీసుకొని వచ్చి మధురంగా ధ్వనిస్తూ ఉన్నాయి. రాయంచలు ప్రియురాండ్రతో కూడి అచటి కొలనులలో కలకల ధ్వనులు చేస్తూ తామర తూడులను ముక్కులతో చించి, మెక్కి సొక్కిపోతున్నాయి, అచటి కొలకులు మిసమిస లాడెడి కాంచన పద్మాలతో లక్ష్మీ మందిరాల్లాగా అందాలు చిందుతూ ఉన్నాయి. ఆ కొలకుల్లో అలల తుంపరలకు తడిసి వడవడ వణకుచూ అల్లి బిల్లిగా సాగిన తీగ యిండ్లలో దూరి అచట గల నానావిధ పుష్ప వాసనల సారముతో ఈడిగిల పడి గాడ్పులు మందమందగా వీస్తున్నాయి. వాయు ప్రేరితాలై పుష్ప పరాగాలు (పుప్పొడి) ఆకాశానికి ఎగిరి పలు వన్నియలు గల మేలుకటు (చాందినీ) పట్టాల్లాగా దట్టంగా వ్యాపించి కనువిందు చేస్తున్నాయి.

కామధేనువులు గుంపులు గుంపులుగా అచటి వాగు వంతల చెంతకు పోయి గరికలు మేసి మత్తిల్లి నెమరులు వేస్తూ బలిసిన పొదుగులతో దూడలు పరుగులు పెట్టుతూ వెంటపడగా ఇండ్లకు వచ్చి పౌరుల కోరికలు తీరగా కోరిన పాలు కురుస్తున్నాయి. ఆ కామధేనువులకు నిలువ నీడలు ఇస్తూ కల్పవృక్షాలు అర్థిజనుల కోర్కెలను తీరుస్తున్నాయి. మత్తేభాలు కరిణులకు కల్పతరువుల

చిగురాకుల గుత్తులను విరిచి ఇస్తూ వాటి అనురాగాన్ని మెచ్చుకుంటూ తిరుగుతూ ఉండే క్రీడాపర్వతాల చఱులయందు విహరించెడి సుందరాంగులు ఆ మదపుటేనుగుల మందగమనాలను అనుకరిస్తూ ఉంటారు. మదపుటేనుగులు ఒరసికొనుటవలన నును పైన మకరతోరణ స్తంభాలను అనుకొని రంభాది దివ్యాంగనలు, మృతిచెంది దేవ విమానాలపై అధిరోహించి స్వర్గానికి వచ్చే సచ్చరిత్రులకు ఎదురు చని ఆహ్వానించటానికి నిలబడి ఉంటారు. ఆ అప్సరాంగనల సౌందర్యం వర్ణింపనలవికానిది. వారు మన్మథుని ఒఱనుండి పెరికిన చిగురాకు బాణాల్లాగా, చెలింపని సంపదగల శంపాలతల్లాగా (మెఱపు తీగలు), కరచరణాదిశాఖలు గల చంద్రరేఖలరీతిగా చూపులతోనే లోకాలను మోహింపచేస్తూ ఎంతో మనోహరంగా ఉంటారు.

రాయంచలు, జక్కవ పిట్టలు, బెగ్గురు పక్షులు కలకల ధ్వనులు చేస్తుండగా కలువ పువ్వులు, తామరలు చూచి ఆనందించెడి తుమ్మెద గుంపులతో కనువిందుచేస్తూ అలల మొత్తాలతో గంగానది ఆకాశపర్యంతంపొంగిందా! అన్నట్లు అచటి అగడ్తలు మూపరుల పొగడ్తలను అందుకుంటూ ఉంటాయి. దేవకన్యకలు ఆ అగడ్తల తేటనీటిలో ఒకరిపైనొకరు దోసిళ్ళతో నీటిని చల్లుంటూ ఆనంద పారవశ్యంతో జలక్రీడలు ఆడుచూ ఉంటారు. అచటి గోపురాల కనక కవాటాల దగ్గర(తలుపులు)వారస్త్రీలు నర్తిస్తూ పూజలు చేస్తూ ఉంటారు. ఆ గోపుర కవాటాల దగ్గర వేదికలపై మణిస్థగితాలైన ఇంద్రనీల స్తంభాలు గంభీరంగా గోచరిస్తాయి. ఆ గోపుర ద్వారాదేశాలు పద్మరాగ పాలికల మాలికలతో మనోహరంగా ఉంటాయి. ఆ ద్వారదేశాలకు దగ్గరగా గల చావిళ్ళలో కాపుట్టుండి అస్త్రశస్త్రధరులైన ద్వారపాలకులు ప్రొద్దుపోక దేవాసుర యుద్ధాలను గూర్చిన గాథలు చెప్పుకుంటూ ఉంటారు.

అచటి కోటచుట్టగోడలు వజ్రరజిత నిర్మితాలు. వాటి సోపానాలు శుద్ధ స్ఫటికాలతో నిర్మింపబడి మహోన్నతంగా వీరుల ఆవేశమను సముద్రానికి చెలియలికట్ట పెంపు కలిగి మనోజ్ఞంగా ఉంటాయి. కోటగోడల శిరోభాగాలయందు హిమకర కిరణాల్లాంటి చంద్రకాంతమణులు పొదిగిన శిఖరాలు తళతళలాడుతూ ఉంటాయి. ఆ ఖర క్రాంతుల ధావళ్యం ముందు తారకలు వెలవెలాపోతూ ఉంటాయి. యుద్ధ సన్నద్ధులైన మహావీరులగు గంధర్వులు ప్రాకారాలకు గల మరకత మణి మయాలైన బురుజులకు కావలా కాస్తూ ఉంటారు.

ఆ బురుజులపై ఎత్తైన వజ్రమయ స్తంభాల్లాంటి యుద్ధ యంత్రాలు (ఫిరంగులు) అమర్చబడి ఉంటాయి. ఆ యంత్రాల తుదలు రథాల ఇరుసులు ఒరసికొనగా అవి అరని దివ్వెల్లాగా కోట ఈవల ఆవల సూర్యచంద్ర మండలాలు భాసిస్తాయి. చంద్రమండలాన్ని చూచి అద్దమని భ్రాంతిపడి

రాజసౌధాల్లోని అంతఃపురకాంతలు తొంగిచూస్తూ నుదుటిపై గుంపుగా మూగిన ముంగురులను తొలగించి తిలకం దిద్దుకుంటూండగా వెనుకగా వచ్చినిలబడిన పతుల ప్రతిబింబాలను చూచి సంభ్రమపాటుతో తొలగిపోతారు.

ఎత్తైన సౌధశిఖరాల యందు బంగారపు దిండ్లు అమర్చబడి ఉన్నాయి. అవి చుక్కల నంటియుండి ముత్తెపు సరులతోడి గుబ్బచన్నుల్లాగా ఆ సౌధ శిఖరాలకు శృంగారాన్ని కల్పిస్తాయి. ఆ సౌధాల్లోని శయ్యలూ ఉయ్యాలలూ కాంచన కల్పితాలే. గవాక్షాల నుండి ఎప్పుడూ కర్పూర కుంకుమాగరు ధూప ధూమాలు వెలువడుతూ ఉంటాయి.

ఆ ధూపాలను (పొగలను) మేఘ సమూహాలని భ్రమించి నెమిళ్ళు అనూహ్యమైన ఆనందంతో మురిసిపోతూ పురులు విప్పి చెట్లక్రింద నాట్యం చేస్తూ మన్మథుని రహస్య విద్యలకు టీకలన్నట్లు కేకలు వేస్తూంటాయి. నెమిలి పురులనెడి రతనపు ఎండ్ల నినాదాలకు భీతితో విప్పారిన పడగలతో సర్పాలు పైకెగిరి రవిని కదిసిన రాహువు లాగా తడబడుతూ ఉంటాయి. వేర్వేరు గుఱుతులు గల ధ్వజాలతో, గొడుగులతో అసంఖ్యాకులైన రాక్షస వీరులు వీరాలాపాలు ఆడుతూ, సింహాల్లాగా గర్జిస్తూ పులుల్లాగా పెడబొబ్బలు పెడుతూ, శరభాల్లాగా రభసం చేస్తూ, ధూమ కేతువుల్లాగా అంకెలు వేస్తూ స్వర్గ నగర వీథుల్లో స్వైర విహారం చేస్తున్నారు. నానావిధాయుధ కాంతులు దశ దిశలు వ్యాపిస్తున్నాయి. ఉఱుముల్లాంటి రథ చక్రాల ధ్వనులకు చెవులు దిబ్బెళ్ళు వేస్తున్నాయి.

గమన వేగంతో ఇంద్రుని గుర్రాలను పరిహసిస్తూ, వాయువును గేలి చేస్తూ బలినరేంద్రుని తురంగాలు తిరుగుతున్నాయి. రాక్షస వీరుల మదపు టేనుగుల చెక్కిళ్ళ నుండి స్రవించెడి మదజల కణాలు ఇంద్రాది దిక్పాలకులు ధరించిన హారాల నుండి రాలిన మణి కాంచన రేణువులతో కలియడం చేత స్వర్గ వీధులు దుర్గమంగా ఉన్నాయి. ఇక లెక్కింప నలవికాని విమానాలు ఆ మార్గాలపైన విహరిస్తూ రోహిణాచల తట ప్రదేశాలకు వన్నె కూరుస్తున్నాయి. ఆ విమానాల్లో దేవాంగనలు నానావిధ వాద్యాలతో పాడుతూ, ఆడుతూ, సరస సల్లాపాలతో సాహితీ చర్చలు చేస్తూ ఆనందిస్తున్నారు.

శృంగారానికి ఆటపట్టులైన చతుష్పథాల్లో సుందరాంగుల దేహాలు దివ్వెల్లాగా వెలుగులు చిమ్ముతున్నాయి. సభా మండపాల్లో చింతామణులు దీపాల్లాగా కాంతులు ప్రసరింప చేస్తున్నాయి.

రత్నాకరంలాగా కౌశికి అను దేవనదిచే అది ప్రసిద్ధికెక్కింది. వేద

వాక్యంలాగా స్వచ్ఛమైన సువర్ణం[1]చే అతిశయించింది. శివుని కంఠంలాగా భోగిరాజు[2] మనోహరమైనది. కాంతాజన వక్షోజంలాగా సువృత్త[3] మైనది. వృత్త[4] సమూహంలాగా గురులఘు[5] నియమాలచే మనోహరమైనది. రామ చంద్రుని తేజస్సులాగా ఖరదూషణాది[6] దోషాచరులచే పొందబడరానిది. అందమైన ఉద్యానవనంలాగా రంభా[7] శోక పున్నాగాలు[8] కలది. ఆదిశేషువు మస్తకంలాగా ఉన్నత క్షమా[9] విశారదం. శారద[10] సముదయంలాగా ధవళజీమూత[11] ప్రకాశితం. వర్షాదివలె ఇంద్రగోప[12] కలది. వృషభం మాపురంలాగా విచక్షు[13]రార్యా[14]లంకృతమైనది.

అలాంటి అమరావతీనగరాన్ని బలిచక్రవర్తి సమీపించి తన అపార సేనావాహినిని కోటచుట్టూ విడియించాడు. కోటలోనికిపోయే దారులన్నీ అరికట్టి ఏమరుపాటు చెందకుండా దేవతలతో యుద్ధం చేయటానికి సన్నద్ధుడై ఉన్నాడు. దానవ వీరులు శంఖాలు పూరించారు. ఆ శంఖ ధ్వనులకు దేవాంగనల గర్భాలు పగిలి గర్భస్థ శిశువులు అపురాపురని ఆక్రోశించారు.

బలి వచ్చి అమరావతిని చుట్టుముట్టడం చూచి దేవేంద్రుడు కోటకు గట్టిగా కాపు పెట్టించాడు. సురాచార్యులని పిలిపించి రాక్షసేంద్రుడైన బలి ముట్టడిని గూర్చి చెప్పి ఇలా అన్నాడు.

ఆచార్యా! బలి ప్రళయ సమయ వాయువులాగా భాసిస్తున్నాడు. అతని వెంట లెక్కింప నలవికాని క్రూర రాక్షసులెందరో ఉన్నారు. లోగడ మనకు ఓడిపోయి వీడు మళ్ళీ ఇప్పుడు ఏ తపః ప్రభావం చేత వచ్చాడో? ఈ దుర్మార్గునకు ఎవడు తోడయ్యాడో? వీనిని జయించటానికి దారి ఏది? ఇతడు మహా వీరుడు. వీనిని ఎదుర్కొనటం ఎవరికీ సాధ్యం కాదు. వీడు ఆకాశాన్ని మ్రింగేలాగా ఉన్నాడు. అమరాద్రి కంటే కూడా ఎత్తుగా పొంగుతున్నాడు. యముడులాగా సర్వం మ్రింగేలాగా ఉన్నాడు. శ్రీ మహా విష్ణువు తిరగబడినా భంగించేలా ఉన్నాడు. చూస్తూ చూస్తూ సుర రాజ్యాన్ని వీనికి కట్టబెట్టలేం.

---

1. బంగారము, సుశబ్దము. 2. భోగులైన రాజులు సర్పరాజు 3. గుండ్రనైనది, మంచి నడవడికతో కూడినది. 4. పద్యవిశేషం 5. ఛందస్సులోని గురువులు, లఘువులు; పెద్ద, చిన్న. 6. ఖరుడు, దూషణుడు మొదలగు రాక్షసులచే - తీవ్రమైన దూషణాదులచేత, దోషాలుతేనిది. 7. రంభా=దేవకాంత, అరటి చెట్టు. 8. పున్నాగం=ఇంద్రుని ఏనుగు, సురపున్న చెట్టు. 9. ఓర్పు, భూమి. 10. శరత్కాలం, సరస్వతి. 11. మేఘం, ఒకలత, 12. ఇంద్రునిచే రక్షితమైనది, ఆరుద్ర పురుగులు కలది. 13. విచక్షువు=శివుడు, విశాలనేత్రాలు కలది. 14. ఆర్యా=పార్వతి, ఉత్తమ స్త్రీ.

ఈతనితో యుద్ధం చేయలేం. చేసినా వెనుదిరిగి రావటం తగదు. అమరుల వటంచేత ఇతని చేతిలో మనకు మరణమున్నూ రాదు. కనుక మనం ఇప్పుడు ఏమీ చేయాలి?- అని సురేంద్రుడు అనేసరికి సురాచార్యుడైన బృహస్పతి ఇలా అన్నాడు.

"దేవేంద్రా! విను. వీనికింతటి ప్రతిభ కల్గటానికి కారకులు బ్రహ్మ వాదులైన శుక్రులు. ఇప్పుడు ఈతని ఎదుట నిలవడటానికి హరి హరులకు మాత్రమే శక్తి కలదు. నీవూ, నీ సములూ, నీ కంటే అధికులూ అయినవారు ఎవ్వరూ కూడా ఇతని ఎదుట నిల్వలేరు. కనుక ఇప్పటికి నీవు స్వర్గరాజ్యాన్ని విడిచిపెట్టి పోవటం రాజనీతి. ఎప్పటికైనా ఈతని శక్తి క్షీణించెడి సమయం రాకపోదు. ఆ సమయం కనిపెట్టి తిరిగి స్వర్గానికి రావచ్చు. ఇది నా అభిప్రాయము. విప్ర బలంచేత వీనికి ఇంతటి వృద్ధి వచ్చింది. కనుక వానిని ఇప్పుడు ఎదిరిస్తే నీకు అపజయం తప్పదు. అందాకా ఎక్కడికన్నా వెళ్ళిపో. శత్రువు పేరు తలవబోకు.

యుద్ధంలో శత్రువులను గెలవనైనా గెలవాలి. లేదా వారితో సమంగా పోరనైనా పోరాలి. అదీగాక వెనుజూపకుండా రణరంగంలో చావనైనా చావాలి. అది వీర లక్షణం. అలాకాక యుద్ధంలో జయంకానీ, సమత్వంకానీ, మృతికానీ, లభించదనుకున్నప్పుడు సరసంగా ముందుగానే తొలగి పోవటం ఉత్తమం—

అని కార్య కాలజ్ఞుడైన బృహస్పతి చెప్పగా విని కామరూపులైన దేవతలు స్వర్గాన్ని విడిచి ఎవరికి తగిన ప్రదేశాలకు వారు వెళ్ళిపోయారు. బలి శత్రువులు విడిచి పెట్టిన దేవధానిని అనాయాసంగా ఆక్రమించు కొన్నాడు. ముల్లోకాలను తన వశం చేసుకొన్నాడు. విశ్వ విజయుడై పెద్ద కాలం రాజ్యం చేశాడు. శిష్య వత్సలులైన భృగువు మొదలైన వారు అతని చేత నూఱు అశ్వమేధ యాగాలు చేయించారు. బలి చక్రవర్తి రాజ్య పాలనం అద్భుతంగా ఉంది. లోకాలన్నీ సర్వ సమృద్ధంగా ఉన్నాయి. యాచకులు లేరు. దాతలు చెడరు. సర్వ యత్నాలు సిద్ధిస్తున్నాయి. శత్రువులు లేరు. దేవాగారాలు మహోత్సవాలతో అతిశయిస్తున్నాయి. బ్రాహ్మణులకు ఏ లోటూ లేదు. ముక్కారులూ వర్షాలు కురుస్తున్నాయి. భూమికి వసుంధర[1] అను పేరు సార్థకమైంది.

స్వర్గధామం రాక్షసుల పాలుకావటం దేవతలందరూ ఎక్కడెక్కడకో పోయి దాగికొనటం విని దేవమాత అదితి పరితపించింది. అనాథలాగా

1. వసుంధర = బంగారమును ధరించునది.

దుఃఖించటం మొదలుపెట్టింది. అప్పుడు ఆమె పెనిమిటి కశ్యపబ్రహ్మ ఒకనాడు సమాధిమాని ఆమె నిలయానికి వచ్చాడు. ఆమె అతన్ని విధి విహితంగా పూజించింది. ఆమె ముఖకమలం వాడి ఉండడం చూచి కశ్యపుడు ఆమెను దగ్గరకు తీసుకొని ఆమె చిబుకాన్ని (గడ్డం) పుడుకుచూ కమలాక్షీ! ఎందుకిలా దుఃఖిస్తున్నావూ? అని అడిగి ఇలా అన్నాడు. దేవీ! బ్రాహ్మణులు ఏ లోపం లేకుండా ఉన్నారా? దేవార్చనాచారాలు జరుగుతూన్నాయా? వేళ తప్పకుండా గృహస్థులు అగ్నులు వ్రేలుస్తున్నారా? కొడుకులు ధర్మవర్తనులై ఉన్నారా? అభ్యాగతులకు అన్నపానాలు ఇస్తున్నావా? యాచకులనూ, సేవకులనూ, సాధుసజ్జనులనూ ఆదరిస్తున్నావా?

అన్నంగాని, నీరుగాని, మజ్జిగగాని, కూరగాని తనకు కల్గినంతవరకు అడ్డం ఆడకుండా అతిథులకు ఇవ్వనివారు ఉండికూడా లేనివారే కాగలరు. దేవీ! నిఖిలదేవాత్మకుడైన విష్ణునకు ముఖం అగ్నిహోత్రుడూ, బ్రాహ్మణులూ కనుక వారు తృప్తిచెందితే మహావిష్ణువు తృప్తిచెదుతాడు. అతడొక్కడు సంతుష్టుడైతే లోకాలన్నీ తృప్తి చెందుతాయి. నీ బిడ్డలు నీకు భయపడతారా? వారు నీకు ఎదురుచేయరుకదా? కోడండ్రున్నూ మారాడక వర్తిస్తారా? ఇంటిలో నీకు సమస్తమూ లభిస్తున్నది కదా?-అని కశ్యపుడనేసరికి అదితి ఆతనికి ఇలా అన్నది.

హృదయేశ్వరా! ఏమని చెప్పను. అణుమాత్రం కూడా ప్రేమలేని దితి కొడుకులూ, మనుమలూ బలగర్వితులై నా బిడ్డల నందరిని పారద్రోలి సాహసంతో స్వర్గధామాన్ని ఆక్రమించి పరిపాలిస్తున్నారు నీవు కరుణించి నా బిడ్డల మేలు చూడాలి. అక్కాచెల్లెండ్రమైనా దితి కొడుకులు మాతో పోరు విడవరు. ఆమె సురలతో యుద్ధం తగదని రక్కసులకు చెప్పదు. అవునవునని చూస్తూ ంటుంది.

నాథా! ఈనాడు ఎంత కన్నుఎఱుగని ఇంద్రుని ఇల్లాలు దైన్యంతో వరుల పంచలు చేరింది. ఇంద్రుడు త్రిభువన-సామ్రాజ్య వైభవాన్ని కోల్పోయి అడవుల పడి తిరుగుతున్నాడు. గారాబు బిడ్డలు జయంతాదులు ఆటవిక బాలుర, కలిసి సంచరిస్తున్నారు. అమరులకు ఆధారమైన అమరావతి ఈనాడు అసురులకు ఆటపట్టు అయింది. లోకాల్లో ఈనాడు బలి కంటే బలవంతుడు లేడు. ఇంద్రుడు వానిని జయించలేడు. దేవతలకు ఒక్క కబళమైనా ఇవ్వకుండా యజ్ఞభాగం అంతా అతదే గ్రసిస్తున్నాడు. నీకు ప్రజలందరూ సమానులే. ప్రజలను కడుపారా కన్న ప్రభువు నీవు. అయినా ప్రజలలో దుష్టాత్ములైనవారిని నీవు శిక్షింపవద్దా! మహాత్మా! కష్టాల్లో ఉండి విరధులైన సురల శోకాన్ని పోగొట్టి వారికి తిరిగి స్వర్గరాజ్యం వచ్చేలా చేయి. నిశాచరులని నిగ్రహించటానికి ఏమి చేయాలో చేయి. దేవతలను నీ కరుణా

దృష్టితో తనిపి రక్షించు-అని అదితి అర్థించేసరికి కశ్యపర్షి ముహూర్తమాత్రం ఆలోచించాడు. జ్ఞానదృష్టితో భవిష్యత్కాల కార్యం విచారించి కశ్యపబ్రహ్మ ఇలా అన్నాడు.

దేవీ!-వాస్తవం విచారిస్తే తండ్రి ఎవ్వడు? బిడ్డ ఎవ్వడు? జనన స్థానమేది? అసలు జననమేమిటి? శరీరాలు ఏపాటి? సంసార స్వరూపం ఏమిటి? ఇదంతా విష్ణుమాయ కాక మరేమిలేదు. దీనికంతటికీ మోహబంధం కారణం. కనుక నీవు విచారించడం దేనికీ? అయినప్పటికీ కాలోచితంగా చేయవలసిన పని చెబుతాను విను. శ్రీహరి భగవంతుడు. పరముడు జగదీశుడు. సర్వాత్మకుడు.జనార్దనుడు.కృపాపారీణుడు.అతనినినీవు సేవించు. అతడు నీ సాంగత్యం పొంది నీకు ఇష్టార్థాలన్నీ చేకూరుస్తాడు, నీవు కోరిన కోర్కెలన్నీ తీరుతాయి. భగవత్సేవ వలన పొందరాని సౌభాగ్యం ఏముంటుంది?—అని కశ్యపుడనేసరికి అదితి-దేవా! ఆ పరమేశ్వరుని ఏ రీతిగా స్మరించగలను? దానికి తగిన మంత్రమేది? విహితాచారాలు ఏవి? ఏ సమయంలో ఆరాధించాలి? చెప్పండి-అని అర్థించేసరికి కశ్యప ప్రజాపతి 'పయోభక్షణం" అనే మంత్రాన్ని ఉపదేశించాడు. ఆ మంత్రమేమిటో, దాని విధానం ఏమిటో,ఆ వ్రతాచరణం ఎప్పుడు చేయాలో వ్రతసమయంలో ఉపవాస దాన భోజనాలు ఎలా ఉండాలో తెలుపమని ప్రార్థించింది.

అపుడు కశ్యపుడు అదితి అడిగిన విషయాలన్నీ చెప్పాడు. ఆ ప్రకారం ఆమె ఫాల్గుణమాస శుక్లపక్షంలో మొదటి దినం మొదలుకొని పన్నెండుదినాలు హరి సమర్పణంగా వ్రతం చేసింది. వ్రతాంతమందు ఆమె నియతయై ఉండగా చతుర్భుజాలతో శంఖ చక్ర గదాధరుడై పచ్చని పట్టు దువ్వలు దాల్చి శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమయ్యేసరికి అదితి మహానందం చెందింది. కనుల నుండి సంతోషబాష్పాలు స్రవించాయి.వక్షోజాలు పులకరించాయి. ఆమె ఆ దేవునికి నమస్కరించింది. సన్నుతించింది. ముఖం పైకెత్తి నుదుట దోయిలి ఘటించింది. చూపులతోనే శ్రీపతి స్వరూపాన్ని తనివితీరా త్రాగింది. మహానందంతో నోరారా మంద మధుర వాక్కులతో లక్ష్మీనాథుని ఇలా సన్నుతించింది. పరమపురుషా! పద్మాక్షా! నీవు యజ్ఞేశ్వరుడవు. విశ్వంభరుడవు. అచ్యుతుడవు. మంగళ నామధేయుడవు. లోకస్వరూపుడవు. ఆపన్నభక్త జనుల ఆర్తిని పోగొట్టువాడవు. దీనజనాధారుడవు. తీర్థపాదుడవు[1]. లోకసృష్టి స్థితి విలయ కారణ భూతుడవు. నిత్యానందస్వరూపుడవు. నిన్ను సేవించని వారలకు ఆయువు, సంపద, భూమి, స్వర్గం, ధర్మార్థకామాలు, వైదికజ్ఞానం,

---

1. తీర్థపాదుడవు = గంగ జనించిన పాదము గలవాడు విష్ణువు

మోక్షం, శత్రుజయం లభిస్తాయా? నీవు ప్రణత వత్సలుడవు. నిన్ను స్తుతించేడి వారి పాలిటి కల్పలతవు నీవు.

రాక్షసులు దేవతలను బెదరించి స్వర్గాన్ని ఆక్రమించి పాలించు చున్నప్పటి నుండీ కన్న కడుపు కనుక నా కంటి కూర్కు రాకున్నది. నా గర్భశోకం మాన్పి నన్ను రక్షించు-అని అదితి ప్రార్థించేసరికి ఆశ్రితుల పాలిటి కామధేనువైన ఆ పరమేశ్వరుడు చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు.

తల్లీ! నీకోడంద్రుడు, కుమారులు; నీనాథుడు, నీవు సంతోషింపగా నీకా పరులు శోకింపగా నీగర్భంలో నేను తేజోరూపంలో జన్మిస్తాను. నీ కడుపున పుట్టి నీకు కొడుకునై నర్తించి, వర్తించాలనే కుతూహలం నాకు పుట్టింది. నీవు చలించకు.రాక్షసులను వినయోపాయంతోకాక బలప్రయోగంతో చంపటంసాధ్యం కాదు. నీ నియతికీ భక్తికీ నేను మెచ్చాను. ఇంద్రుడూ, దేవగణమూ, శచీదేవీ మెచ్చేలాగా రాక్షసరాజ్యం హరించి తిరిగి ఇంద్రునకు ఇస్తాను. నీ దుఃఖం తొలగిస్తాను.

నా రూపాన్ని నీ మనస్సులో నిలుపుకొని నీ భర్తను సేవించు. నేను నీ గర్భంలో ప్రవేశించి నీకు బిడ్డగా జన్మిస్తాను. కరుణించి నన్ను గారాబంతో పెంచు. దేవతలు తిరిగి స్వర్గాన్ని పరిపాలించేలా చేస్తాను. ఇంద్రసతి శచీదేవి భాగ్యాన్నీ, సిరినీ పాలిస్తాను. దానవులను తూలిస్తాను. శత్రుభార్యల భూషణాలను నిర్మూలిస్తాను[1].— అని భక్తజన పరతంత్రుడైన పురాణ పురుషుడు శ్రీహరి ఆనతిచ్చి అంతర్హితుడయ్యాడు. అదితిన్నీ తనకోరిక తీరగా సంతోషించి తన ప్రాణవల్లభుడగు కశ్యపుని ఆశ్రయించి సేవిస్తూ ఉంది. అలా ఉండగా ఒకనాడు కశ్యపుడు సమాధిలో ఉండగా శ్రీహరి అంశం అతనిలో ప్రవేశించింది. అతడప్పుడు చలితుడై అదితి యందు తన అమోఘ వీర్యాన్ని దారువు[2]నందు గాలి, అగ్నిని చేర్చినట్లు చేర్చాడు. కశ్యపుడు చిర కాలం చేసిన తపస్సువలన కూడిన వీర్యంచే అదితి మహోల్లాసంతో వుంది.

మృదువై, కాంతివంతమై గర్భస్థపిండం కరుడుగట్టి కంఠనాళంతో తల ఏర్పడి ఆమెకు నెలతప్పింది. ఆమె గర్భవతి అయింది. ఆమెకు అలా మాలు ఏర్పడి క్రమక్రమంగా నెలలు పెరుగుతుండగా రాక్షస నిర్మూలతకు నెలలు అంతకంతకు దగ్గరపడుతున్నాయి. గర్భం అంతకంతకు పెరిగిన కొలదీ మేఘసమూహంచే కప్పబడిన వేయి సూర్యుల కాంతితో అంగాలేర్పడిన శిశువు కశ్యప గృహిణి గర్భంలో కదలటం మొదలుపెట్టింది. ఆమె కడుపున

---

1. భర్తలను చంపి వారిని అనాథలను చేస్తాను, వితంతువులు భూషణములు ధరించరు. 2. కొయ్య.

ఒకచోట ఆ శిశువు బ్రహ్మాండభాండం, సముద్రసమూహం, సకలజగత్తులు నిడుకొని అణగిమణగి ఆశ్చర్యకరంగా పెరుగుతున్నాడు.

ఆమెకు నెలలు నిండాయి. అప్పుడు ఆమెకు కంటిరెప్పల కదలికలు తగ్గాయి. కనులయందు ధావళ్యం పెరిగింది. చనుమొనలయందు నల్లదనం ఏర్పడింది. గర్భాభారంచేత వడ్డాణం బిగిసి పోయింది. ముఖం తెల్లవడింది. స్తనాలు, పిరుదులు బలిశాయి. సన్నగానుండెడి నడుముకూడా లావెక్కింది. శరీరమందు ఒకవిధమైన మహామహిమ గోచరించింది. ఆమె చెలికత్తెలు కొందరు నిండుచూలాలైన ఆ దేవికి నుదుట భూతిని పెట్టగా కొందరు ఆమెకు పట్టుబట్టల జంటను కట్టబెట్టారు. కొందరు ఆమె గర్భరక్షణకు రక్షలు కట్టారు. ఈ విధంగా విశ్వగర్భుడైన శ్రీహరి తన గర్భబిలంలో పూటపూటకు వృద్ధి చెందుతుండగా నెలలు నిండి అదితి నీళ్ళాడు ప్రొద్దులు వచ్చాయి.

అపుడు బ్రహ్మదేవుడు వచ్చి అదితిగర్భంలో పరిభ్రమిస్తూన్న ఆ పరమేశ్వరునుద్దేశించి యిలా స్తుతించడం మొదలుపెట్టాడు—దేవా! త్రివిక్రమా[1]! త్రిభువన జయశీలీ! సర్వాత్మా! శిపివిష్టా[2]! పృశ్ని[4] గర్భాశ్రితా! త్రినాభా[3]! త్రివృష్టా[5]! లోకాలకు నీవే ఆదివి. మధ్యముడవు. నీవే అంత. చేతనాచేతన ప్రాణికోటికి సృష్టికర్తవు నీవే. నీవే కాలస్వరూపుడవు. నమస్తము. నీవు నీ ఆత్మయందు ధరిస్తావు. మహాప్రవాహం తనయందు బడిన గడ్డిపోచను చిమ్మి వేసినట్లు కాలశరీరకుడవైన నీవు నీలోని జంతువులను చిమ్మివేస్తావు. నీవు ప్రజాపతులను సృష్టిస్తావు. స్వర్గాన్ని విడిచి దిక్కులేక శోకసముద్రంలో మునిగిన దేవతలకు ఆధార భూతమైన నౌకవు నీవు ప్రభూ! వెంటనే అదితి గర్భంనుండి వెల్వడ చిరవ్యథనొందుతున్న దేవతలను రక్షించు. వారు నీరాక కోసం ముచ్చటపడి ఎదురుచూస్తున్నారు—అని చతుర్ముఖుడు శ్రీహరిని అనేక విధాల సన్నుతించాడు.

---

1. త్రివిక్రముడు = మూడు లోకములను ఆక్రమింపజాలిన పాదన్యాస్నాలు కలవాడు. 2. శిపివిష్టుడు = జీవులయందుండువాడు. 3. త్రినాభుడు = ముల్లోకములూ నాభియందు కలవాడు. 4. పృశ్ని = అదితి పూర్వజన్మ నామం. పూర్వం శ్రీహరి ఇలాగే ఆమె గర్భంలో వసించాడు. 5. త్రివృష్ట = ముల్లోకములకూ పైన ఉండువాడు. [6. సువర్ణం=బంగారం, మంచిమాట. 7. భోగము అనుభవించు రాజులచేత, సర్పరాజుచేత, 8. గుండ్రనిది, మంచి నడవడి కలది.]

## వామనమూర్తి జననం

అప్పుడు శ్రీహరి సకల నక్షత్రాలు, గ్రహాలు ప్రదక్షిణం చేస్తూండగా శ్రవణ నక్షత్రంతో కూడిన భాద్రపద శుక్ల ద్వాదశినాడు అభిజిన్ముహూర్తంలో సూర్యుడు గగనమధ్యమును అధిష్ఠించి ఉండగా వామనుడై పుట్టాడు. అతని నాలుగు చేతులయందు శంఖం, చక్రం, గద, పద్మం ప్రకాశిస్తున్నాయి. పచ్చని పట్టువస్త్రం ధరించాడు. కర్ణకుండలాల కాంతి చెక్కిళ్ళపై ప్రతిఫలిస్తోంది. వక్షస్థలమున శ్రీవత్సం మెఱుస్తోంది. అతని కన్నులు తామర రేకుల్లా విశాలంగా ఉన్నాయి. అతని మెడయందున్న వనమాలయందలి తేనియను త్రాగుటకు మూగిన తుమ్మెద కొదమలు ఝుంకారాలు చేస్తున్నాయి. అతడు ధరించిన కౌస్తుభరత్నం కమనీయంగా, రమణీయంగా అందాలు చిలుకుతూ ఉంది. ముంజేతులందు కనక కంకణాలు, భుజములందు కేయూరాలు, తలయందు మణి కిరీటం, మొలయందు బంగారు త్రాడు, మెడయందు ముత్యాల హారం, కాళ్ళయందు మణికుందనమయాలైన నూపురాలు ధగధగలాడుచున్నాయి. నీల మేఘాన్ని పోలిన అతని దేహకాంతి మిల మిల లాడుతోంది.

అలా శ్రీహరి ఆవిర్భవించేసరికి యక్షులు సురలు, సిద్ధులు, సాధ్యులు, చారణులు, విద్యాధరులు, మునులు, బ్రహ్మాదులు మహానందంతో పరవశించిపోయారు. సూర్యచంద్రుల కాంతి ఇనుమడించింది. కింపురుషులు, కిన్నెరలు, గంధర్వులు ఆకాశాన గీత వాద్యాలతో నాట్యం చేశారు. దిక్కులు నిర్మలాలయ్యాయి. జలధులు ప్రసన్నాలయ్యాయి. భూమి, ఆకాశం సంతోషంతో పొంగిపోయాయి. దేవతలు పుష్పవర్షం కురిపించారు. పరమేశ్వరుడు చిరకాలం గర్భమందుండటం చేత అదితి ఆశ్చర్యపడ్డది. కశ్యపుడు ఆనందంతో జయజయధ్వానాలు చేస్తూ ఆ దేవదేవుని సన్నుతించాడు.

రాజేంద్రా! భగవంతుడు జన్మించిన ద్వాదశి విజయ అను పేరుతో పిలువబడుతోంది. అదితి గర్భం నుండి ఆయుధాలతోనూ, భూషణాలతోనూ అవతరించిన ఆ పరమపురుషుడు ఆశ్చర్యకరంగా వాటినన్నింటినీ విడిచి రూపాంతరం చెందాడు. కపట వటువులాగా ఉపనయన వయస్కుడైన వామన బాలకుడు తల్లిముందట క్రీడిస్తూ తన తొక్కు పలుకులతో తల్లికి మహానందం కల్పించాడు. అతన్ని చూచి ఆమె పరవశించిపోయింది.

అదితి వామనుడుగా జన్మించిన శ్రీహరి నుద్దేశించి 'నను కన్నతండ్రీ! నాపాలి దైవమా నా తపః ఫలమా. నా కులదీపకా. నా కుమారా నీవు నాభాగ్యరాశివి రా రమ్మని దగ్గర చేర్చుకొని పాలిచ్చి, కౌగలించుకొంది. అతని చిన్నారి ముఖాన్ని నిమిరింది. తనివితీరా అతన్ని చూస్తూ పరవశించి

పోయింది. పుణ్యస్త్రీలు లక్ష్మీ పార్వతులకు ఈడైన పురుటాలియగు అదితికి పది దినాలు పురుడు పోశారు. మహర్షులు కశ్యపప్రజాపతిచే ఆ శిశువునకు జాతకర్మాది ఉపనయన కర్మాదులు చేయించారు. సూర్యుడు అతనికి సావిత్రిని ఉపదేశించాడు. బృహస్పతి యజ్ఞోపవీతాన్ని, కశ్యపుడు ముంజ దర్భల మొల త్రాడునూ, అదితి కౌపీనాన్ని, భూమి కృష్ణాజినాన్ని, వనస్పతి అయిన చంద్రుడు దండాన్ని, గగనాధిష్ఠానదేవత (దివి) గొడుగునూ, బ్రహ్మ కమండలాన్ని, సరస్వతి అక్షమాలనూ, సప్తఋషులు కుశపవిత్రాలనూ ఇచ్చారు. కుబేరుడు భిక్షాపాత్రను ఇచ్చాడు. అది అక్షయమైనది. పార్వతి భిక్ష పెట్టింది. అనంతరం వటుడు వృద్ధాచారాన్ని అనుసరించి బ్రహ్మర్షులు సేవిస్తూండగా విహిత మంత్రాలు పఠిస్తూ అగ్నిలో హోమం చేశాడు

## బలిచక్రవర్తి కడకు వామనుడు వెళ్ళటం

మాయా బ్రహ్మచారి అయిన శ్రీహరి దేశాంతరాల నుండి వచ్చిన బ్రహ్మణులు కొందరిని చూచి - అర్థించడానికి బ్రాహ్మణులు వస్తారా? దాతలు ఇష్టార్థాలను ఇస్తారా? మీరున్నూ ఇలా సంపదలు తెచ్చుకొంటారా? అలాంటి దానవీరుడెవ్వడో చెప్పండి అని అడిగేసరికి అఖిలదేశీయులైన బ్రాహ్మణులు- వామనా! దాతలూ ఉన్నారు. కోరిన అర్థాలనూ ఇస్తారు. కామ్యార్థాలను తీసుకొని బ్రాహ్మణులూ వెడతారు. కాని దాతృత్వంలో బలిచక్రవర్తిని పోలిన వాడెవ్వడూ లేడు. అతడు మహానుభావుడు. శుక్రాచార్యుని ఆజ్ఞచే అతడు నూరు యజ్ఞాలు చేశాడు. అతన్ని అర్థిస్తే అమితమైన సంపద్దు పొందవచ్చు అని చెప్పారు.

ఆ బ్రాహ్మణుల మాటలు విని వామనుడు లోకశ్రేయస్సుకోసం అందరూ ఆశీర్వదిస్తూండగా ఒక శుభముహూర్తాన తల్లితండ్రులను వీడ్కొని భిక్షకోసం బలి చక్రవర్తి భవనానికి వెళ్ళాడు. ఎంత ఆశ్చర్యమూ? సిరి వక్షస్థలాన గల శ్రీహరి ఇంద్రుని రక్షించటానికి రాక్షసేంద్రుని దగ్గరకుపోయి అర్థించటమా? పరులహితంకోరే ప్రభువులకు యాచనకూడా అలంకార ప్రాయమే అవుతుంది. సమస్త ప్రపంచం యొక్క మహాభారాన్ని వహించిన వాడవటం చేత వామనుడు బలికడకు వెడుతూంటే ఆ బరువు సహించలేక భూమి క్రుంగింది. ఆదిశేషువు వంగిపోయాడు.

వామనుడు అలా వెళ్ళి వెళ్ళి సకల సుఖాలు ఇచ్చేదీ, యమదండభీతి తొలగించేదీ, ముక్తికాంతను కరతలామలకం చేసేదీ, నిర్మలమైన తన నీటిచే పాపాలను పోగొట్టేదీ అయిన నర్మదా నదిని దాటాడు. ఆ నది ఉత్తర తీరమందే బలి యజ్ఞశాల ఉంది. ఆ యజ్ఞశాలలో రాక్షసులు ఇష్టం వచ్చినట్లు ప్రేలుతున్నారు. ఆహూతులైన దేవతలూ, సిద్ధులూ భయంతో గడగడలాడు

తున్నారు. ఆ యజ్ఞవాటిక ద్వార సీమలందు ఏనుగులు, గుర్రాలు, ధ్వజాలు కనువిందు చేస్తున్నాయి. యజ్ఞకుండాల నుండి పైకి లేచిన పొగ సూర్యుని రథ హయాలను కప్పివేస్తోంది.

వామనుడు అలా దానవరాజు అశ్వమేధ వాటికను సమీపింపగా యజ్ఞ శాలయందున్న శుక్రాదులు అతన్ని చూచి— "ఆ వచ్చేవాడు శివుడా? విష్ణువా? చతుర్ముఖుడా? సూర్యుడా? లేక అగ్నిదేవుడా? అతని ఆకారం ఎంతో దంభంగా ఉంది. మనోజ్ఞంగానూ ఉంది. ఎవ్వరీ బ్రాహ్మణ వటువు?" అని విస్మయావిష్టులై వారిలో వారు రహస్యంగా సంభావించుకోవటం మొదలు పెట్టారు. మహా తేజశ్శాలి అయిన ఆ బ్రహ్మచారిని చూచి కొందరు కలత చెందారు. కొందరు రహస్యంగా గుసగుసలాడటం మొదలు పెట్టారు. కొందరు వ్యాకులపాటు చెందారు

ఇంతలో వామనుడు యజ్ఞ శాలను సమీపించాడు ఉద్గాతలు చెవులకి ఇంపుగా చదివెడి సామ గానాలను వింటున్నాడు. మంత్ర తంత్రార్థాలను వివరించి చెప్పెడి హోతలను చూస్తున్నాడు. హోమ కుండలాలలో త్రేతాగ్నులను రాజిల్ల చేసెడి యాచకులను కలిసికొంటున్నాడు. సమర్థతతో నానా విధాలైన యజ్ఞ విశేషాలను చెప్పే సభ్యుల దగ్గరకు పోతున్నాడు. అలా అదితి పుట్టువూ, సిరికి ఆటపట్టూ అయిన శ్రీహరి కొంతసేపు ఆ సభలో తన ఇష్టం వచ్చినట్లు తిరిగాడు. ఆ సభలో ఆ మాయా వటువు చేసిన నటనలు ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి.

ఒంగుతాడు, వ్రాలిపోతాడు. సంభ్రమంతో జన సమూహాల దగ్గరకు హరినామ స్మరణ చేస్తూ వెడతాడు. కొంత తడవు కనపడకుండా మరుగు పడతాడు. ఉలికి పడతాడు. దిరదిరా తిరుగుతాడు. కొందరితో చర్చిస్తాడు. కొందరితో కలిసి వేద పఠనం చేస్తాడు. గోష్ఠుల్లో పాల్గొంటాడు. కొందరితో వాదిస్తాడు. కొందరితో ముచ్చటలు చెబుతాడు. కొందరితో పరిహాసాలు ఆడతాడు. ఇలా అనేక విధాల అందరకూ అన్నిరూపాలతో వినోదం కల్గిస్తూ మంద మందంగా నడుస్తూ, నడుమ నడుమ భూమి క్రుంగిపోగా అడుగిడలేక ఆగుతూ, బుడి బుడి మాటలు చెబుతూ, జుట్టు ముడి తడబడగా వడుగు బలి చక్రవర్తిని చేరాడు.

మాయా భిక్షువైన హరి రాక్షసేంద్రుని చూచి— ఇతడే దానవ చక్రవర్తి. ఇతడు దిక్పాలకుల గర్వాన్ని పోగొట్టగల దక్షుడు. లోభ, మోహాలు లేనివాడు. క్రతుకర్త. ఎన్నో వ్రతాలు చేశాడు. మహా దాత. దేవాంగనల మనస్సులను భేదింపజాలిన యశోమూర్తి. సత్య సంధుడు. కరుణా సముద్రుడు. ధర్మ స్వరూపుడు— అని కుశ పవిత్రాల్ను అక్షత ను గ్రహించి దక్షిణ హస్తం చాచి ఇలా దీవించాడు.

ముల్లోకాలనూ శాసించే వాడున్నూ, చిఱునవ్వు చేతనే ఇంద్రుని చలింపచేయగల వాడున్నూ, మహోదారుడున్నూ, మునులచే పొగడ బడిన శుభ ప్రదాలైన యజ్ఞాలు చేసేవాడున్నూ, దేవతా స్త్రీల మంగళ సూత్రాలను పరిహరించెడి వాడున్నూ అయిన రాక్షసేంద్రునకు నా శుభాశీస్సులు. అలా దీవించి మూర్తీభవించిన వేదరాశి లాగా వామనుడు ముందుకు అడుగుపెట్టాడు. ఆతని చేతుల్లో దండం, ఛత్రం ఉన్నాయి. చంకకు భిక్షాపాత్ర వ్రేలాడుతోంది. చేతిలో జల పూర్ణమైన కమండలువు వుంది. అతని ముఖం చంద్రబింబం లాగా మెఱిసి పోతోంది. ఆ మాయా వటువును చూచి భృగువులు సూర్య కిరణాల ముందు గ్రహాల మాదిరిగా తేజోహీనులై తమ ఆసనాల నుండి దిగ్గనీ లేచారు. వటువు క్షేమం అడిగి మధురోక్తులతో సన్మానించారు. బలి చక్రవర్తి కూడా అతనికి నమస్కరించి తన గద్దెపై నుంచి అతని పాదాలు తుడిచాడు. తన ప్రాణేశ్వరి స్వర్ణ పాత్రతో నీళ్ళు పోయగా వామనుని చరణాలు కడిగి అతని పాద స్పర్శచే పవిత్రమైన నీటిని శుభ ప్రదమని భావించి తన శిరసుపై జల్లుకొన్నాడు.

ఎవ్వని పాదమందు పుట్టిన గంగను శంకరుడు తలదాల్చి పవిత్రు డయ్యాడో ఆ పరమేశ్వరుని పాద జలాన్నే తన శిరమున జల్లుకొని అసురేంద్రుడైన బలి పరమానందం చెందాడు. తాను కృతకృత్యుడైనట్లు భావించుకొన్నాడు. మాయా విప్రుడగు హరికి ఇలా అన్నాడు-

వడుగా! నీ వెవ్వడవు? ఎవ్వరి వాడవు? నీ నివాస స్థలం ఏది? నీవు ఇక్కడకు రావటం వల్ల నా వంశం, జన్మం సార్థక మయ్యాయి. నేను ధన్యాత్ముడ నయ్యాను. నేను ఆచరిస్తున్న ఈ యజ్ఞం సార్థకమైంది. నా కోర్కెలు ఫలించాయి. అగ్నులు చక్కగా ప్రేల్వ బడ్డాయి. ఈ సమయం ఎంతో మంగళ ప్రదమైనది. అనర్ఘాలైన వస్త్రాలో, మాడలో, ఫలాలో, వన్య వస్తువులో, గోవులో, గుఱ్ఱాలో, ఏనుగులో, రథాలో, రత్నాలో, విశిష్టమైన అన్నమో, కన్యలో, కాంచనమో, ఇండ్లో, గ్రామాలో, భూములో, భూభాగమో, ఇవేవి కాక ఇంకేమి అడుగు తావో-అడుగుమని బలి చక్రవర్తి ధర్మయుక్తంగా అనే సరికి ఈశ్వరుడు సంతోషించి ఇలా అన్నాడు.

రాక్షసేంద్రా! ఇది నా నివాస స్థానమని నేను ఎలా చెప్పగలను? నేను ఒకచోట ఉండను. అంతటనూ ఉంటాను. నేను ఎవ్వని వాడనని చెప్పగలను? నేను స్వతంత్రుడను. నాయంత పాదనై నడుస్తూ ఉంటాను. నా నడవడి ఇలా ఉంటుందని నేను ఎలా చెప్పగలను? నేను ముప్పోకల[1] పోగలను. నాకు అది తెలుసు, ఇది తెలుసు అని ఎలా చెప్పగలను? నాకు

1. ముప్పోకలు = రజస్సత్వతమోగుణ మార్గాలు.

సమస్తమూ తెలుసు. ఇతరు లెవ్వరూ నాకు అండగా నుండరు. కాని నేను మాత్రం ఇతరులకు బాసటగా ఉంటాను. నేను ఒంటివాడను. నాకు చుట్టం ఒక్కడునూ లేడు. పూర్వం నాకు సిరి ఉండేది. వాస్తవం చెబుతున్నాను విను. సజ్జన హృదయం నా ప్రధాన నివాస స్థానం.

రాజేంద్రా! అది అలా ఉండనీ! నేను ఇంకా చెప్పేది విను. నీ వాడిన మాట సత్యబద్ధమైనది, ధర్మసమ్మతమైనది, కీర్తిప్రదమైనది. నీ వంశానికి అర్హమైనది. స్వచ్ఛమైన నీ వంశంలో కరుణా సముద్రులూ, సత్యమూర్తులూ కాక ఇతరులు కలుగరు. ప్రత్యర్థులు అర్థిస్తే భయపడేవారు కాని, అర్థులు యాచిస్తే లేదని వెనుతీయువారు కాని నీ వంశంలో లేరు. నీ తాతలందరూ మహానుభావులు. దాతృత్వంలో ఎంతో ప్రసిద్ధి కెక్కినవారు. ఆకాశాన చంద్రుడులాగా నీ తాత ప్రహ్లాదుడు నీ కులానికి వన్నె తెస్తూంటాడు. నీ వంశం మహాయశస్సుతో సముద్రంలాగా విస్తృతమైనది.

పూర్వం నీ ముత్తాత హిరణ్యాక్షుడు విశ్వవిజయం చేసి గదాయుధుడై భూలోకంలో ప్రతివీరులను కానక సంచరిస్తూండగా శ్రీ మహావిష్ణువు వరాహ రూపంతో అతన్ని వధించాడు. అతని తమ్ముడు హిరణ్యకశిపుడు అది విని శ్రీహరి పరాక్రమానికి ఆశ్చర్యచకితు డయ్యాడు. తన శక్తిసామర్థ్యాలను పరిగణించక మహోద్రేకంతో అతడు అసురమర్దనుడైన శ్రీహరి మందిరానికి వెళ్లాడు. శూలాయుధుండాట్టి అంతకాకారంలో వస్తున్న రాక్షసుని చూచి విష్ణువు కాలజ్ఞానం కలవాడు కనుక మాయాగుణం అవలంబించి తన మనస్సులో "ఇతనిని ఎదుర్కొని పోరరాదు. కాక ఇంకెక్కడికైనా పోతే ఇతడు మృత్యువులాగా అందరి వెంటా పడి వెదకి వెదకి సంహరిస్తాడు"- అని కార్యజ్ఞుడైన శ్రీహరి ప్రత్యక్షచర్య తీసుకొనేందుకు బదులు దైత్యుని హృదయాంతరాళంలో సూక్ష్మరూపాన నిశ్వాస రంధ్రంలో ప్రవేశించాడు.

రాక్షసుడు అప్పుడు వైష్ణవ నిలయానికి వెళ్ళాడు. నలువైపులా వెదికాడు. ఎక్కడా శ్రీహరి కనపడ లేదు. క్రుద్ధుడయ్యాడు. విడువకుండా భూమ్యాకాశాలు అన్వేషించాడు స్వర్గంలో వెదికాడు. దిక్కులు పరిశీలించాడు. భూ రంధ్రాల్లో చూచాడు. సముద్రాలు తరచి చూచాడు నగరాలు శోధించాడు. వనాలు విమర్శించాడు. పాతాళం పరీక్షించాడు. అయినా లోకాల్లో ఎక్కడా శత్రువు కనపడకపోవటంచేత అతడు తనలో- "శత్రువు చచ్చిపోయి ఉంటాడు. అలాకాకపోతే ఎదురు పడకుండా ఉంటాడా? శత్రువు చనిపోతే వాని సంతతిపై పగపట్టటం తగదు. వైరి మరణంతో వైరానుబంధం నశిస్తుంది. వైరం ప్రాణికోటికి మరణపర్యంతమే ఉండదగ్గది. అనంతరం ఉండదు" అని భావించి తన ప్రయత్నం మానుకొన్నాడు.

అతడు నీ ప్రపితామహుడు. అతడు సద్గుణ సంపన్నుడు. అది అలా ఉంచు. నీ తండ్రి ఎంత గొప్పవాడూ! ఇంద్రాదులు బ్రాహ్మణ రూపంలో వచ్చి తనను వేడగా వారికి తన ఆయువే ఇచ్చాడు. నీవు మాత్రం ఈ లోకంలో సామాన్యుడవా? ముల్లోకాలు పరిపాలించావు. ఇంద్రాది దేవతలనూ పార ద్రోలావు. దానగుణంలో నీవు నీ పూర్వులను మించిపోయావు. నిశాశరులను రక్షించటానికి చెమట ధారపోసావు. రాజ్యాధికారం ఉన్నప్పుడు పూజ్యులకూ, యాచకులకూ, బ్రాహ్మణులకూ తన సంపదలను పంచి ఈయకపోతే అతని జన్మ, ధనం, గేహం నిరర్థకాలు. దాతలను లెక్కించునపుడు అందరూ త్రిలోకాధిపతివైన నిన్ను పేర్కొంటారు. ఇంతకాలం నుండి నేను ఎన్నడూ "నాకు ఇది ఇమ్మని" నిన్ను అర్థించలేదు. నేను ఒంటరివాడను. నాకు ఒకటి రెండడుగులు నేల ఇమ్ము. చాలు. ఎక్కువ ఏమీ అక్కరలేదు. దానిని స్వీకరించి బ్రహ్మదేవుని కూకటిని స్పృశించి సంతటి మహానందం చెందుతాను.

అని వామనుడనేసరికి మహాదాత అయిన బలి ఇలా అన్నాడు- "విప్రుడా! నీవు పలికినది సత్యసంగతం. వృద్ధ సమ్మతం.అడుగదలచినవాడవు ఈ కొంచమేనా అడగటం? దాతయొక్క పెంపుసొంపులు భావించవద్దా? నీవు పసిబాలుడవు. నీకు అడగటం చేతకాదు. భూభాగాలో, ఏనుగులో, గుఱ్ఱాలో, యువతులో అడగాలి కాని నావంటి రాజేంద్రుని మూడడుగుల నేల ఇమ్మని యాచించావే. ఇంతటి అల్పవస్తువును నేను ఎలా ఇస్తాను? అని చిఱునవ్వు నవ్వగా మేధావి అయిన వామనుడు గృహమేధి అగు బలికి ఇలా అన్నాడు.

రాక్షసేంద్రా! నేను బ్రహ్మచారిని. నాకు గొడుగో, యజ్ఞోపవీతమో, ముంజదర్భల మొలత్రాటో, దండమో కాక భూములు, ఏనుగులు, కన్యలు అశ్వాలు ఎందుకూ? నేనెక్కడ? ఈ భోగాలెక్కడ? నేను నిత్యం ఆచరించే కర్మ ఎక్కడ? కనుక నేను కాంక్షించిన మూడడుగుల నేల అనుగ్రహించు చాలు. అదే నా పాలిట బ్రహ్మాండం కాగలదు అదీగాక ఎక్కువ కావాలని భావించక లభించిన కొద్దిపాటిదే పదివేలని తృప్తిచెందని మానవుడు సప్తద్వీపాలు ఇచ్చినా బాగుపడడు. ఆశాపాశం చాలా నిడుపైనది. దానికి అంతంలేదు. సముద్ర పరీతమైన మేదినీ (భూమి) సామ్రాజ్యం లభించినా వైన్యుడు, గయుడు మొదలగు రాజులు నానాకష్టాలు పొందారు. కాని అర్థకామాశాన్ని విడువ గల్గారా? తమ ఆశలకు అంతం చూడగల్గారా?

సంతృప్తుడైనవాడు ముల్లోకాల్లో పూజ్యుడు. సంతోషి అయినవాడు ఎప్పుడూ సంతోషంగా కాలం గడుపుతాడు. సంతోషి కాని వానికి సంసార బాధలు తప్పవు. సంతోషంతో మోక్షప్రాప్తికూడా కల్గుతుంది. లోకంలో యాదృచ్ఛికంగా లభించిన దానితో సంతృప్తి చెందేవాడు తేజశ్శాలి అయి వృద్ధి చెందుతాడు సంతృప్తి లేకపోతే నీటిధారచే అగ్ని చల్లారినట్లు కాంతి

తగ్గుతుంది. నీవు రాజువని సమస్తం అడగటం న్యాయంకాదు. నాకు తగ్గట్లుగా నేనర్థించిన ఈ మూడడుగుల నేల ఇమ్ము. చాలు-అని ఇలా పలికిన వామనునకు అతడు కోరిన మూడడుగుల నేలను ధారాపూర్వకంగా ఇవ్వటానికి సిద్ధపడి బలిచక్రవర్తి చేతిలో జలపాత్ర గైకొనగా శుక్రుడతనిని చూచి దనుజరాజ్యం పోతుందనే దిగులుతో ఇలా అన్నాడు.

రాజేంద్రా! ఇతడు బ్రాహ్మణుడు కాడు. దేవకార్యం సాధించటానికై అవ్యయుడైన శ్రీహరి అదితి గర్భంలో కశ్యపపుత్రుడై జన్మించాడు. ఇతని కోర్కెలోని అంతర్యం నీకు తెలియక ఇస్తానన్నావు. రాక్షస సంతతికి ఉపద్రవం వస్తుంది. నీ లక్ష్మినీ, తేజాన్ని, స్థానాన్నీ, ఐశ్వర్యాన్ని ఈతడు వంచించి దేవేంద్రునికి ఇస్తాడు. ఇతడు విశ్వరూపుడై మూడు పాదాలతో ముల్లోకాలు ఆక్రమిస్తాడు నీవు నీ సర్వస్వాన్ని విష్ణుపాలుచేసి నిరుపేదవుగా ఎలా జీవిస్తావు? ఒక పాదంతో భూమిని, మరొక పాదంతో స్వర్గాన్ని ఆక్రమించి మహాకారంతో దిక్కులు,గగనం కాస్తా నిండిపోతే నీవు ఎక్కడికి వెళ్ళెదవో చెప్పు?

ఇచ్చెదనని ఇయ్యకపోతే నరకం తప్పదు. కాని అతనికోర్కె తీర్చక పోతే దానివలన నీకు వచ్చేనష్టం ఏమీలేదు. ఎందుకంటే ఏ దానంచేత స్వనాశనం సంభవిస్తుందో అది దానంక్రింద లెక్కకాదని తత్వవిదులంటారు. దానం, యజ్ఞం, తపస్సు, కర్మ-ఇవన్నీ విత్తవంతుడైనవానికే. అర్థానికి, ధర్మానికి, యశస్సుకు, ఆశ్రితసమూహానికి సమంగా తన సంపదను పంచి ఇచ్చువాడు ఇహపరములయందు సంతృప్తుడై ఉంటాడు తనను మాలిన ధర్మం తగవుకాదు.

అదీకాక ఈ విషయంలో పెద్దలు వివరించిన మాటలెన్నో ఉన్నాయి విను. ఇస్తానన్న దానంవలన సమస్తం పోనున్నప్పుడు లేదనటం అనృతం కాదు. ఆత్మవృక్షానికి అనృతం మూలం. ఆ అనృతమూలం ఉంటే ఆత్మ చెడదు. ఆత్మవృక్షానికి సత్యం పువ్వులు ' ఫలాలు. ఆ వృక్షం బ్రతుకకపోతే ఆ సత్యంకూడా నశిస్తుంది. ఫల, పుష్పాలు లేకపోయినా మూలం సరిగ్గావుంటే వృక్షం వృద్ధి చెందుతుంది. కనుక చేటుకాని, క్రూరతకాని, అల్పత్వంకాని చెందకుండా ఇతరులకు ఇవ్వదగినంత మాత్రమే ఇచ్చేవాడు ఎన్నడూ చెడిపోడు. కాని సత్యాన్నిపాటించి తన సమస్తాన్నీ యాచకునకు ఇస్తే నీకు ఏమీ మిగిలేది ఉండదు.

రాజేంద్రా! నీ కొక రహస్యం చెబుతాను విను. ఇప్పుడు నిన్ను యాచించినవాడు వాస్తవంగా లేనివాడు కాదు. తాను సర్వధనం అడుగలేదనీ, ఏదో తనకు వలసిన పరిమితమైన భూమి మాత్రమే కోరానని అసత్యం ఆడెడి నటి ఇతడు, తనకుండియూ లేదనెడివాడు ప్రాణంతో కూడిన శవమ్ము

లాంటివాడు. వాని జన్మమెందుకూ? స్త్రీల విషయంలోనూ, వివాహాల్లోనూ ప్రాణానికి, ధనానికి, మానానికి భంగం కలిగినప్పుడున్నూ, గోబ్రాహ్మణులను రక్షించవలసి వచ్చినప్పుడు బొంకవచ్చును. అందువలన పాపం రాదు.

రాక్షసేంద్రా! తొందర పడకు. నీ కులమునూ, రాజ్యాన్ని, తేజస్సునూ కాపాడుకో. ఇతడు మాయావటువు. విశ్వంభరుడు. అంతతేలికగా నిన్ను విడువడు. అతడు మూడడుగులతో బ్రహ్మాండం అంతా నిండిపోగలడు. అతనిని ఎవ్వడూ అడ్డగించలేడు. నామాట విను. ఈ దానం, గీనం వద్దు. బ్రహ్మచారిని పంపివేసేయి - అని శుక్రాచార్యుడు హితోపదేశం చేయగా బలి చక్రవర్తి కన్నులు మూసుకొని క్షణకాలం ఆలోచించి ఇలా అన్నాడు.

మహాత్మా! నీవు నిజం చెప్పావు. అర్థకామాలకు, కీర్తికి, వృత్తికి పరస్పర బాధ కల్గకుండా ప్రవర్తించటం గృహస్థ ధర్మం. కానీ ఏది కోరితే అది ఇస్తానని వాగ్దానం చేశాను. అలాంటప్పుడు ధనలోభం చేత యాచకుని ఎలా పొమ్మనగలను? పలికి లేదనుటకంటే పాపం ఇంకొకటేమి ఉంటుంది? "ఎలాంటి దుష్కర్ముడైనా భరిస్తాను కానీ సత్యహీనుని భరించలేనని" పూర్వం భూదేవి బ్రహ్మదేవునితో పలుకలేదా? రణరంగమునందు వెన్నీయక చావటం కంటే, పలికి బొంకక సత్యాన్ని పాటించటం కంటే మానధనులైన వారికి భద్రం మరొకటి ఉంటుందా?

భూమియందు కర్షకునకు మంచినేల, మంచి విత్తనాలు ఒకేచోట దొరకటం ఎంత అదృష్టం? అలాగే దాతకు ఈవీ[1] పాత్రమూ[2] ఒక్కచోట లభించటం అదృష్టం కాదా? ఎందరో రాజులు కాలేదూ? రాజ్యాలు సంపాదించలేదూ? గర్వోద్ధతులు కాలేదూ? అయినా వారందరూ ఏమయ్యారు? వారు సిరిని మూటకట్టుకొని వెంట తీసుకొని వెళ్ళారా? వారికి భూమి మీద ఊరూ, పేరూ ఏమైనా ఉందా? శిబి మొదలైనవారు కీర్తి కాంక్షులై యాచకుల కోర్కెలు తీర్చలేదా? వారిని ఇప్పటికిన్నీ మరచారా? ఎడతెగని యజ్ఞాలవలన గాని, తపశ్చర్య వలన కాని కనపడని మహోన్నతుడైనవాడు వామనాకృతి[3]తో వచ్చి నావంటి వానిని అర్థిస్తే అతనికి ఇష్టార్థాలు ఇవ్వడం భావ్యం కాదా? తొలుత లక్ష్మీదేవి కొప్పును గ్రహించి శరీరాన్ని స్పృశించి ఉత్తరీయాన్ని పట్టుకొని పాదకమలాలనంటి చెక్కిళ్ళను తడిమి, పాలిండ్లనంటి క్రొంగొత్త రీతుల విలసిల్లిన రమాధవుని చేయి క్రిందవటం నాచేయి పైది అవటం ఎంతటి అదృష్టం. ఈ రాజ్యం గీజ్యం శాశ్వతమా? ఈ శరీరం నిరపాయమైనదా?

---

1. ఈవీ = దానము 2. పాత్రం = అర్హుడైనవాడు. 3. వామనాకృతి = పొట్టివాడు.

కనుక ఆచార్యా! నాకు నరకం ప్రాప్తించినా, నేను బంధితుడనైనా' నా రాజ్యం సమస్తమూ నిర్మూలమై పోయినా, నేను దుర్మరణం పాలైనా, నా కులం నశించినా, ఏది ఏమైనా కానీ! ఈ అభ్యాగతులు హరి హర బ్రహ్మలైనా సరే నేను ఆడిన మాట తప్పను. అడిగినది ఇచ్చినప్పుడు విష్ణువు నన్నెందుకు బంధిస్తాడు? ఒకవేళ బంధించినా కరుణించి తనే విడిచి వేస్తాడు. విడిచి పెట్ట దంటూరా అదీ నాకు సమ్మతమే. కనుక మేరువు తలక్రిందైనా, సముద్రాలు ఇంకి పోయినా, భూమి దుమ్ము దుమ్ము అయిపోయినా, ఆకాశం బద్దలైనా నేనీ బ్రాహ్మణునకు ఇస్తానన్నది తప్పక ఇస్తాను. ఇతడెన్నడూ ఎవ్వరినీ ఏదీ యాచించలేదట! ఒఆటరివాడట! కన్నవారు అన్నదమ్ములు కూడా ఎవ్వరూ లేరట! అన్ని విద్యల రహస్యాలు తెలిసిన ప్రౌడుడట! అలాంటి ఈ చిన్ని బావడు దోసిలొగ్గి అర్థి అయి నా ఎదుట నిలబడితే త్రోసిపుచ్చటానికి నాకు ఎలా మనస్కరిస్తుంది?— అని బలి సమాధానం చెప్పేసరికి,

సత్యనిరతుడూ, దాన కుతూహలుడూ, మహా యశస్వీ, దృఢ మనస్కుడూ, సత్య సంధుడూ అయిన బలిని చూచి శుక్రుడు క్రుద్ధుడయ్యాడు. "నా శాసనం అతిక్రమించావు కనుక శీఘ్రకాలంలోనే పదభ్రష్టుడవు కాగల"వని శపించాడు. గురుశాప తప్తుడైన బలి ఆడిన మాట తప్పడానికి అభిముఖుడు కాలేదు. బ్రతికినా, చచ్చినా, ఎన్ని బాధలు వచ్చినా, లేమి తటస్థించినా, సర్వ నాశనమైనా మానధనులైనవారు ఆడిన మాట కాదనలేరు. అపుడు బలి దైత్యేంద్రుని భార్య వింధ్యావళి మద మరాళం (హంస) లాగా మంద గమనంతో భర్త కను సంజ్ఞ గ్రహించి బ్రహ్మచారి కాళ్లు కడగటానికి స్వర్ణ కలశంతో నీళ్ళు తెచ్చింది. అప్పుడు ఆ దానవేంద్రుడు కపట వటువు నుద్దేశించి- వటోత్తమా! రా. నీ వాంఛితం తీరుస్తాను. ఏవీ నీ పాదాలు? కడగాలి- అనగా విని శ్రీహరి తన పాదాన్ని చాచాడు.

బలిదైత్యేంద్రుడు తన రెండు చేతులతో శ్రీహరి పాదాన్ని నీట కడిగాడు. అలాంటి అదృష్టం ఎవరికి లభిస్తుంది? శ్రీహరి పాదం సామాన్య మైనదా! యోగులూ, దేవతలూ, అర్చించిన సంపదలను ఇచ్చేది. వంగి నమస్కరించేటప్పుడుఅంటిన రమాదేవి నుదుటి కస్తూరి బొట్టుతో శోభించేది అది. ఆ పాదం తామర పువ్వులాగా పరిమళిస్తుంది. వేదాలు ఆమె కాలి యందెలు. స్వర్గ లోకాన్ని ఉద్ధరించినది అది. అది నిత్య శుభంకరమైనది. ఉపనిషత్తులచే అలంకృతమైనది. జన్మ రాహిత్యమును కావించునది. అంతటి మహిమాన్విత మైన శ్రీహరి కుడి పాదం తొలుత కడిగి అనంతరం ఎడమ పాదం కడిగాడు. ఆ పావన జలాన్ని శిరస్సున చల్లుకొన్నాడు. ఆ పైన దేశ కాలాది పరిగణనం చేసి "బ్రాహ్మణోత్తమా! బ్రహ్మచర్య వ్రత పాలనా! విష్ణు స్వరూపా! వేద విదుడా! నేను మూడడుగుల దానం ఇస్తున్నాను' అని రాక్షసేశ్వరుడు చేయి

చాచి వడుగును పూజించి "బ్రహ్మ ప్రీతం" అని ధారా పూర్వకంగా దానం ఇచ్చాడు. బలి దాతృత్వానికి లోకాలన్నీ ఆశ్చర్యంలో మునిగి పోయాయి.

అప్పటికి శుక్రుడు ఓపలేక నీటిధార పడకుండా జల కలశం రంధ్రంలో జొరబడి అడ్డగించాడు. శ్రీహరి అది గ్రహించి దర్భాగ్రంతో ఆ రంధ్రంలో పొడిచేసరికి అది గుచ్చుకొన్ని శుక్రాచారుని కన్ను గ్రుడ్డిదయి పోయింది. దానితో అతడు ఒంటి కంటి వాడయ్యాడు. అనంతరం రమేశుడు ఇంద్ర విరోధిని గెలిచినట్టిదీ, లక్ష్మీదేవి పెనచి పట్టుకొన్నట్టిదీ, శ్రీదేవి చనుమొనల యందు ఉంచబడినట్టిదీ అయిన తన హస్తాన్ని బలి చక్రవర్తి చేతినుండి ధారగా జారిన నీళ్ళ కొరకు క్రింద పట్టి జలం గ్రహించాడు. శ్రీహరిని ఎరిగి కాలదేశాలు తెలుసుకొని శుక్రుని మాటను గ్రహించి స్వీయ నాశనం తప్పదని భావించి,యాచకుడైన వామనుడు పాత్రుడైన వాడని కాదనకుండా అతనికి దానం ఇచ్చాడు. భూమి యందు బలివంటి దాత మరి ఎవ్వడూ ఉండడు. బలి చేసిన దాన ఫలంగా కమలాక్షుడు సకలలోక నాయకుడయ్యాడు. దశ దిశలూ కలకలమని సంతోషించాయి. పంచ భూతాలు సన్నుతించాయి. భూదానం ఇచ్చేవాడున్నూ దానిని కాంక్షతో గ్రహించే వాడున్నూ పాప దూరులై నూఱు సంవత్సరాలు ఇంద్ర లోకంలో సకల భోగాలు అనుభవిస్తారని ప్రతీతి.

కనుక ఏ దానమూ భూదానంతో సమానం కాదు, కనుక నీకు భూదానం ఇచ్చాను. ఉభయ లోకాలలో కీర్తినీ. సుకృతాన్నీ పొందుమని పలుకగా ఆ మాయా వటువు- రాక్షసేంద్రా! ఇది ఏమి? ఇలా అడిగావు? అని మనస్సులో ఆలోచింపక సత్యం పాటించి ధారా పూర్వకంగా నీవు నేను కోరిన అర్థాన్ని ఇస్తే నాకు ముల్లోకాలను ఇచ్చినట్లే కాగలదు-అని మాయా వటువు పలుకగా మహానందం చెంది వైరోచనుడు (బలి) మందహాసం చేస్తూ ఈ పొట్టి వడుగు ఇట్టి బుద్ధులు పుట్టి నేర్చుకొన్నాడో? పుట్టక నేర్చాడో? తెలియదు. ఇతని పొట్టలో సకల భూములూ లేవా? అని అతనికి ధరణీ ధానం ఇచ్చాడు.

## వామనుడు విశ్వరూపం పొంది విజృంభించుట

బలి చక్రవర్తి చేసిన మహా దానానికి లోకాలన్నీ విస్మయావిష్టాలయ్యాయి. గ్రహాలు, మునీంద్రులు, సిద్ధులు, గంధర్వులు, కిన్నెరలు యక్షులు, దేవతలు, ఉరగులు సంతోషంతో పుష్ప వర్షం కురిపించారు. బలి వలన అలా ధారా పూర్వకంగా దానం గ్రహించి ఇంతవాడైన వటువు మరింతై క్రమ క్రమంగా పెరుగుతూ ఆకాశ పర్యంతం వ్యాపించాడు. మేఘ మండలాన్ని అతిక్రమించాడు. తేజో మండలాన్ని దాటాడు. అలాగే ఇంకా పెరుగుతూ చంద్ర మండలాన్ని, ధృవ మండలాన్ని, మహర్లోకాన్ని; సత్య లోకాన్ని మించాడు. తుదకు బ్రహ్మాండ భాండం అంతా నిండిపోయాడు.

ఆ వామనుడిలా పెరిగిపోతుంటే సూర్యబింబం తొలుత గొడుగులా గోచరించింది. ఇంకా పెరగ్గా పెరగ్గా శిరోరత్నంగా, కర్ణాలంకారంగా, కంఠభూషణంగా, బంగారు బాహుపురిగా, కాంతివంతమైన హస్తకంకణంగా, కటిస్థలిని ఘంటగా, కాలికి మణిమయమైన నూపురంగా, తుదకు చరణ పీఠంగా మారాడు. ఇలా శ్రీహరి త్రిగుణాత్మకమైన విశ్వరూపం ధరించేసరికి భూమి, ఆకాశం, స్వర్గం, దిశలు, దిశాచ్ఛిద్రాలు, సముద్రాలు, అఖిల ప్రాణి సముదాయాలు తానే అయి ఏకీభవించి క్రమక్రమంగా భూలోకాన్ని మించాడు. భువర్లోకాన్ని మించాడు. సువర్లోకాన్ని కడచాడు. మహర్లోకాన్ని దాటాడు. జనోలోకాన్ని మీరిపోయాడు. తపోలోకానికంటే, సత్యలోకం కంటే కూడా ఔన్నత్యం వహించాడు.

సంధులూ, మూలలూ, బిలాలూ, లేకుండా సమస్త విశ్వం నిండిపోయాడు. మహోన్నతమైన విశ్వరూపం దాల్చాడు. అప్పుడు బలి మహా విభూతి అయిన వామనుని శరీరమందు గుణత్రయాత్మకమగు సకల ప్రపంచాన్ని చూచాడు. పాదతలములందు రసాతలాన్నీ, పాదములందు భూమిన్నీ, పిక్కలయందు పర్వతాలనూ, మోకాళ్ళయందు పక్షులనూ, తొడలయందు మరుద్గణాలనూ, వస్త్రమందు సంధ్యలనూ, రహస్య ప్రదేశమందు ప్రజాపతులనూ, పిరుదులయందు రాక్షసులనూ, నాభియందు అంతరిక్షాన్నీ, కుక్షియందు సప్తసముద్రాలనూ, వక్షస్థలమందు నక్షత్ర పంక్తులనూ, హృదయాన ధర్మాన్నీ, స్తనములయందు సత్యాన్నీ, మనస్సునందు చంద్రుడ్నీ, రొమ్మునందు కమలహస్త అయిన లక్ష్మినీ, కంఠమందు సామాది సమస్త వేదాలనూ, భుజములయందు ఇంద్రాది దేవతలనూ, చెవులయందు దిక్కులనూ, తలయందు దివినీ, కేశపాశమునందు మేఘాలనూ, నాసికయందు వాయువునూ, నేత్రాలయందు సూర్యునీ, ముఖమందు అగ్నినీ, వాక్కునందు వేదాన్నీ చూచాడు.

అలాగే నాలుకయందు వరుణుని, కనుబొమ్మలయందు విధినిషేధ శాస్త్రాలనూ, కనురెప్పలందు రేయింబవళ్ళనూ, నుదుటియందు కోపాన్నీ, క్రింది పెదవియందు లోభాన్నీ, స్పర్శంబునందు కామాన్నీ, రేతస్సునందు (శుక్లం) జలాన్నీ, పృష్ఠభాగాన అధర్మాన్నీ, పాదనాశ్యములందు యజ్ఞాలనూ, నీడయందు మృత్యువునూ, నవ్వునందు మాయనూ, రోమములందు ఓషధులనూ, నాడులందు నదులనూ, గోళ్ళయందు శిలలనూ, బుద్ధియందు బ్రహ్మనూ, ఇంద్రియాలయందు ఋషిగణాలనూ - దేవగణములనూ, చూచాడు. శరీరమునందు సమస్త చరాచరాత్మకమైన ప్రాణికోటినీ కలిగి సాక్షాత్కరించిన శ్రీహరి విశ్వరూపం చూచి బలి మొదలగువారు విస్మితులైనారు.

అతని చేతుల్లో మేఘ గంభీర ధ్వనిగల శంఖం, శార్ఙమనెడి విల్లు, సుదర్శన చక్రం, కౌమోదకి అనెడి గదా, విద్యాధరమూ నందకమూ అను పేర్లుగల ఖడ్గం, చంద్రాకృతిలో నున్న డాలు, తరుగని బాణాలు గల అంబుల పొదులూ, మకర కుండలాలూ, కిరీటం, బాహుపురులూ, హస్త కంకణాలూ, కౌస్తుభం, మొలనూలూ, వనమాలికా మొదలైన ఆభరణాల్లతో కనులకు మిరుమిట్లు గొలుపుతున్నాడు. సునందుడూ, నందుడూ, జయుడూ, విజయుడూ మొదలైన పరిచర సమూహం చుట్టూ చేరిసి కొలవగా శ్రేష్ఠో విరాజితుడై బ్రహ్మాండం అంతా తన మేని కప్పుకాగా శ్రీహరి విజృంభించాడు.

ఒక పాదంతో భూమిని కప్పాడు . వేరొక పాదంతో స్వర్గాన్ని నిరోధించాడు. మరొకపాదంతో ఊర్ధ్వ లోకాలన్నింటినీ ఒక్కొక్కటిగా లంఘించాడు. అనంతరం బ్రహ్మాండం పెట్టక అది పెటిలి నిప్పులు క్రక్కుతూ ఒక్కడై వాక్కునకు గానీ, దృక్కునకు గానీ లభింపరానివాడై శ్రీహరి ప్రకాశించాడు. ఒక పాదం క్రిందనున్న భూమి పద్మాన్ని అంటుకొన్న బురదతో ఎంతో శోభించగా, మరొక పాదం పైన ఉన్న ఆకాశమందు ఒదిగిన తుమ్మెదలాగా శోభవహించింది. ఆ రీతిగా లోకాలన్నింటినీ దాటి నమున్నతుడైన త్రివిక్రముని వెన్నెలలవంటి కాళ్ళ గోటి కాంతుల ముందు సూర్యకాంతి ముందు దివియలాగా బ్రహ్మదేవుని తేజస్సు క్షీణించిపోయింది.

సంసార బంధాలు విడిచి బ్రహ్మలోకంలో స్థిరపడిన మరీచీ మొదలగు రాజులూ, సనందాది దివ్య యోగీంద్రులూ, మూర్తిమంతాలై నిరంతరం ధ్వనించెడి పురాణాలూ, తర్కశాస్త్రాలూ, వేదాలూ, ఇతిహాస ధర్మ సంహితలూ గురూపదేశం చేత లభించిన జ్ఞానాగ్నియందు దగ్ధకర్ములై వచ్చి శ్రీహరి పాదాలకు నమస్కరించారు. తమ హృదయాంతరాళమందు నిరంతరం స్మరించెడి నిధిని కళ్ళారా చూచాం. మా జన్మ సార్థకమైంది"- అని భావించారు.

శ్రీహరి పాదం బ్రహ్మకు పుట్టిల్లు. ఆ పాదమే ఇపుడు తన లోకంలోనే తన ఇంటి ముంగిటనే దృగ్గోచరమయ్యే సరికి బ్రహ్మదేవుడు సంతోషంతో పరవశించి పోయాడు. కమండలు జలంతో ఆ పాదం కడిగి నలువైపులా జల్లాడు. ఆ జలం ఆకాశ వీధిని ప్రవహించి దేవనది అయింది. అప్పుడు బ్రహ్మ మొదలైన లోకపాలకులందరూ యోగ మార్గంతో విష్ణుమాయ నూహించి పుష్ప ధామాలతో పూజించారు. దివ్య గంధం సమర్పించారు. దూప దీపాలిచ్చారు. లాజలు (పేలాలు) అక్షతలూ చల్లారు. పండ్లు కానుక పెట్టారు. రాగ యుక్తంగా పొగిడారు. శంఖాలు పూరించారు. "కరుణా సముద్రుడా త్రివిక్రమా!" అని అంటూ జయ జయధ్వానాలు చేశారు. అప్పుడు జాంబవంతుడు వచ్చి భేరి మ్రోగిస్తూ విష్ణు విజయ గాథను దశ దిశలా చాటాడు. యాగశాలలోని సభ్యులూ, యాగ కర్త బలి చక్రవర్తి కూడా

లోకాలన్నీ నిండి చూపులకూ, మనస్సునకు అందకుండా ఉన్న జగన్నాథుని సన్నుతించారు.

అప్పుడు రాక్షసులు ఇంకనూ వామనాకారంతోనే ఉన్న హరిని చూచి- "ఇతడూ పాదత్రయ వ్యాజంతో (వంకతో) సమస్త మహీమండలాన్నీ ఆక్రమించాడు. దానవేంద్రుడు సత్యసంధుడు కావున ఇతడు కపట రూపంలో ఉన్న విష్ణువని ఎరుగక మాటతప్పకుండా, అతడు కోరిందిచ్చాడు. బలి వలన నేరంలేదు. ఈ వామనుడే మహాతేజంతో బలి ఎడల వైరభావం వహించి ముల్లోకాలనూ ఇంద్రాదులకు ఇవ్వాలని చూస్తున్నాడు కనుక ఈ బ్రహ్మణ వటువును పాఱిపోనియక జయించటం మనకర్తవ్యం"- అని గర్జిస్తూ, బెదరిస్తూ పూర్వం ఇంద్రాదులను మరుత్తులను జయించిన హేతి, ప్రహేతి, విప్రచిత్తి, మొదలైన రాక్షస వీరులనేకులు మదోద్ధతులై యుద్ధానికి సన్నద్ధులయ్యారు. గొడ్డళ్ళూ, అడ్డకత్తులూ, బల్లెములూ మొదలైనరణసాధనాలు ధరించి విజృంభించారు. దశదిశలూ మునరికొని రణోద్యుతు లయ్యారు.

అది చూచి సునందుడూ, నందుడూ, జయుడూ, విజయుడూ, జయంతుడూ, ప్రబలుడూ, ఉద్భటుడూ, కుముదుడూ, కుముదాక్షుడూ, తార్క్ష్యుడూ, పుష్పదంతుడూ, విష్వక్సేనుడూ, స్వతదేవుడూ, సాత్వతుడూ మొదలైన దండనాథులు పదివేలమంది మదేభాల్లాంటి వీరయోధులను ఆయుధాలతో కూర్చుకొని రణరంగంలో రాక్షస సమూహాన్ని వధింప దలచి ఎదుర్కొని రణరంగంలో వీరవిహారం చేయటం చూచి రాక్షసేశుడైన బలి, శుక్రాచార్యుల శాపాన్ని మనస్సులో భావించి ఇలా అన్నాడు.

'రాక్షస వీరులారా! పోరాటం తగదు. తిరిగి రండి. కలహానికి మనకిది తగిన సమయం కాదు. సర్వభూతాలకూ, సంపదాపదలకు ప్రభువైన దైవం మనకు అనుకూలించనప్పుడు మనం యుద్ధం చేయలేం. పూర్వం మనకు రాజ్యాన్నీ, దేవతలకు నాశాన్ని కల్పించి ఈనాడు అందుకు విరుద్ధంగా చేస్తూన్న దైవాన్ని మనం ఏమనగలం? మనపాలి భాగ్యం ఇంతే అనుకోవాలి. పూర్వం అనేక పర్యాయాలు మనకు వెరచి రణభూమినుండి పాఱిపోయిన విష్ణు భటులు మిమ్మల్ని తరిమి తరిమి కొట్టడం దైవప్రభావం చేత కాదా? కనుక మనకు దైవం అనుకూలించి నప్పుడు దేవతలను ఎదుర్కొని జయిద్దాం. ఇప్పుడు వద్దు. అదీకాక అనేక దుర్గాలు, బలాలు, మంత్రౌషధాలు, బుద్ధిబలం, మంత్రిత్వం ఉన్నా రాజైనవాడు కాలపరిస్థితి తెలుసుకొని సామోపాయంతో పోరాడతగును. కనుక శత్రువులకు ఇప్పుడు ఎదురు మోహరించటం కార్యం కాదు. అనుకూలసమయం వచ్చినపుడు మనకు జయం కరగతం కాగలదు. కనుక ఇప్పుడు మీరు కోపింపక తొలగండి"- అనేసరికి దేవభటులు తరుమగా రక్కసులు రసాతలానికి వెళ్ళారు.

అప్పుడు శ్రీహరి హృదయం గ్రహించి గరుత్మంతుడు యోగమద్యంలో వారుణపాశంతో అసురవల్లభుడైన బలిని బంధించాడు. అలా అతని చేతులూ, కాళ్ళూ కట్టివేసే నరికి 'శ్రీహరి కృప కాక నే నేమి చేయగలను.". అని సందేహించ కుండా బలి నిశ్చలంగా ఉన్నాడు అప్పుడు దిగ్దిగంతాలలో హాహారావాలు బయలుదేరాయి. తన సర్వసంపదలూ చెడినా బలిచక్రవర్తి దైన్యం చెందలేదు చలనం పొందలేదు. పూర్వంకంటే కూడా పెంపూ, తెంపూ, జ్ఞానం, ధైర్యం వహించటం చూచి వామను డిలా అన్నాడు.

దానవేంద్రా! నాకు నీవు మూడడుగుల మేర ఇస్తానన్నావు. సూర్య చంద్రులెందాకా ప్రసరిస్తారో అందాకాగల నీ భూమి, అంతా నాకు ఒక్క అడుగైంది. సురలోకం ఒక చరణం అయింది. కనుక నీ రాజ్యం, సమస్తం నాకు రెండడుగులు మాత్రమే అయినది. మిగిలిన మూడవ పాదానికి చోటు ఏదీ? ఇచ్చెదనన్న అర్థం ఈయని దురాత్మునికి నరకం తప్పదు. కాన ఇప్పుడు నీవు నా మూడవ పాదానికి తావు చూపించు. బ్రాహ్మణులకు వశమైన వాటిని త్రోసివేయటం బ్రహ్మదేవునికి కూడా సాధ్యంకాదు అని వామనుడు అనగా బలి సత్యభంగం కల్గుతుందేమో అని సందేహించాడు. ఆ సందేహమును విషదిగ్ధ బాణంతో అతని హృదయం చెదిరింది అయినా అతను ధైర్యం వహించాడు; దుఃఖితుడు కాలేదు.

ప్రసన్న వదనంతో మిక్కిలి దిట్ట అయిన ఆ పొట్టి వడుగునకు- "ఏ స్థితిలోనూ నా నాల్క సత్య వాక్కునే వల్కుతుంది. నేను ఎన్నడూ బొంకను నీ మూడవ పాదాన్ని నీవు నా శిరస్సునందు ఉంచు నేను అసత్యానికి భయ పడతాను కాని నరకానికి కానీ, నిగ్రహానికి కానీ, అధికార హీనతకు కానీ, బంధనానికి కానీ, సంపన్నాశానికి గానీ, దుఃఖానికి కానీ భయపడను. దేవా, తల్లిం తండ్రులు కానీ, అన్నదమ్ములు కానీ, చెలికాండ్రు కానీ, గురువులు కానీ దండించినంత మాత్రాన వచ్చెడి కొరత ఏదీలేదు. పిదప కాలక్రమంలో దాని వలన మేలే కల్గుతుంది. మదాంధులైన దానవులకు సమయం కనిపెట్టి జ్ఞాన నేత్రాన్ని ప్రసాదించటంచేత గురువులలో నీవు ఆది గురువవు. నీవు బంధించినా, నిగ్రహించినా, బాధించినా, ద్రవ్యనాశనం కల్పించినా, నవ్వుల పాలు చేసినా పూర్వం నిన్ను ఎదిరించి పోరాడి రాక్షసులు మహాయోగీంద్రులు పొందెడి పదవిని పొందలేదా? అలాంటి వైరభక్తులందరినీ నీవు అనుగ్రహించ లేదూ? నీ ఎడల దుర్లభమైనది ఏమి ఉంటుంది? మృత్యువు ఎవరికీ మిత్రం కాదు. యముడు చుట్టంకాదు. కింకరులు సేవార్థులు కారు. బ్రహ్మ ఎవరినీ శిలలతో సృజించలేదు. కనుక ఈ జీవం దృఢం కాదు. ఎప్పటికైనా చలించి నశించేదే. ఈ కపట సంసారాన్ని మూఢుడు సత్యాన్ని, దానాన్ని, కరుణనూ, ధర్మాన్ని విడిచి నిక్కమని భావిస్తాడు.

"చుట్టాలు దొంగలు. సుతులు ఋణస్థులు. కాంతలు సంసార కారణాలు. ధనం అస్థిరం. శరీరం చంచలం. కార్యార్థులు అన్యులు. కాలం, ఆయువూ, ఐశ్వర్యం అతి శీఘ్రకాలంలో నశిస్తాయి." అని తన తండ్రిని తిరస్కరించి సాధుసమ్మతుడైన మా తాత ప్రహ్లాదుడు నీ పాద కమలాలు ఆశ్రయించాడు. అతనికి మృతిలేని శాశ్వతమైన బ్రతుకు కల్గింది. రాక్షసులు నీతో వైరభావం వహించారే కాని నీ ప్రభావం ఎరుగరు. నీవు స్వయంగా వచ్చి నన్ను యాచించటం నా పుణ్యఫలం - అని రాక్షసేంద్రుడు పలుకుచున్న సమయంలో అచ్చటికి ప్రహ్లాదుడు వచ్చాడు.

ప్రహ్లాదుని వక్షస్థలం విశాలంగా, సమున్నతంగా ఉంది. నేత్రాలు క్రొందామరల్లాగా ఉన్నాయి. పసుపు వన్నెగల పట్టుబట్టను ధరించాడు. అతడు సంసారాన్ని ఛేధించిన మహానుభావుడు, మహాభక్తుడు, దుఃఖరహితుడు. మహాజ్ఞాని. అలా వచ్చిన తన తాతను బలి చూచాడు. వారుణపాశం చేత బద్ధుడై ఉండటం వలన అతనికి నమస్కారం చేయలేక పోయాడు కనులలో నీళ్ళు గిఱ్ఱున తిరిగాయి. సిగ్గుపడ్డాడు. తలవంచి వినయంగా మ్రొక్కు చెల్లించాడు. అప్పుడు ప్రహ్లాదుడు యజ్ఞమండపంలో తన పార్షదులతో కూడి కూర్చున్న వామనుని చూచి పులకాంకితుడై ఆనందభాష్పాలు రాలుస్తూ దండ ప్రణామం చేసి ఇలా విన్నవించాడు.

పరమేశ్వరా! ఇతనికి నీవు పూర్వం ఇంద్ర పదవినిచ్చి నేడు మరలించటం వలన ఇతనికి మేలే చేశావు. అధికారం మోహానికీ అహంకారానికీ మూలం. అది గర్వాంధకారాన్ని పెంచుతుంది. ఇప్పుడు నీవు ఈతనిని బంధించటం కరుణతో రక్షించటమే కానీ మరేమీ కాదు తత్వజ్ఞునకు మహేంద్రత్వం ఎందుకూ? సురరాజ్యభోగం నీ చరణ కమలసేవతో సాటి రాదు. అధిపత్యం వలన గర్వమతిశయించి కన్నులు కానరావు. చెవులు వినరావు. మనస్సు చిక్కువడుతుంది. నీ సేవలను మరపింప చేస్తుంది. నీ మహిమను తెలుసుకోనీయదు. కనుక నీవు నీ ప్రతిభను చూపించి ఇతనికి (బలికి) మేలే చేశావు - అని వల్కి జగదీశ్వరుడూ, నిఖిలలోక సాక్షీ అయిన నారాయణ దేవునకు ప్రహ్లాదుడు నమస్కరించి నిలబడి ఉండగా పతిభిక్ష నర్థించి అచటికి వింధ్యావళి వచ్చింది.

ఆమె నడక మదగజయానంలాగా ఉంది. ఆమె నిట్టూర్పులకు ఉటికిన ఆమె పాలిండ్లు రవికెను ఉత్తరీయాన్ని అద్దుకొంటున్నాయి. ఆమె కనుల వెంట శోక బాష్పాలు కురుస్తున్నాయి. చేతులతో ముఖం కప్పుకొని వుంది. ఆమె అలావచ్చి జగద్రక్షకుడైన వామనుని "మృదు హృదయుడా! నాకు పతిభిక్ష పెట్టుమని" అర్థించి దేవా! నీకు ఈ లోకాలు క్రీడార్థాలు. మతిహీనులైన లోకులు అజ్ఞాన వశంచేత తాము లోకాధీశులమనుకొంటారు. కానీ

వాస్తవంగా సకలలోకాలకూ అధిపతి అయినవాడవు నీవే. రమాధవా! ఆశ్రిత మందారా! నా భర్త నిన్ను కాదనలేదే? నీవు అడిగినది ఇవ్వకుండా పొమ్మన లేదే? తన అధీనంలోని జగత్త్రయం నీకు ఇచ్చివేశాడే. అలాంటప్పుడు నీవు నా భర్తను బంధించటం న్యాయమా? అని అడుగుతూండగా బ్రహ్మదేవుడచటికి వచ్చి ఇలా అన్నాడు.

లోకేశ్వరా! భూతభావనా! దేవా! జగన్నాధా. దేవవంద్యా! బలిచక్రవర్తి మహాదాత. అతడు తన సంపద సమస్తం మారుమాట్లాడక నీకు ఇచ్చాడు. అతడు దండయోగ్యుడు కాదు. కరుణింప దగ్గవాడు. కనుక నీవు ఇతనికి బంధవిముక్తి కల్పించి ఇతని భయాన్ని తీర్చు. నీకుచల్లి దర్భాంకురాలతో నీ పాదాలర్చించే భక్తుడు లోకేశ్వర పదం పొందగలడు. నీవు ప్రత్యక్షంగా వచ్చి వేడగా తెలిసికూడా తన రాజ్యమంతా నీకు దానంగా ఇచ్చిన బలికి పాశబంధం తగునా? అని పల్కిన బ్రహ్మకు భగవంతుడు ఇలా అన్నాడు.

చతురాననా! నేను ఎవనిని కరుణింపగోరుతానో వాని సమస్త సంపదనూ హరిస్తాను. సంసార మదంచేత మూఢుడై ఎవ్వడు లోకాన్ని తెగడి నన్ను ధిక్కరిస్తాడో అతడెల్లకాలం అఖిలయోనుల్లో పుట్టుతూ దుర్గతి పాలవుతాడు. ఆ తరువాత-విత్తం, వయస్సు, రూపం, విద్య, బలం, ఐశ్వర్యం, కర్మ జన్మములూ-వలని గర్వాన్ని పోగొట్టి దుర్బలుడై ఎవ్వడుంటాడో వాడు నాకు ప్రియుడు. రక్షింప తగ్గవాడు. నా యందు ఆసక్తి కలవాడు లోభం చేతన్నూ, అభిమానంచేతన్నూ, సంసార వైభవంచేతన్నూ మత్తుడైనా చెడడు. ఇతడు సామాన్యుడు కాదు. గురుశాప తప్తుడయ్యాడు. వరుణపాశంచే బంధింపబడ్డాడు. బంధువు జనంచే విడిచిపెట్టబడ్డాడు. చేతికి లభించిన ఐశ్వర్యాన్ని వైభవాన్ని కోల్పోయాడు. నిరుపేద అయ్యాడు. అయినా మహాజ్ఞాని ఒక దయా సత్యాలను విడువక జయింపనలవికాని మాయను గెలిచాడు.

దనుజ నాధుడైన ఈతని సౌజన్యాన్ని పరీక్షించటానికే ఇలా చేశాను. ఇతడు నిజం పలికాడు. ఇతనిలో మాలిన్యం ఏమీ లేదు ఇతడు నా ప్రసన్నతకు పాత్రుడు. సావర్ణి మనువు కాలంలో ఇతడు దేవేంద్రుడవుతా. దేవతలకు కూడా భావింపనలవికాని నా లోకానికి తప్పిస్తాను. అప్పుడు ఈత ) రక్షిస్తాను. వ్యాధులూ, తప్పులూ, ఒప్పులూ, బాధలు లేకుండా విశ్వకర్మచే సంభావితమై దనుజ సేవితమైన సుతలంలో అందాకా ఇతడు మహా వైభవంతో ఉంటాడు— అని పల్కి పరమేశ్వరుడు బలిని చూచి ఇలా అన్నాడు.

రాక్షసేంద్రా! నీ సేనా వాహిని క్షేమంగా ఉంటుంది. భయపడకు. నీ వితరణం (దానం) సాటి లేనిది దేవతలు స్వర్గంలో ఉండాలని వేడుక

పడుతున్నారు. అచటనున్నవారికి దుఃఖాలు, కష్టాలు, దుర్మరణాలు పొందవు. నీవు సుతలంలో ఉండు. నీ ఆజ్ఞను ధిక్కరించెడి రాక్షసులను నా చక్రం వధిస్తుంది. అక్కడ నీపై లోక పాలకులెవ్వరి ఆధిపత్యం ఉండదు. ఇక ఇతరులు నిన్నేమి చేయగలరు? నేను ఎల్ల వేళలా నిన్ను రక్షిస్తాను. కరుణతో దర్శనం ఇస్తాను. దైత్య, దానవుల ఉభయుల లక్షణాలతో కూడిన నీ అసుర భావం నీవు నన్ను ధ్యానించుట చేత తొలగి పోతుంది. కనుక నీవు నా ఆజ్ఞానుసారంగా సుతలంలో ఉండు - అని శ్రీహరి అన్నాడు.

చెలకు రసంలా తీయని ఆ దేవ దేవుని వాక్కులు వీనుల విందు కాగా రెప్పలు పైకెత్తి ఆనంద పారవశ్యంతో బలి కన్నీరు కార్చాడు. శరీరం గగుర్పొడిచింది. చేతులు మోడ్చి సంభ్రమ పాటుతో ఆ రాక్షస రాజు మృదు మధురంగా ఇలా అన్నాడు.

శేష శయనా! నీవు ఎన్నడూ లోక పాలకులనుకూడా ఇంతటి కృపతో చూడవు. ఈనాడు నీవు నన్ను సమున్నతునిగా చేసి నా జీవిత వైభవాన్ని వ్యక్తం చేశావు. నన్ను రక్షించావు. ఈ మన్ననా, ఈ దయా రసం, ఈ మాటల పెద్దరికం నాకు చాలు. నిన్నెరిగి నిన్ను ఆశ్రయించిన వానికి ఏ ఆపదలూ కలుగవు - అని పలికి హరికీ, బ్రహ్మకూ నమస్కరించి బంధ విముక్తుడై తన పరివారంతో కూడి సుతలానికి వెళ్ళాడు. శ్రీహరి కరుణచేత కృతార్థుడై కులోద్ధారకుడైన మనుమని చూచి ఆనందించి ప్రహ్లాదుడు భగవంతునికిలా అన్నాడు.

చతుర్ముఖునకు, ఈశ్వరునకు కూడా ఇంతటి సంపద్వైభవాలు లేవు. ఇక అన్యులకి ఎక్కడివి? బ్రహ్మాదులచే పూజింపబడు చరణ కమలాలు గల నీవు దుర్లభుడవు. బ్రహ్మాదులు నీ పాద పద్మ మకరంద సేవ వలన మహా మహిమనూ, ఐశ్వర్యాన్నీ పొందగల్గారు. మేము అల్ప మతులం. దుష్ట యోనుల్లో జన్మించిన వారం. దురాత్ములం. నీ కృపా దృష్టికి మేము ఎంతటి తపస్సు చేశామో! తెలియదు. మాలాంటి వారిని, నీవు రక్షించటం విచిత్రమే! అదీగాక నీవు సర్వ గతుడవు, సమ దర్శనుడవు, అయుండిన్నీ, ఒక్కొక్కప్పుడు విషమ వృత్తి వహిస్తావు. నీవు భక్తుల కోర్కెలు కల్పతరువు లాగా తీరుస్తావు-

అని విన్నవించిన ప్రహ్లాదుని చూచి పరమపురుషుడిలా అన్నాడు. "వత్సా! ప్రహ్లాదా! మంచిది. నీవు, నీవారు నీమనుమని తోడ్కొని సుతలానికి పయనమై వెళ్ళండి. నేను గదా పాణినై మిమ్మల్ని రక్షిస్తూ ఉంటాను. మీకు అక్కడ ఏ పాపాలు అంటవు-అని ఆజ్ఞాపించిన పరమేశ్వరునకు నమస్కరించి ప్రదక్షిణం చేసి ఫాలమందు చేతులొగ్గి వీడ్కొని ప్రహ్లాదుడు బలిని వెంట పెట్టుకొని సకల రాక్షస సమూహంతో ఒక మహా బిల ద్వారంలో చొచ్చి సుతల లోకానికి వెళ్ళాడు.

అనంతరం బ్రహ్మవాదులైన యాజకుల మధ్య కూర్చున్న శుక్రుని చూచి శ్రీమన్నారాయణుడు- ఆచార్యా! బలి తలపెట్టిన యజ్ఞంలో కొరతను నీవు పూర్తి చేయి. విషమమైన కర్మజాలం బ్రాహ్మణులు చూచినంత మాత్రముననే సమత్వాన్ని పొందుతుంది- అనేసరికి శుక్రాచార్యుడు ఇలా అన్నాడు.

దేవ దేవా! నీవు సమస్త కర్మలకూ అధిపతివి. నీవు యజ్ఞేశుడవు. యజ్ఞ పురుషుడవు. నీవు స్వయంగా సంతుష్టి చెందినపుడు ఏ కర్మకైనా కొరత ఏముంటుంది? దేశ కాలార్హాలైన తంత్రాల్లోనూ, మంత్రాల్లోనూ కొరత లేమైనా ఉంటే అవి నిన్ను స్మరించినంత మాత్రం చేతనే తీరిపోతాయి. అయినా నీ ఆదేశానుసారం యజ్ఞ శేషాన్ని నిర్వర్తిస్తాను. నీ ఆజ్ఞానుసారం మెలగటం ఎవరికైనా శ్రేయస్కరమే. ఇంతకంటే నాకు శుభం ఏముంటుంది? అని శ్రీహరి ఆనతి శిరసావహించి శుక్రుడు బలి యజ్ఞాన్ని పూర్తి చేశాడు మునులూ, బ్రాహ్మణులూ కూడ ఈ కార్య నిర్వహణంలో ఎంతో సహాయ పడ్డారు.

ఈ విధంగా శ్రీహరి వామనుడై బలిని యాచించి భూమిని గ్రహించి తనకు అగ్రజుడైన దేవేంద్రునకు స్వర్గరాజ్యం ఇచ్చాడు. అప్పుడు దక్షుడూ, భృగువూ మొదలైన ప్రజాపతులనూ, శివుడూ కుమారుడూ, దేవర్షి గణాల్నూ, రాజులూ, తానునూ కలిసి చతుర్ముఖుడు అదితి కశ్యపులకు సంతోషం కల్గు నట్లుగా లోకాలకూ, లోకపాలకులకూ వామనుని అధిపతిగా నియమించాడు. ధర్మానికీ, యశస్సుకూ, లక్ష్మికీ, శుభాలకూ, దేవతలకూ, వేదాలకూ, వ్రతాలకూ, స్వర్గ మోక్షాలకూ ఉపేంద్రుడు ప్రధానుడు కాగలడని నిర్ణయించాడు. అనంతరం బ్రహ్మాది లోకపాలకులు దేవేంద్రునితో కూడి వామనుని దేవ యానం మీద స్వర్గలోకానికి తీసికొని వెళ్ళారు. ఈ విధంగా శ్రీహరి సహాయంతో ఇంద్రునికి తిరిగి ఇంద్రపదవి లభించింది. బలవంతుడైన తమ్ము డున్నప్పుడు అన్ని కోరికలు కొరత లేకుండా తీరటంలో ఆశ్చర్యం ఏముంది?

అదితి కడపటి చూలైన వామనుడు ఈ రీతిగా బలిని యాచించి తెచ్చిన రాజ్యంలో భాగమిమ్మని అడుగడు సమస్తం ఇంద్రునికే ఇచ్చాడు. వామను నకు సాటి ఎవ్వరు కాగలరు? కడుపు పగిలేలాగా కొడుకులనేకమంది కనే దాని కంటే తల్లికి బలాఢ్యుడైన కొడుకు ఒకడు చాలు. అదితి ఎందరో దేవత లను కన్నది. కానీ ఏమి ప్రయోజనం? తనకు కడుపు తీరేలాగా వామను డైన మేటి కొడుకుని కని జన్మ సార్థకం చేసుకొన్నది. దేవేంద్రుడు కొంత కాలానికి వామనపాలితమైన త్రిలోక సామ్రాజ్య విభవాన్ని తిరిగి గ్రహించాడు. అపుడు బ్రహ్మ శివుడూ, కుమారుడూ, భృగువూ మొదలగు మునులూ, పితృ దేవతలూ దక్షుడూ మొదలైన ప్రజాపతులూ, సిద్ధులూ, వైమానికులూ ఇంకను

తక్కిన వారలు పరమాద్భుతమైన వామనుని చేష్టలకు ఆశ్చర్యం పొంది స్తుతిస్తూ, నర్తిస్తూ, పాడుతూ తమ తమ నివాసాలకు వెళ్ళిపోయారు—అని పలికి శుకుడు ఇంకా ఇలా చెప్పటం మొదలు పెట్టాడు.

పరీక్షిన్నరేంద్రా! త్రివిక్రముని మహిమలను తెలుసుకొనటానికి గానీ, తర్కించటానికి గానీ, లెక్కించటానికి గానీ, ఎవ్వడూ సమర్థుడు కాదు. భూమి యొక్క రేణుకణాలు లెక్కింప గలవాడు కూడా ఆ పని చేయలేడు. మిగిలినవారికి సాధ్యం అవుతుందా? అద్భుత పరాక్రమడైన శ్రీహరి దివ్య చరితమును వినేవాడు మహాపరాక్రమశాలి అయి తుదకు ఉత్తమ గతులు పొందగలడు. మనుష్య కర్మములందుగానీ, పితృ దేవతలకు సంబంధించిన నిత్య నైమిత్తికములందుగానీ, దైవకార్యములందుగానీ త్రివిక్రముని పరాక్రమ గాథ కీర్తిస్తే నిత్యశోభ్యాలు లభిస్తాయి. మూఢులై స్వర్గాన్ని కోల్పోయిన దేవతలనూ, దేవేంద్రునీ రక్షించటానికి వామనుడై వైరోచనిని (బలిని) పాద త్రయం మేర యాచించి రెండడుగులు చాచి సమస్త విశ్వం ఆక్రమించి మహానందపడిన వామనునకు నేనెల్ల వేళలా నమస్కరిస్తాను అని శుక మహర్షి వామనావతార చరిత్రను పరీక్షిత్తునకు చెప్పాడని సూతుడు మునులకు చెప్పగా విని వారతనికి ఇలా అన్నారు.

## మత్స్యావతార కథా ప్రారంభం

మహాత్మా! శ్రీహరి మత్స్యావతారం ధరించిన వృత్తాంతం వినాలని మాకు కుతూహలంగా ఉంది. కర్మబద్ధుడులాగా ఈశ్వరుడు లోకనిందితమూ, తమోగుణ నిలయమూ అయిన మత్స్యరూపం ఎందుకు ధరించాడో! ఎక్కడ వర్తించాడో! ఏమి చేశాడో! అవతారాల్లో తొలి అవతారమైన మీన రూపానికి కారణం ఏమిటో, కార్యాంశం ఏదో చెప్పటానికి నీవు సమర్థుడవు. దేవదేవుని చరితం సకల లోకాలకూ సౌభాగ్యప్రదం కాదా! కనుక ఆ అవతార ఘట్టాలన్నీ మాకు సవిస్తరంగా చెప్పు - అని ముని జనులు సూత మహర్షిని అడిగే సరికి అతడు మునీంద్రులారా!మీరడిగిన ఈ విషయాన్నే పరీక్షిన్నరేంద్రుడూ అడుగగా భగవంతుడైన శుక మహర్షి ఇలా అన్నాడు.

రాజేంద్రా! గోవులనూ, బ్రాహ్మణులనూ, దేవతలనూ, సాధువులనూ, వేదములనూ, ధర్మ మర్యాదలనూ, రక్షింపగోరి భగవంతుడు మత్స్యావతారం మొదలైన అవతారాలు ధరిస్తున్నాడు. అతడు ప్రాకృత గుణాలుకాక కేవలం కళ్యాణ గుణాలు మాత్రమే కలవాడగుటచేత పెద్దవీ, చిన్నవీ అయిన భూతము లందు గాలివలే వ్యాపిస్తూన్నా, ఆ యా భూతముల ఉచ్చత్వ నీచత్వాలు అతనికి సంభవింపవు. ఎక్కువ తక్కువలు లేక ఎప్పుడూ గుణ రహితంగానే ఉంటాడు.

గురుత్వంకానీ, లఘుత్వంగానీ గుణసాంగత్యం చేతనే లభిస్తుంది. అందుచేత శ్రీహరి మత్స్యావతారం ధరించటంలో వింత ఏమిన్నీ లేదు. గడచిన కల్పాంతమందు ద్రవిళ దేశపు రాజైన సత్యవ్రతు డనువాడు ఒక ఏటిగట్టున నుండి కేవలం జలభక్షణం చేస్తూ నిష్ఠతో దారుణ తపస్సు చేశాడు. ఒకనాడు ఆ రాజు కృతమాలిక అను ఏటిలో హరి సమర్పణంగా జలతర్పణం చేస్తూండగా అతని దోసిట నొక చేపపిల్ల వచ్చేసరికి ఉలికిపడి దానిని మళ్ళీ నదీజలంలో విడిచిపెట్టాడు. అప్పుడా చేపపిల్ల రాజేంద్రునితో ఇలా అన్నది.

"దయాసముద్రుడా! చేపపిల్లలమైన మమ్మల్ని పెద్ద చేపలు తినటం పరిపాటి. అదీగాక ఒక్కొక్కప్పుడు మేముజాలరుల వలల్లోపడి మృతి చెందటం కూడా కద్దు. అందుచేత నేను అక్కడ ఉండకుండా నీవు రక్షిస్తావని నీ దోసిటిలో వచ్చిపడ్డాను. అలాంటప్పుడు నీవు నన్ను తిరిగి నట్టేట త్రోయటం న్యాయమా? జాలర్లు వేటకి వచ్చి ఏటిని కలచి చేపల నెక్కడికీ పోనీయకుండా పట్టుకొంటారు. అప్పుడు నేను ఎక్కడకు పోగలను? పెద్ద చేపలు తిననైనా తింటాయి. దుష్టులైన జాలరుల చేతుల్లో పడనైనా పడతాను. కనుక దీనవత్సలా! నన్ను రక్షించు. శక్తిహీనులను రక్షించటం కంటే ఉత్తమ కార్యం ఏమి ఉంటుంది?'

అనగా విని కరుణాంతరంగుడైన ఆ ద్రవిళదేశాధీశుడు ఆ చేపపిల్లను తన కమండలు జలంలో పెట్టి తన నిలయానికి తీసుకొని వెళ్ళాడు. అప్పుడా చేప ఒక రాత్రియందే కమండలువునకు సరిపడ పెరిగి తానుండటానికి చోటు చాలక-రాజేంద్రా! నేనుండటానికి ఈ కమండలువు చాలటం లేదు. ఇంకేదైనా తీసుకొనిరా! అనేసరికి—రాజు దానిని తెచ్చి ఒక జలకలశంలో పడేశాడు. కాని ముహూర్తకాలంలో మూడు చేతుల పొడవుగల ఆ జలకలశం కూడా నిండి ఆ చేప నరేంద్రుని మరొక పెద్ద పాత్ర తెమ్మంది. అప్పుడు కరుణామయుడైన ఆ ధరాపాలకుడు చేపను ఒక చిన్న మడుగులో ఉంచాడు.

కొంత సేపటికి ఆ చేప దానికి సరిపడ పెరిగి-రాజా! ఈ సరోవర్ణం నేను స్వేచ్ఛగా ఉండటానికి చాలటం లేదు. కనుక నన్ను తీసుకొనిపోయి ఇంతకంటే పెద్దదీ అక్షయజలం కలదీ, అయిన ఒక మడుగులో ఉంచమని అర్థించేసరికి ఆ జనపాలకుడు దానిని ఒక మహాసముద్రంలో విడిచాడు. అప్పుడది నరపాలకా! ఈ సముద్రంనిండా మొసళ్ళుంటాయి. అవి నన్ను ముసరుకొని మ్రింగగలవు. ఇంతకాలమూ రక్షించి నన్ను తుదకు ఈ మకరాలయంలో (సముద్రంలో) దిగవిడచిపెట్టటం న్యాయమా? కనుక నన్ను వెలికి తీసి ఇంకెక్కడైనా ఆశ్రయం కల్పించు - అని ఆ మహామీనం అర్థించేసరికి పుడమిఱేడు ఇలా అన్నాడు. మత్స్యేంద్రమా! నీవు ఒకరోజునే నూరు యోజనాలు పెరిగావు. నీలాంటి చేపను ఎప్పుడూ చూడం, ఎరుగం. మత్స్య

జాతికి ఇంతటి మహత్తరమైన శరీరం ఉంటుందా! నీ వెవ్వరవు? నన్ను ఎందుకిలా మోహింప చేస్తున్నావు? కరుణతో ఆపన్నులను రక్షింపగోరి జలచరమైన నీవు సాక్షాత్తు శ్రీహరివి. ఇప్పుడు నాకు తెలిసినది. నీవు అవ్యయుడవైన శ్రీమన్నారాయణుడవు. లోకముల సృష్టి స్థితి సంహారాలకు కారకుడవు.

దీనులకూ, భక్తులకూ నీవే దిక్కు. నీ లీలావతారం సమస్తప్రాణికోటికి శ్రేయోహేతువు. నీకు నా నమస్కారం. మేము అజ్ఞాన సంగతులం. ఇతరులం కాదు. కనుకనే నీవు మా పాలనున్నావు. భక్తస్థితుడవైన నిన్ను సేవించెడి వానికి నాశంలేదు. లక్ష్మీదేవి వక్షస్థలం మీద నిరంతరం క్రీడించెడివాడవైన నీవు తామసరూపమైన మత్స్యం కావటానికి కారణం ఏమిటి? - అని పలికిన సత్యవ్రతునకు ఆ యుగాంతంలో ప్రళయసమయంలో ఏకాంతంగా విహరించా లనే కోరికతో మత్స్యరూపం దాల్చిన శ్రీహరి ఇలా అన్నాడు.

రాజా! ఈ రాత్రికి ఇకమీద ఏడవ దినమున బ్రహ్మకు ఒక పగలు పూర్తి అవుతుంది. భూమి మొదలైన ముల్లోకాలు ప్రళయసముద్రంలో మునిగి పోతాయి. అప్పుడు నా ఆజ్ఞానుసారం ఒక విశాలమైన పడవ నీ చెంతకి వస్తుంది. దానిమీద ఔషధులనూ, నానావిధ బీజాలనూ ఉంచి సప్తఋషులతో గూడి నిర్భయంగా సంచరించగలవు. అప్పుడు ఎదుట ఏమున్నదో కానరాని పెనుచీకటి వ్యాపిస్తుంది. అయినా మహర్షుల దేహకాంతిచే చీకట్లు తొలగి పోతాయి. సముద్రం తొణికిసలాడుతూ ఉంటుంది. నావ తేలుతూ ఉంటుంది.

ఆ నావ సముద్రపు కరళ్ళకు లోనుకాకుండా నలువైపులా నేను కాపాడుతూ ఉంటాను. ఆ నావను పొడవటానికి వచ్చెడి జలజంతువులను పొడుగాటి వెంట్రుకలుగల నా రెక్కలచే నిగ్రహిస్తాను. నా ఆజ్ఞానుసారం నీకు అక్కడ పెద్ద పాము కనపడుతుంది. దానివలన సుడిగాలులకు నావ తిరుగబడకుండా ఉంటుంది. అది నా కొమ్ము తుదిని పదిలంగా ఉండి నీకూ, తాపసులకూ ఏ అలజడి కలుగకుండా చేస్తుంది. ఈ విధంగా నేను జలరాశిలో బ్రహ్మదేవుని రాత్రి పూర్తి అయ్యేదాకా తిరుగుతూ ఉంటాను. ఆ కారణం చేతనే నేను జలచర రూపాన్ని ధరించాను. అదీగాక మరొక ప్రయోజనం కూడా ఉంది. నా మహిమ పరబ్రహ్మమని గ్రహించు. నిన్ను అనుగ్రహించాను అని సత్యవ్రతుడు చూచుస్తుండగా శ్రీహరి తిరోహితుడయ్యాడు.

మత్స్యరూపి అయిన మాధవుని మాటలు మనస్సులో స్మరిస్తూ రాచ తపస్వి అగు సత్యవ్రతుడు దర్భశయ్యమీద ఒకచోట తూర్పు తలగడగా పడుకొని ఆ కాలం కొరకు నిరీక్షిస్తున్నాడు. ఇంతలో కల్పాంతం దగ్గర పడేసరికి ఆకాశం అంతా ప్రళయకాల మేఘాలు క్రమ్మి భయంకరమైన జడివాన కురిపించాయి. సముద్రాలు పొంగి చెలియలు కట్టలను దాటి దేశాలను

ముంచెత్తాయి. అనంతరం గడచిన కల్పాంతమందు బ్రహ్మమనెడి నైమిత్తిక ప్రళయ సమయంలో ఆకాశమందు తొణికిసలాడుచున్న మున్నీటిలో భూతకోటి లోకాల పరిమితులను అతిక్రమించి కూలిపోయాయి.

ఆ రాత్రి బ్రహ్మదేవుడు విశ్రాంతి లేకుండా ప్రాణికోటిని సృజించి సృజించి అలసిపోయాడు. అవులించాడు. సృష్టిమాని టెప్పలు మూతపడగా చేతిని తలగడగా చేసుకొని మేనువాల్చి గుఱ్ఱుపెడుతూ, కలలు కంటూ, ఘోషిస్తూ నిదురపోయాడు. ఆ రీతిగా అలసిసొలసి ఆదమరచి నిద్రిస్తూండగా బ్రహ్మనోటినుండి వేదాలు బయలుదేరాయి. హయగ్రీవుడను ఒక రాక్షసుడు ఆ వేదాలను అపహరించాడు. దొంగను అడ్డగించటానికి ఎవనితరం? బ్రహ్మదేవుడు గాఢనిద్రలో ఉండగా వేదాలను అపహరించిన హయగ్రీవుడు సముద్ర గర్భంలో ప్రవేశించాడు.

ఇలా వేదాలను దొంగిలించి మాయారాక్షసుడు మున్నీటిలో మునిగేనరికి వాడిని జయించాలనే ఊహతోనూ, నావలో నుంచబడిన మ్రానుతీగల విత్తనాలనూ నీట నాని చెడకుండా ఉండటానికిన్నీ పురుషోత్తముడు బ్రహ్మరాత్రి ప్రవేశించినపుడు చిన్న రెక్కలు, పొడుగుపాటి మీసాలు, చిఱుతోక, పసిడిమేను, సంపత్కరములైన పొడలు, చక్కని ముఖం, ఒక కొమ్మూ మిఱ్ఱుమాపులు గల ఒక మహామీనం అయ్యాడు.

ఈ రీతిగా లక్షయోజనాలు పొడవుగల మత్స్యమై విశ్వంభరుడు జలధిలో చొచ్చి ఒక మాటు జల జంతు సమూహాలతో కలసిమెలసి ఉంటాడు. ఒకమాటు గట్టుమీదికి ఉరుకుతాడు. ఒకమాటు ఆకాశానికి ఎగురుతాడు. ఒకమాటు సముద్ర గర్భంలో ఒదిగి ఉంటాడు. ఒకసారి సముద్రంలో మునుగకుండా పైకి తేలుతాడు. ఒకమాటు పైకివచ్చి బ్రహ్మండాన్ని ఒరసికొని పోతాడు. ఒక పర్యాయం మత్స్య సమూహాన్ని ఒడిసిపట్టుకొని మ్రింగివేస్తాడు. ఒకతూరి సముద్రజలాలను పుక్కిటపట్టి ఉమిసివేస్తాడు. టెక్కలు సారిస్తాడు. మీసాలు పెంచుతాడు. పొడలను ప్రకాశింప చేస్తాడు. ఒక్కొక్కప్పుడు కన్నులు మూసుకొంటాడు. శరీరం జళిపిస్తాడు. ఇలా మీనరూపధారి అయిన శ్రీహరి వేదాలకోసం వెదకుతూ సముద్రమంతా కలయ తిరుగుతూ తళతళ మెరిసిపోతాడు

అంతకు ముందే సత్యవ్రతుడు మహాసముద్రాలు మహీమండలాన్ని ముంచేటప్పుడు భక్తవరాధీనుడైన శ్రీహరిని స్మరిస్తూండగా అతని దగ్గరకు భగవత్ప్రేరితమైన నావ వచ్చింది. సత్యవ్రతుడు ఆ నావలో నానావిధాలైన చెట్లయొక్కయూ, తీగలయొక్కయు విత్తనాలు ఉంచాడు. శ్రీహరిని ధ్యానిస్తూ ముని సంఘాలతో కూడి ఆ నావపైకి ఎక్కాడు. అప్పుడు ఎదుటగా సముద్రంపై తేలుతూన్న మీనాన్ని చూచాడు. చూచి ఆ మీనం కొమ్మునకు ఒక

పెద్ద పాపత్రాటితో నావను కట్టి మహానందంతో తపస్వులూ,తానూ మీనాకారు డైన శ్రీహరిని ఇలా నన్నుతించటం ప్రారంభించారు.

ఈశ్వరా! అనాది అయిన దేహాత్మాభిమాన రూపమగు అజ్ఞానంచే ఆత్మ తత్వాన్ని విస్మరించి సంసారమగ్నులై అకారణ జనితమైన నీ కృపకు పాత్రులై నిన్ను ఆశ్రయించి ముక్తులగుచున్నారు. దేవా! మమ్ములను కరుణించి పాలించు. కన్నులు గలవాడు కానని వానికి త్రోవచూపగా వెళ్ళునట్లు సూర్యుడే కన్నులు కాగా భూతకోటిని రక్షించెడి మాధవా! మాకు ధర్మమూర్తివై, గురువువై సద్గతి యొక్క జాడ చూపించు. అగ్ని సాంగత్యంతో బంగారం వన్నె పెరిగినట్లు నీ సేవచే పాపాలు తొలగిపోతాయి. ముక్తి ప్రాప్తిస్తుంది. నీ అనుగ్రహంతో పదివేలవ పాలు లభిస్తే చాలు ఇంద్రత్వం లభిస్తుంది. నిన్ను మెప్పిస్తే ఇక లభింపనిది ఏముంటుంది? ఇతరులను గురువులుగా భావించి వారు చూపెడి కొంటగాని దారిలో నడచెడి మూఢుడు కూడా నీవు చూపెడి సన్మార్గాన చరిస్తే అరమరలేని పదమును పొందగలడు.

నీవు నెచ్చెలివి, చుట్టమువవు, చిన్మూర్తివి, ఆత్మవు, కోర్కెల పంటవు, మనస్సితుడవు, ఈశ్వరుడవు. అలాంటి నిన్ను కాదని పనికిమాలిన దారులు త్రొక్కి మానవుడు దురాశతో వ్యర్థ జీవనుడవుతాడు. అభాగ్యుడైన వాడు ఎదుట బంగారపు గుట్ట కనబడినా కన్నెత్తి చూడడు. నిజ కర్మములచే బద్ధమై సముద్రంలో నిద్రిస్తున్న లోకం ఏ మహాత్ముని చేత ఎవ్విటి రీతిగా మేల్కొంటుందో ఆ మహాత్ముడవగు నీవే మాకు గురుడవు. సర్వేశ్వరా! నా విన్నపం ఆలించు. దేవాధీశుడవైన నిన్ను ఇదే అర్థిస్తున్నాను. నాలోని చిక్కులను మాన్పి నన్ను నీలో ఐక్యం చేసుకో అని సత్యవ్రతుడు పలుకగా మత్స్యరూపంతో మహాసముద్రంలో విహరిస్తున్న శ్రీహరి పురాణపురుషుడగుట వలన జ్ఞానయోగరతో కూడిన పురాణ సంహితను ఉపదేశించాడు. ఆ రాజేంద్రుడు మునిజన సంహితుడై భగవంతుడు పల్కిన సనాతన బ్రహ్మస్వరూపం విని కృతార్థుడయ్యాడు. అతడు ఈ మహాకల్పంలో వివశ్వతుడను పేరుగల సూర్యునకు జన్మించి శ్రాద్ధదేవుడనే పేరుతో విఖ్యాతుడై శ్రీహరి కృపాతిశయంచేత ఏడవ మనువయ్యాడు. ఈ రీతిగా బ్రహ్మదేవుని రేయి గడచేదాకా నారాయణుడు జలచరాకారంతో సముద్రంలో తిరిగి ఆ నిశాంత సమయంలో వేదాల దైన్యం చూచి తెక్కలల్లార్చాడు. ముఖం చాచాడు. తోక సారించాడు. శరీర కాంతులు నలువైపులా చిమ్ముతూ దౌడలనుగిరి మీసాలు అతిశయింపగా శ్రీహరి వేదాలు దొంగిలించిన హయగ్రీవుని ఎదుర్కొని పిడికిటి పోట్లతో వధించాడు.

అపుడు ప్రళయాంత సమయంలో ఎప్పుడు తెల్లవారుతుందా అని మునులు సంతోషంతో ఎదురు చూస్తున్నారు. అప్పుడు బ్రహ్మదేవుని ప్రక్క

నిద్రిస్తున్న సరస్వతి లేచి అరజారిన పైటను చక్కనొత్తుకుంది. యథాప్రకారం తొలిసంధ్య కెంజాయలు వ్యాపించాయి. ప్రాణికోటి కంటి కొలకులయందు వారివారి భాగధేయాలు గోచరించాయి. బ్రహ్మదేవుడు అవయవాలు కదిలించాడు. ఆవులించాడు. నిద్రనుండి తెప్పరిల్లి మేల్కొన్నాడు. ఒళ్ళు విరుచుకున్నాడు. కళ్ళు నులుముకొన్నాడు. తిరిగి సృష్టికార్యం సాగించటానికి లేచి కూర్చున్నాడు.

అప్పుడు ఈశ్వరుడు హయగ్రీవుని చంపి అతని చేజిక్కిన వేదకోటిని తెచ్చి నిదురలేచి కూర్చున్న బ్రహ్మదేవునకిచ్చాడు.

సత్యవ్రతుడు బ్రహ్మదేవునికి జలతర్పణం ఇచ్చి అనంతరం మనువయ్యాడు. శ్రీహరిని సేవించెడి వారికి సంపదలు కలుగుటలో వింత ఏముంది? రాచతపసి అయిన సత్యవ్రతుడూ మత్స్యరూపి అయినమాధవుడూ సంచరించిన ఈ మహాఖ్యానాన్ని వినినవాడు బంధరహితుడవుతాడు. శ్రీహరి మత్స్యావతార గాథను ప్రతిదినం చదివేవాడు పరమపదం పొందుతాడు. అతని సకల వాంఛితాలు సిద్ధిస్తాయి. ప్రళయ సముద్రంలో ఒడలు మరిచి నిద్రించెడి వాణీశునుండి వేదాలను అపహరించిన దైత్యుని సంహరించి సత్యవ్రతునకు పురాణ సంహితను ఉపదేశించి సర్వాధారుడై, మీనమై సముద్రంలో మునుగుతూ తేలుతూ మెలగెడి తేజోమూర్తి శ్రీహరికి నా ప్రణామాలు - అని శుకమహర్షి అనగా పరీక్షిన్నరేంద్రుడు పులకాంకితుడయ్యాడు.

* * *



# మహాభాగవతం

## నవమ స్కంధం

ప్రాయోప విష్టుడైన పరీక్షిన్నరేంద్రుడు శుక యోగీంద్రుని ఉద్దేశించి- వ్యాస నందనా! మనువుల నడవళ్లూ మర్యాదలూ విన్నాను. మన్వంతరాల్లో శ్రీహరి ఏమేమి చేసిందీ విన్నాను. సత్యవ్రతుడను ద్రవిళ దేశాధీశుడు గడచిన మన్వంతరంలో శ్రీహరిని సేవించి జ్ఞానియై సూర్యునికతడు వైవస్వంతుడై పుట్టి మనువయ్యాడని కూడా విన్నాను. అతనికి ఇక్ష్వాకువు మొదలైన పది మంది కొడుకులున్నారంటారు. వారి వంశం ఎలా ప్రవర్తించింది? ఆ వంశంలో ఎవరెవరు జన్మించారు?ఇప్పుడున్నవారెవ్వరు? ఇక ముందు జన్మించే వారెవ్వరు? వారి చరిత్రలు వినాలని కుతూహలంగా ఉంది- అనేసరికి శుక మహర్షి యిలా చెప్పడం మొదలు పెట్టాడు.

రాజేంద్రా! వైవస్వత మనువు చరిత్రను సంపూర్ణంగా విస్తరించి చెప్ప డానికి నూతేండ్లు కాదు వేయేండ్లయినా చాలవు. అయినా నాకు తెలిసినంత వఱకు వేగంగా చెపుతాను విను. ఎక్కువ తక్కువలను భేద భావం లేకుండా సకల. భూతకోటికి అంతరాత్మ యయిన పరమ పురుషుడు అవినాశి. కల్పాంతంలో అతడు ఈ విశ్వాన్ని అంతటినీ తనయందు ఇముడ్చుకొని ఉంటాడు.

నరేంద్రా! ఆ మహా పురుషుని నాభి మధ్యాన బంగారు కెందమ్మి (ఎఱ్ఱ తామర) మొలిచింది. అనంతరం ఆ తమ్మి పువ్వులో తనయంత తాను నాలుగు ముఖాలుగల నలువ (బ్రహ్మ) పుట్టాడు. ఆ బ్రహ్మకు మరీచి మానస పుత్రుడు. మరీచికి కశ్యపుడు కలిగాడు. ఆ కశ్యపునకు దక్ష పుత్రిక అయిన అదితియందు సూర్యుడు జన్మించాడు. ఆ సూర్యుని భార్య సంజ్ఞ. ఆమెకు మనువైన శ్రాద్ధదేవుడు ఉద్భవించాడు. అతనికి శ్రద్ధ యనునామె వలన మహా కీర్తి శాలులైన పది మంది కొడుకులు పుట్టారు. వారు ఇక్ష్వాకుడు, శర్యాతి, నృగుడూ, ధృష్టుడూ, దిష్టుడూ, కరూశకుడూ, అరిష్యంతుడూ, పృషధ్రుడూ, అభగుడూ, కవి- 'అను పేర్లతో ప్రఖ్యాతి గాంచారు.

ఈ కొడుకులు పుట్టక పూర్వం, మనువు పుత్ర సంతానం కోసం వశిష్ఠుని ఆశ్రయించగా ఆ మహర్షి కరుణించి అతనిచేత మిత్రావరుణమను యజ్ఞం చేయించాడు. అపుడు మను పత్ని అయిన శ్రద్ధ భక్తితో పయోవ్రత[1] మనేడి ఒక వ్రతాన్ని ఆచరించి హోత దగ్గరకు వెళ్ళి తనకు కూతురు

1. కేవలం నీళ్ళుకాని, పాలుకానీ త్రాగి చేసెడి వ్రతం.

పుట్టేలాగా చేయమని అర్థించింది. ఆమె కోరిక ననుసరించి అధ్వర్యుడు[1] హోత[2] నుద్దేశించి అదే రీతిగా అగ్నివేల్చమని చెప్పాడు. అధ్వర్యుని ఆదేశానుసారం హోత హవిస్సునుచేతాల్చి "కూతుర్ను జన్మించు గాక" అని వషట్కారం[3] చెబుతూ వేల్చాడు. అపుడు హోతయొక్క పెదచేత వలన మనువు కోరినట్లు పుత్రుడు కాక శ్రద్ధ వలన ఇళ అను కూతురు పుట్టింది. మనువు ఆ బిడ్డను చూచి సంతాపం చెంది "కొడుకు మేలు కాని కూతురెందు"కని తిరిగి వశిష్ఠుని కడకు పోయి ఇలా అన్నాడు.

అయ్యా! నీ ఆజ్ఞానుసారం నేను కొడుకుల కోసం యజ్ఞం చేయగా నాకు ఈ ఆడుబిడ్డ పుట్టటం ఏమిటి? మీరు బ్రహ్మవాదులు. మంత్రవాదులు. పాప కృత్యానికి పాల్పడేవారు కాదు. కాని ఇలా జరిగిందేమిటి?- అనగా వశిష్ఠుడు హోత చేసిన పెదచేత తెలుసుకొని మనువునకిలా అన్నాడు- రాజా! ఇది హోత వలన కలిగిన దోష ఫలితం. అతడు విషమ బుద్ధితో సంకల్పం చెప్పాడు. అందుచేత ఆడుది కల్గింది. అయినా భయపడకు. నేను నా నేర్పుతో నీ కోరిక తీరేలాగా నీకొక కుమారుని కల్గిస్తాను - అని పలికి- మనువు కుమార్తె అయిన ఇళాదేవి మగవాడయ్యే లాగా ఏకచిత్తంతో ఆది పురుషుడైన శ్రీహరిని సన్నుతించే సరికి ఆ పరమేశ్వరుడు మెచ్చి వశిష్ఠుని కోరిన వరం ఇచ్చాడు. ఆ కారణం చేత ఇళాకన్యక సుద్యుమ్నుడను కుమారుడై రాజ్య పాలనం చేస్తున్నాడు.

అలా ఉండగా ఒకనాడతడు మంత్రులు, పరివారం వెంటరాగా సైంధవ[4]మైన గుఱ్ఱం ఎక్కి ధనుష్పాణి అయి వేటాడటానికి అడవికి వెళ్ళాడు. అతడు కంటపడిన మృగాలను తరుముతూ ఉత్తర దిక్కుగా పోయి పోయి మేరు పర్వత సమీపంలో కుమార వనంలో ప్రవేశించాడు. ఆ వనంలో ఈశ్వరుడూ, పార్వతి నిరంతరం కేళీ విలాసంలో మునిగి తేలుతూ ఉంటారు. సుద్యుమ్నుడు ఆ అడవిలో అడుగు పెట్టేసరికి ఆడుది అయ్యాడు. అతని అనుచరులందరూ అలాగే స్త్రీలయ్యారు. ఆ గుఱ్ఱం కూడా ఆడుది అయ్యింది. ఇలా వారందరూ మగతనం కోల్పోయి స్త్రీలై ఒకరిముఖం ఒకరు చూసుకుంటూ దుఃఖాక్రాంతులయ్యారు- అనగా విని శుకునకు రాజు ఇలా అన్నాడు.

మునీంద్రా! రాజూ, అతని తోడివారూ స్త్రీలు అయ్యారని అన్నావు. విచిత్రంగా ఉన్నదే! దానికి కారణం ఏమిటి? ఇలాంటి దేశం ఒకటున్నదని

---

1. యజ్ఞం చేయించు వారిలో ముఖ్యుడు. 2. హోమం చేసెడి వాడు.
3. అగ్నియందు హవిస్సు వేల్చునప్పుడు ఉచ్చరించెడి శబ్దం (వషట్)
4. సింధు దేశము నందు పుట్టిన గుఱ్ఱం.

ఎవ్వరూ ఎరుగరే! నాకా వృత్తాంతం అంతా వినాలని కుతూహలంగా ఉంది. కనుక విస్తరించి చెప్పు. అదీ కాక ఎక్కడైనా ఆడుది మొగవాడుగా కావచ్చు. కాని మానవంతుడైన మగవాడు మగతనం మాని ఆడుదిగా మారుతాడా? అలా చేస్తే పేరూ, పెంపూ చెడిపోవూ? అని పరీక్షిన్నరేంద్రుడు అడిగేనరికి వ్యాస తనూజుడైన శుకమహర్షి ఇలా అన్నాడు.

ఒకనాడు కొందరు మునులు శివుని దర్శించటానికి బయలుదేరారు. అపుడు వారి తేజఃప్రభావం వలన చీకట్లు నందుల్లోనూ, గొందుల్లోనూ జొఱ పడ్డాయి. ఆ సమయంలో ఒక వనంలో పార్వతి శివుని తొడపై కూర్చుంది వారిని చూచింది. అపుడామె వివస్త్రగా ఉంది. వారిని చూడగానే ఆమెకు సిగ్గు ముంచుకొని వచ్చింది. వెంటనే చీర కట్టుకుంది. అపుడా మునులు పార్వతీ పరమేశ్వరులు దీర్ఘమైన కేళీ విలాసంతో ఏకాంతంగా ఉన్నారని గ్రహించి వారినిదర్శించటానికి అది సమయంకాదని భావించారు. వెంటనే నరనారాయణుల తపోభూమికి వెళ్ళారు. అపుడు భగవంతుడగు శివుడు తన ప్రియురాలి వేడుక కోసం— "ఈ చోటుకు వచ్చేవాడు ఆడుది అవుతాడు'—అని అన్నాడు. ఆ కారణంచేతనే అక్కడికి ఎవ్వరు వెళ్ళినా స్త్రీగా మారిపోవటం తథ్యం.

ఆ విధంగా రాకుమారుడు సుద్యుమ్నుడు స్త్రీఅయి తన చెలికత్తెలతో కూడి అడుగోకడలుపోతూ, బెదరు చూపులు చూస్తూ దైవయోగంచేత చంద్రుని కుమారుడైన బుధుని ఆశ్రమం దగ్గరికి వెళ్ళాడు. ఆమె బుధుని చూచింది. బుధుడున్నూ ఇందువదన అయిన ఆమెను చూచాడు. కామాతురులై ఇరువురూ పరస్పరం ప్రేమించుకొన్నారు. ఆ అవకాశాన్ని తీసుకొని తుంటరి అయిన మన్మథుడు వారిపై తన పుష్పబాణాలు కురిపించాడు. ఇలా ఆ పుష్పబాణుడు పూవుటమ్ముల కొనలతో వారిద్దర్నీ బాధించేసరికి వారు అతని అధీనులై కామ కేళికి ఉపక్రమించారు. అపుడు వారికి పురూరవుడు అనే కుమారుడు పుట్టాడు. ఈ విధంగా మనువు కుమారుడయిన సుద్యుమ్నుడు మగనాలి అయి కొడుకును గాంచినందుకు విసివిపోయాడు. కుంది కుంది ఎంతో మనోవ్యథ చెందాడు. తన గురువైన వశిష్ఠుని స్మరించాడు. స్మరించినంతనే వశిష్ఠుడు వచ్చి జరిగిన వృత్తాంతం తెలుసుకొని సుద్యుమ్నుని తిరిగి మగవానిగా చేయదలిచి శివుని ఆరాధించాడు. శివుడు వశిష్ఠుని అభ్యర్థన అంగీకరించి మునీంద్రా! నీ కోర్కె మన్నిస్తాను. కాని నేను పూర్వం అన్నమాట కూడా వ్యర్థం కాకూడదు కదా. కనుక ఉభయ సమ్మతంగా నే చెప్పేది విను సుద్యుమ్నుడు ఒకనెల పురుషుడుగా ఒకనెల స్త్రీగా మారి రాజ్యపాలనం చేస్తాడు—అన్నాడు.

సుద్యుమ్నుడు వశిష్ఠుని అనుగ్రహంచేత అలా ఒకనెల మొగవాడుగా ఒక నెల మగువగా మారుతూ రాజ్యపాలనం చేశాడు. ప్రజలు కూడా సంతోషించారు. అతనికి ఉత్కలుడు, గయుడు, విమలుడు అను ముగ్గురు కొడుకులు

కల్గి ధర్మవర్తనులై ఉత్తరా పథానికి రాజులయ్యారు. సుద్యుమ్నుడు మునలి వాడు కాగా తన రాజధాని అయిన ప్రతిష్ఠానపురం విడిచి పురూరవుని రాజుగా చేసి తపశ్చర్యకై అడవికి వెళ్ళాడు.

సుద్యుమ్నుడు అలా అడవులకు వెళ్ళేసరికి వైవస్వత మనువు (శ్రాద్ధదేవుడు) బిడ్డలకోసం శ్రీహరి గూర్చి నూరేండ్లు యమునానదీ తీరమున దారుణ తపస్సు చేయగా శ్రీహరి సంతసించి అతనికి ఇక్ష్వాకుడు మొదలైన పదిమంది కొడుకులను అనుగ్రహించాడు. వారిలో ఎనిమిదవ వాడైన వృషధ్రుడు తండ్రిచే గోపాలనమునకు నియుక్తుడయ్యాడు. అతడు రాత్రివేళల్లో ఖడ్గధారి అయి సంచరిస్తూ గోవులను పులుల బారి పడకుండా రక్షిస్తున్నాడు.

అలా ఉండగా ఒకనాటి నడిరేయి ఆకాశం మేఘాక్రాంతమైంది. జోరున వానకురియటం మొదలు పెట్టింది. వృషధ్రుడు ఆలమందను విడియించి ఏమరుపాటు లేకుండా గోరక్షణం చేస్తున్నాడు. అప్పుడు కారుచీకటిగా ఉంది. కన్నూకన్నూ పొడుచుకున్నా కనపడటం లేదు. అప్పుడొక బెబ్బులి గజగజ వణుకుచూ కంచెనురికి ఒక మందావును పట్టుకొంది. ఆ ఆవు హడలి అరవటం మొదలుపెట్టింది. అప్పుడు మిగిలిన ఆలమందలు భీతితో లేచి "అంబే" అని అరుస్తూ పులిగాలి తగలటం చేత చెల్లాచెదురై పారిపోయాయి. ఆ కారుచీకటిలో రాకుమారుడుకానక పులి అనుకొని తన ఖడ్గంతోపుల్లావుశిరస్సు నరికాడు. తాను చేసిన పొరపాటు గ్రహించి మరొక వ్రేటుతో పులిని కూడా చంపాడు. అతడు తలతెగి పడియున్న ఆ దేనువు దగ్గరకు వెళ్ళి దుఃఖాక్రాంతుడయ్యాడు. అప్పుడు అతని కులగురువగు వశిష్ఠుడు అతడు చేసిన గోహత్యకు ఆగ్రహించి - నీవు రాజత్వాన్ని విడిచి ఈ అపరాధం చేశావు కనుక శూద్రుడవు కమ్మని శపించాడు.

అపుడు వృషధ్రుడు గురువు నాజ్ఞను తీసుకొని అక్కడి నుండి వెళ్ళిపోయాడు. అతడు అఖిలాత్మడైన హరియందూ, అన్యునియందూ సమభావం అలవరుచుకొన్నాడు. ఇంద్రియాలు జయించాడు. ఊర్ధ్వ రేతస్కుడై[1] సకల ప్రాణికోటికీ ఆప్తుడయ్యాడు. శాంతుడయ్యాడు. సర్వసంగాలు ఛేదించాడు. తనకు ఏదిలభిస్తే దానితో జీవనం చేయడం మొదలుపెట్టాడు. ఒకప్పుడు జడుడుగ, ఒకప్పుడు అంధుడుగా, మరొకప్పుడు చెవిటివానిలాగా భూమండలం అంతా తిరుగుతూ అడవులకు పోయి ఒకనాడు కార్చిచ్చులో చిక్కుకొని బ్రహ్మైక్యం పొందాడు.

---

1. స్త్రీ ముఖం చూడకుండా తన వీర్యమును నిలబెట్టుకొనువాడు.

కడపటి కొడుకైన కవి అనువాడు కూడా రాజ్యాన్ని రాజభవనాన్ని విడిచి బంధువులతో కూడి అడవులకు పోయి పరమ పురుషుని స్మరించి పరమ పదం చెందాడు.

వైవస్వతుని ఆరవ కుమారుడైన కరూశునకు కొందరు క్షత్రియులు పుట్టి ధర్మబుద్ధిగల వారవటం చేత బ్రహ్మణ్యులై ఉత్తరాపథానికి ఏలిక లయ్యారు. ఐదవ వాడైన ధృష్టుని వలన ధార్ష్టం జనవంశం కల్గి భూలోకంలో ఆ వంశస్థులందరూ బ్రాహ్మణులయ్యారు. రెండవ వాడైన నృగుని వంశంలో సుమతి పుట్టాడు. అతనికి భూతజ్యోతి అనువాడు జన్మించాడు. ఆ భూతజ్యోతికి వసు వనువాడు ఉద్భవించాడు. వసువునకు ప్రతీతుడనువాడు కల్గాడు. ప్రతీతునకు ఓఘవంతు డనువాడు పుట్టాడు. అతని కూతురు ఓఘువతి అనునామెను సుదర్శనుడు పెండ్లాడాడు.

అరిష్యంతుడను మనుపుత్రునకు చిత్రసేనుడు, అతనికి దక్షుడు, ఆ దక్షునకు మీఢాస్వుడు, అతనికి శర్వుడు, శర్వునకు ఇంద్రసేనుడు, ఇంద్రసేనునకు వీతిహోత్రుడు, అతనికి సత్యశ్రవుడు, ఆ సత్యశ్రవునికి ఉరుశ్రవుడు, అతనికి దేవదత్తుడు, అతనికి అగ్నివేశుడు పుత్రులుగా జనించారు. వారిలో అగ్నివేశుడు కానీనుడు*. అతడు జాతకర్ణుడను మహర్షి అయి ప్రఖ్యాతి చెందాడు. ఆతనివలన నాగ్నివేశ్యగోత్రమని పిలువబడు బ్రాహ్మణ కులం జనించింది.

రాజేంద్రా! నీకు అరిష్యంతుని కులం సమస్తం వివరించి చెప్పాను. ఇక నీకు దిష్టుని వంశాన్ని గూర్చి చెబుతాను విను. దిష్టుని కొడుకు నాభాగుడు. అతడు కర్మవశం చేత వైశ్యత్వం పొందాడు. ఆ నాభాగునకు హలంధనుడు కలిగాడు. అతనికి వత్సప్రీతియను వాడు, వత్సప్రీతికి ప్రాంశువు, అతనికి ప్రమతి, ప్రమతికి ఖమిత్రుడు, ఖమిత్రునికి చాక్షుషువు, వానికి వివింశతి, వివింశతికి రంభుడు, రంభునకు ఖనినేత్రుడు, అతనికి ఖరంధనుడు, ఖరంధనునకు అవిక్షిత్తు, ఆ అవిక్షిత్తునకు మరుత్తుడు జనించారు. మరుత్తుడు చక్రవర్తి అయ్యాడు. నరేంద్రా! అతని చరిత్ర చెబుతా విను.

మరుత్తుడు సామాన్యుడు కాదు. అతడు అంగిరసుని కుమారుడు. మహాయోగి అయిన సంవర్తుని యాజకునిగా వరించి అనేక యజ్ఞాలు చేశాడు. ఆ యాగంలో అతడు సోమరసంచే ఇంద్రుని, దక్షిణలచే బ్రాహ్మణులను అమిత సంతృప్తులుగా చేశాడు. ఆ యజ్ఞాల్లో విశ్వేదేవులు సభ్యులు. సోమపానంచే ఇంద్రుడు సంతోషించి యాగ వస్తువులన్నింటినీ బంగారు మయం

---

*. రజస్వల కాని కన్యకు కల్గినవాడు.

చేశాడు. ఆ మరుత్తుడు చేసినట్లు ధైర్యంతో, త్యాగంతో, తెంపుతో యజ్ఞాలు చేసినవారు ముల్లోకాల్లో ఎక్కడా లేరు.

ఆ మరుత్తునకు దముడూ, దమునకు రాజవర్ధనుడూ, రాజవర్ధనునకు సుధృతీ, సుధృతికి సౌధృతేయుడూ, సౌధృతేయునకు కేవలుడూ, కేవలునకు బంధుమంతుడూ, బంధుమంతునకు వేదవంతుడూ, వేదవంతునకు బంధుడూ, బంధునకు తృణబిందుడూ జన్మించారు. అలంబున యను అచ్చర కన్య తృణ బిందువును చూచి కామించింది. మోహాతురులై వారిరువురు కలిశారు. వారికి "ఇలబిల" అను కూతురు జన్మించింది. ఆమెను విశ్రవసుడు చేపట్టగా వారికి కుబేరుడు పుట్టాడు. తృణబిందునకు విశాలుడూ, శూన్యబంధుడూ, ధూమ్ర కేతుడూ అను ముగ్గురు కొడుకులు కూడా కల్గినారు. వారిలో విశాలుడు వంశ వర్ధనుడై వైశాలి అను నగరం నిర్మించాడు.ఆ నరేంద్రునకు హేమచంద్రుడూ, అతనికి ధూమ్రాక్షుడూ,ధూమ్రాక్షునకు సహదేవుడూ,అతనికి కృశాశ్వుడూ,ఆ కృశాశ్వునకు సోమదత్తుడూ జన్మించారు. ఆ సోమదత్తుడు ఇంద్ర ప్రీతిగా అశ్వమేధయాగం చేసి స్వర్గతుడయ్యాడు. సోమదత్తుని కొడుకు సుమతి. ఆ సుమతికి జనమేజయుడను కొడుకు పుట్టాడు. విశాలుని సంతతివారు కనుక వీరంధరూ వైశాలురను పేరుతో ప్రఖ్యాతి చెంది రాజ్యపాలనం చేశారు.

## సుకన్య చరిత్ర

బ్రహ్మజ్ఞాని అయిన మనువునకు శర్యాతి అను రాజు జన్మించాడు. అతడు శ్రౌతమందు నేర్పరి. కనుకనే అంగిరసుడు చేస్తూన్న సత్రయాగంలో రెండవదినమున చేయవలసిన క్రియా విధానాన్ని చక్కగా ఉపదేశింప గలిగాడు. అతని కూతురు సుకన్య. ఒకనాడామె తన తండ్రితో కలసి అడవికి వెళ్ళి ఆ సమీపంలోనున్న చ్యవనాశ్రమంలో ప్రవేశించింది. ఆమె తన చెలికత్తెలతో కూడి ఆ ఆశ్రమంలోని వృక్షపంక్తులన్ను చూస్తూ ఫలపుష్పాలను కోస్తూ విహరిస్తూండగా ఒకచోట ఒక పుట్ట కన్పడింది. ఆ పుట్టకన్నంలో రెండు జ్యోతులు ఆమె కంటపడ్డాయి. ముగ్ధయైన ఆమె దైవవశంచేత అవి మిణుగురు పురుగులని భ్రమించి వాడి ముల్లుతో ఆ జ్యోతులను పొడిచింది. వెంటనే వానినుండి రక్తం పైకి చిమ్మింది.

అచ్చటికి కొలది దూరంలో ఉన్న శర్యాతి సైనికులకు మలమూత్ర నిరోధం కల్గింది. వారినిచూచి రాజర్షి అయిన శర్యాతి విస్మితు డయ్యాడు. ఈ ఆశ్రమంలో మీరేదో అకృత్యం చేసి ఉంటారు అందుచేతనే మీకు మలమూత్రబంధం కల్గింది - అని శర్యాతి వారిని మందలించగా సుకన్య తండ్రినుద్దేశించి తండ్రీ! నేను నా చెలికత్తెలతో ఈ పుట్ట సమీపంలో

విహరిస్తూండగా అందులో నాకు రెండు జ్యోతులు కనపడ్డాయి. కుతూహలంతో నేను ఒక వాడిముల్లు తీసుకొని వాటిని పొడవగా రక్తం కురిసింది. అలా రక్తం కురియటానికి కారణం ఏమిటో తెలియదు అనగా శర్యాతి భీతుడై కుమార్తెను వెంటపెట్టుకొని పుట్టదగ్గరకు వెళ్ళాడు. ఆ పుట్టలో తపశ్చర్యలో మునిగివున్న చ్యవనమునిని చూచాడు. ఆ మునికి నమస్కరించి అతనిని ప్రసన్నునిగా చేసుకొన్నాడు. అనంతరం శర్యాతి చ్యవనునికోరిక ననుసరించి అతనికి తన కుమార్తెను ఇచ్చి మునీంద్రుని వీడ్కొని నిజనిలయానికి వెళ్ళాడు.

ఆ చ్యవనుడు ముక్కోపి. ముదుసలి. పై పెచ్చు ఇప్పుడు అంధుడు కూడా అయ్యాడు. అయినా సుకన్యక, అతనిని పతిగా వరించి అతనికి తలలో నాలుకగా ప్రవర్తిస్తూ అతనికి నానావిధ సపర్యలు చేస్తూ ఆ పర్ణశాల లోనే ఉంది. ఇలా కొన్ని యేండ్లు గడిచాక ఆ ఆశ్రమానికి దేవ వైద్యులు (అశ్వినులు) ఇరువురు రాగా చ్యవన మహర్షి వారిని పూజించి- దేవవైద్యులారా! మీకు ఇంతకు ముందు యాగ భాగం లేదుకదా! మీకు నేను సోమపానం కల్పిస్తాను. ఆ సోమపాన సమయంలో పాన పాత్రాన్ని మీ కందిస్తాను. అందుకు ప్రతి కృతిగా మీరు నా ముసలి తనాన్ని పోగొట్టండి. నాకు పడుచు దనాన్నీ, జవరాండ్రను రంజింప చేయగల చక్కదనాన్ని ప్రసాదించండి. నేను మిమ్మల్ని ఆశీర్వదిస్తాను అన్నాడు.

అశ్విదేవతలు సంతోషించి ఆ దగ్గరలో వున్న సిద్ధ నిర్మితమగు మడుగులో స్నానం చేయించటానికి వారు ఆ ముసలి తాపసుని పట్టి ఎత్తుకొని తీసుకొని వెళ్ళారు. అనంతరం ముగ్గురూ ఆ మడుగులో మునిగి లేచేసరికి సుందరాకారులయ్యారు. వారి మెడలో కమల మాలికలున్నాయి. చెవులకు కనక కుండలాలు వ్రేలాడుతున్నాయి. యువతుల హృదయాలను ఇట్టే దోచు కొనగల మన్మథాకారంతో చీన్ని చీనాంబరాలు ధరించి చూడ ముచ్చటగా ఉన్నారు. వారు సూర్య కాంతితో ధగ ధగ మెరుస్తూ ఒకే రీతిగా ఉండటం చేత ముగ్ధయైన సుకన్యక ఆ ముగ్గురిలో తన భర్త ఎవ్వరో గుర్తింపలేక పోయింది. ఆమె మహా పతివ్రత కాబట్టి నా నాథుడు ఎవ్వరో చూపండి అని అశ్వి[illegible]తలను నమస్కార పూర్వకంగా అర్థించింది. వారు ఆ పతివ్రత సత్య వర్త[illegible]కి వయోరూప సంపన్నుడైన చ్యవనుని చూపి ఆ దంపతుల[illegible] వీడ్కొ[illegible] విమానారూఢులై స్వర్గ నిలయ[illegible]కి వెళ్ళారు.

ఇలా ఉండగా శర్యాతి ఒకసా[illegible] యజ్ఞం చేయదలచి కూతుర[illegible] అల్లుడ[illegible] తీసుకొని రావటానికి చ్యవన మునీంద్రుని ఆశ్రమానికి వెళ్ళాడు. దేవవై[illegible]ద్యుల వలన చ్యవనుడు తరుణ వ[illegible]స్కుడైన సుందరాకారుడుగా మారి[illegible]

విషయం అతనికి తెలియదు అతడు వెళ్లే సరికి తన కుమార్తె ప్రక్క సూర్య తేజస్కుడైన యవ్వనవంతుని చూచి అతడెవ్వడో పర పురుషుడని భావించాడు. కూతురు మీద పట్టరాని కోపం వచ్చింది. వృద్ధుడైన చ్యవనుని విడిచి అన్య పురుషుని చేపట్టినదని భ్రమించాడు. అందుచేత ఆమె తనకు చేసిన సపర్యలనూ, మ్రొక్కులనూ స్వీకరించలేదు. తల వంచుకుని మారు మాట్లాడలేదు. ఆమెను దీవించలేదు. విసుగుతో- ఓసీ! ఇతడెవ్వడు? మునీంద్రుడైన చ్యవను డేమయ్యాడు? అతడెలా వంచింపబడ్డాడు? నీవు ఉన్నత కుల సంజాతవు. దేవతా రాధ్యుడూ, పుణ్య శీలుడూ, మహా తపస్వి, సాధ్వీజనమనోభిరాముడూ అయిన మగనిని కాదని పర పురుషుని చేపట్టటం న్యాయమా? వంశ మర్యాదను నీట కల్పి నీవు నీ తండ్రినీ, నీ పతినీ కూడా దుర్గతిపాలు చేశావు. ఇది ధర్మం కాదు. భర్త తరుణ వయస్కుడైతే భార్యను అదుపులో పెట్ట గలడు. కాని చ్యవనుడు వృద్ధుడు. మహా తపస్వి. నీలాంటి యువతిని అతడు కట్టడి చేయలేడు. కనుక కన్యనెప్పుడూ ముసలివానికి ఇచ్చి వివాహం చేయటం కూడని పని - అని శర్యాతి పలుకగా మహా పతివ్రత అయిన సుకన్యక చిరు నవ్వుతో తండ్రికిలా అంది.

తండ్రీ! ఇతడు నీ అల్లుడు. జారుడు కాదు. నీవు సంతోషంతో ఎప్పటి యట్లు నన్ను సమాదరించు - లని ఆమె జరిగిన వృత్తాంత మంతా తండ్రికి వినిపించింది.

అప్పుడు శర్యాతి మహానందంతో కుమార్తెను కౌగలించుకొని "నీవు ఆయిదువవు కమ్మని" దీవించాడు. అనంతరం చ్యవనుడు సతీ సమేతంగా వెళ్ళి మామగారి యజ్ఞం పూర్తి చేయించాడు. ఆ యాగ సమయంలో ఆ మహర్షి ఒక పాత్రంలో సోమభాగం పట్టి తన తపోబలం చేత అశ్వీదేవతలకు అందించాడు. ఇంద్రుడది చూచి కోపోద్రిక్తుడయ్యాడు. మునీంద్రుని సంహరించ టానికి వజ్రాయుధం ఎత్తాడు అప్పుడు మునీంద్రుడు ఆ వజ్రాయుధాన్ని ఇంద్రుని చేతిలో స్తంభింప చేశాడు. అందరూ ఆశ్చర్యచకితు లయ్యారు. అశ్వినులు వైద్యులనిన్నీ వారికి సోమపానార్హత లేదనిన్నీ మొదట నిరాకరించారు. కానీ అది మొదలుకొని యాజకులు అశ్వినులకు సోమభాగం ఇవ్వటానికి అంగీకరించారు.

శర్యాతికి ఉత్తానబర్హి, ఆనర్తుడు, భూరిషేణుడు అను ముగ్గురు కొడుకులు కల్గారు. వారిలో ఆనర్తునకు రైవతుడనువాడు పుట్టాడు. అతడు సముద్ర మధ్యంలో "కుశస్థలి" అనే నగరాన్ని నిర్మించి ఆనర్త దేశాలను పరిపాలించాడు. ఆ కుశస్థలియే అనంతరం ద్వారకాపురమని పేరు పొందింది. అతనికి నూరుగురు కొడుకులు పుట్టారు. వారిలో కకుద్మి అనువాడు పెద్దవాడు.

పీరుగాక రైవతునకు రేవతి అను నొక కూతురు కల్గింది. ఆ రాజు ఆమెను వెంట బెట్టుకొని ఆమెకు తగిన వరుదెవ్వరో తెలుసు కోవటానికి బ్రహ్మలోకం వెళ్ళాడు. అతడు అచ్చటికి వెళ్ళేటప్పటికి గంధర్వులు, కిన్నెరలు బ్రహ్మదేవుని సమక్షంలో ఆట పాటలు చేస్తున్నారు. అందుచేత బ్రహ్మదేవుని దర్శించటానికి అవకాశం లేక క్షణ కాలం అక్కడ వేచి ఉన్నాడు. అనంతరం అవకాశం చిక్కాక రైవతుడు బ్రహ్మకు నమస్కరించి రేవతిని చూపి- దేవా! ఈమె నా కుమార్తె రేవతి. ఈమె ముగ్ధరాలు. జవ్వని. ఈమెకు పతి కాగల వాదెవ్వడో చెప్పు-మని అర్థించే సరికి బ్రహ్మ వకవక నవ్వి ఆ రాజేంద్రునికిలా అన్నాడు- రాజేంద్రా! ఇక్కడ ఒక క్షణ కాలం గడిస్తే భూలోకంలో ఎంతో కాలం యతిక్రమిస్తుంది. నీవిక్కడ ఒక క్షణ కాలం ఉన్నావు. ఈ కాలంలోనే భూ లోకంలో మానవులకు నాలుగు యుగాలు ఇరువది ఏడు పర్యాయాలు గడిచి పోయాయి. నీవు వచ్చేటప్పుడు నీ కుమార్తెకు భర్తగా నిశ్చయించుకొని వచ్చిన వాడెవ్వడూ ఇప్పుడు లేడు. అంతేకాదు భూలోకంలో నీవెరిగిన వారు కూడా ఇప్పుడెవ్వరూ లేరు. వారందరూ కాలవశం గతులయ్యారు. వారుగానీ, వారి బిడ్డలుగానీ, మనుమలుగానీ, వారి గోత్రజులుగానీ ఇప్పుడెవ్వరూ లేరు. కాబట్టి నీవు తిరిగి భూలోకానికి వెళ్ళు. దేవ దేవుడైన శ్రీహరి భూ భారం మాన్పటానికి బలదేవుడనే పేరుతో పుట్టాడు నారాయణాంశ సంభూతుడైన అతనికి నీ కన్యనిచ్చి పెండ్లి గావించు- అని పలుకగా రైవతుడు బ్రహ్మకు నమస్కరించి తన కూతురిని వెంట పెట్టుకొని తిరిగి భూ లోకానికి వచ్చాడు. అక్కడ తన నగరమైన కుశస్థలిలో తన స్వజనం ఎవ్వరూ లేరు. అక్కడ బలభద్రుని చూచి బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారం రేవతిని అతనికిచ్చి వివాహం చేశాడు. అనంతరం బదరికా వనానికివెళ్ళి తపస్సు చేయుటకు మొదలుపెట్టాడు.

ఓ రాజేంద్రా! ఇక మను పుత్రుడైన నభగుని చరిత్ర చెబుతాను విను. నభగునకు చాలమంది కొడుకులు పుట్టారు. వారిలో నాభాగ దనువాడు చివరి వాడు. అతడు బ్రహ్మచారి. మహా జ్ఞాని. అందుచేత అతని సోదరులు పిత్రార్జిత మైన దానిలో అతని భాగం వేరు పరుపక తమలో భాగం పంచుకొన్నారు. అతడు గురుకులం నుండి వచ్చి తన భాగం తనకిమ్మని సోదరులను అడిగాడు. అప్పుడు వారు తండ్రి ఆదేశాన్ని అనుసరించి ఇస్తామన్నారు. అప్పుడు నాభాగుడు తండ్రి అయిన నభగుని దగ్గరకు వెళ్ళి విత్తంలో తన భాగం తనకిమ్మని అర్థించేనరికి అతడు ఇలా అన్నాడు.

బిడ్డా! అంగీరసులు బుద్ధిమంతులైన సత్రయాగం చేస్తూ ఆరవ దినమున విహిత కర్మములు తెలియక మూఢులవుతారు. నీవు వారికి వైశ్వదేవ సూక్తాలు రెండు తెలియజేస్తే నీవు కవి అని ప్రసిద్ధికెక్కగలవు. అప్పుడు వారు కృత కృత్యులై స్వర్గానికి పోతూ వారు నీ ఉపకారానికి ప్రతి కృతిగా

మిగిలిన యాగ ధనం నీ కిస్తారు - అనగా తండ్రిని వీడ్కొని నాభాగుడు వెళ్ళి వారి యజ్ఞాన్ని నిర్విఘ్నంగా పరిసమాప్తం చేయించే సరికి అంగిరసులు సంతోషించి యజ్ఞ పరిశేషిత ధనం అతనికిచ్చి స్వర్గానికి వెళ్ళారు.

అనంతరం నాభాగుడు యాగావశిష్టధనం-గ్రహించ బోతుండగా నల్లని శరీరంగల ఒక మహాపురుషుడు అచటికి వచ్చి అతనిని అదలించి ఆ ద్రవ్య మంతా తాను గ్రహించాడు. అప్పుడు నాభాగుడు "ఈ ధనం నాకు మును లిచ్చారు. ఇది నాది" అని పలుకగా ఆ మహాపురుషుడు - మీతండ్రి చెప్పినట్లు చేయటం మంచిది అన్నాడు. అప్పుడు నాభాగుడు తండ్రి అయిన నభగునకు ఈ వృత్తాంతం చెప్పగా అతడు యజ్ఞమందిరంలోవున్న అవశిష్ట ధనాన్ని పూర్వం మహర్షులు రుద్రునికిచ్చారు. అది కారణంగా ఆ దేవుడు సర్వధనానికి అర్హుడు- అనగా విని నాభాగుడు తిరిగివచ్చి ఆ మహాదేవునకు నమస్కరించి "దేవా! ఈ ధనం నీ అధీనమని నాతండ్రి నాకు చెప్పాడు. నేనే అపరాధం చేశాను. క్షమించు" అన్నాడు.

అప్పుడు భక్తవత్సలుడైన ఆ మహాపురుషుడు - ఓయీ! నీతండ్రి ధర్మం చెప్పాడు. నీవున్నూ సత్యం పలికావు. నే సంతోషించాను. కనుక యాగావ శిష్టమైన ఈ ధనం నీకిచ్చివేస్తున్నాను అని పలికి నాభాగునకు అంతర్దర్శిత్వం సనాతనమైన బ్రహ్మజ్ఞానం ఉపదేశించి తిరోహితుడయ్యాడు. ఆ మహాపురుషుడు రుద్రుడు ఒకప్పుడు దక్షాధ్వర్యంలో ఋషులందరూ ఏకీభవించి యాగావశిష్ట మైన ద్రవ్యం అంతా శంకరునదనీ, అది అతనికే చెందాలనీ నిర్ణయించారు. ఈ నాభాగుని చరిత్రను రేపూ మాపూ స్మరించినంత మాత్రం చేత పురుషుడు మంత్రజ్ఞు డవుతాడు. ఉత్తమ గతిని పొందుతాడు.

## అంబరీషో పాఖ్యానం

నాభాగునకు అంబరీషుడు జనించాడు. అతడు మహాత్ముడు. అమోఘ మైన బ్రాహ్మణ శాపం కూడా అతనిని స్పృశింపలేక అనర్థకమైనది- అని పలికిన శుకుని చూచి రాజేంద్రుడు "మునిపుంగవా! అప్రతిహతమైన బ్రహ్మ శాపం కూడా-అంబరీషుని బాధింపలేక పోయిందన్నావు. అది ఆశ్చర్యకరంగా వుంది. నాకు ఆ వృత్తాంతమంతా వినాలని కుతూహలంగా ఉంది' అని వేడే సరికి శుక మునీంద్రుడు ఇలా చెప్పటం మొదలుపెట్టాడు-

అంబరీషుడు సాటిలేని ప్రతిభగల సార్వభౌముడు. సప్తద్వీప విశాలమైన భూభారం అంతా తన భుజ స్తంభాన వహించి నిరాటంకంగా పరిపాలించాడు. అతని సంపదకూ, విభవానికీ మేరలేదు. అతడు మహా చతురుడు. అతనికి ఏ దుర్వ్యాపారాలు లేవు. ఏమరకుండా అతడు నిరంతం వైష్ణవసేవలను చేస్తూంటాడు. అతడు సకల సద్గుణ గరిష్ఠుడు. అతని మనస్సు ఎప్పుడూ

శ్రీహరి పాదపద్మములయందు లగ్నమై ఉంటుంది. అతడు ఎప్పుడూ శ్రీహరి గుణకీర్తనం చేస్తూంటాడు. విష్ణుమందిరాలను సమార్జనం[1] చేస్తూంటాడు. నిరంతరం మాధవుని పుణ్యకథలు వింటూ ఉంటాడు. గోవిందుని రూపాన్ని ఎప్పుడూ చూస్తూంటాడు. తలయొగ్గి కేశవునకు నమస్కృతులు చేస్తుంటాడు. అనుదినం ఈశ్వరాలయాలను దర్శిస్తూంటాడు రమాధవుని సేవకాక అతనికి మరొక కోరికేదీలేదు అనవరతం హరిభక్తుల సాంగత్యంలో కాలంగడుపుతాడు. అతడు నిత్యం శ్రీహరి భక్తుల పాదకమలాలను ఎప్పుడూ సేవిస్తూంటాడు. అతని నాల్క ఎడతెగకుండా తులసీదళములయందు ఆసక్తమై ఉంటుంది.

పాపరహితుడైన అంబరీషుడు యజ్ఞేశ్వరుడైన శ్రీహరినుద్దేశించి వశిష్ఠాది మునీంద్రులతోకూడి సరస్వతీ నదీతీరాన అనేక అశ్వమేధ యాగాలు చేశాడు యాజ్ఞికులకు లెక్కింప నలవికాని దక్షిణలు పెట్టాడు. అతని దృష్టిలో చిల్లపెంకైనా మేలిమి బంగారమైనా ఒక్కటే. అతడు సర్వకర్మములు శ్రీహరి పరంగా చేస్తాడు. అతడు నిరంతరం తన మనస్సును విష్ణుభక్తులందు, విష్ణువునందు నిలిపి రాజవృత్తిని విడవకుండా రాచతపస్వి అని పేరుగాంచాడు. అతడు మహా భాగవతుడు అతడు ఏది భావించినా, ఏది దర్శించినా, ఏది స్పృశించినా, ఏది ఆఘ్రాణించినా, ఏది ఆస్వాదించినా, శ్రీహరిని స్మరించిగాని చేయడు. అంతటి అసాధారణ భక్తుడైన అంబరీషుని పొగడటం ఎవరి తరమూకాదు. పుణ్యశీలుడూ, శ్రీహరి పరాయణుడూ అయిన అంబరీషుడు అలా రాజ్యపాలనం చేస్తుండగా అతనికి భౌతిక సంపదలయందు విరక్తి కల్గింది. హయములందు[2], కరులందు[3], ధనమునందు, క్రీడావనమునందు, పుత్రులయందు, బంధుమిత్రులయందు, పురమందు, అంతఃపురమందు అతనికి కోరిక తగ్గింది. ఆలా కొంతకాల మతడు సంసారమందు ఆసక్తి విడిచి ఏకాంతంగా నిశ్చలభక్తియోగంలో ఉండగా ఆ రాచతపస్వికి భక్తలోక వత్సలుడైన పురుషోత్తముడు శత్రుభయంకరమైన తన చక్రం ఇచ్చాడు.

అనంతరం ఆ నరేంద్రుడు నీడలాగా నిరంతరం తనను అనుసరిస్తూ తనకు అన్నింటను అనురూప అయిన పట్టమహిషితోకూడి ఒక వత్సరకాల పర్యంతమైన ద్వాదశి వ్రతాన్ని శ్రీహరి నుద్దేశించి చేశాడు. ఆ వ్రతాంతాన కార్తీకమాసంలో మూడు రాత్రులు ఉపవసించాడు యమునా జలాల్లో స్నానం చేశాడు. నానావిధ పరికరాలు గ్రహించి శ్రీహరికి మధువనంలో మహాభిషేకం చేశాడు. గంధాక్షతలు అర్పించాడు. సువాసనలు చిమ్మెడి పువ్వులతో

---

1 తుడిచి శుభ్రంచేయుట 2. గుఱ్ఱములందు 3. ఏనుగుల యందు

పూజించాడు. ఆపైన వేదవిదులైన పండితులకు ఆరు అర్బుదాల[1] ఆవులను సమర్పించాడు. అవన్నీ పాడిఆవులు పొదుగులనుండి పాలు ప్రవహిస్తూంటాయి. వాటి శరీరాలు కాంతులు చిమ్ముతూంటాయి. లేవయస్సులో అవి ఎంతో ముచ్చటగా ఉంటాయి. అవి సాధువులు. వాటి కాలిగిట్టలు రజతమయాలు[2]. కొమ్ములు కాంచనమయాలు. అవి తమబిడ్డల అఱ్ఱులు నాకుచూ మనోహరంగా ఉంటాయి.

అంబరీషుడు విప్రులకు అపారంగా ఆలమందలను దానంచేసి వారికి భక్తితో కంఠపూర్తిగా మృష్టాన్నం పెట్టాడు. అనంతరం వారి యాజ్ఞపొంది పారణం[3] చేయటానికి సంసిద్ధుడై యుండగా దుర్వాస మహర్షి అతని ఇంటికి అతిథిగా వచ్చాడు. దుర్వాసుడు తపోనిధి. వేదార్థాలు ఉపన్యసింపగలవాడు. యోగాభ్యాసరతుడు. సూర్యతేజస్కుడు అంబరీషుడు ఆ మహర్షిని చూసి ఎదురేగి తీసుకొనివచ్చాడు సుఖాసీనుని చేసాడు. అర్ఘ్యపాద్యాది అతిథి సత్కారాలు చేశాడు. అతని పాదాలకు నమస్కరించి తన ఇంట భుజించమని అర్థించాడు. దుర్వాసుడు అతని ప్రార్థనమంగీకరించి మాధ్యాహ్నిక విధులు నెరవేర్చటానికి యమునానదికి వెళ్ళాడు. శ్రీహరి ధ్యానంలో మునిగి అతడు ఆ నదిలో స్నానం చేశాడు. కాని ఎంతసేపటికీ ఒయటకి రాదయ్యె. అప్పటికి ద్వాదశి ఒక అరగడియమాత్రమే మిగిలిఉంది. ఆలోగా పారణచేస్తేకాని వ్రతఫలం దక్కదు.అతిథిగా వచ్చిన మహర్షి కాదని భుజించటం ధర్మంకాదు. అందుచేత. అతడు విద్వాంసులను రావించి — "మహాత్ములారా! స్నానార్థం యమునానదికి వెళ్ళిన మునిచంద్రుడు దుర్వాసుడు ఇంతవరకు తిరిగిరాలేదు. ద్వాదశి గడచిపోనున్నది. ఈలోగాపారణ తప్పకుండా చేయాలి. కనుక ఇప్పుడు నేను చేయదగిన ధర్మవిధి ఏమిటోచెప్పండి' అని ప్రార్థించేసరికి వారు ఆ నరేంద్రునికిలా అన్నారు-అతిథి వెళ్ళి రాలేదని ద్వాదశి పారణం మానటం ధర్మవిరుద్ధం. కనుక జలపానం చేస్తే నీకి అధర్మం చుట్టుకొనదు. జలపానం భుజించుటయు కాదు. భుజించకపోవుటయు కాదు. అలా చేయటంవలన వ్రతభంగంకానీ అతిథి నిరాకరణం కానీ కానేరదు.—అని వారు అతని ధర్మసందేహం తీర్చేసరికి ఆ రాజర్షి మనస్సులో శ్రీహరిని స్మరిస్తూ నీరు పారణం చేసి దుర్వాసుని రాకకు ఎదురుచూస్తున్నాడు.

ఇంతలో దుర్వాసుడు యమునానదిలో తన విధులను నిర్వర్తించుకొని తిరిగివచ్చాడు. తన బుద్ధిబలంతో రాజు చేసిన పని ఊహించాడు. అతడు ముక్కోపి. మహోగ్రుడయ్యాడు. అతని కనుబొమలు ముడివడ్డాయి. శరీరం

---

1. అర్బుదము=పదికోట్లు 2. వెండివి 3. ఉపవాసం ఉండి పారణ చేయు భోజనం.



కంపించింది. ఒకవైపు ఆకలి బాధతో కొట్టుమిట్టాడు తున్నాడు. అపుడు అచటనున్న విద్వాంసులను చూచి మహాత్ములారా! చూచారా! ఇతడు ధనమదాంధుడు. క్రూరుడు. దురంహకారుడు. వాస్తవంగా ఇతడు విష్ణు భక్తుడుకాదు. వీడు తన ఆతిథ్యం స్వీకరించటానికి నన్ను రమ్మనిపిలిచి తుదకు నన్ను తృణీకరించి తాను భుజించాడు. ధర్మభంగం చేశాడు. ఈ దురాత్ముడిని నేను ఇప్పుడేమిచేస్తానో చూడండి. నేను ఆగ్రహిస్తే నన్ను ప్రతిఘటించ గలవాడెవ్వరూ లేరు-

అని దుర్వాసుడు పెటపెటమని పండ్లుకొరికాడు. అతని కన్నులవెంట నిప్పులు కురుస్తున్నాయి. చెక్కిళ్ళు పొంగిపోయాయి. అతడు హుంకారంచేస్తూ ఒక జటను మొదలంటగా పెరికి దానితో కాలాగ్ని సమమైన ఒక శక్తిని నిర్మించి రాజుపై ప్రయోగించాడు. ఆ శక్తి శూలం ధరించి చుఱచుఱ మని గ్రుక్కుచు[1] పాదఘట్టనచే భూమి కంపింపగా నరేంద్రుని సమీపించింది. విశ్వరూపుడైన శ్రీహరి అది తెలుసుకొన్నాడు. "వెఱ్ఱి తాపసుని వంచన మాన్పు"మని చక్రాన్ని పంపాడు. అది ప్రళయాగ్నిలాగా వచ్చి శక్తిని దహించి తనివి తీరక మునివెంట వడ్డది. ముని మేరుపర్వతగుహ చొచ్చాడు. అది కూడా సర్పం వెంట కార్చిచ్చు వడ్డట్లు ఆ గుహలో చొచ్చింది. అది ఆ మునిని విడిచిపెట్టకుండా అతడు ఎక్కడికి వెడితే అక్కడకి అతన్ని వెన్నంటింది. అతడు భూమిలో దూరితే అదీ భూమిలో దూరుతుంది. సముద్రంలో దాగితే అదీ సముద్రంలో చొరబడుతుంది. ఉద్వేగంతో అతడు ఆకాశానికి ఎగిరితే అదీ ఆకాశానికి ఎగురుతుంది. దిక్కులకు పరుగిడితే అదీ దిక్కులకు పరుగిడుతుంది. అతడు క్రుంగితే క్రుంగుతుంది. నిలబడితే నిలబడుతుంది. తొలగితే తొలగుతుంది. ఆ మునీంద్రుడు పరలోకానికి వెళ్ళినా చక్రాగ్ని జ్వాలలు విడువకుండా అతని వెంటపడుతున్నాయి దానిని ప్రతిఘటించగల వారెవరూ కనపడలేదు. అప్పుడతను సురజ్యేష్ఠుడైన బ్రహ్మను దర్శించి "దేవా! ఈ చక్రాగ్నికీల నుండి నన్ను రక్షించు" అని అర్థించాడు. అపుడు బ్రహ్మ ఇలా అన్నాడు— మునీంద్రా! ఈ విశ్వం శ్రీహరికి క్రీడా సాధనం. క్రీడావసాన మందు దాన్ని సంహరిస్తాడు. అలాగే నన్నూ నశింపచేస్తాడు. రెండు పరార్థాల కాలాల తరువాత నేనూ ఉండను. కాల శరీరకుడైన ఆ మహాత్ముని చక్రాన్ని మరలించే శక్తి నాకు లేదు. నేనేకాదు శంకరుడూ, దక్షుడూ, భృగువూ, ఇంద్రాదులు, ప్రజాపతులు కూడా అతని ఆజ్ఞ శిరసావహిస్తారు—అని బ్రహ్మ నిరాకరించగా దుర్వాసుడు సంచలించి కైలాసానికి వెళ్ళి శివునకు జరిగిన వృత్తాంతం అంతా చెప్పాడు.

---

1. చుట్టుకుంటూ

మునీంద్రా! విను. విశ్వేశ్వరునియందు బ్రహ్మ మొదలైన అసంఖ్యాక జీవరాసులుగూడి అతడు తిరిగి సృజింపదలచిన కాలంలో తిరిగి పుడుతూ ఉంటారు. సంహరింప దలచినప్పుడు నశిస్తారు. నేనూ సనత్కుమారుడు, నారదుడు, చతుర్ముఖుడు, దేవలుడు, అజుడు, ధర్ముడు, కపిలాచార్యుడు, మరీచుడు మొదలైన మహాజ్ఞానులు, తక్కిన ఇతర సిద్ధులు—అందరం అతని మాయకు వశంగతులైనవారమే. అతని చేష్టలు మేమెవ్వరం తెలుసుకొన లేము. అలాంటి సర్వేశ్వరుని ఆయుధ శ్రేష్ఠమైన చక్రాన్ని నివారించటం మా వల్లకాదు. కనుక నీవు ఆ శ్రీహరిని దర్శించి అతన్ని శరణువేడు. అతడు కరుణా సముద్రుడు—అని పలికేసరికి దుర్వాసుడు హతాశుడై వైకుంఠ నగరానికి వెళ్ళాడు.

ఆ వైకుంఠంలో 'కనకసౌధాగ్రాన లక్ష్మీదేవితో వినోదంగా భాషిస్తూ, క్రీడిస్తూ ఉన్న' శ్రీహరిని చూచి దేవాధిదేవా! వరదా! భక్తజన రక్షణ వర తంత్రా! నేను అపరాధం చేశాను. నన్ను మన్నించి ఈ చక్రాగ్ని జ్వాలలు మాన్పు. సముద్రంలాంటి నీ మహిమ యొక్క సారం తెలుసుకొనలేక అల్ప బుద్ధితో నీకు ప్రేమ పాత్రుడైన భక్తునకు కీడు చేశాను. నా అజ్ఞానాన్ని సహించు. నరకగతుడైనవాడు కూడా మనస్సులో నీ నామాన్ని చింతిస్తే అనంతమైన సుఖస్థితిని పొందగలడు-అని పలికి తన పాదాలపైబడి లేవకుండా ఉన్న దుర్వాసుని చూచి శ్రీహరి ఇలా అన్నాడు.

తాపసా! నేను భక్త జనాధీనుడను. బుద్ధిమంతులైన సాధువులు నా హృదయాన్ని హరిస్తారు. మత్త గజాన్ని వలతో బంధించినట్లు నన్ను వారు భక్తి లతలతో బంధిస్తారు. వారిమీద గల వాత్సల్యంచేత నేను వారినిత్రోసి రాజనకుండా ఉంటాను. అలాంటివారి మేలుకోరటం నా కర్తవ్యం. భక్తులకు నేనేగతి. గోవు వెంట కోడెవలె నేను భక్తులు ఎక్కడికిపోతే అతని వెను వెంటనేవెళతాను. శరీరాన్ని ప్రాణాన్ని దార సుతాదులను సంపదలనువిడిచినన్ను గాక అన్యమేదీ ఎరుగని నా భక్తులను ఏ పరిస్థితిలోనూ నేను విడిచి పెట్టను. ఇంద్రియాలను నిగ్రహించి బుద్ధిమంతులైన వారు పుణ్యసతులు. మంచివరుని మరగినట్లు, నన్ను తమ హృదయంలో ప్రతిష్ఠించి నన్ను విడువకుండా ఉంటారు. సాధువుల హృదయం నాది. నేను సాధువుల హృదయాన్ని. ముజ్జగాల్లో ఉండే సాధువులను నేనెరుగుదును. సాధువులు నా చరిత్ర ఎరుగుదురు.

బ్రాహ్మణులైన వారికి తపస్సు, విద్యా ఈ రెండూ ముక్తిని కల్పిస్తాయి. దుర్జనులకు ఇవి కీడు చేస్తాయి. సాధువుల హృదయంలో నా తేజస్సు విస్తరించి ఉంటుంది. వారిని బాధించెడివారికి అది ఖడ్గంలాగ భీతిని కల్పిస్తుంది. మనస్సంతోషం చెడగొడుతుంది, అది తథ్యం. కనుక బ్రాహ్మణుడా! నీవు

ఆ అంబరీషుని శరణువేడు. అతడు దయార్ద్ర హృదయుడు. సద్గుణాకరుడు. అతనిని సంతోషపరచి ప్రార్థించు. నీకు అభయం ఇస్తాడు - అని రమాధవుడు ఆనతిచ్చాడు.

దుర్వాసుడు చక్రాగ్ని జ్వాలలు వెంటపడగా లోకాలన్నీ తిరిగి తిరిగి డస్సిపోయాడు. అతడు తేజోహీనుడయ్యాడు. అతడు నిట్టూరుస్తూ అంబరీషుని దగ్గరకు వెళ్ళాడు. అంబరీషుడు కరుణావారిధి. అతని వేషభాషలు మనోజ్ఞంగా ఉంటాయి. అతనిలో ఏదోషమూ లేదు. మేధావి. నీతికోవిదుడు. మృదువుగా, మితంగామాటలాడుతాడు. అలాంటి మహానుభావుడైన రాజేంద్రుని పాదాలుపట్టు కొనివిడువక పోయేసరికి అతడు చలించి కరుణా రసభరిత హృదయుడై హరి చక్రాన్ని ఇలా స్తుతించాడు - చక్రాయుధమా! నీవే అగ్నివి. నీవే సూర్యుడవు. నీవే జలం. భూమి. ఆకాశం. వాయువు. నీవే భూతేంద్రియ నికరం. నీవే బ్రహ్మవు. నీవే యజ్ఞం.. ఫలం. నీవే లోకాధిపతివి. సర్వాత్ముడవు. కాలానివి. ఈ జగత్తు అంతా నీవే. నీవు యజ్ఞభోక్తవు. నీవే మూల తేజానివి. నేను నీకు నమస్కరిస్తున్నాను. శ్రీహరికి ప్రీతిపాత్రమైన ఆయుధోత్తమా ఇక చాలును. ఈ మునిని రక్షింపుము.

యుద్ధరంగమందు శ్రీహరి నిన్ను విడిచి విడువగానే దైత్యులు ఇక మృత్యువు తప్పదని ముందుగానే వారు ఖండితాంగులై ప్రాణాలు విడుస్తారు. అదేకాదు వారు కలతనిద్రలో, కలలో నిన్ను చూస్తే చాలు భీతితో దీర్ఘనిద్ర పోతారు. తెలతెలవారుతుండగా అసురసతులు లేచి శయ్యలపై తమ ప్రక్కనే మృతిచెందిన భర్తలనుచూచి పలవరిస్తారు. చక్రాయుధమా! నీ కాంతులు చీకట్లను పారద్రోలి లోకానికి వెలుగునిస్తాయి. సజ్జనకోటికి శ్రేయస్సంపదలు ఇస్తాయి. విధాతకూడా నిన్ను వర్ణింపలేడు. నీవు పరాత్పరుడవు ఆద్యంత రహితుడవు. నీ మూర్తి మిక్కిలి మహత్తరమైనది. దుష్టశిక్షకుడైన శ్రీహరి ఆజ్ఞానుసారం నీవు ఈ తపస్వివెంట వచ్చావు. ఇక చాలును. ఆపన్నుడై ఉన్న ఈ మునీంద్రుని కరుణించు రక్షించు - అని అంబరీషుడు సుదర్శన చక్రాన్ని సన్నుతించి నొసట కేల్గవ ఘటించి ఇంకా ఇలా అన్నాడు.

ఆయుధముఖ్యమా! నీవు రాక్షసులపాలిట నాశహేతువగు తోకచుక్క లాంటివాడవు. ధర్మానికి సేతువు వంటివాడవు. నీ రూపం వినిర్మలమైనది. విశ్వానికంతటికి నీవు జ్యోతివి. నీవు ఇంద్రుని ఎన్నో పర్యాయాలు రక్షించావు. అలాంటి నీకు నా ప్రణామాలు. నేను విహితధర్మమందు విహరించే వాడినైతే, అర్థులకు కోరినద్రవ్యం ఇచ్చేవాడినైతే, బ్రాహ్మణుని నేను దైవతంగా భావించే వాడినైతే ఈ మునీంద్రునకు శుభం కల్గుగాక! అఖిల గుణాశ్రయుడైన శ్రీహరి నా సేవలకు సంతసించి పరవశించేవాడైతే ఈ భూమిసురుడు సుఖించుగాక! అని రాజేంద్రుడు సన్నుతించేసరికి చక్రం అగ్నిజ్వాలలచే తపసిని భంగించ

కుండా తిరిగి వెళ్ళిపోయింది. అపుడు దుర్వాసుడు శాంతించి మృదుమధుర వాక్కులతో అంబరీషుని దీవించి ఇలా అన్నాడు.

రాజేంద్రా! నీవు నా అపరాధాన్ని మన్నించి నీవు నాకు మేలు చేశావు. ఆశ్చర్యం. నీవు శ్రీహరి పాదకమలాలను ఇంత గాఢంగా సేవించావా! అయితే నిన్ను సామాన్య మానవుడని అనడానికి వీలులేదు. నీవంటి సాధువునకు ఇవ్వటం, రక్షించటం సహజ గుణాలు. అవి మిత్రాకారంతో ఒకదానితోపాటు ఒకటి వస్తూంటుంది. శ్రీహరి పేరు ఒక్కసారి చెవిపడితే చాలు సకల పాపాలు తొలగిపోతాయి. అతడు దేవేశుడు. మహానుభావుడు. అతని పాదాబ్జాల నుండి పవిత్ర తీర్థమైన గంగ జనించింది. అలాంటి శ్రీహరిని సేవించే భక్తులకు అడ్డంలేదు.

నాతప్పు సైరించి చక్రాగ్నిజ్వాలలు మాపావు. నీ దయారసం ప్రశంసనీయం. నా ప్రాణాలు పోయి తిరిగి వచ్చినట్లయింది. నేను ధన్యుడనయ్యాను. నేను ఎప్పుడూ నీశుభం కోరుతూ ఉంటాను. ఇకపోతాను - అని మునీంద్రుడు అనగా అంబరీషనరేంద్రుడు మునివల్లభుని పాదాలకు మ్రొక్కి అతనికి సకల సపర్యలు చేసి ఇష్టమృష్టాన్న భోజనం పెట్టించాడు. మునిచంద్రుడున్నూ సంతృప్తుడై - నరనాథా! ఈ నాటికి నిన్ను చూచాను. నీ మధుర వాక్కులను కర్ణపేయంగా విన్నాను. నీ ఇంట కడుపారా భుజించాను. నేను కృతార్థుడనయ్యాను. దివియందు, భూమియందు నరులు, సురలు నీ కీర్తిని సన్నుతిస్తారు - అని దుర్వాసుడు అంబరీషుని దీవించి, కీర్తించి ఆకాశమార్గాన బ్రహ్మలోకానికి వెళ్ళాడు. మునీశ్వరుడు వచ్చి తిరిగి వెళ్ళేసరికి ఒక సంవత్సరం నిండి వ్రతం పరిపూర్ణమైంది.

దుర్వాసుడు భుజించి వెళ్ళిన తరువాత పవిత్రమైన ఆ భుక్త శేషాన్ని రాజు భుజించాడు. అనంతరం రాజు తన మనస్సులో - మునీంద్రుని కష్టం పోగొట్టటానికి ఇదంతా శ్రీహరి కృపామహాత్మ్యం కాని వేరుకాదు. శ్రీహరిని సేవించేవారికి బ్రహ్మపదవి మొదలు సకలపద భోగాలు నరకసమాలే కాని సుఖహేతువులు కావు - అని భావించి అతడు విరక్తుడయ్యాడు. రాజ్యాధికారమందు అతనికి ఆసక్తి తగ్గింది. అపుడతడు తన కొడుకులకు రాజ్యభారం అప్పగించి అంతశ్శత్రువులైన కామాదులను జయించి శ్రీహరి సాయుజ్యం పొందాడు.

ఈ అంబరీషుని పుణ్యచరిత్రను కర్ణమధురంగా విన్నా, చదివినా పురుషుడు బుద్ధిసంపన్నుడవుతాడు. భోగపరుడవుతాడు. సకల పుణ్యఫలాలు అతనికి కరతలామలకాలవుతాయి.

పరీక్షిన్నరేంద్రా! ఇక అంబరీషుని వంశక్రమం చెబుతాను విను. అతనికి విరూపుడు, కేతుమంతుడు, శంభుడు అను ముగ్గురు కొడుకులు

పుట్టారు. వారిలో కేతుమంతుడూ, శంభుడూ హరినిగూర్చి తపస్సు చేయటానికి అరణ్యానికి వెళ్ళారు. విరూపునకు పృషదశ్వుడు, పృషదశ్వునకు రథీతరుడు కల్గారు. రథీతరునికి సంతతిలేక అతడు అంగీరసుని ప్రార్థింపగా ఆ మునీంద్రుడు అతని భార్యయందు బ్రహ్మతేజోనిధులైన కొడుకులను కల్గించాడు. వారు రథీతరుని భార్యవలన పుట్టటంచేత రథీతరగోత్రాలన్నినీ అంగీరస బీజంవలన జన్మించటంచేత ఆంగిరసులని ప్రఖ్యాతివహించారు. ఆ కారణం చేతనే రథీతరపుత్రుల సంతతివారి ప్రవరలో బ్రాహ్మణులు క్షత్రియులు కలిసి ఉన్నారు.

పరీక్షిన్నరేంద్రా! ఇక ఇక్ష్వాకుని వంశక్రమం వివరించి చెబుతాను విను. ఒకనాడు వైవస్వత మనువు తుమ్మేసరికి అతని ముక్కు రంధ్రాల నుండి మహా కీర్తిశాలియైన ఇక్ష్వాకుడు పుట్టాడు. అతడు సూర్య వంశానికి అధిపతి. ఇక్ష్వాకునకు నూరుగురు కొడుకులు పుట్టారు. వారిలో వికుక్షి, నిమి,దండకుడు అనువారు పెద్దవారు. ఈ ముగ్గురునూ ఆర్యావర్తంలో హిమవన్నగానికి, వింధ్య పర్వతానికి మధ్యగల మహీ మండలాన్ని పరిపాలించారు. ఇరువది ఐదు మంది ఆర్యావర్తానికి తూర్పువైపున, సముద్ర పర్యంతం గల భూమికి అధిపతులయ్యారు. అలాగే మరొక ఇరువది ఐదు మంది పడమటికి అధిపతులయ్యారు. మిగిలిన నలుబది ఏడుగురు దక్షిణోత్తర భూములను పాలించారు.

అలా ఉండగా ఇక్ష్వాకుడు అష్టకాశ్రాద్ధం[1] చేయాలనిసంకల్పించి తన జ్యేష్ఠ సుతుడైన వికుక్షిని పరిశుద్ధమైన మాంస ఖండం తెమ్మని అడవికి పంపాడు. తండ్రి ఆదేశాన్ని అనుసరించి వికుక్షి అరణ్యానికి వెళ్ళి అనేక మృగాలను వేటాడాడు. ఆకలిచే దస్సి ఒక శశాన్ని (కుందేలును) పట్టి తిన్నాడు. ఇక శేషించిన మాంసాన్ని తీసుకొని వచ్చి తండ్రికిచ్చాడు.

తన కుల గురువైన వశిష్ఠుడు అంతర్దృష్టితో వికుక్షి కుందేలు మాంసం తినటం తెలుసుకొని అతడు తెచ్చిన మాంసం ఎంగిలి అయినది కావున అది పైతృకానికి పనికి రాదన్నాడు ఇక్ష్వాకుడు గురువు వలన తన కుమారుడు చేసిన దుష్కార్యాన్ని తెలుసుకొని క్రోధోద్ధతుడై అతనిని దేశం నుండి వెళ్ళగొట్టాడు. కొడుకునారీతిగా దేశ బహిష్కృతుని చేశాక గుణనిధి అయిన ఇక్ష్వాకుడు వశిష్ఠుని ఆదేశానుసారం చేయవలసిన విధులు చేసి యోగి అయి అరణ్యానికి వెళ్ళాడు. అక్కడే శరీర త్యాగం చేసి ముక్తిపదం పొందాడు. తండ్రి అనంతరం వికుక్షి అశేష ధరణీ చక్రం పాలించి అనేక యజ్ఞాలు

1. అష్టకాశ్రాద్ధం=ఇది వైశ్యదేవ సంబంధమైన యజ్ఞాల్లో ఒకటి. ఈ యజ్ఞాన్ని మాఘ బహుళ షష్టి, సప్తమి, అష్టమి తిథులందు పితృ దేవతల నుద్దేశించి చేస్తారు.

చేశాడు. శశాన్ని (కుందేటిని) తినటం వలన అతనికి శశాదుడనే పేరు వచ్చింది. అతనికి పురంజయుడనే కొడుకు పుట్టాడు. ఆ పురంజయునకు అమరేంద్రవాహుడు, కకుత్స్థుడు అనికూడా పేర్లున్నాయి.

కృత యుగాంతంలో రాక్షసులకు దేవతలకు దారుణ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో అమరేంద్రుడు ఓడిపోయి శ్రీహరి సహాయం అర్థించాడు. అప్పుడు శ్రీహరి- నేను నా తేజంతో శశాద పుత్రుడైన పురంజయునియందు ప్రవేశించి ఉంటాను. నీవు అతనికి వృషభ రూపంలో వాహనం కా- అనగా దేవేంద్రుడు వృషభ రూపం దాల్చి, తన కకుత్ప్రదేశమున (మూపున) పురంజయుని మోశాడు. అప్పుడు పురంజయుడు దివ్య ధనుస్సును చేదాల్చి వాడి బాణాలతో దేవతలు ప్రస్తుతిస్తుండగా కాలాగ్ని లాగా రణ రంగానికి వెళ్ళాడు. అతడు ఆ ఘోర యుద్ధంలో తన బాణ సమూహంతో రాక్షస నాథుల శరీరాలు చీల్చి చెండాడాడు. కొందరి కంఠాలను త్రుంచి యమాలయానికి పంపాడు. కొందరిని పాతాళానికి త్రోలాడు. అంతటితో తనివి చెందక అతడు ఆ రాక్షసుల పురాలను కూల్చివేశాడు.

ఈ రీతిగా శశాద సుతుడు నిశాచరుల పురాలను జయించటంచేత పురంజయుడనియు, వృషభాకారంలో ఇంద్రుడు వాహనం అవటంచేత ఇంద్ర వాహనుడనియు, ఆతడి మూపురం ఎక్కి యుద్ధం చేయటం వలన కకుత్స్థుడనియు మూడు పేర్లతో ప్రసిద్ధికెక్కాడు. అతడు రణ రంగంలో దైత్యులను జయించి వారి ధనాన్ని ఇంద్రున కిచ్చాడు. ఆ పురంజయుని పుత్రుడు అనేనసుడు. అతని పుత్రుడు పృధువు. పృధువు కొడుకు విశ్వగంధుడు, విశ్వగంధునకు చంద్రుడను కొడుకు పుట్టాడు. చంద్రసుతుడు యవనాశ్వుడు, యవనాశ్వ తనూభవుడు శవస్తుడు. అతడు శావస్తనామ నగరం నిర్మించాడు. శవస్తుని కుమారుడు బృహదశ్వుడు. బృహదశ్వునకు కువలయాశ్వుడను మహా వీరుడు జన్మించాడు.

అతనికి ఇరువది ఒకవేల మంది కొడుకులు పుట్టారు. వారందరూ మహా వీరులు. అతడు తన పుత్రులతో కలిసి ఉదంక ముని ఆదేశానుసారం ధుంధుడను దైత్యునితో యుద్ధం చేసి అతన్ని చంపివేశాడు. అందుచే అతనికి ధుంధుమారుడు అను నామాంతరం కల్గింది. ఆ యుద్ధంలో అతని కొడుకుల్లో ముగ్గురు తప్ప మిగిలిన వారందరూ ధుంధుని ముఖాగ్నికి అహుతులయ్యారు. దృఢాశ్వుడు, కపిలాశ్వుడు, భద్రాశ్వుడు అను ముగ్గురు మాత్రం మిగిలారు. వారిలో దృఢాశ్వునకు హర్యశ్వుడూ,అతనికినికుంభుడూ,వానికి బర్హిణాశ్వుడూ, అతనికి కృశాశ్వుడు, వానికి సేనజిత్తు, ఆ సేనజిత్తునకు యువనాశ్వుడు పుట్టారు, యువనాశ్వుడు సంతానహీను డవటంచేత మిక్కిలి దుఃఖించి తన నూరుగురు భార్యలతోనూ అరణ్యానికి పోయి అచ్చట నిర్వేరపడి యుండగా

అచటి మునులు చూచి జాలిపడి అతనిచేత ఇంద్రదేవతాకమైన పుత్ర కామేష్టిని చేయించారు. రాజు భార్యకు పుత్ర లాభం కల్గించాలనే ఊహతో మునులు జలం మంత్రించి జల కలశాన్ని యాగశాలలో ఒక రహస్య ప్రదేశంలో దాచి నిద్రపోయారు.

ఆ రాత్రి రాజైన యువనాశ్వుడు దప్పికగొని ఆ యజ్ఞ మందిరంలో ప్రవేశించి ఆ జల కలశంతో నీరు త్రాగాడు. మునులు నిద్ర మేల్కొని చూచే సరికి ఆ జల కలశంలో నీరు లేదు. దాన్ని ఎవరు త్రాగారో అని విస్మితు లయ్యారు. రాజు త్రాగినట్లు మనో దృష్టితో గ్రహించారు. 'ఔరా! విచిత్రం. ఈశ్వరాజ్ఞ అతిక్రమించటానికి ఎవ్వరి తరం కాదు. ఆ ఈశ్వరునకు మా నమస్కారం. ఇప్పుడు కర్తవ్య మేమిటి?" అని వారు దుఃఖిస్తూంటగా యువనాశ్వుని కడుపు చీల్చుకొని చక్రవర్తి చిహ్నాలు గల ఒక కుమారుడు జన్మించాడు. తల్లిలేని కారణంచేత కడుపునకు లేక ఆ బిడ్డ ఏడుస్తూండగా ఇంద్రుడు వచ్చి ఆ శిశువునకు ఆకలి తీరటానికి వానినోట తన వ్రేలిని ఉంచాడు. దానిని త్రాపటంచేత వానికి మాంధాత* అనే పేరు వచ్చింది. కడుపును చీల్చుకొని కొడుకు పుట్టినా తండ్రి మృతుడు కాలేదు. దేవతల యొక్కయు విప్రుల యొక్కయు కరుణ అలాంటిది. వారి కరుణా విశేషానికి పాత్రులైన వారెవ్వరూ చెడరు. యువనాశ్వుడు కొంత కాలానికి తపస్సు చేసి సిద్ధి పొందాడు.

వసివాడైన మాంధాత పడమట దిక్కున ఉదయించెడి బాలచంద్రుని లాగా క్రమక్రమాభివృద్ధి చెంది పరిపూర్ణ యౌవనారూఢుడయ్యాడు. రావణుడు మొదలైన శత్రురాజుల మదాన్ని అణచాడు. అతని శౌర్యం చూచి దేవేంద్రుడు అతనిని త్రసదస్యుడని నుతించాడు. అఖిల దేవ మయుడు, అతీంద్రియుడు, ధర్మాత్ముడు, యజ్ఞాధీశుడు అయిన రమాధవుని ఆత్మయందు నిలుపుకొని అనేక యాగాలు చేశాడు. పురోడాశాది ద్రవ్యం, మంత్రాలు, విధులు, ధర్మాలు, దేశం, కాలం, యజమాని, ఋత్విజులు ఈ సమస్తం విష్ణురూపాలని భావించి బ్రాహ్మణులకు భూరి దక్షిణలు ఇచ్చాడు. అతడు శ్రీహరి కరుణచేత రవి చంద్రుల కాంతి యెందాకా ప్రకాశిస్తుందో అంతమేరా తన బలిమితో ప్రజలను శాసిస్తూ పాలించాడు అతని భార్య శతబిందుని కూతురు బిందుమతి. ఆమె వలన అతనికి పురుకుత్సుడు, అంబరీషుడు, ముచుకుంద్యుడు అను ముగ్గురు కొడుకులును యాబది మంది కుమార్తెలును జనించారు ఆ కుమార్తెలందరూ

* ఇంద్రుడు అమృతమయుడు. కనుక తన బొటన వ్రేలు చూపి "మాంధాన్యతు" (నా వ్రేలు కుడువుము) అనగానే వాడు కుడిచి పెద్దవాడై చక్రవర్తి అయ్యాడు. అందుకనే అతనికి మాంధాత అనే పేరు వచ్చింది.

సౌభరి అను మహర్షిని పెండ్లాడారు. నరేంద్రా! నీకు ఆ వృత్తాంతం చెబుతాను విను.

సౌభరి ఒకనాడు యమునా నదిలో తపస్సు చేస్తున్నాడు. అప్పుడతనికి తన ఆలుబిడ్డలతో మహానందంతో తిరుగుతూన్న ఒక పెద్ద చేప కన్పడ్డది. ముని మనస్సు చలించింది. సంసారిక సుఖాలు అనుభవించాలని అతనికి కోరిక కల్గింది. అతడు వెంటనే మాంధాత దగ్గరకి వెళ్ళి ఒక కుమార్తెను తనకిమ్మని అడిగాడు. అప్పుడు రాజు స్వయంవరంలో నీవు నీయిష్టం వచ్చిన కన్యను చేపట్టవచ్చునన్నాడు. అప్పుడు సౌభరి తన మనస్సులో ఇలా అనుకొన్నాడు. నేను ముసలి వాడను. ఇటు అటు వణుకుతూ ఉంటాను. నాజుట్టు తెల్లగా నెరసింది. నా శరీరం జిగిబిగిలేక శిథిలమైపోయింది. అటువంటి నన్ను యువ్వనవతి అయిన ఏ కన్య భరిస్తుంది? కన్యను ఏ ఉపాయంచే ఆకర్షించగలను. సౌందర్యవతి, యవ్వనవతి అయిన కన్య పడుచు వానిని, అందగానిని ధనవంతుని ప్రేమిస్తుంది గానీ ముసలి తాపసిని ప్రేమిస్తుందా?

అని విచారించి సౌభరి తన తపోబలం చేత తన ముసలితనాన్ని పోగొట్టుకొని ఎలప్రాయపు కుమారుడయ్యాడు. చక్కగా అలంకరించుకొని మాంధాత ఎదుట నిలబడ్డాడు మాంధాత అంతఃపురంలో ఉన్న కన్యకలకు అతన్ని చూపించాడు. అతన్ని చూడగానే వారందరూ కామోద్రేకంతో చలించి పోయారు. మరుడో[1], జయింతుడో[2], నలకూబరుడో[3] ఏమరుపాటున వచ్చాడు అని భావించి ఆ కన్యలు అతనిని చేపట్టటానికి "నేను, నేను" అని అందరూ ముందుకు వచ్చారు. అప్పుడు సౌభరి వారందరినీ పెండ్లాడి ఒక వనంలో ఉన్న తన ఆశ్రమానికి తీసుకొని వెళ్ళాడు. అక్కడ తన తపశ్శక్తి చేత ఒక్కొక్కదానికి ఒక దివ్యభవనం నిర్మించాడు. వారి వినోదం కోసం క్రీడాపర్వతాలు కల్పించాడు. కలువలతోనూ, తామర పువ్వులతోనూ, కనువిందు చేసున్న కొలనులు సృష్టించాడు. అవ్యక్తమైన కంఠం గల తుమ్మెదల ఝుంకారాలతోనిండిన ఉద్యానవనాలను నిర్మించాడు. మణివేదికలతో మనోహరమైన పర్యంకాలతో లీలానగ గృహాలయందు శృంగారవతులైన చెలువలు సేవించగా చక్కని వలువలు దాల్చి మంచిగంధం అలదికొని స్వర్ణభూషితుడై ఇష్టాన్నాలు భుజిస్తూ పూటపూటకు ఒక వింతసొగసు వహించి ఆ రాజకన్యకలందరినీ రతిక్రీడలతో తేలుస్తున్నాడు. అమితమైన నేతి ధారలతో తృప్తి చెందని అగ్నిదేవునిలాగా ఆ మునీంద్రుడు అంతమంది సుందరాంగులకు తానొక్కడే మగడైయుండి కూడా తృప్తిచెందకుండా ఉన్నాడు. అతడు

1. మరుడు=మన్మథుడు, 2. జయంతుడు = ఇంద్రుని కొడుకు, నలకూబరుడు=కుబేరుని కొడుకు

ఉద్యానవనాల్లో ఆ యువతులతో విహరిస్తూ వారితో గారాబాలు చేస్తూ ఎంతో ఆనందంతో ప్రొద్దులు గడపుతున్నాడు.

అలా ఉండగా ఒకనాడు మాంధాత మునీశ్వరుడెలా ఉన్నాడో తన కూతుళ్ళు ఎక్కడ ఏమి బాధలు పడుతున్నారో అని భావించి వెదుక్కుంటూ వచ్చాడు. ఒక గహన వనంలో మణిమయ సౌధాల్లో చక్రవర్తిలాగా మహా భోగాలనుభవిస్తున్న మునిరాజును చూచి సంతసించి ఆశ్చర్యపడ్డాడు. అతనిచే పూజితుడై కుమార్తెలను చూచి - బిడ్డలారా! మీరందరూ సుఖంగా ఉన్నారు కదా? అని ప్రశ్నించగా వారందరూ వరుసగా "నాతోడు, నాతోడు, మేమంతా సుఖంగా ఉన్నాం" - అని అన్నారు. రాజు ఆనంద భరితు డయ్యాడు.

కొంతకాలం అయ్యాక బహు భార్యలతో గృహస్థాశ్రమ భోగాలు అనుభవించిన సౌభరి ఏకాంతంలో మీనమిధున సంగదోషం చేత తనకీ సంసారపు తగులం కల్గిందే! అని పశ్చాత్తాపంతో ఇలా అనుకొన్నాడు. అయ్యో! ఉపవాసాలు చేయటం, విషయవాసనలు విడిచిపెట్టటం, నిరంతర తపస్సులో మునిగి ఉండటం, శ్రీహరి పాదాలను ధ్యానించటం మునులకు కర్తవ్యం. అలాకాక అజ్ఞానంతో ఇంతకాలం స్త్రీలోలుడనై కాలం గడిపాను. నా తపస్సు చెడిపోయింది నాకు కైవల్యం లభించదు. నేను మునిని. తత్వవేదిని. మోక్షం కాక అన్యసుఖాలు పనికిరావు. స్త్రీలముఖం చూడకూడదు. అలాంటప్పుడు నాకీ సౌధాలేమిటి? నేను అయిదువేల మంది బిడ్డలను కనటం ఏమిటి? భోగ పరాయణమైన ఒక మీన కుటుంబాన్ని చూచి నేనీ సంసార లంపటంలో పడటం ఏమిటి? మహాత్ములైన వారు నన్ను చూచి నవ్వుకుంటారు కాని నన్ను మెచ్చుకుంటారా? తపం చేసేవాడు, తత్వజ్ఞుడైన వాడు, మోక్షకామి అయినవాడు ఎన్నడూ ఏకాంతంగానే ఉంటాడు. నిక్కపు తపసికి ఈ కాపురం ఏమిటి?

అని దుఃఖించి తన్నుతాను నిందించుకొంటూ తన అజ్ఞానాన్ని వివేకించుకొంటూ ఇహపరసాధకుడై సంసారం విడిచిపెట్టాడు. తన సతులతో గూడి అడవికిపోయి వానప్రస్థ ధర్మం అవలంబించి ఘోరతపస్సు చేశాడు. తుదకు శరీరాన్ని కుదించి అగ్నిలో ఆహుతుడై బ్రహ్మసాయుజ్యం పొందాడు. అనంతరం మునిపత్నులు అగ్నిని అనుసరించు అగ్నిజ్వాలల్లాగా తమ ప్రాణ వల్లభునితో పాటు తాముకూడా ముక్తిచెందారు.

## మాంధాత వంశ పరంపర

రాజేంద్రా! మాంధాత కొడుకుల్లో అంబరీషుడను వానిని అతని పితామహుడు యువనాశ్వుడు పుత్రునిగా స్వీకరించాడు. ఆ అంబరీషునకు యౌవనాశ్వుడు, అతనికి హరితుడు పుట్టాడు. ఆ కారణంచేత అంబరీషుడు,

యౌవనాశ్వుడు, హరితుడు మాంధాతృ గోత్రానికి ప్రవరు[1] అయ్యారు. మాంధాత మరొక కొడుకు పురుకుత్సుడు నాగకన్యకయగు నర్మదని పెండ్లి యాడాడు. ఆమె భర్తృ ప్రేమకు పాత్రురాలై తన సోదరులైన సర్పరాజుల కోర్కెపైన అతనిని పాతాళానికి తీసుకొనిపోయింది. అక్కడ విష్ణుబల సంపన్నుడైన పురుకుత్సుడు అజేయులైన గంధర్వనాథులను జయించి తన నాగలోక సంచరణం స్మరించువారికి సర్పభయం లేకుండా వరంపొంది తిరిగివచ్చాడు. ఆ పురుకుత్సునకు త్రసదస్యుడు, త్రసదస్యునకు అరణ్యుడు, అతనికి హర్యశ్వుడు, హర్యశ్వునకు త్ర్యరుణుడు జన్మించారు. ఆ త్ర్యరుణనకు త్రిబంధుడు జన్మించాడు. వానికి సత్యవ్రతుడు కల్గాడు. ఆ సత్యవ్రతుడే త్రిశంకుడని ప్రఖ్యాతి పొందాడు.

రాజేంద్రా! గురుశాపవశంచేత చండాలుడై ఆ త్రిశంకుడు విశ్వామిత్రుని ఆశ్రయించాడు. విశ్వామిత్రుడు తన తపశ్శక్తిచేత అతనిని సశరీరంగా స్వర్గానికి పంపాడు. కాని దేవతలు అతని రాకకు అంగీకరింపక క్రిందికి త్రోశారు. అతడు తలక్రిందుగా పడి దైన్యంతో రాగా కౌశికుడు తన శక్తితో ఆకాశమందు నిలిపాడు. అతడు ఈనాడునూ నక్షత్రరూపంలో అక్కడ ఉన్నాడు. త్రిశంకుని కొడుకు హరిశ్చంద్రుడు. కౌశికుడు హరిశ్చంద్రునికడకు వెళ్ళి యాగదక్షిణ అను వంకతో అతని సమస్త ధనాన్ని హరించాడు. ఆపైన ఒక కులహీనునివద్ద కొలువులో పెట్టాడు. హరిశ్చంద్రుడు మహాసత్యనిరతుడు. విశ్వామిత్రుడు అలా హరిశ్చంద్రుని బాధించి నిర్ధనునిగా చేసిన విషయం విని అతని కులగురువైన వశిష్ఠుడు విశ్వామిత్రుని గ్రద్దవు కమ్మని శపించాడు. విశ్వామిత్రుడున్నూ వశిష్ఠుని కొంగవుకమ్మని శపించాడు. ఇలా ఇద్దరూ పరస్పర శాపకారణంగా పక్షి రూపాలతో వైరం విడువక చిరకాలం యుద్ధం చేశారు.

అలాఉండగా సంతానహీనుడైన హరిశ్చంద్రుడు నారదుని ఉపదేశాను సారం వరుణదేవుని ఉపాసింపగా ఆ వరుణుడు ప్రత్యక్షమయ్యేసరికి అతనికి మ్రొక్కి, హరిశ్చంద్రుడు - దేవా! నాకు వీరుడు, గుణవంతుడు అయిన కొడుకు జన్మిస్తే ఆ కొడుకును యజ్ఞపశువుగా చేసి నీకు వ్రేలుస్తాను. నాకు కొడుకును అనుగ్రహించు - అని అర్థించగా వరుణుడు అలాగే అని వరం ఇచ్చి వెళ్ళిపోయాడు.

వరుణ ప్రసాదంచేత హరిశ్చంద్రునకు రోహితుడను కొడుకు పుట్టాడు. అది విని వరుణుడు పురిటిలోపలవచ్చి కొడుకును వ్రేల్చమని హరిశ్చంద్రుని అడిగాడు. పురుడు అయితేగాని యాగంలో కొడుకును వ్రేల్చటం సాధ్యంకాదని

1. వంశశ్రేష్ఠులు

హరిశ్చంద్రుడన్నాడు. వరుణుడు "సరే" అని వెళ్ళిపోయి పురుడు గడిచాక వచ్చి యాగం చేయమన్నాడు. దానికి ఆ రాజు పిల్లవానికి దంతాలువస్తేకాని యాగయోగ్యుడుకాదని అభ్యంతరం తెలిపాడు. పిల్లవానికి దంతాలు వచ్చిన తరువాత వరుణుడు మళ్ళావచ్చాడు. 'కాని అవి పాలదంతాలు, అవి ఊడితే కాని యాగయోగ్యుడు కాదని' హరిశ్చంద్రుడు అన్నాడు. వరుణుడు దానికీ సమ్మతించి బాలునకు పాలదంతాలు పూడినవెంటనే వచ్చి యజ్ఞం చేయమని పట్టుబట్టాడు అపుడు రాజు బాలునకు మళ్ళీ దంతాలు వస్తేకాని యాగ పశువవటానికి యోగ్యుడు కాదని నిరాకరించాడు పదిపళ్ళు వచ్చాక వరుణుడు మళ్ళీ వచ్చాడు. కాని బాలుడు యుద్ధయోగ్యుడై తేకాని వేల్వడానికి అర్హుడు కాదని హరిశ్చంద్రుడు మళ్ళీ అడ్డం పెట్టాడు హరిశ్చంద్రుడిలా ఏదో సాకుతో కాలయాపన చేయటంచూచి వరుణుడు సహనభావంతో తగిన సమయంకోసం నిరీక్షిస్తున్నాడు. ఇంతలో రోహితుడు తన తండ్రి తనను యాగపశువుగా చేయనున్నాడని గ్రహించి తన ప్రాణం రక్షించుకొనేందుకు విలునమ్ములు ధరించి అరణ్యానికి పారిపోయాడు. ఆ వార్తవిని వరుణుడు కోపించి ఉదరవ్యాధిరూపంతో హరిశ్చంద్రుని బాధింపటం మొదలుపెట్టాడు. తండ్రికి సంభవించిన ఆపద తెలుసుకొని రోహితుడి హృదయం ద్రవించింది. తండ్రిని చూడాలనే కుతూహలంతో అరణ్యంనుండి బయలుదేరాడు. దారిలో ఇంద్రు డతనికి ముసలి తపసి అయి ఎదురుపడి "ఓయీ! నీవిప్పుడు నీ తండ్రివద్దకు పోవద్దు అతడు కుక్షి రోగంతో బాధపడుతున్నాడు.నీవు పుణ్యక్షేత్రాలకు వెళ్ళి పుణ్యతీర్థాలలో క్రుంకి పుణ్యకథలువింటే నీ తండ్రి వ్యాధి మరలిపోతుంది" అన్నాడు' అప్పుడు రోహితుడు ఒక ఏడు ఇంద్రుడు చెప్పినట్లు చేసి తిరిగి నిజనగరానికి బయలుదేరగా ఇంద్రుడు పూర్వం మాదిరిగావచ్చి నివారించాడు. అలా ఇంద్రుడు ఆ బాలుని ఐదు సంవత్సరాలు ఇంటికి వెళ్ళకుండా మరల్చాడు.

ఆరవఏడు అడవి నుండి రోహితుడు ఇంటికి వస్తూ దారిలో భృగు వంశ సంభూతుడైన అజీగర్తు కుమారుడు శునశ్శేపుడును వానిని కొని తన నగరాని వచ్చి తనకు బదులుగా తన తండ్రికి ఆ బాలుని యాగ పశువుగా అర్పించాడు. హరిశ్చంద్రుడు వరుణ ప్రీతిగా నరమేధంచేసి రోగ విముక్తు డయ్యాడు. ఆ నరమేధంలో విశ్వామిత్రుడు హోత. భృగువు అధ్వర్యుడు. జమదగ్ని బ్రహ్మ, వశిష్ఠుడు ఉద్గాత[1]. ఇంద్రుడు ఆ యాగం చూచి సంతో షించి హరిశ్చంద్రునకు కనక రథం ఇచ్చాడు.

---

1. యజ్ఞమునందు సామవేద తంత్రం నడిపేవాడు.

రాజేంద్రా! శునశ్శేపుని ప్రభావం తరువాత చెబుతాను. హరిశ్చంద్రుని అనంతర గాథ చెబుతాను విను. విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని వలన సంప్రీతుడై దోషరహితుడైన అతనికి ఆత్మజ్ఞానం ఉపదేశించాడు. హరిశ్చంద్రుడు ఆ జ్ఞానబలంచేత మనస్సును పృథ్వియందు చేర్చి ఆ పృథ్విని జలంతోనూ, జలాన్ని తేజస్సుతోనూ, తేజస్సును వాయువుతోనూ, వాయువును గగనంతోనూ కలిపి ఆ గగనాన్ని తామసాహంకారంతో చేర్చాడు. అనంతరం ఆ తామసాహంకారాన్ని మహత్తత్వమందు లయంచేసి, ఆ మహత్తత్వాన్ని పరతత్వంగా గ్రహించాడు. ఆ ఎఱుకవలన సంసారహేతువైన ప్రకృతిని దగ్ధంచేసి, ఆ జ్ఞానాన్ని నిర్వాణ సుఖపరవశత్వంతో పరిహరించి సకల బంధ విముక్తుడై, హరిశ్చంద్రుడు వాక్కునకు మనస్సునకు గోచరంకాని నిజరూపంతో ప్రకాశిస్తున్నాడు అతని కుమారుడు లోహితునకు హరితుడు పుట్టాడు.హరితునకు చంపకుడు అనువాడు జన్మించాడు. అతడు తనపేర చంపానగరం నిర్మించాడు. ఆ చంపునికి సుదేవుడు, సుదేవునకు విజయుడు, విజయునకు రురుకుడు, రురుకునకు ఉరుకుడు, ఉరుకునకు బాహుకుడు జనించారు.

## సగర చక్రవర్తి కథా ప్రారంభం

బాహుకుడు రాజ్యపాలనం చేస్తుండగా శత్రువులు అతనిపై దాడిచేసి అతన్ని ఓడించేసరికి అతడు భార్యా సహితుడై అడవులకు పోయి వార్ధక్యంతో అచట చనిపోయాడు. అప్పుడు అతని భార్య భర్తృ వియోగం సహింపలేక అతనితో పాటు ప్రాణత్యాగం చేయటానికి సిద్ధపడింది కాని అప్పుడామె గర్భవతి. ఔర్వుడనే మునీంద్రుడు తన మనోదృష్టితో ఆ విషయం తెలుసుకొని ఆ ప్రయత్నం నుండి ఆమెను వారించాడు. ఆమె నిండు చూలాలయ్యేసరికి ఆమె సవతులు చూచి సహింపలేక ఆమెకు అన్నంలో విషంకల్పి పెట్టారు. కాని ఆ విషం వలన ఆమెకాని, ఆమె గర్భస్థ శిశువుకాని మృతి చెందలేదు. కొంతకాలానికి ఆమెకు ఒక కొడుకు పుట్టాడు. గరళంతో (విషంతో) కూడా పుట్టినందువలన ఆ బాలుడు సగరుడని ప్రఖ్యాతిగాంచి సమస్త భూమండలాన్ని పరిపాలించాడు.

సగరుడు మహావీరుడు. అతడు తనతండ్రిని రాజ్యభ్రష్టునిగా చేసిన వారిపై పగతీర్చుకొనేందుకు ఉద్యుక్తుడయ్యాడు. యుద్ధరంగాల్లో హైహయలూ బర్బలూ మొదలైన శత్రురాజులను ఓడించాడు. తాళజంఘాదుల్లో కొందరి బుర్రలు గొరిగించాడు కొందరిని వివస్త్రులుగా చేశాడు. మరికొందరిని వికృతాకారులుగా చేశాడు. రవి చంద్రుల్లాగ మహాతేజస్వులైన శత్రురాజు

అందరినీ పరిభ్రమించి తన బాహుశక్తితో సమస్త భూమండలాన్ని పరిపాలిం చాడు. మేరునగ ధీరుడైన ఆ సగరుని వినుతించటం ఎవ్వరి తరమూ కాదు.

ఔర్వముని ఆదేశానుసారం వేదాత్మకుడైన శ్రీహరిని గూర్చి సగరుడు అనేక వాజమేధాలు చేశాడు. అందులో ఒక యజ్ఞంలో గుఱ్ఱాన్ని విడువగా ఇంద్రుడు దానిని పట్టుకొనిపోయి నాగలోకంలో తపోమగ్నుడైన కపిల మహర్షి దగ్గరగా కట్టివేశాడు. అపుడు గుఱ్ఱం కన్పడక పోవటంచేత సగరుడు దానిని వెతకటానికి తన పుత్రులను నలుదిక్కులకు పంపాడు. వారు ఏడు దీవుల్లో మూల మూలలూ వెతికారు. కాని యాగాశ్వం కన్పడలేదు. అయినా తిరిగి రాకుండా వారు మహా భుజబలంతో భూమండలం అంతా గ్రొచ్చి కోరాడి త్రవ్వారు. వారందరూ సగరునకు సుమతి వలన కలిగిన కొడుకులు. వారలా నేల త్రవ్వి పాతాళంలో ఈశాన దిక్కున కపిల మహాముని చెంతనున్న గుఱ్ఱాన్ని చూచారు.

"భళీ! గుఱ్ఱం దొరికింది. ఇతడే గుఱ్ఱపు దొంగ. పైకి సాధువైన మునిలాగా నిమీలిత నేత్రుడై నోరు మెదల్పక మౌనంగా ఉన్నాడు. ఇతడు వంచకుడు ఇతన్ని చంపుదాం' అని ఆ అరువది వేల మంది సగర పుత్రులు ఆయుధాలు ఝుళిపిస్తూ దగ్గరకి వెళ్ళారు. ఆ సంరంభం చూచి కపిలుడు కళ్ళు తెరిచాడు. వారి శరీరాలలో మంటలు పుట్టాయి. వారి ధైర్యసారం సడలి పోయింది. వారి పాప కృత్యాలు మూలంగా మూఢ చిత్తులై ఆ రాకుమారు లందరూ తక్షణం భస్మీకృతులయ్యారు సాధువులను బాధింప గోరిన మదో న్మత్తులు నిలుస్తారా? కొందరు కపిలుని కోపాగ్ని చేత సగర కుమారులు చచ్చారని అంటారు. కాని అది తప్పు. కపిల మహర్షి చాల శాంతుడు. ఆనందమయమూర్తి. అతనికేమిటి? కోపమేమిటి? దుమ్ము నేలపై కాక ఆకాశ మందు జన్మిస్తుందా? ఎవ్వని ముఖం నుండి ఉదయించి సాంఖ్యమతం చేత బుద్ధిమంతులు సంసార సముద్రాన్ని లంఘిస్తారో అటువంటి మహాప్రభావుడు సర్వజ్ఞుడు అయిన కపిలునకు శత్రు మిత్ర భావం ఎలా సంభవిస్తుంది? సగర పుత్రులు స్వయంకృతాపరాధం చేతనే అగ్ని కీలలకు దగ్ధులయ్యారు కాని వాస్తవంగా వారి మృతికి దయా సముద్రుడైన కపిలుడు కారణం కాదు.

సగరునకు కేశిని రెండవ భార్య. ఆమె వలన అతనికి అసమంజసుడను కొడుకు పుట్టాడు. వాడు గుణశీలుడు. పూర్వ జన్మలో యోగీశుడై యుండి సాంగత్య దోషం వలన యోగ భ్రష్టుడై సగరునిగ జన్మించాడు అతని దుష్ట వర్తనకు అందరూ అసహ్యించుకొన్నారు. ఒకనాడతడు అయోధ్యలో గల తన ఈడు పిల్లలను సరయూనదిలో ముంచివేశాడు. తండ్రీ, పౌరులూ కూడా అతన్ని ఎంతో నిరసించారు. కాని అతడు తన యోగబలం చేత కొన్నాళ్ళకు ఆ పిల్లలందరినీ తిరిగి నగరంలోకి రప్పించేసరికి అందరూ నివ్వెర పోయారు.

ఆ అసమంజసుని కొడుకు అంశుమంతుడు. అతడూ వినీతుడు. సగరునకు ప్రీతి పాత్రుడు. అందుచేత సగరుడు తన మనుమడైన అంశుమంతుని గుఱ్ఱాన్ని వెతికి తెమ్మని పంపించాడు అంశుమంతుడు తన తండ్రులు పోయిన దారిని పోయి వారు త్రవ్విన మహా ఘాతంలో ప్రవేశించాడు. అక్కడ భస్మ రాసుల పొంత ఉన్న గుఱ్ఱాన్ని చూచాడు ఆ సమీపమందు ఉన్న కపిల మహర్షికి దండ ప్రణామం చేసి ఇలా స్తుతించాడు.

మనోనిగ్రహం కల్గి సమాధి గౌరవంతో తనకు అవల వెలిగెడి నిన్ను బ్రహ్మ కూడా తెలుసుకోలేడు. అలాంటప్పుడు బ్రహ్మ వలన సృజింప బడిన అల్పులమైన మాకు తెలియటం సాధ్యమా? శరీర ధారులు నీ మాయచే మోహితులై ప్రపంచంలో కన్పడే శబ్దాది విషయాలను వాటి ననుభవించు శరీరాన్ని మాత్రమే తెలుసుకొంటారు. కాని ఆ శరీరంలో నున్న నిన్ను ఎరుగరు. నిన్ను గుణాత్మకునిగా భ్రమిస్తారు. బాహ్య శరీరాలను మాత్రమే చూస్తారు కాని అజ్ఞాన వశంచేత అంధులై శరీరగతమైన ఆత్మను తెలిసికోలేరు. నీ మాయ తెలిసికోవటం సాధ్యం కాదు.

అని స్తుతించి హయాన్ని విడువమనికాని తన తండ్రులు భస్మీ భూతమైన విషయాన్ని తలపటంకాని చేయకుండా ఆ మహర్షికి మ్రొక్కి నిలబడి ఉన్న అంశుమంతునికి కరుణా సంద్రుడైన కపిలుడు "బుద్ధిమంతుడవైన ఓ బిడ్డా! ఈ గుర్రాన్ని తీసుకొని నీ తాత వద్దకు వెళ్ళు. నీ తండ్రులు వెర్రివారై దగ్ధులయ్యారు. ఈ భస్మరాసుల మీద గంగా జలం ప్రవహిస్తే వారికి ఉత్తమ గతులు కల్గుతాయి" అన్నాడు. మునీంద్రుని వాక్కులు విని రాకుమారుడు అతనికి నమస్కరించి హయాన్ని తీసుకొని వెళ్ళి సగరుని కిచ్చాడు. సగరుడు మెచ్చి ఆ అశ్వంతో యజ్ఞం పరి సమాప్తం చేశాడుని అంశుమంతునకు రాజ్యం ఇచ్చి తన సంసార బంధాలను త్రెంచి వేసుకొని ఔర్వుడు చెప్పిన మార్గాన ఉత్తమ గతి చెందాడు

తనంతరం అంశుమంతుడు తన జనకులు మృతి నొందిన చోటికి దేవనది గంగను తీసుకొని రావాలనే తలపుతో అడవికి పోయి తపస్సు చేయాలనుకొన్నాడు. కాని అతని కోరిక తీరక ముందే అతడు స్వర్గతుడయ్యాడు. అతని కొడుకు దిలీపుడు భూలోకానికి గంగను తీసుకొని రావటానికి తపస్సు చేస్తూ అతడు కూడా విఫల ప్రయత్నుడై కాల పరవశుడయ్యాడు. ఆ దిలీపుని కొదుకు భగీరథుడు దారుణ తపస్సు చేసి గంగను చూచాడు. ఆమె కడగంటి చూపుల్లో అమృతం తొణికిసలాడుతోంది. ఆమె తరంగాలు మనోజ్ఞంగా ఉన్నాయి. ఆమె ముఖ కమలంపై తుమ్మెదలు మూగుతున్నాయి. శివుని జటాజూటం తన కొలువుకూటం. భగీరథుడు అలాంటి గంగను చూచి నమస్కరించే సరికి గంగ కరుణించి వరం వేడుకోమంది.

అప్పుడా రాకుమారుడు- తల్లీ! నీవు మావారి భస్మ రాసులపై ప్రవహించు వారు నీ జల స్పర్శచే మోక్షం పొందగలరు. నీవు దయాంతరంగవు. పుణ్యాత్మురాలవు. నీ అలలు తెల్లపూలకంటేనూ, మల్లెపూలకంటేనూ తెల్లగా మనోహరంగా ఉంటాయి. నీవు సాధువుల కోర్కెలు తీర్చెడి కల్పలతవంటి దానివి.

అని వినుతించిన రాకుమారునకు లోక పావనియగు గంగా భవాని- ఓయీ! ఆకాశం నుండి నేలపై పడే నా వేగాన్ని ఎవ్వరూ సహించలేరు. అప్పుడు నేను భూమిని భేదించి పాతాళానికి పోతాను. అదీగాక నేను వస్తే నా పవిత్ర జలాల్లో మానవులు స్నాతులై వారి పాపాలను నాకు సంక్రమింప చేస్తారు. నేనా పాపరాశిని ఎలా నాశం చేసుకోగలను? అందుచేత విచారిస్తున్నాను- అని పల్కిన లోకమాతకు రాజేంద్రుడైన భగీరథుడు ఇలా అన్నాడు.

తల్లీ! నీలో పరతత్వజ్ఞులు శాంత చిత్తులు, తపో నిధులు, ఆర్యులు అయిన మహా పురుషులెందరో క్రుంకిడుతారు. అలాంటప్పుడు మానవుల పాపాలు నీకెలా అంటుతాయి? అదీకాక సకల పాపాలనూ సంహరించెడి జగన్నాథుడైన విష్ణువు ఆ సరుల్లో కూడా అంతర్యామి అయి ఉంటాడు కదా! అందుచేత వారి పాపాలు నీకు కల్గతాయని సంకోచించకు ఇక నీ వేగాన్ని భరింపగల వారెవ్వరంటావా? విను. ఈశ్వరుడు విశ్వ భావనుడు. అతనిలో అన్ని లోకాలుంటాయి. తాను అన్ని లోకాల్లోనూ దారాల్లో చీరలా ఉంటాడు. కనుక అలాంటి శివుని నీ నీటి వేగాన్ని భరించటానికి నేను సేవిస్తాను- అని తెలిపి ఆమెను వీడ్కొని భగీరథుడు మహేశ్వరు నుద్దేశించి మహోగ్రమైన తపస్సు చేశాడు. అప్పుడు భక్త వత్సలుడైన ఫాలాక్షుడు ప్రసన్నుడై తన శిరస్సునందు విష్ణు పాదమున పుట్టుటచే పవిత్రమైన నీరు గలది అయి దివి నుండి భువికి పడెడి గంగను ధరించాడు.

## గంగాప్రవాహ వర్ణనం*

అలా గంగానది శివుని జటాజూట రంధ్రాల నుండి వెల్వడి నిరర్గళంగా నేలపైబడి నిండి క్రమక్రమంగా పెరుగుతూ దూడవెంటబడి క్రేపునకు కామ ధేనువులాగా, నిండు చంద్రునితోడి స్నేహంతోకలిసి దారితప్పక సాగివచ్చు సుధా సముద్రంలాగా, శివుని ముఖంనుండి వెల్వడు ఓంకారాన్ని అంటివచ్చు

* ఈ గంగా ప్రవాహ వర్ణనా ఘట్టంలో, అద్భుతమైన ఉపమాన వాక్యా లెన్నో ఉన్నాయి. ఈ అర్థసూచికలలో వివిధ శబ్దాలకు (గంగపరంగానూ) ఉపమాన వాక్యపరంగానూ ఈయబడిన అర్థద్వయాన్ని పాఠకులు గుర్తించి సమన్వయం చేసుకొనేది.

శబ్ద బ్రహ్మంలాగా ఆ భగీరథుని వెంటబడి వస్తోంది. ఐరావతపు తొండాలను అనుకరించెడి ఆ నదీముఖప్రవాహాలు దానికి ముఖప్రాయంగా ఉన్నాయి. ఆప్రవాహాల్లో అక్కడక్కడా పొడచూపు నీటిబుదగలు లేవయసులో ఉన్న ముగుద పాలిండ్ల లాగా ఉన్నాయి.

ఆ నీటిబుగ్గల దగ్గఱ తెల్లని నురువులు పారిజాతపు పూగుత్తుల సోయగాన్ని తిరస్కరిస్తున్నాయి. ఆ నురువుల సమీపంలో సుడులు అరవిరిసిన కప్పురపు చెట్ల చిగురుజొంపాల అందాన్ని అధఃకరిస్తున్నాయి. ఆ సుడుల చెంగట నిడుదలైన యేఱులు వెలిమబ్బు రేకల చక్కదనాన్ని ధిక్కరిస్తున్నాయి. ఆ యేళ్ళలో కలిసి వాయువశంచేత పావభంగాలైన భంగాలు (అలలు) ఒకదానితో నొకటి ఒరసికొంటూ పైకెగసి అంతటా వ్యాపిస్తున్నాయి. ఆ అలల కొనలు ఛిన్నాభిన్నాలై కుప్పించి ఆకాశానికెగిసెడి ముత్తెపు సరుల్లాగా, మల్లెపూదండల్లాగా, కప్పురపు తునకల్లాగా, చంద్రకళా ఖండాల్లాగా, నక్షత్ర సమూహంలాగా ముక్తికన్యా వశీకరాలైన శీకరాలు (తెలినీటి తుంపరలు) మెరిసిపోతున్నాయి. అది భూలోకానికే శోభాయమానంగా శ్రీకరంగా (సంపత్కరంగా) ఉంది.

అది శ్రీకరంలాగా విష్ణుపదాన్ని స్పృశిస్తోంది[1]. విష్ణుపదంలాగా హంస[2] రుచిరంగా ఉంది. రుచిరపక్షంలాగా (శుక్లపక్షంలాగా) శోభించెడి కువలయం[3] గలదిగా ఉంది. కువలయంలాగా బహుజీవనమై[4] ప్రకాశిస్తోంది. జీవనంలాగా సుమనోవికాన ప్రధానంగా[5] ఉన్నది. భారత ప్రధాన పర్వంలాగా అనేక చక్రబక భీమమహాభంగ సుభద్రార్జున చరిత్రాభిరామంగా ఉంది[6]. శ్రీరాముని

---

1. శ్రీకరం=సంపత్కరం, లక్ష్మీదేవి చెయ్యి. విష్ణుపదం=ఆకాశం, శ్రీహరి పాదం. — లక్ష్మిచెయ్యి శ్రీహరిపాదాన్ని స్పృశిస్తుంది. గంగ ఆకాశాన్ని తాకుతుంది.

2. హంస=అంచ, సూర్యుడు. 1) గంగ రాయంచతో మనోహరంగా ఉంటుంది. 2) ఆకాశం సూర్యునితో మనోజ్ఞంగా ఉంటుంది.

3. కువలయం=కలువ, భూమి. 1) శుక్లపక్షం భూమికి శోభ కల్గిస్తుంది. 2) గంగ కలువలతో శోభిస్తుంది.

4. జీవనం=నీరు, బ్రతుకు, 1) భూమి అసంఖ్యాక జీవకోటి కలిగి ప్రకాశిస్తుంది. 2) గంగ అపారజలంతో ప్రకాశిస్తుంది.

5. సుమనోవికాన=పుణ్యవికాసం, దేవతలకు ఆనందం.

6. 1) (గంగా పరంగా) చక్రవాకాలు, కొంగలు, భయంకరమైన అలలతోగూడి శ్రేయస్కరమైన స్వచ్ఛచరిత్ర కలది.(భారత పరంగా) సుదర్శన చక్రం,బకభీముల భంగపాట్లు,సుభద్రార్జునుల గాథకల్గి మనోహరంగా ఉంది.

హృదయంలాగా తన వారిలో[7] చొచ్చిన దోషాచరులకు[8a] అభయదానం ఇస్తుంది. అభయప్రదాతలాగా ఉపాసిత మృత్యుంజయం[8] కలదిగా ఉంటుంది. మృత్యు జయం (శివుని రూపంలాగా) విభూతి[9] కలిగిఉంది. కుమారస్వామి చరిత్రలాగా క్రౌంచాది విజయం[10] కలిగి ఉంది. విజయుని (అర్జునుని) రథం లాగా హరిహయ వేగం[11] గలదిగా ఉంది. కైక దాసి మంథర ఊహలాగా మహారామ గిరి వనప్రవేశం[12] కలిగి ఉంది. మన్మథుని టెక్కెంలాగా ఉద్దీపిత మకరమైనది[13]. మకరకేతనుని (మన్మథుని) బాణం శోషణం*లాగా విలీనవర వాహినీ కలిత శంబరమైనది[14].

శంబరారాతి (మన్మథుని) పుష్పబాణం చూతంలాగా బాటసారుల వేదన శమింప చేస్తుంది. శమన దండం (యమ దండం) లాగా నిమ్నోన్నత సమవృత్తంగా[15] ఉంటుంది. వృత్తశాస్త్రం (ఛందస్సు) లాగా వడి[16] కలిగి గురు లఘు వాక్యచ్ఛటలచే[17] పరిగణిత మౌతుంది. గణిత శాస్త్రంలాగా ఘన

---

7. 1) తనసీటిలో 2) ఆత్మీయులలో 1) గంగ తనసీటిలో మున్కిలిడిన పాపులకుకూడా అభయదానం ఇస్తుంది. 2) రాముడు తన ఆత్మీయులైన (విభీషణాది) రాక్షసులకు అభయమిస్తాడు.

8a. 1) పాపాత్ములు 2) రాక్షసులు 8 1) ఉపాసకులకు మృత్యువు లేకుండా చేసేది 2) ఉపాసింపబడిన శివుడు కలవాడు.

9. 1) ఐశ్వర్యం 2) బూది

10. 1) బెగ్గురులు మొదలైన పక్షులు గలది. 2) క్రౌంచ పర్వతాన్ని ఛేదించి బిలం చేసినవాడు (కుమారస్వామి)

11 1) హరిహయవేగం=పాములు కప్పలు మొదలైన జల జంతువుల సంరంభం కలది. 2) శ్రీకృష్ణుని గుర్రాల వేగం.

12. 1) ఆరామాలు, గిరులు, వనాలు ప్రవేశించడం. 2) రామాయణ పరంగా రాముడు చిత్రకూటం, అరణ్యాలు ప్రవేశించడం.

13. మకరం=మొసలి, చేప.

* మన్మథునకు పుష్పబాణ పంచకమే కాక-ఉన్మాదం, తాపనం, స్తంభనం, శోషణం, సమ్మోహనం - అనే వేరొక విధమైన పంచబాణాలు కూడా ఉన్నాయి.

14 1) కలిసిపోయిన ఇతర నదుల నీరు కలది. 2) అణగి పోయిన శత్రువు శంబరుని సేనకలది. (మన్మథుడు శంబరుని చంపాడు).

15. 1) కొద్దివారిని గొప్పవారిని అందరిని సమానంగా చూస్తుంది (యమ దండం) 2) గంగ ఒకచోట పల్లంలో ఒకచోట మిట్టమీద ఒకచోట సమంగా ప్రవహిస్తుంది.

16. వడి - వేగం, యతి. 17. గురువులు లఘువులు, వాక్యాలు కలిగి ఉంటుంది.(ఛందశ్శాస్త్రం) గంగ—చిన్న, పెద్దశబ్దాలతో గూడిఉంటుంది.

ఘనమూల, వర్గ, సంకలిత, భిన్న, మిశ్ర, ప్రకీర్ణఖాతం[1] భీష్మంగా (భయంకరంగా) ఉంటుంది. భీష్మ పర్వంలాగా అనేక భగవద్గీతమై[2] గోచరిస్తుంది. గీత శాస్త్రం (సంగీత శాస్త్రం) లాగా మహా సుషిరతను ఘన నా నా శబ్దాలతో[3] గూడి ఉంటుంది. శబ్ద శాస్త్రం (వ్యాకరణ శాస్త్రం) లాగా అచ్చు, వడి, హల్లు[4] కలిగి ఉంటుంది. అర్థశాస్త్రం లాగా బహు ప్రయోజన ప్రమాణ దృష్టాంత[5] కలిగి ఉంటుంది. దృష్టాంతం (ఉదాహరణం) మాదిరిగా సర్వ సామాన్య గుణ విశేషమై[6] ఉంటుంది.

ఆదిశేషుని వానపొరం లాగా సుస్థిరోద్ధరణ[7] తత్పరమైనది. పర బ్రహ్మం లాగా అతిక్రాంత నిగమమైనది[8], నిగమం (వేదం) లాగా బ్రహ్మ వర్ణ పదక్రమ[9] సంగ్రహమైనది. గ్రహశాస్త్రంలాగా కర్కట, మీన, మిథున, మకర[10] సుందరమైనది. సుందరీ ముఖంలాగా నిర్మల చంద్ర కాంత

---

1. (గంగ పరంగా) నా నా విధాలైన మడుగులతో భయంకరమైనది. (గణితం పరంగా) మూలం, మూలవర్గం, భిన్నం మొదలైనవి గణిత సంబంధమైన పారిభాషిక పదాలు.

2. 1) అనేక భాగవతులచే కీర్తింపబడేది గంగ. 2) భగవత్పరమైన అనేక స్తోత్రాలు కలది భీష్మ పర్వం.

3. సుషిరం = రంధ్రం. (గంగ పరంగా) పెక్కు సొరంగాల ద్వారా ప్రవహించడంచేత వివిధ రీతుల ధ్వనులు కలది. (గీతశాస్త్ర పరంగా) నానావిధాలైన వేణువు మొదలగు వాద్య విశేషాల శబ్దం కలది.

4. 1) స్థిరంగా, వడిగా, మెల్లగా ప్రవహించునది. 2) అచ్చులు హల్లులు మొదలైనవి కలది. (వ్యాకరణం)

5. 1) అనేక ప్రయోజనాల యొక్క ప్రత్యక్షోదాహరణములు కలది (గంగ) 2) అనేక ప్రయోజనాలు గల ప్రమాణాలతో దృష్టాంతాలతో వ్యవహరించెడిది (శాస్త్రం).

6. 1) సర్వ సామాన్య గుణ విశేషణం కలది. 2) దృష్టాంతంలో సమాన ధర్మం ఉంటుంది.

7. స్థిర = భూమి, మోక్షం. 1 భూమిని మోయుటయందు తత్పర మైనది (శేషువు) శాశ్వతమైన మోక్షం ఇవ్వడంలో ఆసక్తి గలది (గంగ).

8 నిగమం = వేదం, పట్టణం. 1 వేదాలను మించినది (పరబ్రహ్మం) 2) పట్టణాలను అతిక్రమించి ప్రవహిస్తుంది (గంగ)

9 బ్రహ్మ = విష్ణువు, బ్రాహ్మణుడు 1. భగవద్విశేషాలతో నిండినది (వేదం) 2) బ్రాహ్మణవర్ణం పదక్రమంచే భాసించేది (గంగ

10. 1) జల జంతువులు 2) రాసులు.

మైనది.[1] కాంతయొక్క క్రిబెదవిలా శోణాచ్ఛాయా[2] విలాసమైనది.కొప్పులాగా నల్లని కోడెత్రాచులు గలది. పండితుల శాస్త్రవాదం[2(a)] లాగా అపార సరస్వతీ విజయ విభ్రమమైనది. విభ్రమవతి చనుదోయి లాగా నిరంతర పయో[3] వ్యాప్తమై అఖిలలోక జీవన ప్రదమై[4] తుంగభద్రాతిరేఖా[5] సలలితమై ఉంది. లలితవతి (స్త్రీ) నవ్వునుమించు చంద్రభాగ ధేయమైనది[6]

భాగ్యవంతుని వివాహంలాగా మహామేఖల కన్యకా[7] విస్తారమైనది. తారకెంగేలిలాగా ఆక్రాంత సూర్యతనయమైనది.[8] సూర్యసుతుడైన కర్ణుని

---

1. 1) చంద్రునివలె మనోహరమైనది (సుందరీ ముఖం). 2) నిర్మలమైన చంద్ర కాంత శిలలచే శోభించేది (గంగ).

2. శోణం = ఎఱ్ఱనిది, మాణిక్యం 1) స్త్రీ అధరం (క్రింది పెదవి) ఎఱ్ఱగా ఉంటుంది. 2) గంగ ఎఱ్ఱని మాణిక్య కాంతులతో విలసిల్లుతూ ఉంటుంది. 2(a) సరస్వతి = వాక్కు, ఒక నది, సముద్రం 1) పండితుల చర్చ అపార వాగ్వైభవంతో విజయ వంతంగా ఉంటుంది. 2) గంగ సముద్రాన్ని మించిన విభ్రమం కలది.

3. పయస్సు = పాలు, నీరు. 4. జీవనం = నీరు, ప్రాణం.

5. తుంగభద్ర = ఒక నది, ఎత్తైన మేరు పర్వతం. భద్ర=ఏనుగు, శ్రేష్ఠమైనది. 1) స్త్రీ చనుదోయి నిరంతరం పాలుస్రవిస్తుంది.గంగ నీటిని ప్రవహిస్తుంది. 2) స్త్రీ చనుబాలు ప్రాణాలను కాపాడుతుంది. గంగ నీటినిఇస్తుంది. 3) స్త్రీ పాలిండ్లు 1) ఎత్తైన మేరు పర్వతంయొక్క లేక భద్రజాతి మదపుటేనుగు కుంభస్థలంయొక్క సౌందర్యం కలిగి ఉంటాయి. 2) గంగ ఎల్లప్పుడు నీటితో నిండి సకల లోకాలకు నీరు లేక జీవనం ప్రదానం చేస్తూ తుంగభద్రా నదిని మించిన శోభ గలిగి ఉంటుంది.

6. చంద్రభాగధేయం=చంద్రుని భాగధేయం, తెల్ల కలువల సొంపు. చంద్రభాగ = ఒకనది. 1) స్త్రీ చిఱునవ్వు చంద్రుని భాగధేయాన్ని పరిహసిస్తుంది. గంగ చంద్రభాగా నదిని మించిన భాగ్యం కలిగి ఉంటుంది. లేక తెల్ల కలువల శోభతో ప్రకాశిస్తుంది.

7. మేఖల=స్త్రీలు ధరించెడి ఎనిమిదిపేటల మొలనూలు, మేఖల కన్యకా=నర్మదానది. 1) ధనవంతుల వివాహంలో కన్య విలువైన మేఖల ధరిస్తుంది. 2) గంగ నర్మదా నదిలాగా విస్తరించి ఉంటుంది.

8. తార = వాలిభార్య. సూర్యతనయుడు = సుగ్రీవుడు. సూర్యతనయ=యమునానది. 1) తారను సుగ్రీవుడు ఆక్రమిస్తాడు. 2) గంగ యమునానదిని సంగమిస్తుంది.

శరవర్షంలాగా భీమరథ్యా[1]టోప వారణమైనది. వారణం (మదపుటేనుగు) మాదిరిగా పుష్కరోన్నత సంరంభమైనది[2]. రంభ ముఖంలాగా సురసాతిశయ దశమైనది[3]. దశరథ తనయుని (శ్రీరాముని) కనుబొమముడి లాగా సింధు గర్వ ప్రభంజన మైనది[4]. ప్రభంజన తనయుని (భీముని) గదపెట్టువలె సమీపగత దుశ్శాసన దుర్మద నివారకమైనది[5]. వారకన్యక (వేశ్య) ముంజేతిలాగా మాటిమాటికి చలించెడి కంకణాలచే అలంకృతమైనది[6]. కృత యుగంలాగా అపంకమైనది[7]. పంకజాసనుని (బ్రహ్మ) ముఖంలాగా ప్రభూతముఖ్య వర్ణమైనది[8]. వర్ణగుణితంలాగా దీర్ఘబిందు విసర్గ[9]మైంది.

సర్గాలతో (అధ్యాయాలతో) కూడిన కావ్యంలాగా గంభీర భావ మధు రంగా ఉంటుంది[10]. మధురాపురంలాగ మహానందనందనంగా[11] ఉంటుంది.

---

1. రథ్యం=రథహయం. రథ్య=రాజమార్గం 1) కర్ణుని శరవర్షం భీముని రథతురంగాల ఆటోపాన్ని వారిస్తుంది. 2) గంగ భయంకరమైన దుర్గమ మార్గాల ఆటోపాన్ని వారిస్తుంది.

2. పుష్కరం = ఆకాశం, ఏనుగు తొండం చివర 1) గంగ ఆకాశోన్నతమై సంరంభిస్తుంది. 2) ఏనుగు తొండం ఎత్తి నీరు చిమ్ముతూ సంరంభిస్తుంది.

3. 1) రసం=శృంగారం, జలం. 2) దశ=అదృష్టం, స్థితి.

4. సింధువు=సముద్రం, నది. 1) రాముడు సముద్ర గర్వభంగం చేశాడు. 2) గంగ నదుల నన్నింటిని అతిక్రమించి వాటి గర్వాన్ని భంజిస్తుంది.

5. 1) భీమునిగద దుశ్శాసనాది దుర్మదులను అణచివేసింది. 2) గంగ తనను సమీపించిన దుష్టులకు రాజుల మదాపహరణం చేస్తుంది.

6. కంకణం=చేతికడియం, నీటిబిందువు.

7. అపంకం=పాపంలేనిది (కృతయుగం), బురదలేనిది (గంగ)

8 ముఖ్యవర్ణము=బ్రాహ్మణులు (బ్రహ్మకు ముఖంవంటివారు బ్రాహ్మణులు), స్వచ్ఛమైనది.

9. విసర్గం=ఉభయాక్షరాలలో ఒకటి, విసర్జనం (విడుచుట) 1) గుణితంలో దీర్ఘం, బిందువు, విసర్గం (ః అను అక్షరం) ఉంటాయి. 2) గంగ సుదూరం నీటిబిందువులను విసర్జిస్తుంది.

10. 1) గంభీరం=లోతు, తేలికగా అర్థం కానిది 2) భావం=అభిప్రాయం, సారం, స్వభావం. 1) కావ్యం గంభీర భావాలతో మధురంగా ఉంటుంది. 2) గంగ లోతైన మధురజలంతో నిండి ఉంటుంది.

11. 1) మధురాపురం నంద నందనుడైన శ్రీకృష్ణునిచే మనోహరంగా ఉంటుంది. 2) గంగ మహానందంగా ఇంపుగా ఉంటుంది.

నందనవనంలాగా విహారమాణకౌశిక[1]మైనది. కౌశికుని (ఇంద్రుని) గుఱ్ఱంలా సుదశ్రువ[2]మైనది. ధ్రువుని తలపులాగా క్రియాపరిశీలిత విశ్వంభర[3]మైనది. విశ్వంభరుని (శ్రీహరి) శంఖం పాంచజన్యంలాగా దక్షిణావర్తోత్తర[4]మైనది. ఉత్తర (విరాటుని కూతురు) వివాహంలాగా ప్రముదిత నర[5]మైనది. నరసింహుని గోళ్ళులాగా ఆశ్రిత ప్రహ్లాద గురువిభవ[6] ప్రధానమైనది.

దాన కాండంలాగా కామధేను కల్పలతాద్యభినవ[7]మైనది. నవసూతిక (కొత్త బాలెంతరాలు) లాగా నిరంతరపయో[8]వర్ధనమైనది. కుబేరనిలయంగా మకర పద్మ మహాపద్మ కచ్ఛప[9]మైనది. తాబేలు వీపులాగా పతిత శైల[10]

---

1. కౌశికుడు=ఇంద్రుడు. కౌశికం=ఒకచెట్టు. 1) నందనవనంలో ఇంద్రుడు విహరిస్తాడు. 2) గంగాప్రవాహంలో చెట్లు, పొదలు కదలివస్తాయి.

2 సుదశ్రువం=అన్ని దిక్కులలోను నిలకడగా ఉండేది, మంచి దశచే నిలుకడ కలది.

3 విశ్వంభరుడు=విష్ణువు, విశ్వంభర=భూమి: 1) ధ్రువుడు క్రియాకలాపాలచే విష్ణువును పరిశీలించినవాడు 2) గంగ గమనాదికంచే భూమిని పరిశీలించినది.

4. దక్షిణము=కుడి, మనోహరమైనది 1) శ్రీహరి శంఖం దక్షిణావర్తం 2) గంగ మనోహరమైన సుడులు కలది.

5. నరుడు=అర్జునుడు, మానవుడు. 1) ఉత్తర వివాహం అర్జునునకు ప్రమోదదాయకమైనది. 2)గంగ సమస్త మానవులకు ఆనందం కలిగిస్తుంది.

6. 1) నరసింహుని గోళ్ళు ఆశ్రితుడైన ప్రహ్లాదునకు గొప్ప విభవాన్ని కలిగించాయి. 2) గంగ తనను ఆశ్రయించిన వారికి ఆహ్లాదాన్ని, గొప్పవైభవాన్ని కలిగిస్తుంది.

7. అభినవం=క్రొత్తది, స్తోత్రం 1) దానప్రక్రియ కామదేనువు కల్పవృక్షంలాగా స్తుతింపదగినది. 2) గంగ భక్తుల కోర్కెలు తీర్చుటలో కామదేను కల్పవృక్షాలకంటే అభినవమైనది.

8. పయోవర్ధనం=పాలు పెంపుదల, నీటిసమృద్ధి.

9. 1) కుబేర నిలయంలో మకరం, పద్మం, మహాపద్మం, కచ్ఛపం మొదలైన నిధులుంటాయి 2) గంగలో మకరాలు (మొసళ్ళు),పద్మాలు, మహాపద్మాలు (తామరలు) కచ్ఛపాలు (తాబేళ్ళు) ఉంటాయి.

10. శైలం=పర్వతం, జాతి పువ్వు (ఒక గంధ ద్రవ్యం), 1. కూర్మం వీపు, పడిన మంథర పర్వతాన్ని ఎత్తి పట్టింది. 2) గంగ రాలిన జాతి పూవులను వహిస్తుంది.

సముద్ధరణమైనది. ధరణీ ధరం (పర్వతం) లాగా ఉత్తుంగతట[1] ముఖ్య మైనది. ముఖ్యవరాహంలాగా ఉన్నతక్షయ[2]మైనది. క్షమాసుర (బ్రాహ్మణ) హస్తంలాగా సత్ప[3]విత్రమనోభి రామమైనది. రామచంద్రుని బాణంలాగా అభ్యాగత ఖరదూషణ మదావహరణ ముఖర[4]మైనది.

పరశురాముని గొడ్డలిలాగా భూభృన్మూల[5]చ్ఛేదన ప్రబలమైనది. బలరాముని నాగలిలాగా ప్రతికూల స్థన్నికర్షణ[6] ప్రబుద్ధమైనది. హర తాండవంలాగా ఉల్లసితానిమిష[7]మైనది. అనిమిషావతారం (మత్స్యావతారం) లాగా శ్రుతి[8]మంగళ ప్రదమైనది. ప్రదాత ఈవిలాగా అర్థపరంపరా వామన మైనది[9]. వామన చరణంలాగా బలివంశ వ్యపనయ[10]మైనది. నీతిశాస్త్రం

---

1. తటం=కొండనెత్తం, గట్టు 1) పర్వతం ఎత్తైన నెత్తంతో శోభిస్తుంది. 2) గంగ ఎత్తైన గట్లతో ప్రముఖంగా ఉంటుంది.

2. ముఖ్యవరాహం=ఆది వరాహం, క్షమ=భూమి, క్షమాసంపత్తి (ఓర్పు) వరాహం భూమిని పైకెత్తింది...గంగ గొప్ప క్షమాగుణం కలది.

3. పవిత్రం=దర్భల ఉంగరం, పరిశుద్ధం, జలం 1) బ్రాహ్మణ హస్తానికి దర్భలతో అల్లిన ఉంగరం లాంటిది ఉంటుంది. 2) గంగ పరిశుద్ధ మైన నీటితో లేక పవిత్రులైన వారితో మనోహరంగా ఉంటుంది.

4. ఖరుడు=ఒక రాక్షసుడు, వాడియైన వాడు — దూషణుడు= ఒక రాక్షసుడు, దూషింపదగినవాడు, 1) రామబాణం ఖరదూషణుల మదం హరించింది 2) గంగ ధృష్టుల మదాన్ని అపహరిస్తుంది.

5. భూభృతులు=రాజులు, కొండలు. 1) పరశురాముడు రాజులను మూలచ్ఛేదనం చేశాడు 2) గంగ కొండలను కూల్చివేస్తుంది.

6. బలరాముని నాగలి శత్రువులను దగ్గరకు ఆకర్షించుట యందు జాగ్రత్త వహిస్తుంది. గంగ అనుకూలురు కాని వారిని కూడా చేర్చి తరింప చేస్తుంది.

7. అనిమిషులు=దేవతలు,అనిమిషం=చేప 1) శివతాండవం దేవతలకు ఉల్లాసం కల్పిస్తుంది. 2) గంగ చేపలకు ఆనందం కల్పిస్తుంది.

8. శ్రుతి=వేదం, చెవి. 1) మత్స్యావతారం వేదమునకు మంగళ కరమైనది. 2) గంగా ప్రవాహధ్వని చెవికి ఇంపుగా ఉంటుంది.

9. అర్థం=ధనం, వామనం=పొట్టిది, క్రక్కునది. 1) దాత ఈ విధానాన్ని తగ్గిస్తుంది. 2) గంగ భక్తకోటికి అర్థ పరంపరల నిస్తుంది.

10. 1) వామనుని చరణం బలి వంశాన్ని తొలగించింది. 2) గంగ ప్రబలమైన వెదుళ్ళను పెకలిస్తుంది.

లాగా సామభేద మాయోపాయచతుర[1]మైనది. చతురాననాండం (బహ్మాండం) లాగా అపరిమిత భువన జంతు[2]జాల సేవ్యమానమైనది. మానినిలాగా ఆంతర్యం (లోతు) చూపదు. శాంత స్వభావంగల స్త్రీ లాగా చడిచప్పుడు చేయదు. ముగ్ధలాగా బయటపడదు. మదవతిలాగా స్వేచ్ఛగా తిరుగుతుంది. పతివ్రతలాగా నిలకడకలిగి ఉంటుంది. తల్లిలాగా సమస్తం లోనిముడ్చు కుంటుంది. దైవంలాగా భక్తుల కోర్కెలు తీరుస్తుంది.

అలాంటి గంగానది భగీరథుని రథాన్ని అనుగమిస్తూ దేశదేశాలుదాటి సగరపుత్రుల భస్మరాసులపై ప్రవహించింది. ఆ పవిత్ర జలస్పర్శచే సగర పుత్రులు నూతన వైభవంతో స్వర్గతులయ్యారు. సజ్జనద్రోహులైన వారి పాపాగ్ని పవిత్రమైన గంగనీటితో కాక మరొకవిధంగా ఆరుతుందా? భగీరథుడు సామాన్యుడుకాదు. మహాతపోనియతితో శివుని మెప్పించి ఆకాశ గంగను భూమికి తెచ్చాడు. మహాకీర్తి గడించాడు. పితృకార్యం నెరవేర్చే వాడు. దుస్తరమైన తన వంశవ్యధను పోగొట్టాడు. అలా భగీరథుడు విష్ణు పాదోద్భవి అయిన గంగను భూలోకంలోకి తీసుకొనిరాగా హరి సేవాపరులైన మునీంద్రులు ఆ పవిత్ర నదీజలాల్లో క్రుంకి గుణాతీతులై శ్రీహరి సాయుజ్యం పొందారు.

ఆ భగీరథునకు శ్రుతుడను కుమారుడు కల్గాడు. శ్రుతునకు నాభావరుడును, నాభావరునకు సింధుద్వీపుడునూ, సింధుద్వీపునకు అయుతా యువును, అయుతాయువునకు ఋతుపర్ణుడును జన్మించారు. ఆ ఋతుపర్ణుడు నీతికోవిదుడైన నలచక్రవర్తితో సఖ్యంచేసి అతనికి ద్యూతశాస్త్ర రహస్యాలను తెలిపి అతనివలన అశ్వవిద్య సంపాదించాడు. ఆ ఋతుపర్ణునకు సర్వ కాముడున్నూ, సర్వకామునకు మదయంతీ వల్లభుడైన సుదాసుడు పుట్టాడు. ఆ సుదాసుని మిత్రసహుడన్నిన్నీ, కల్మాషపాదుడనీ అంటారు. అతడు వశిష్ఠుని శాపంచేత రాక్షసుడై నిజకర్మంచేత సంతానహీనుడయ్యాడు-అని శుకుడు అనగా పరీక్షిన్నరేంద్రుడు ఏ కారణంచేత సుదాసునకు గురుశాపం

---

1. 1) నీతిశాస్త్రం సామభేదమాయోపాయాలతో నేర్పరి యైనది (కొందఱి మతంలో ఉపాయాలు ఏడు. అందులో మాయ ఒకటి.) 2) గంగ ఒకచోట సామంగా (నెమ్మదిగా) నడుస్తుంది. ఒక చోట భేదంగా కొండలను బద్దలుచేస్తూ ప్రవహిస్తుంది. మఱొకచోట మాయగా (సూటిగా గాక) అటూ ఇటూ కనబడక ప్రవహిస్తుంది.

2. 1) అపరిమిత భువన = అనేక లోకాలతో, అంతులేని నీటితో 2) జంతుజాలం=ప్రాణికోటి, జలజంతు సమూహం.

ప్రాప్తించిందో చెప్పుమని ప్రశ్నించేనరికి శుకయోగి ఈ రీతిగా చెప్పటం ప్రారంభించాడు.

సుదాసుడు ఒకనాడు అడవికి వేటాడబోయి అచట ఒక రాక్షసుని సంహరించి వాని సోదరుని సంహరించకుండా విడిచిపెట్టాడు. వాడు తన తోడబుట్టిన వాని చావునకు ప్రతీకారం చేయటానికి కపటవేషంతో ఆ రాజు నింట వంటవాడుగా చేరి సేవించటం మొదలు పెట్టాడు. ఒకనాడు వశిష్ఠ మహర్షి తన ఇంటికి రాగా సుదాసుడు ఆ మహర్షికి ఆతిథ్యమివ్వటానికి ఉద్యుక్తుడై వానిచే వంట చేయించాడు. ఆ దురాత్ముడు మునికి నరమాంసం వండి పెట్టాడు. వశిష్ఠుడది గ్రహించి కోపోద్రిక్తుడై రాజును రాక్షసుడవుకమ్మని శపించాడు. అనంతరం ఆ అపరాధం వంటవానిది కాని రాజుదికాదని తెలుసుకొని ఆ శాపాన్ని పన్నెండు సంవత్సరాలు మాత్రం అనుభవించవదగ్గదని అవధి ఏర్పరిచాడు అంతట సుదాసుడు తనను నిష్కారణంగా శపించినందుకు వశిష్ఠుపై ఆగ్రహించి ప్రతిశాపం ఇవ్వటానికి చేతిలో నీళ్ళు గ్రహించాడు. కాని అతడి భార్య మదయంతి అలా మారుశాపం ఇవ్వటం తగదని వారించటంచేత రాజు ఆ ఉద్యమం మాని జీవకోటితో నిండిన భూమ్యాకాశములందు ఆ జలం ఎక్కడపోసినా జీవులకు అపాయం సంభవిస్తుందని తలచి దాన్ని తన పాదాలపై విడిచాడు. తీవ్రమైన ఆ నీటి తాకిడిచే అతని పాదాలు కమిలి నల్లవడ్డాయి. అందుచేత అతనికి కల్మాష పాదుడను పేరు వచ్చింది. కల్మాషం అనగా నల్లదనం.

గురుశాపం కారణంగా అతడు రాక్షస భావంతో అడవుల్లో తిరుగుతుండగా ఒకనాడతడు ఆకలిచే నకసకలాడుచూ ఆ అడవిలో క్రీడానక్తులై ఉన్న విప్రదంపతులను చూచి తటాలున విప్రుని పట్టి మింగటానికి సిద్ధమయ్యాడు అప్పుడా బ్రహ్మణుని భార్య బెగ్గడిల్లి డగ్గుత్తికతో పతికి అడ్డం వచ్చి ఏడుస్తూ ఆ రాచరక్కసునకు ఇలా అన్నది.

రాజేంద్రా ! మానుషదేహం కల్గటం దుర్లభం. దుర్లభమైన ఈ మానుష దేహం లభించాక దానధర్మాలు చేయాలి. పరోపకారం చేయాలి. యశస్సు గడించాలి. అలా కాక దుష్కృత్యానికి ఒడికట్టటం తగదు. నీవు సూర్యవంశశ్రేష్ఠుడవు. సమస్తధరణీ రాజ్యానికి శాసకుడవు. లోకస్తుత్యుడవు. పదార్థ నిరతుడవు. పుణ్యాత్ముడవు. అలాంటివాడవు అకారణంగా బ్రహ్మవిదుడు, తపఃశీలుడు, బ్రాహ్మణుడు అయిన నా పెనిమిటిని భక్షించటానికి యత్నించటం న్యాయమా? సూర్యవంశస్థులకు బ్రాహ్మణులు దైవసన్నిభుడంటారు. ఆ మాటలు ఏమయ్యాయి? మీవంటి సాధువులు బ్రాహ్మణులను, గోవులను వధించటానికి అభిలషిస్తారా? నీ కీ రాక్షస భావ మేమిటి? నీ తండ్రి తాతలను, పూర్వులను స్మరించవా? ధర్మం పాటించవా? అన్నా!

నేను నీకు చెల్లెలను. నా పెనిమిటిని విడిచిపెట్టు. నీకు అన్నం పెట్టిస్తాను. నా పెనిమిటి ద్విజుడు. పరమసాధువైనవాడు. అలాంటి వానిని నీవు హింసించటం దేనికి? నీవు ఆడుతోడుతో పుట్టలేదా? ఒకవేళ నీకంతగా ఆకలిగాఉంటే ముందు నీవు నా శిరస్సు ఖండించి నా ప్రాణేశుని భక్షించు- అని కరుణపుట్టేలాగా ఆమె విలపింపగా ఆ రాచరక్కసి నిర్దయుడై శాపవశం చేత బుద్ధిని కోల్పోయి పులి పశువునుపట్టి తిన్నట్లు ఆ విప్రుని తిన్నాడు.

అప్పుడాబ్రాహ్మణి కోపోద్రిక్తురాలై కామార్త ఆయిన నా భర్తను నీవు భక్షించావు కనుక నీవు స్త్రీని పొందినపుడు నీకు మరణం ప్రాప్తిస్తుంది అని పతికళ్యాలతో అగ్నిప్రవేశం చేసి సుగతికి పోయింది.

అంత పంద్రెండేండ్లు గడవగా ఆ రాజునకు శాపవిమోచనం కల్గింది. అప్పుడతడు నిజభవనానికి వెళ్ళి రతిక్రీడకు తన భార్యను రావింపగా ఆమె విప్రసతి శాపం తెలుసుకొన్నది గాన బెదరిపోయింది. మగనిని అడ్డుపెట్టి మైథున కర్మకు విముఖునిగా చేసింది. అతడున్నూ తన సతి అభీష్టాన్ని అనుసరించి రతిక్రీడమానాడు. ఆ కారణంచేత సుదాసుడు పుత్రహీనుడయ్యాడు. అనంతరం సుదాసుని అభ్యర్థనపై వశిష్ఠుడు మదయంతిని కలియగా ఆమె గర్భవతి అయింది. ఆమె ఏడేండ్లు గర్భం ధరించి నీళ్ళాడటానికి సంకట పడుతూండగా వశిష్ఠుడు ఒక వాడిఅయిన రాతితో ఆమె గర్భాన్ని చీల్చాడు. అప్పుడామెకు అశ్మకుడను కొడుకు పుట్టాడు. అశ్మమనగా రాయి. అశ్మకునకు మూలకుడు పుట్టాడు.

వీరుడైన పరశురాముడు తన గొడ్డలితో రాజులను వధించేటప్పుడు మూలకుని నారీజనులు (స్త్రీలు) దాయటంచేత అతనికి నారీకవచుడు అను పేరు వచ్చింది. ఆ నారీకవచుడు నిర్మూలమైన సూర్యవంశానికి మూల మవటంచేత మూలకుడు అన పేరు కూడా వచ్చింది. ఆ మూలకునకు విశ్వ సహుడు పుట్టాడు. విశ్వసహునకు ఖట్వాంగుడు పుట్టి చక్రవర్తి అయ్యాడు. దేవతల ప్రార్థనపై అతడు రాక్షస నాథులనేకులను చంపాడు దేవతలు సంతోషించారు. అప్పుడా రాజేంద్రుడు నేనింకా ఎంతకాలం బ్రతుకుతానో చెప్పండి అని అడిగాడు. అందుకువారు - నీ జీవితకాలం ఎంతో లేదు. దగ్గర వడ్డది కనుక ఇప్పుడే ఏదైనా వరం కోరుకో. ఇస్తాం -అన్నారు.

కాని అతడు అంగీకరించక విమానరూఢుడై తన నగరానికి వెళ్ళాడు. సత్వ బుద్ధితో పరమేశ్వరునియందు తన మనస్సును నిలిపాడు. భార్యా పుత్రా దులుకాని, ప్రాణంకాని, రాజ్యంకాని కులదేవతలకంటే, ద్విజులకంటే ప్రియ మైనవి కావని భావించాడు. ఇంకా ఇలా తన మనస్సులో అనుకొన్నాడు- నేనెన్నడూ ధర్మాన్ని అతిక్రమించను. ఈశ్వరునికంటే నేను అన్యమైనది ఏదీ ఎరుగను; ఈ భూమిమీద బ్రతకటం దేనికి? దేవతలను వరాలు కోరటం

దే కి? ధనం ఎందుకు? - ఇట్టేకనపడి ఇట్టే మాయమయ్యేడి గంధర్వ నగరాల్లాంటి ఐశ్వర్యాలు ఎందుకు? లోకాలను సృష్టించాలనే ఊహతో ప్రకృతితో కూడి తుదకు లయయై తుదిని విడిచిపెట్టి నిర్మలమై అవాఙ్మనస గోచరమైన పరమేశ్వరునిలో లీనమవుతాను - అని నిశ్చయించు కొన్నాడు.

ఖట్వాంగుడలా సంసార సంగం విడిచిపెట్టి ఉండికూడా లేనిది కల్యాణ నిలయమైనది, ఆత్మలో ఊహించటానికి వీలుకానిది, మాటలతో చెప్పటానికి సాధ్యంకానిది, పరమమైనది, తత్వజ్ఞులు ఊహించి హృదయ కమలాల్లో వాసుదేవుడని స్థిరీకరించిన ఆ పరబ్రహ్మంలో కలిసిపోయాడు. ఆ ఖట్వాంగునకు దీర్ఘబాహుడు, దీర్ఘబాహునకు రఘువు, రఘువునకు పృథుశ్రవుడు, పృథుశ్రవునకు అజుడు అజునకు దశరథుడు పుట్టారు. దశరథునకు దేవప్రార్థితుడై పరబ్రహ్మపరమైన శ్రీహరి నాల్గువిధాలై నిజాంశంతో రామ, లక్షణ, భరత, శత్రుఘ్ను లను పేర్లతో జన్మించాడు. వారి చరిత్రాన్ని వాల్మీకి మొదలైన మహర్షులు వర్ణించారు. అయినా నేను కూడా సంగ్రహంగా చెబుతాను సావధానుడవై విను అని శుకమహర్షి పరీక్షితునకు శ్రీరామ చరిత్రను ఇలా చెప్పటం మొదలుపెట్టాడు.

## శ్రీరామ చరిత్రం

దశరథుని భార్య అయిన కౌసల్యకు తూర్పుదిశకు పూర్ణచంద్రుడుద యించినట్లు, నారాయణాంశంతో శ్రీరాముడు మదాంధుడైన రావణుని శిరస్స మూహాలనుచేదించటానికి జన్మించాడు. బాల్యంలోనే విశ్వామిత్రుని యాగ రక్షణార్థం ఆ మహర్షివెంట బయలుదేరి వెడుతూండగా దారిలోతాటకయను రక్కసి తటస్థించింది. దాని కృంతలచ్ఛవి (జుట్టుయొక్క కాంతి) బంగారపు కాంతిని ధిక్కరిస్తోంది అది మాయలాడి. ఉత్తమ జాతికి చెందిన గుఱ్ఱంకంటే కూడా ఎక్కువ వడికలది. దాని చేతిలో పెద్ద దాలు ఉంది. ముని ఆజ్ఞ ననుసరించి శ్రీరాముడు నిష్కరుణంగా ఆ తాటకను వధించాడు. దైత్యులైన సుబాహు మారీచులు విశ్వామిత్రుని యాగాన్ని భంగం చేస్తున్నారు - శ్రీరాముడు సుబాహువుని యుద్ధంలో వధించి నీచుడైన మారీచుని అనేక యోజనాలు దూరంపోయి పడేటట్లు ఒకబాణంతో కొట్టాడు. ముని యజ్ఞం కాపాడాడు.

మూడు వందలమంది పట్టి ఎత్తి తెచ్చిన మహోగ్రమైన శివ ధనస్సును గున్నఏనుగు అవలీలగా చెఱకు గోలను త్రుంచినట్లు రాజులందరూ చూస్తూండగా తన భుజశక్తితో విరిచి విదేహ రాజైన జనకుని కుమార్తె సీతను పెండ్లాడాడు. దీర్ఘమైన కుఠారం (గొడ్డలి) చేదాల్చి రాజవంశాన్ని నిర్మూలనం చేసిన భార్గవ రాముని రణ రంగంలో భంగపరిచాడు.

దశరథుడు పూర్వం కైకకు వశంగతుడై తానిచ్చిన మాటను నిలబెట్టు కోవటానికి శ్రీరాముని అడవికి పంపాడు. తన తండ్రి అలా పంపటం తన మేలు కొరకే అని భావించి శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై అయోధ్యా నగరాన్ని విడిచిపెట్టి అడవుల పాలయ్యాడు. భరతుని రాజ్యాభిషక్తుని చేసి తాను అరణ్యంలో చిత్రకూట పర్వతంపై ఉన్నాడు. అనంతరం ఆతడు దండకారణ్యానికి వెళ్ళాడు. ఆ దండకాటవిలో తాపసులెందరో ఉన్నారు. గౌతమీ నదియొక్క నిర్మలమైన నీటి తుంపరలచే ఆ అరణ్యం పవిత్రీ భూతమైంది. అచట నెమిళ్ళు పురులు విప్పి నాట్యం చేస్తూ కనువిందు కల్పిస్తాయి. అచట నానావిధాలైన వృక్షాలు, పూ పొదరిండ్లు నయన పర్వంగా ఉంటాయి. ఆ వనంలో శ్రీరాముడు సీతాలక్ష్మణులతో కూడి ఒక పర్ణశాలలో ఉండగా రావణాసురుని చెల్లెలు శూర్పణఖ వచ్చి శ్రీరాముని సౌందర్యాన్ని చూచి ముగ్ధురాలైంది. తనను పెండ్లియాడుమని రాముని అర్థించింది. లక్ష్మణుడు ఆగ్రహంతో దాని ముక్కు కోసివేశాడు. దానికి తోబుట్టువులు ఖరదూషణాదులు పదునాలుగువేల మంది ఉన్నారు. చెల్లెలి పరాభవ వార్త విని వారందరూ తనపై వచ్చి పడగా శ్రీరాముడు వారినందరినీ తన బాణాగ్ని కీలల్లో భస్మం చేశాడు.

జనక నందన సీత చక్కదనాన్ని విని దశకంఠుడు పరవశించి పోయాడు. ఆమెను వంచించి చేబట్టాలనే తలంపుతో మారీచుని పంపాడు. అతడు బంగారు లేడిగా నటిస్తూ పర్ణకుటి సమీపంలో సంచరిస్తూండగా శ్రీరాముడు దాని వెంటపడి వధించాడు. ఇంతలో రావణుడు మాయాముని వేషంలో సీతను అపహరించుకొని పోయాడు. రావణుడు ఆ రీతిగా సీతాదేవిని వంచించి ఆకాశ మార్గాన పోతూండగా పక్షి రాజైన జటాయువు ఎదిరించాడు. రావణుడు కరుణాదూరుడై తన నిశిత ఖడ్గ తో ఆ జటాయువును వధించాడు. శ్రీరాముడు లక్ష్మణ సమేతుడై సీతను అన్వేషిస్తూ వచ్చి తన నిమిత్తం నిహతుడైన జటాయువునకు పరలోక క్రియలు నిర్వర్తించి ఋశ్యమూక పర్వతానికి వెళ్ళాడు.

అచ్చట వాలిచే తరుమబడిన సుగ్రీవుడుంటున్నాడు. శ్రీరాముడు సుగ్రీవుని కడకేగి "నీపై పగబట్టి నిన్ను రాజ్యభ్రష్టుని చేసిన వాలిని వధిస్తా" నని సుగ్రీవునకు మాట ఇచ్చాడు. వాలి సామాన్యుడు కాదు. అతడు నీతిశాలి. శివభక్తుడు. దశకంఠుని పరిభవించిన మహావీరుడు. అలాంటి వీరుని శ్రీరాముడు ఒక్క బాణంతో వధించాడు. సుగ్రీవుని కిష్కింధకు పట్టాభిషిక్తుని చేశాడు. అనంతరం మహా బలవంతుడైన హనుమంతుని శ్రీరాముడు సీతాన్వేషణమునకు నియమించాడు. హనుమంతుడు తన సహజ శక్తిచే అవలీలగా దక్షిణ సముద్రాన్ని దాటి లంకానగరంలో సీతాదేవిని చూచాడు. తిరిగివస్తూ

అక్షకుమారాదులను వధించాడు. రావణుడాగ్రహించి అతని తోకకు, చేతులకు నిప్పంటించేసరికి ఆ నిప్పుతోనే అతడు నిరాటంకంగా లంకా నగరాన్ని దగ్ధం చేశాడు.

ఆ విధంగా లంకాదహనం చేసి వచ్చి మారుతి సీతాకథనం చెప్పగా శ్రీరామ చంద్రుడు కపిసేనను వెంటపెట్టుకొని సముద్రతీరం చేరాడు. ఆ సముద్రం నానావిధ జలజంతువులతో భయంకరంగా ఉంది. దాని గాంభీర్యం చెప్పనలవి కానిది. దాని తరంగాలు ఆకాశాన్నంటి అక్కడ ఒక దానితో నొకటి కొట్టుకొనటం వలన రేగిన కఠోర ధ్వనితో కూడి నీటి తుంపరలు ఆకాశాన్నంతా కమ్మివేస్తున్నాయి. అది రత్న నిలయం. ఆ సముద్రాన్ని చూచి శ్రీరాముడు తనకు దారిమ్మని అర్థించాడు. కాని అది దారి చూపక పోగా గర్వోద్ధతితో ఆకాశాన్ని అంటుతూ పెరిగింది. శ్రీరామ చంద్రుడు రెట్టించిన కోపంతో చిరునవ్వు నవ్వుతూ, కళ్ళు అల్లారుస్తూ సవిలాసంగా విల్లు చేతితో అందుకొనేసరికి ఆ సముద్రం అంతా గుల్లలు, నాచులు, చిప్పలు, మంటిపెల్లలునై పెద్దబీడు అయిపోంది. అపుడు సముద్రుడు నదులతోగూడి మూర్తిమంతుడై వచ్చి రామచంద్రుని పాదాలపైబడి శరణువేడి ఇలా ప్రార్థించాడు.

ఓ కాకుత్స్థ కులేంద్రుడా! ఓ గుణనిధీ! ఓ దీన మందారా! నేను బుద్ధి హీనుడను. నీ కోపానికి నేను ఎంతవాణ్ణి. నీవు భూనాథుడవు. లోకాధీశుడవు ఆది నాయకుడవు. ఈ లోకాలన్నీ నీ కుక్షిలో ప్రవేశిస్తాయి; పెరుగుతాయి. అణగి పోతాయి. రజోగుణంతో ధాతలను, సత్వగుణంతో దేవతలను, తమోగుణంతో భూతకోటినీ సృష్టిస్తూ నీవు ఈ మూడు గుణాలకు అతీతుడువుగా ఉంటావు. నీవు సేతువుని కట్టు. లంకను చుట్టుముట్టు, నీ బాణాగ్నికి రాక్షసులతలలునేలబడేలా కొట్టు. అత్యంత భాగ్యప్రబల అయిన నీ అబలను (భార్యను) చేవట్టు. నేను హరికి మామను. శ్రీదేవికి తండ్రిని. నన్ను బాధించటం దేనికి? చంద్రవంశా గ్రణీ! నీవు నీ కీర్తిలతకు నెలవుకాగా వారధి కట్టి లంకకు వెళ్ళు అని విన్న వింపగా శ్రీరామ చంద్రుడు సముద్రుని పూర్వరీతిని ఉండుపొమ్మని వీడ్కొలిపాడు.

అనంతరం ఇంద్రాది దేవతలు సన్నుతింపగా కపినాథులు పర్వతాలనూ, చెట్లనూ మహావేగంతో పెరికితెచ్చి జలరాశిని కట్టారు శ్రీరామ చంద్రుడు ఇలా సముద్రం దాటి లంకలో ప్రవేశించాడు. రావణుని తమ్ముడు విభీషణుడు శరణువేడగా అభయమిచ్చాడు లంకను చుట్టు ముట్టాడు. ప్రాకారాలు పడగొట్టాడు అగడ్తలు పూడ్చివేశాడు. కోట కొమ్మలు నేల కూల్చాడు. సింహద్వారాలు పెకలించాడు. తలుపులు విరిచాడు. కోట

గోడలు బ్రద్దలు కొట్టాడు. యంత్రాలు చెరిపివేశాడు. ముంజూరులందలి గువ్వ గూడులను నటికి క్రిందపడవేశాడు. గోపురాలను నేలకూలదన్నాడు. మకర తోరణాలను కూల్చివేశాడు. కేతనాలను (జెండాలు) చింపివేశాడు. మెట్లను కదల్చివేశాడు. మేడలను పడగొట్టాడు. బంగారపు స్థంభాలను పెరకివేశాడు. ఏనుగులు నీటి కొలనులో ప్రవేశించి కలచి వేసినట్లు కపిసేనలు లంకలో ప్రవేశించి చిందర వందర చేశాయి.

అపుడు లంకేశ్వరుడు కుంభుడు, నికుంభుడు, ధూమ్రాక్షుడు, విరూపాక్షుడు, సురాంతకుడు, నరాంతకుడు, దుర్ముఖుడు, ప్రహస్తుడు, మహాకాయుడు మొదలైన రాక్షసవీరులను ధనుర్బాణాలు ఖడ్గాలు, శూలాలు, ఇనుప గుదియలు మొదలగు నానావిధాలైన ఆయుధాలు ఇంకా ఇతర యుద్ధ సాధనాలు ధరించి రథ, గజ, తురంగాలపై కపివీరులను ఎదుర్కోవటానికి పంపాడు. కపివీరులు సుగ్రీవుడు, హనుమంతుడు, గవయుడు, గంధమాదనుడు అంగదుడు, కుముదుడు, జాంబవంతుడు మొదలైనవారు ఆ రాక్షసులను ద్వంద్వయుద్ధ లో తరులతో, గిరులతో, గదాఘాతాలతో హతమార్చారు.

అప్పుడు లక్ష్మణుడు తీవ్ర బాణాలతో పర్వతాకారుడు,మాయోపాయుడు, అజేయుడు అయిన అతికాయుని త్రుంచివేశాడు. శ్రీరామచంద్రుడు కుంభకర్ణుని సంహరించాడు. అనంతరం లక్ష్మణుడు అలవోకగా మేఘనాధుని నేల గూల్చాడు. తన వారందరూ అలా రణ రంగంలో నిహతులు కావటం చూచి దేవ వైరి రావణాసురుడు పుష్పక విమానం అధిరోహించి రామునితో శర యుద్ధానికి తలపడ్డాడు.

అప్పుడు దేవేంద్రుని ఆజ్ఞానుసారం మాతలి శ్రీరామచంద్రుని నిమిత్తం ఒక దివ్య రథం తీసుకొని వచ్చాడు. సూర్యుడు ఉదయ పర్వతాన్ని ఎక్కినట్లు రఘుపతి ఇంద్ర సారథి అయిన మాతలి తీసుకొని వచ్చిన రథాన్ని అధిరోహించి రావణునికిలా అన్నాడు. రావణా! నాతో ఇప్పుడు యుద్ధానికి రా. రణ రంగంలో నన్నెదిరించి నా బాణాగ్ని తాపాన్ని సహించటం ఎక్కడో ఒక మూల నక్కి బంగారు లేడిని పంపటం కాదు. కపట యతివేషం దాల్చి అరణ్య మధ్యంలో అబలను వంచించి నిరసించటం కాదు. నీచుడా! నీవు చేసిన పాపాలకు యముడు దాకా అక్కర్లేదు. ఖేచరులు, భూచరులు చూచి ఆనందంతో పరవశించేలాగా నా బాణాలతో నేడు నిన్ను ఖండిస్తాను చూడు- అని పల్కి తన వింటిని గ్రహించాడు బ్రహ్మాండం బ్రద్దలయ్యేలాగా టంకార ధ్వని చేశాడు. ప్రళయ కాలాగ్నితో సమానమైన ఒక మహా బాణాన్ని వింటికి సంధించాడు. ఆకర్ణాంతం లాగి మహా వీరుడైన రావణునిపై విసిరాడు. దశరథ సూనుడు వేసిన బాణం లంకేశుని హృదయంలో దూరింది. అతడు

దభ్భాటుగా నేలకు కూలాడు. అతని పది కోళ్ళనుండి రక్త ధారలు స్రవించటం మొదలు పెట్టాయి. అతడు వెంటనే మృతి చెందాడు.

రావణుని మృతి వార్త విని రాక్షస స్త్రీలు తలలు మోదుకుంటూ భూత బేతాళ పిశాచాలకు నిలయమైన యుద్ధ రంగానికి కన్నీరు మున్నీరుగా శోకిస్తూ వచ్చారు: తడబాటుతో వారలా యుద్ధ భూమికి వడివడిగా వస్తూండగా పీడిపోయిన కొప్పులు పూల మాలికలతోకూడి భుజాలమీద చిందర వందరగా పడ్డాయి. వారు పాపటలయందు ధరించిన ముత్యాలు చెదరిపోయాయి. కర్ణాభరణాలు ఊడిపోయాయి. కంఠ హారాలు తెగిపోయాయి. ముఖ పద్మాలు వాడిపోయాయి. పెదవులు ఎండిపోయాయి. కన్నీళ్ళు వరదలై అవయవాలను తడుపుతున్నాయి. సన్నని నడుములు జవ్వాడుతున్నాయి. పయ్యెదలు జారి పోతున్నాయి. పాలిండ్ల బరువులను నడుములు భరించలేక పోతున్నాయి. తూలుతూ, సోలుతూ శోకాక్రాంతలై రాక్షస సతులు రణ భూమికి వచ్చి తమ తమ నాథుల మృత శరీరాలపై బడి విలపించటం మొదలు పెట్టారు.

మండోదరి రావణుని చూచి ఇలా అన్నది. "దనుజేంద్రా! ప్రాణేశ్వరా! సురేంద్రాదులను గెల్చిన నీవు ఈనాటికి మన్మథుని పూబాణాలకు ఓర్వలేక కాలంగతుడవయ్యావా! ఉన్మాదంతో రఘువీరుని భార్యను తీసుకొని రావటం తప్పని నేను చెప్పినా వినవైతివికదా! ముల్లోకాల్లో నిన్ను చూచి వెరవని వారెవ్వరు? సూర్యుడు ఎండకాయటానికి భయపడుతాడు. చంద్రుడు వెన్నెల విరియటానికి వెఱుస్తాడు. గాలి స్వేచ్ఛగా వీయటానికి శంకిస్తాడు. అలాంటి మహావీరుడవైన నీ రాజధాని లంకానగరానికి మాకు ఈనాడు విధవాత్వం వచ్చింది. పరస్త్రీరతులకు, పరధనాసక్తులకు ఇహమూ పరమూ కూడా ఉండవు. వారికి కళ్ళు కన్పడవు. ఇది పాపకృత్యమే; అని వారు భావింపరు. క్షణికమైన సౌఖ్యం కోసం ఎక్కడికైనా పోతారు"- అని మండోదరి విలపిస్తూండగా విభీషణుడు రామచంద్రుని ఆజ్ఞానుసారం రావణాసురునకు దహనాది క్రియలు కావించాడు. అనంతరం రాఘవేంద్రుడు అశోకవనానికి వెళ్ళి అచట శింశుపావృక్ష సమీపంలో ప్రాణావశిష్ఠ అయిఉన్న సీతాదేవిని చూచాడు. రాక్షసాంగనలు ఆ దేవి చుట్టూ పర్యవేష్టించి ఉన్నారు. ఆమెజుట్టు విడివడి ఉంది. ముంగురులు చిక్కువడి ఉన్నాయి. ఆమె నిట్టూరుస్తూ ఉంది. కన్నీళ్ల సంతతధారగా ప్రవహిస్తున్నాయి. శుష్కించిన చెక్కిలిని చేతియందుంచి భీతితో తలవంచి కూర్చున్నది కృశించిపోయింది. ఎలాగో ప్రాణాలు బిగపట్టి జీవించి ఉన్నది.

శ్రీరామచంద్రుడు ఆమెని చూచి తపించిపోయాడు. ఆమె నిర్దోషిత్వాన్ని అగ్నిపరీక్షలో ప్రకటించి దేవతల ఆజ్ఞానుసారం ఆ దేవిని గ్రహించాడు. అనంతరం శ్రీరామచంద్రుడు విభీషణుని సమస్త లంకా సామ్రాజ్యాని

అభిషిక్తుణ్ణి చేశాడు. వెంటనే రాజచంద్రుడైన రాముడు పుష్పకారూఢుడై సీతా లక్ష్మణులతో కూడి నందిగ్రామానికి బయలుదేరాడు. సుగ్రీవుడు, హనుమంతుడు మొదలైనవారుగూడా వెంటనంటి వెళ్ళారు. దేవతలు పువ్వులసోనలు కురిపిస్తూండగా తాను పూర్వం వచ్చిన తిరుగుజాడలు సీతకు చూపిస్తూ నందిగ్రామం చేరాడు. రఘుపతి తిరిగివస్తున్నాడని విని భరతుడు పరవశించి పోయాడు. పాదుకలను తలదాల్చి పురజనులు వెంటకొలిచిరాగా అన్నకు ఎదురునచ్చాడు. అలా ఎదురువచ్చి భరతుడు పాదుకలను శ్రీరాముని పాదకమలముల ముందుంచి సాష్టాంగ దండప్రణామాలు చేశాడు. నానబుత్తో ఆతని పాద ధూళిని తుడిచి నెత్తిపై చల్లుకొన్నాడు. అంతటితో తనివితీరక శ్రీరాముని పాదపద్మాలను రొమ్మున మోపుకొని ఆనంద బాష్పజలంతో కడిగి క్షేమాలడిగాడు.

అనంతరం రామవిభుడు తనకు ఎదురువచ్చిన బ్రాహ్మణులకు నమస్కరించాడు. ఇతరులవలన మన్ననలు పొందాడు. వారిని మన్నించాడు. శ్రీరాముని చూచి అందఱు మహానందం చెందారు— "రాజేంద్రా! నిన్ను చూచి ఎన్నాళ్ళో అయింది. మా తపస్సులు ఈనాడు పండాయి. మేము ధన్యులమయ్యాం" అని ధ్వజాలూపుతూ పువ్వులతో వసంతాలాడుతూ వినోదించారు.

సుగ్రీవుడూ, విభీషణుడూ శ్రీరామచంద్రుని కిరువైపులా చామరాలు వీస్తున్నారు. హనుమంతుడు శ్వేతాతపత్రం పట్టుకొన్నాడు. భరతుడు భక్తితో పాదుకలను తెస్తున్నాడు శత్రుఘ్నుడు ధనుర్బాణాలు ధరించి వెంట వస్తున్నాడు లక్ష్మణుడు చేమోడ్చిభృత్య భావంతో అనుగమిస్తున్నాడు. సీతాదేవి జలపాత్ర చేదాల్చివస్తోంది. స్వర్ణమయమైన ఖడ్గాన్ని అంగదుడూ పసిడి టెక్కాన్ని జాంబవంతుడూ మోస్తున్నారు. అలా మహావైభవంతో పుష్పకారూఢుడైన శ్రీరామచంద్రుడు నమస్తగ్రహాళిచే సేవింపబడుతన్న పూర్ణ చంద్రుడులా ప్రకాశించాడు. అనంతరం అందరూ అయోధ్యానగరాభిముఖులై బయలుదేరారు. అంతకుముందే పౌరులు ఆ నగరంలోని వీథుల్లో సుగంధ జలాలు చల్లారు. అరటి కంబాలు నిలిపారు. పట్టుచీరలు చుట్టారు. తోరణాలు కట్టారు. మేలుకట్లు అమర్చారు. వేదికలలికించి నానావిధాలైన రత్నాల ముగ్గులు పెట్టారు. గోడలమీద రామ కథలు వ్రాయించారు. రాజ సౌధాల మీద, దేవ భవనాలమీద, గోపురాలమీదా కనక కలశాలు ఎత్తించారు. వాకిట వాకిట కాక్కలుంచారు. నానా వాద్యాలతో అందరూ రాఘవేంద్రునికి ఎదురు వెళ్ళారు రాజ వీథులన్నీ మదపు టేనుగుల దాన ధారలతో తడిసి ఆ నగరం తన ప్రాణేశుని రాకకు ద్రవించిన హృదయం గల అంగనలాగా హృదయమంగా ఉంది శ్రీరామచంద్రుడు వచ్చేనరికి వాద్య ధ్వనులతోనూ చతురంగ

సేనా వాహినితోనూ అయోధ్యా నగరం చంద్రుడు వచ్చే సరికి జల జంతువు లతో, తరంగ ధ్వనులతో ఘూర్ణిల్లెడి సముద్రం లాగా ఉంది.

రాముడలా నగరం ప్రవేశించి రాజ మార్గాన పోతూండగా సౌధాగ్రాల మీదనుండి పౌరాంగనలు వ్రేళ్ళతో చూపిస్తూ "అతడే రామ నరేంద్రుడు. ఆ అబల సీత. ఆమె కోసమే అతడు సుర వైరిని ఖండించాడు. అదుగో అతడే లక్ష్మణుడు. అతడే కపిరాజు సుగ్రీవుడు. ఆ పక్కనున్న వాడు హనుమంతుడు. ఆ హనుమంతునికి చెంగటనున్నది విభీషణుడు." అని చెప్పుకొంటూ మురిసి పోతున్నారు. ఇలా సమస్త జనులు చూస్తూండగా రామచంద్రుడు రాజ మార్గాన చని చని రాజ సౌధంలో ప్రవేశించాడు. ఆ సౌధాల సోయగం చెప్ప నలవి కానిది. ఆ పటికపు గోడలు ఆ పగడాల వాకిళ్ళు ఆ నీలపు టరుగులు, వైఢూర్యమయాలైన ఆ స్తంభాలు, ఆ మకర తోరణాలు, నేత్ర పర్వంగా ఉన్నాయి. అచటి సుగంధ పుష్ప వాసనలూ ధూప దీపాలు మైమరపిస్తూ ఉన్నాయి. అపర దేవతల్లాగా ఉన్న అచటి స్త్రీ పురుషుల సందడి చెప్పనలవి కాదు. ఇక ఆ రాజ సదనంలోని ధనరాసులు ఎవరెవరివో గురితించటానికి వీలు లేనంతగా కుప్పలు కుప్పలుగా పోసున్నాయి.

శ్రీరామచంద్రుడలా రాజ సదనం ప్రవేసించి తల్లులందరికీ మ్రొక్కాడు. తన తల్లి కౌసల్యకు వందనం ఆచరించాడు. వినతుడై పండితులను విను తించాడు. స్నేహితులనూ, సైదోడులకూ సంతోషంతో కౌగలించుకొన్నాడు. కనుకొలకులయందు కృపారసం స్రవిస్తూండగా అమాత్యులనూ, పూర్వపు సేవకులనూ యథోచితంగా ఆదరించాడు. కొడుకులు పెద్ద కోడలు వైదేహి అలా మ్రొక్కేసరికి తల్లులు ద్రవించిపోయి వారి తలలు మూర్కొన్నారు. వారి మోముదమ్ములను ముద్దులు పెట్టుకొన్నారు. ఆనంద బాష్పాలతో వారి శరీరాలను ముంచివేశారు. వారికప్పుడు పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినంతటి ఆనందం కల్గింది.

అనంతరం వశిష్ఠుడు వచ్చి శ్రీరామ చంద్రుని జటాబంధం విడిచాడు. కులవృద్ధులూతానూ మంత్రపూర్వకంగా,దేవేంద్రుని బృహస్పతి మంగళస్నానం చేయించినట్లు, నానాసముద్రాల నుండి నానా పవిత్రనదుల నుండి తెప్పించిన పుణ్యజలంతో అభిషేకం చేయించారు. సీతారాములు జలకాలాడి మంచి బట్టలు కట్టుకొన్నారు. కమ్మని పువ్వులు తురుముకొన్నారు. సుగంధాలు అలదికొన్నారు. మణిమయాభరణాలు ధరించారు. తనకు భరతుడు సమర్పిం చిన రాజ సింహాసనం మీద కూర్చుండి రాముడు అతనిని మన్నించి కౌసల్యకు ప్రియం చేసి లోక పూజ్యంగా రాజ్యపాలనం చేయటం మొదలు పెట్టాడు. అతడలా రాజ్యం చేస్తుండగా నక్షత్రసముద్రాలు కలగటం మాని శాంతంగా ఉన్నాయి. భూమి నిశ్చలంగా ఉంది. కమలాక్షునకు రక్షణ బాధ్యత తగ్గింది.

దిక్పాలకులకు దైన్యం లేకుండా పోయింది. సూర్యచంద్రులు మాసిపోవటం అనేది లేకుండా నిరంతరం ప్రకాశిస్తున్నారు. దిక్కులకు ఆకాశానికి కావిరి లేకుండా పోయింది. చెట్లు ఎండిపోకుండా నిరంతరం సుమఫల భరితంగా ఉన్నాయి. త్రేతాగ్నులు ముప్పేళలా జ్వలిస్తున్నాయి. శ్రీరాముడు ధరణీభారం వహించటంచేత దిగ్గజాలకు, కుల పర్వతాలకు, ఆది వరాహానికీ, ఆదిశేషునకు, ఆది కూర్మానికి ఆ భారం తప్పింది.

రాజచంద్రుడైన శ్రీరాముడు రాజ్యభారం వహించాక చపలత్వం స్త్రీల ఛాలు చూపులందు, అలాగే లేమి వారి నడుములందూ, వక్రత్వం వారి ముంగురులందు, మాంద్యం వారి నడకలయందు, పీడనం వారి కౌగిండ్లయందు, పోరాటం వారి కుచకుంభాల నడుమను, బంధం వారి రతులయందు, తాపం వారి వియోగమందు, మాత్రమే గోచరిస్తాయి. కాని ఆ లక్షణాలు అన్యత్రా ఇంక ఎక్కడా ఉండవు. అలాగే చౌర్యమనేది ప్రియులు ప్రియురాండ్రు మనస్సులను పరస్పరం దోచుకోవడంలోనే తప్ప ఇంక ఎక్కడాలేదు ఇక అక్రమమనేది భర్తలు తమ సతుల జుట్టు ముడులను పట్టుకొని లాగుటయందే కాని రామరాజ్యంలో ఇంకెక్కడా ఉన్నట్టులేదు.

రామచంద్రుడు ప్రజలను తండ్రిలాగా రక్షిస్తూ ఉండడంచేత వారందరూ వారి తండ్రులను మరచిపోయాడు. అంచేత అందరికి రాముడే తండ్రి అయ్యాడు. అంతేకాదు శ్రీరామచంద్రుడు రాజర్షి వంటివాడు. నిజ ధర్మరతుడు. ఏకపత్నీ వ్రతుడు. సర్వలోక సమ్మతుడు. ధర్మవిరోధం లేకుండా యథోచితంగా భౌతిక సుఖాలు అనుభవిస్తూ ఉంటాడు. అది త్రేతాయుగమైనా కృతయుగ ధర్మాలు నడుస్తూ ఉన్నాయి బాల మరణాలు మొదలైన అరిష్టాలేవీ కలుగకుండా అతడు రాజ్యపాలనం చేస్తున్నాడు ఇక సీతాదేవికూడా సిగ్గు, సింగారం, భక్తి, భయం, నయం, ప్రియం కల్గి శ్రీరాముని మనస్సును వశంగతం చేసుకొని మహాసాధ్వి అని సలుగురిచే అనిపించుకొంది-అని శుకుడు అనేసరికి పరీక్షిన్న రేంద్రుడు-మునిపుంగవా! భ్రాతృజనులయందు,బంధువులయందు ప్రజలయందు రాజభావంలో రామచంద్రుడు ఎలా వర్తించాడు? పరమేశ్వరుని గూర్చి యజ్ఞాలు ఎలా చేశాడు? అని ప్రశ్నించగా శుక యోగీంద్రుడు ఇలా చెప్పటం మొదలు పెట్టాడు.

పరీక్షిన్నరేంద్రా! విను. భగవంతుడైన రామభద్రుడు సర్వదేవమయుడైన తనను తానే కూర్చుకొని అనేక యాగాలు చేశాడు. ఆ యాగాల్లో హోతకు తూర్పు దిక్కు, బ్రహ్మకు దక్షిణ దిక్కు, అధ్వర్యునకు పశ్చిమ దిక్కు, ఉద్గాతకు ఉత్తరదిక్కు, మిగిలినది ఆచార్యునకు దక్షిణగా ఇచ్చాడు. అంతేకాక నిస్పృహుడైన శ్రీరాముడు తన సమస్తం బ్రాహ్మణులకి పంచి ఇచ్చి కట్టు బట్టలతో మాత్రం మిగిలాడు. అలాగే సీతాదేవి కూడా మంగళ సూత్రం

తప్పు మిగిలిన అలంకారాలన్నీ అర్హులైన వారికి ఇచ్చి వేసింది. రాజేంద్రా! ఆ సీతారాముల వితరణాన్ని గూర్చి ఏమనాలి? అయితే శ్రీరాముని ఆ దానశీలత్వానికి మెచ్చి బ్రాహ్మణులు వారికి అతడిచ్చిన భూములను, ధనములను తిరిగి ఇచ్చి "రాజేంద్రా! మేము తాపసులం. మాకి భూమి ఎందులకు? ఈ ధనరాసులెందులకు? అఖిల లోకాలకు అధిపతి అయిన శ్రీహరివి నీవు. నీవు నీ స్వీయ తేజంచే మా హృదయాల్లో ఉండే అజ్ఞానాన్ని పోగొట్టు చాలు"- అని పల్కి బ్రహ్మణ్య దేవుడైన శ్రీరామచంద్రుని వినయ వాక్కులతో పూజించి మునులు వెళ్ళిపోయారు. రాముడు చిరకాలం రాజ్యం చేశాడు.

ఇలా ఉండగా ఒక రోజున రాముడు లోక వార్తలు వినాలనే కుతూహలంతో గూఢ వృత్తితో నడిరేయి, తిరుగుతూండగా పుర జనులలో నొకడు పరునింటనున్న తన సతిని అంగీకరింపక "పరునింట కాపురమున్న చపలురాలుని విడువలేక తిరిగి గ్రహించిన వెర్రి రాముడనా నేను?" అని ఆమెను తృణీకరించటం తన చెవులారా విని శ్రీరాముడు కలత చెందాడు. ఈ వార్తను చారుల వలన లోకంలో సర్వత్రా వ్యాపింప చేశాడు. సీతకు మాత్రం చెప్పకుండా ఆమె నిద్రించు చుండగా రాత్రికి రాత్రి ఆమెను వన మధ్యంలో వాల్మీకి మహర్షి ఆశ్రమంలో దిగ విడిచి వచ్చేలా ఆజ్ఞాపించాడు. సీత అప్పుడు గర్భవతి -ఆమె వాల్మీకి తపో వనంలో కుశలవులను ఇరువురు కొడుకులను కన్నది. వాల్మీకి మహర్షి వారికి జాత కర్మలు ఆచరించాడు.

కాల క్రమంలో లక్ష్మణునకు అంగదుడునూ, చంద్రకేతుడునూ; భరతునకు దక్షుడునూ, పుష్కలుడునూ; శత్రఘ్ననకు సుబాహుడునూ, శ్రుతసేనుడునూ జన్మించారు. మహా బలశాలి అయిన భరతుడు గంధర్వులను జయించి వారిసంపదలను తెచ్చి అన్నకిచ్చాడు. అతని శౌర్యాన్నీ, ఔదార్యాన్నీ తల్లులు,బంధువులు ప్రజలు మెచ్చుకొన్నారు.ఇక శత్రుఘ్నుడు శ్రీరాముడానతి ప్రశంసింపగా మధు వనంలో మధు పుత్రుడైన లవణుని చంపి మధు పురాన్ని నిర్మించాడు.

కొంత కాలానికి శ్రీరామచంద్రుని కుమారులైన కుశలవులందరూ వాల్మీకి వలన వేదాది విద్యల్లో నేర్పరులయ్యారు. అనేక నభల్లో రాగ తాళ యుక్తంగా రామ కథా గానం చేస్తూ ఒకనాడు రాఘవేంద్రుని యజ్ఞశాలకు వచ్చారు. అక్కడ వారు రామ కథా గానం చేస్తూంటే మోడు వారిన చెట్లు చిగిర్చాయి. మధు ధార కాల్వలు కట్టి ప్రవహించింది. శ్రీరాముడూ ప్రజలూ కూడా మహానందంతో మైమరచిపోయారు. వారి కనులవెంట ఆనంద బాష్పాలు స్రవించాయి. ఆ పసి బాలుర గానానికి ముగ్ధులై అందరూ తలలూపి వారిని ప్రశంసించారు. శ్రీరామునికి వారిపై చెప్పరాని అనురాగం పుట్టింది. అతడు వారిని ఉద్దేశించి "చిన్నారులారా! మీరు ధన్యులు. మీ తల్లిదండ్రు [illegible]రు? మీ

ముఖాలు చంద్ర బింబాల్లాగా ఉన్నాయి. మీ నేత్రాలు తామర పువ్వు రేకుల్లా విశాలంగా ఉన్నాయి. మీ మాటలు మధురంగా ముద్దులొలుకు తున్నాయి" అనేసరికి వారు మేము వాల్మీకి మహర్షి మనుమలం. రాఘవేశ్వరుని యాగం చూడటానికి వచ్చాం అని మాత్రమే చెప్పగా శ్రీరాముడు మెల్లన నవ్వి "అలాగా? అయితే రేపు ప్రొద్దున మీ తండ్రి ఎవరో నేనే చెబుతాను ఉండండి" అని వారిని సత్కరించి పంపాడు.

మరునాడు వాల్మీకి మహర్షి సీతాదేవిని తోడ్కొని కుశలవులను ముందిడుకొని వచ్చి శ్రీరాముని అనేక రీతుల సన్నుతించి "రవి వంశ వార్ధి చంద్రా! రామచంద్రా! సీత మహాసాధ్వి మనో వాక్కర్మలయందునత్యనిరత. నిర్మల చరిత. ఆ మహా సాధ్విని విడిచిపెట్టటం తగదు. ఆమెను తిరిగి గ్రహించు"అని వాల్మీకి పలుకగా శ్రీరామచంద్రుడు పుత్రార్థిఅయి విచారించటం మొదలు పెట్టాడు. అప్పుడు సీతాదేవి కుశలవులను వాల్మీకికి అప్పగించి శ్రీరామచంద్రుని చరణ ధ్యానం చేస్తూ హతాశ అయి భూ రంధ్రంలో ప్రవేశించింది.

శ్రీరాముడు ఆ హృదయ విదారక దృశ్యం చూచి నిర్విణ్ణుడై సీత నుద్దేశించి- "దేవీ! నీ వెందుకీ రీతిగా భూ వివరంలో ప్రవేశించావు? మన పరస్పర మోహాన్ని విచారింపవా? నీ ముఖ పద్మాన్ని చూపవా? నీ మృదు వాక్యాన్ని విన్పింపవా? ఇలా తెగతెంపులు చేసుకొనటం తగదు." అని సాక్షాత్తు ఈశ్వరుడై ఉండికూడా ఆ రాజేంద్రుడు దుఃఖించాడు. అవును. ఎవ్వరికైనా ప్రియురాలి వియోగం దుస్సహం కాకుండా ఉంటుందా రామచంద్రుడలా దుఃఖించి సీతా నిర్గమనానంతరం బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ పదమూడు వేల ఏండ్లు అగ్నిహోత్రం అఖండితంగా వేల్చాడు ఈశ్వరుడు కనుక తుదకు తన మొదట నెలవునకు వెళ్ళాడు ఆది దేవుడైన రామచంద్రునకు సముద్ర బంధనం ఎంత? రాక్షస సంహరణం ఎంతటిది? కపుల సహాయమది ఎంత? కేవలం దేవతల కోసం ఇవన్నీ అతడు చేసిన లీలలు. కాక మరేమీ కాదు- అని వల్కి శుకుడు శ్రీరాముని సన్నుతిస్తూ ఇలా అన్నాడు,

రామభద్రా! నీవు మహా సముద్రం యొక్క విజృంభణాన్ని అరికట్టిన వీరుడవు. నీ కీర్తి దశ దిశలా వ్యాపించింది. నీవు రవి తేజుడవు. నీ వాక్కు సుధా మధురం నీవు సాధు పోషకుడవు, రాక్షస రాజును సంహరించిన జగజ్జెట్టివి. నీకు నా నమస్కారం. నీవు నీలమేఘ శ్యామలుడవు. నీ నేత్రాలు పద్మాల్లాగా ఉంటాయి. నీవు నిరంతరం ధనుర్బాణాలు ధరిస్తావు. నీ బొమ్మ అతి విశాలమైనది. నీ భుజాలు ఎత్తుగా ఉంటాయి నీవు అందరిపై కృపారసం చల్లుతావు. నీ యశస్సు దిగంత వ్యాప్తమైనది. నీవు రఘుసత్తముడవు. నీవుకాక నా కోర్కెలు తీర్చేడివారు ఎవ్వరున్నారు. నీకు నా కై మోడ్పు.

కోసల ప్రజలు నీతో కూడి రాక పోకల్లో కలిసి తిరుగుతూ ఆది యోగులు వెళ్ళే ఉత్తమ గతికి వెడతారు. నీ నామ చింతనాలు సద్గతులకు మంతనాలు, మహా పుణ్యాత్ముల్లకు స్థానాలు. పాప వినాశకాలు. నీకు నా ప్రణామాలు. అని శుకయోగీంద్రుడు శ్రీరామచంద్రుని ప్రణుతించి అనంతర కథను ఈ రీతిగా చెప్పటం మొదలు పెట్టాడు.

ఆ రామచంద్రునకు కుశుడునూ, కుశునకు అతిధి, అతిధికి నిషదుడు, నిషదునకు నభుడు, నభునకు పుండరీకుడు, పుండరీకునకు క్షేమధన్వుడు, క్షేమధన్వునకు దేవానీకుడు, దేవానీకునకు అహీనుడు, అహీనునకు పారియాత్రుడు, పారియాత్రునకు బలుడు, బలునకు చలుడు, చలునకు అర్కాంశభవుడైన వజ్రనాభుడు, వజ్రనాభునకు శంఖణుడు, శంఖణునకు విధృతి, విధృతికి హిరణ్యనాభుడు పుట్టారు. హిరణ్యనాభుడు జైమిని శిష్యుడైన యాజ్ఞవల్క్యముని వలన ఆధ్యాత్మయోగం నేర్చి మనోదోషాలను పోగొట్టుకొని యోగచర్యుడయ్యాడు.

ఆ హిరణ్యనాభునకు పుష్యుడు, పుష్యునకు ధ్రువసంధి, ధ్రువసంధికి సుదర్శనుడు, సుదర్శనునికి అగ్నివర్ణుడు, అగ్నివర్ణునకు శీఘ్రుడు, శీఘ్రునకు మరువను రాజశ్రేష్ఠుడు జన్మించారు. రాజయోగి అయిన ఆ మరువు కలాపమనెడి గ్రామంలో ఉంటూ కలియుగాంతాన నశించెడి సూర్యవంశాన్ని తిరిగి ప్రవర్తింపచేస్తాడు. ఆ మరువునకు ప్రశుశ్రుకుడు, ఆ ప్రశుశ్రుకునకు సంధియు, అతనికి అమర్షణుడు, అమర్షణునకు మహాస్వంతుడు, ఆ మహాస్వంతునకు విశ్వసాహ్యుడు, ఆ విశ్వసాహ్యునకు బృహద్బలుడు జన్మించారు. ఆ బృహద్బలుడు భారతయుద్ధంలో నీతండ్రి అయిన అభిమన్యుని చేత హతుడయ్యాడు. ఆ చరిత్ర అంతా క్రమంగా చెబుతాను

## భవిష్యద్రాజేతిహాసము

రాజేంద్రా! ఇక్ష్వాకుడు మొదలుగా బృహద్బలుడు చివరివాడుగా గల మీవంశక్రమాన్ని నీకు తెలియజెప్పాను. ఇహమీద నీ వంశంలో పుట్టేవారిని గూర్చి చెబుతాను విను.

ఆ బృహద్బలునకు బృహద్రణుడు, బృహద్రణునకు ఉరుక్షతుడు, అతనికి వత్సప్రీతుడు, వత్సప్రీతునకు ప్రతివ్యోముడు, ప్రతివ్యోమునకు భానుడు, భానునకు సహదేవుడు, సహదేవునకు బృహదశ్వుడు, బృహదశ్వునకు భానుమంతుడు, భానుమంతునకు ప్రతీకాశ్వుడు, ప్రతీకాశ్వునకు సుప్రతీకుడు, సుప్రతీకునకు మేరుదేవుడు, మేరుదేవునకు సుతక్షత్రుడు, సుతక్షత్రునకు ఋక్షకుడు, ఋక్షకునకు అంతరిక్షుడు, అంతరిక్షునకు సుతపుడు, అతనికి అమిత్రజిత్తు, అమిత్రజిత్తునకు బృహద్వాజి, అతనికి బర్హి, బర్హికి ధనం

జయుడు, ధనంజయునకు రణంజయుడు అతనికి సృంజయుడు సృంజయునకు శాక్యుడు, శాక్యునకు శుద్ధాదుడు, శుద్ధాదునకు లాంగలుడు, లాంగలునకు ప్రసేనజిత్తు, అతనికి క్షుద్రకుడు, క్షుద్రకునకు ఋణకుడు, ఋణకునకు సురధుడు, సురధునకు సుమిత్రుడు జన్మిస్తారు. సుమిత్రుని అనంతరం సూర్య వంశం నశిస్తుంది అని చెప్పి శుకుడు ఇంకా ఇలా అన్నాడు.

## మిథిల వంశానుక్రమం

ఓ రాజేంద్రా! ఇక్ష్వాకు కుమారులలో వికుక్షివంశం వర్ణించి చెప్పాను. ఇక నిమి అనువాని వంశక్రమం చెబుతానువిను. నిమి ఒక యజ్ఞం చేయదలచి వశిష్ఠుని ఋత్విక్కుగా రమ్మని అర్థించాడు - కాని అతడు అంతకుముందే ఇంద్రునకు ఋత్విక్కుగా ఉండి యజ్ఞం చేయించటానికి నిశ్చయించుకొని ఉండటంచేత ఆ యజ్ఞం చేయించి వచ్చేవరకూ ఆగమని అన్నాడు. దానికి నిమి అభ్యంతరం చెప్పలేదు. వశిష్ఠుడు ఇంద్రునియాగం చేయించటానికి వెళ్ళాడు. ఇంతలో నిమి జీవితం చంచలమనిన్నీ, కాలయాపన చేయటం ఉచితం కాదనీ భావించి అన్య ఋత్విక్కులను కూర్చుకొని యజ్ఞం చేశాడు. ఇంద్రయాగం పరిసమాప్తం చేసి వశిష్ఠుడు శిష్యునికడకు వచ్చాడు. తాను వచ్చేదాకా ఆగకుండా నిమి యజ్ఞం చేసినందుకు ఆగ్రహించాడు.

ఓయీ! నాకోసం నిరీక్షించకుండా నీవు యజ్ఞం చేసినందుకు నీకు "దేహపాతం కలుగుగాక" అని శపించాడు. గురుశాపం విని నిమికూడా నిగ్రహం కోల్పోయి "నీవున్నూ దేహత్యాగం చేయుదువు కాక' అని శపించాడు. అనంతరం నిమి శరీర త్యాగం చేశాడు. వశిష్ఠుడు కాలక్రమంలో ఊర్వశిని మోహించిన మిత్రా వరుణలకు కుమారుడై జన్మించాడు. ఇక గురుశాపంచేత విగతజీవుడైన నిమి శరీరాన్ని గంధ ద్రవ్యములందుంచి కాపాడి మునులు సత్ర యాగశేషం పూర్తిచేశారు. యాగానంతరం అక్కడికి వచ్చిన దేవతలను చూచి ఋత్విజులు నిమిని పునర్జీవుతుని గావింపుడని వారిని కోరగా వారందుకు అంగీకరించారు. కాని నిమి అందుకు అంగీకరించక- మహాత్ములారా! ఈ శరీరం సుఖదుఃఖపీడితం. అనిత్యం. అలాంటి దేహం నాకెందుకు? ఈ కారణం చేతనే తత్వజ్ఞులు సర్వేశుడైన శ్రీహరిని సేవిస్తూ దేహధారణం కోసం తపింపరు - అని పలికేసరికి దేవతలు అతని మాటలు కాదనక "నీవీ స్థూల దేహంతో కాక, సూక్ష్మదేహంతో ప్రాణులు కనులు తెరచినప్పుడూ, మూసినప్పుడూ నీవు చూడబడుతూ స్వేచ్ఛగా ఉంటా"వని పలికి వెడలిపోయారు. దానికతడు అంగీకరించాడు.

అనంతరం దేశం అరాచకంగా ఉండటం చూచి మహర్షులు నిమిమృత శరీరాన్ని మధింపగా ఒక కుమారుడు జన్మించాడు. అతడు సామాన్యంగా

అందరూ జన్మించినట్లు జన్మించటంచేత జనకుడని, జీవరహితమైన శరీరమునందుపుట్టుట చేత విదేహుడని, మథనంవలన పుట్టాడు కనుక మిథిలదనీ ప్రఖ్యాతిగాంచాడు. ఆ మిథిలుడు మిథిలానగరాన్ని నిర్మించాడు. జనకునకు ఉదావసుడు, ఉదావసునకు, నందివర్ధనుడూ, అతనికి సుకేతుడు, సుకేతునకు దేవరాతుడు, దేవరాతునకు బృహద్రథుడును పుట్టారు. ఆ బృహద్రథునకు మహావీర్యుడు, అతనికి సుధృతి, అతనికి ధృష్టకేతుడు, అతనికి హర్యశ్వుడు, అతనికి మరువు, అతనికి ప్రతింధకుడు, అతనికి కృతరయుడు, అతనికి దేవమోఢుడు, అతనికి విధృతుడు, అతనికి మహాధృతి, అతనికి కీర్తిరాతుడు, అతనికి మహారోముడు, అతనికి స్వర్ణరోముడు, అతనికి హ్రస్వరోముడు, అతనికి సీరధ్వజుడను పుట్టారు. సీరధ్వజుడు యజ్ఞభూమిని దున్నుతుండగా అతని సీరాగ్రము వలన (నాగేటికొనను) సమస్త శుభ లక్షణములతో కూడిన సీత బయటకి వచ్చింది. అందుచేత అతనికి సీరధ్వజుడు అనే పేరు వచ్చింది.

ఆ సీరధ్వజునకు కుశధ్వజుడు, కుశధ్వజునకు ధర్మధ్వజుడు, ధర్మధ్వజునకు కృతధ్వజ మితధ్వజులను వారిరువురూ పుట్టారు. వారిరువురిలో కృతధ్వజునకు కేశధ్వజుడు జన్మించాడు. కేశధ్వజుడు బ్రహ్మ విద్యయందు ఆరితేరాడు. మితధ్వజునకు ఖాండిక్యుడనేవాడు పుట్టి తండ్రి వలన కర్మతంత్రం నేర్చుకొన్నాడు. కాని కేశధ్వజుని వలని భయంతో ఎక్కడికో పారిపోయాడు.

కేశధ్వజునకు భానుమంతుడు, భానుమంతునకు శతద్యుమ్నుడు, శతద్యుమ్ననికి శుచి, శుచికి సనద్వాజుడు, సనద్వాజునకు ఊర్ధ్వకేతుడు, ఊర్ధ్వకేతునకు అజుడు, అజునకు కురుజిత్తు, కురుజిత్తునకు అరిష్టనేమి, అరిష్టనేమికి శ్రుతాయువు, శ్రుతాయువునకు పార్శ్వకుడు, పార్శ్వకునకు చిత్రరధుడు, చిత్రరధునకు క్షేమాపి, క్షేమాపికి హేమరధుడు, హేమరధునకు సత్యరధుడు, సత్యరధునకు ఉపగురువు, ఉపగురువునకు అగ్నిదేవుని అనుగ్రహంచేత ఉపగుర్వుదును, ఉపగురువునకు సావనుడు, సావనునకు సువర్చనుడు కల్గారు. ఆ సువర్చనుడే సుభూషణుడు అని విఖ్యాతి చెందాడు. సుభూషణునకు జయుడు, జయునకు విజయుడు, విజయునకు ధృతుడు, ధృతునకు అనఘుడు, అనఘునకు వీతిహవ్యుడు, వీతిహవ్యునకు ధృతి, ధృతికి బహుళాశ్వుడు, బహుళాశ్వునకు కృతి, కృతికి మహావశి జన్మించారు. ఈ రాజులందరినీ మైథిలులంటారు. యోగీశ్వర ప్రసాదంచేత అందరూ గృహస్థులై బంధముక్తులై ఆత్మజ్ఞానం కల్గి నిరంతర బ్రహ్మను సంధానం చేస్తూంటారు-అని శుకయోగీంద్రుడు ఇలా అన్నాడు.

## చంద్రవంశ రాజుల ఇతిహాసం

రాజేంద్రా! ఇక చంద్రవంశక్రమం చెబుతాను విను. చంద్రవంశం చంద్రునిలాగా స్వచ్ఛమైనది. ఆ వంశంతో పురూరవుడు మొదలైన రాజేంద్రు లెందరో జన్మించారు. ఒకవేయి తలలతో ఉండు జగన్నాథుని నాభికమలంలో తొలతగా బ్రహ్మ పుట్టాడు. అతనికి అన్నివిధాలా అనురూపుడై సమర్థుడైన అత్రిమహాముని సంభవించాడు. ఆ అత్రిమహర్షి కడగంటి చూపులవలన చంద్రుడు పుట్టాడు. కావుననే అతడు అమృతమయుడయ్యాడు. బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారం అతడు బ్రాహ్మణులకు, కలువలకు, ఓషధులకు అధిపతి అయ్యాడు. అతడు ముల్లోకాలు జయించి రాజసూయయాగం చేశాడు. కాని మూర్ఖత్వంతో బృహస్పతి భార్య అయిన తారను తీసుకొనిపోయి బృహస్పతి తిరిగి తనను అర్థించేవరకూ ఆమెను విడువలేదు.

అపుడు దేవతలకూ, రాక్షసులకూ దారుణ యుద్ధం జరిగింది. బృహస్పతికి, చంద్రునికి గల వైరాన్ని పురస్కరించుకొని శుక్రుడు బృహస్పతిపై కోపంచేత తన శిష్యులైన రాక్షసులతో చంద్రుని పక్షం అవలంబించాడు. రుద్రుడు బృహస్పతియందలి స్నేహంచేత భూతగణాలతో అతనికి సహాయం చేశాడు. సకల దేవగణాలతో ఇంద్రుడు కూడా గురువునకు తోడయ్యాడు. అపుడు దేవాసురులు ఇరు పక్షాలై తార నిమిత్తం ఘోరయుద్ధం చేశారు. ఉభయపక్షాల్లోనూ ఎందరో మృతి చెందారు అపుడు బృహస్పతి తండ్రి అంగిరసుని అభ్యర్థనపై బ్రహ్మదేవుడు వచ్చి చంద్రుని కోపించి గర్భవతి అయిన తారను తిరిగి బృహస్పతికి ఇప్పించగా, బృహస్పతి ఆమెను చూచి— ఓసీ! వెలయాలు లాగా సిగ్గువిడిచి, ధర్మాన్ని, కీర్తిని మంట గలిపి జారుడైన చంద్రునితో గూడి కడుపు తెచ్చుకొన్నావా? ఇది నీకు అధర్మంగా తోచలేదా! ఇపుడు నీవు గర్భస్రావం చేసుకున్నావా సరే. లేకపోతే నిన్ను నాశనం చేస్తాను. మానవతి అయిన స్త్రీలు నీలాంటి దానిని చూచి మెచ్చుకొంటారా?- అని ఆగ్రహవర్యుడై యుండగా ఆమె పసిడిఛాయమేనుగల కుఱ్ఱను కన్నది. వాని సోయగం చూచి మోహాతిరేకంతో బృహస్పతి వాడు తన కొడుకని, చంద్రుడు తానుకన్నవాడని పోట్లాడుకొనటంమొదలు పెట్టారు. అపుడు అక్కడికి వచ్చిన మహర్షులు వారి వాదోపవాదాలు విని ఏమీ నిర్ణయించలేక దేవతలను అడుగగా వారున్నూ ఎటూ తేల్చలేక "ఆ రహస్యం" తారకి తెలియాలి కాని ఇతరులకు తెలియదన్నారు. ఆ మాటలువిని తార సిగ్గుతో తలవంచుకొని ఉండగా ఆమెకు పుట్టిన ఆ చిన్నారి—తల్లీ! బంధువులకు తల వంపులుగా, మగడు అసహ్యించుకొనగా నన్నెందుకు ఇలా కన్నావు? నేను శీతకరునికి పుట్టానో, గురువునకు పుట్టానో చెప్పు—అని అడిగేసరికి కొడుకునకు మారు

చెప్పలేక ఊరకున్న తారను ఏకాంతంగా పిలిచి బ్రహ్మ—కాంతా! నీవు సిగ్గు విడిచి పెట్టి ఈ కుమారుడు ఎవరి వలన జన్మించాడు? చంద్రుని వల్లనా, బృహస్పతి వల్లనా? వీనిని కన్న అతడు ఎవరు? ఎందుకీ దావరికం? ఈ బుద్ధి నీకే పుట్టిందా? ఎందుకలా నిట్టూర్చటం? కాంతలు సహజంగా కాముకలు ఈ రహస్యాన్ని నీవు నాతో చెప్పినందువలన వచ్చేనష్టం ఏదీ లేదు. నేనెవరికీ చెప్పను—అని పల్కిన బ్రహ్మకు తార ఎదురు చెప్పలేకపోయింది. చంద్రునికే కన్నానని రహస్యంగా చెప్పింది. అపుడు బ్రహ్మ ఆ బాలకునకు బుధుడను నామకరణంచేసి చంద్రునికిచ్చి నిజలోకానికి వెళ్ళిపోయాడు. బుద్ధిమంతుడైన బుధుడు తనకు పుత్రుడుగా లభించేసరికి చంద్రుడు ఉప్పొంగిపోయి ఆకాశాన్ని ముట్టాడు. బుద్ధిమంతుడైన కొడుకు పుట్టినప్పుడు తండ్రిపొంగిపోకుండా ఎలా ఉండగలడు!

పూర్వం చెప్పిన ఇళా కన్యకవలన పురూరవుడు పుట్టాడు. ఆ పురూరవుని శౌర్యం, సౌందర్యం, గాంభీర్యం మొదలైన గుణములను నారదుని వలన ఇంద్రసభలో ఊర్వశి విన్నది. మిత్రావరుణుని శాపంచేత ఆమె మనుష్య స్త్రీ రూపం ధరించి భూలోకానికి వచ్చి పురూరవుని చూచింది. అతన్ని చూడగానే ఆమె పరవశించి పోయింది. అతని నేత్రాలు తామర రేకులులాగా ఉన్నాయి. అతని నడుము సింహం నడుములాగా సన్నగా ఉంది. వక్షస్థలం విశాలంగా ఉంది. భుజాలు ఎత్తుగా ఉన్నాయి. ముఖం చంద్రమండలంలాగా కాంతి వంతంగా ఉంది. అతడు చాలా సుకుమారంగా ఉన్నాడు. అతనిని చూచీ చూడగానే ఆమె కామాధీనయై అతనిపై మోహం పెంచుకొంది.

పురూరవుడు కూడా ఆమె సౌందర్యాన్ని చూచి చలించి పోయాడు. మన్మథుని బాణమో, మేఘాన్ని విడిచి వచ్చిన మెఱుగుతీగో, లేక మోహినియో అకాలలక్ష్మియో ఈమెను కరగ్రహణం చేయని వాని బ్రతుకుదేనికి అని నీటిలో తామరాకు చలించినట్లు మన్మథబాణాలచే చలించిపోయాడు. తుదకు అతడు ఎలాగో ధైర్యంతో నిలుకడ చెంది ఆమె నుద్దేశించి—కాంతా! నీవు ఎక్కడినుండి వస్తున్నావు? నీకై నీవు నా దగ్గరకు రావటం నా అదృష్టం. నీకు నేను నాకు నీవు తగిన వారం. నేను నీకు వశంగతడనయ్యాను. మన్మథుని వాడిబాణాలకు లొంగిన నన్ను నీవు ఆర్ద్ర దృష్టితో చూడు శరీరాన్ని శరీరంతో, చేతిని చేతితో, చెక్కిలిని చెక్కిలితో మోపి యథోచిత క్రీడలతో విపన్నుడైన నన్ను రక్షించు అనగా ప్రౌఢ అయిన ఆ చేడియ ఇలా అన్నది.

రాజేంద్రా! నీవు నా కోర్కెలు తీరిస్తే నిన్ను కామక్రీడలో తేలుస్తాను. ఇవిగో రెండు పొట్టేళ్ళు. ఇవి నాకు నా ప్రాణం కంటే ప్రియమైనవి. నీవు వీటి రక్షణ భారం వహించాలి. నీవు ఎప్పుడూ వస్త్రహీనుడివిగా నా కంట పడరాదు. నాకు ఎల్లవేళలా నెయ్యి ఆహారంగా కావాలి. నాయీ నియమాలకు

భంగం కల్గిస్తే నేను నిన్ను తక్షణం విడిచిపెడతాను - అని ఊర్వశి అనేసరికి పురూరవుడు ఆమె ప్రతిజ్ఞా వాక్యాలకు అంగీకరించాడు. "ఆమె మహా సౌందర్యవతి. దేవాంగన. మన్మథునిచే చలితచిత్త అయి తనను కామించింది. ఇంతకంటే ఇంకేమి కావాలి' — అని నరేంద్రుడు నిశ్చయించుకొన్నాడు. ఆమెను కనక సౌధాలలోనూ, తరుచ్ఛాయల్లోనూ, ఉద్యానవనాల్లోనూ, రత్న మందిరాల్లోనూ, కొలకుల్లోనూ, కొండకెలకులయందునూ రతులతో తేలుస్తూ మహానందం అనుభవిస్తున్నాడు. క్రమక్రంగా వారి అనురాగం విడదీయరానిదైంది. వెడితే ఇద్దరూ ఒకే దిక్కుకు వెడతారు. నిలిస్తే ఒకేచోట నిలబడతారు. ఇరువురి మనోభిప్రాయాలు ఒకటిగానే ఉంటాయి. ఇరువురూ ఒకరిని విడిచి ఒకరు క్షణకాలమైనా ఉండలేరు. వారి నెయ్యం, వియ్యం, సత్యశీలత, మక్కువ ఆ దైవానికే తెలియాలి కాని ఇతరులకి తెలియదు. వారి నడుమ పైట కొంగు అడ్డమైనా వారి ప్రాణాలు పోయినట్లుంటాయి.

ఇలా ఊర్వశీ పురూరవులు పరస్పరానురాగం అతిశయించగా రేబవళ్ళు స్వేచ్ఛగా విహరిస్తున్నారు. ఇలా ఉండగా ఒకనాడు దేవలోకంలో దేవేంద్రుడు కొలువుండి, కొలువులో ఊర్వశి లేకపోవటం చూచాడు- ఔరా! ఇన్నాళ్ళనుండి సభా మధ్యంలో ఊర్వశి లేకపోవటం చేత సభ వన్నె తరిగిన బంగారంలాగాకాంతిహీనంగాఉంది.అని ఆమెనుతీసుకొని రావటానికి ఇంద్రుడు గంధర్వులను పంపాడు. వారు వెళ్ళి నడిరేయిని చీకటిలో ఊర్వశి పెంచుతున్న మేషాలను బంధించే సరికి అవి మొర పెట్టాయి వాని మొరవిని రతిఖిన్నుడై మై మరచి నిద్రిస్తున్న పురూరవుని కౌగిటిలో ఉన్న ఊర్వశి ఇలా అన్నది.

ఔరా! నా బిడ్డలను మహాహంకారంతో దొంగలెవ్వరో పట్టుకొని ఉన్మాదులై పోతున్నారు. నా యీ భర్త పేరువెట్టి కన్నులు మూసి నిద్ర పోతూ కదలకుండా ఉన్నాడు. వారిని ఆపటానికే సామర్థ్యం ఇతనికి లేదు. ఇతడు వట్టి మగపంద. నా కౌగిలి విడిచి పోకుండా ఉన్నాడు. పరాయి వారి ప్రేరణచే దొంగలు పడగా మగటిమి పాటి పలేక మగతనమంతా మగువల కౌగిలిలో చూపెడు మగవాడు మగడా! అతడు మగువ అగుట మంచిది. అధమునకు ఆలియగుటకంటే అధికుని ఇంట దాసిగా ఉండటం మేలు. హీనుని పొంది శరీరాన్ని హింసలపాలు చేసుకొనటం కంటే జవ్వని ముదుచుకొని కూర్చుండటం మంచిది. ఎందుకీ రాజరికం? పశువులు మొర పెడుతూంటె ఆతురపాటుతో లేచి దొంగల కీడు అడపకుండా శవంలాగా ఉండటం సహింపరానిది. ఇతడు వినీ విననట్లు నటిస్తున్నాడు. రణ భీరువు. మనుజాధముడు. నిదురపోతు. ఒట్టి మందుడు. ఇతనిని చక్రవర్తిగా చేసిన బ్రహ్మకంటే వెర్రివాడు ఇంకొకడుండడు-

అని ఈ రీతిగా ఊర్వశి పరుషోక్తులాడే సరికి అవి కఱకు బాణాల్లాగా ఆ రాజేంద్రుని చెవులకు తగిలాయి. అప్పుడతడు లేచి అంకుశపు పోట్లకు సంభ్రమపాటు చెందిన మద గజం లాగా కట్టు పుట్టాన్ని మరిచి దిగంబరుడై ఖడ్గం చేదాల్చి వళుశాలకి వెళ్ళాడు. దొంగలను వధించాడు. మేషాల్ని విడిపించాడు. ఇక తిరిగి వస్తూండగా వివస్త్రుడైన అతనిని చూచి ఊర్వశి వెంటనే అదృశ్యురాలైంది. అతడు వచ్చి చూచాడు. ఊర్వశి లేదు. వివశుడై అతడు శోక భారంతో నేలపై పడ్డాడు

అనంతరం పురూరవుడు కామాతురుడై ఊర్వశిని వెదకుతూ పోయి సరస్వతీ నదీ తీరాన చెలికత్తెలతో ఉన్న ఆమెను చూచాడు. అతని ముఖ కమలం వికసించింది. ఇలా అన్నాడు "చెలీ! ఇదేమిటి? ఇలా ఎందుకు వచ్చావు? ఇది న్యాయమా? మన పరస్పర ప్రేమాభిమానాలేమయ్యాయి? ప్రతిజ్ఞా వాక్యాలు ఏమయ్యాయి? మర్యాదలు తప్పినాయా? నేను నిన్ను విడిచి నప్పటినుండి నేలపై పొరలాడుతున్నాను. ఏ క్రూర మృగమో నన్ను తిని వేస్తుంది. నన్ను కృపా దృష్టితో చూడవా?" అని దీనంగా అర్థించే సరికి ఊర్వశి ఇలా అన్నది.

"స్త్రీలకు ఇలా వశంగతుడవైన నీవున్నూ మగవాడివే? పశువులాగా నీవిలా శోకించటం తగదు. నిన్ను మృగాలు తింటాయని భయపడకు. మానుష పశువును తినటానికి మృగాలు కూడా అసహ్యించుకొంటాయి. అదీ కాక రాజేంద్రా! నీవు వెలయాండ్ర మాటలే నమ్మావు. వారి మాయలూ, వేషాలూ వేదాంత సూక్తులూ ఏమి? వారి ఊహలు అగ్నితుల్యాలు. మాటలు అమృత ధారలు. వారు సాక్షాత్తు మన్మథునే మెచ్చుకోరు. ఇతరులను స్మరిస్తారా? వారు దుష్ట మతులు. వారికి విశ్వాసం లేదు. వారు దయా శూన్యలు. చపలాత్మలు. భర్తనైనా వధించటానికి వెనుకాడరు. ఇంకో సంవత్సరం గడిచాక నీవు నా కడకు వచ్చి లక్షణ మంతులైన నీ కుమారులను చూస్తావు. ఇప్పటికి వెళ్ళు'- అని పలికే సరికి ఆమెను గర్భవతిగా భావించి నరేంద్రుడు శంక యొకింత కూడా లేకుండా నెమ్మదిగా తన నగరానికి తిరిగి వెళ్ళాడు.

అలా తిరిగివెళ్ళి తన పురంలో ఒక సంవత్సరకాలం గడిపి పిదప ఒకరాత్రి ఊర్వశి దగ్గరకు వెళ్ళాడు. ఆమె నీవు గంధర్వులను ప్రార్థించు, వారు నన్ను నీకిస్తారు" అనగా అతడు అలాగే చేశాడు. గంధర్వులు అతని పొగడ్తలకు మెచ్చుకొని ఊర్వశిని పొందటానికి సాధన భూతమైన ఒక అగ్ని స్థాలిని అతనికిచ్చారు అతడు దానితో సంతృప్తిచెంది ఒకప్పుడు అడవిలో తిరుగుతూ దాన్ని ఒకచోట మరచి ఇంటికి వెళ్ళాడు.

అప్పుడు త్రేతాయుగం ప్రారంభమైంది. పురూరవుని మనస్సులో వేదం ఆవిర్భవించింది. దానివలన అతడు అగ్నిగర్భమగు అశ్వత్థకాష్ఠం

(రాగికొయ్య) వలన అగ్నిని మథింపవచ్చని గ్రహించాడు అశ్వత్థకాష్ఠాలను మంథన కాష్ఠాలుగా చేసి ఊర్వశీ లోకం పొందాలనే ఊహతో మంత్ర పూర్వకంగా క్రిందికాష్ఠాన్ని ఊర్వశిగానూ, పైకాష్ఠాన్ని తననుగానూ రెంటి నడుమనున్నదాన్ని పుత్రునిగానూ మథించేసరికి జాతవేదుడను అగ్ని పుట్టాడు. ఆ అగ్నిని వేదోక్తాలైన త్రివిధ సంస్కారాలచేత మూడు రూపాలుగా చేసి ఆ ముగ్గురినీ పుత్రులుగా నిశ్చయించుకొన్నాడు. అనంతరం పురూరవుడు ఊర్వశిని చూడగోరి ఆ యగ్నులచే సర్వదేవతా శరీరుడు, యజ్ఞఫల ప్రదాయకుడు, ఆశ్రితార్తిహరుడు అయిన భగవంతుని ప్రార్థించాడు.

రాజేంద్రా! కృతయుగంలో సకల వాక్కులకూ బీజభూతమై ఓంకార మొక్కటే ఉంది. అపుడు వేదంకూడా ఒక్కటే. అగ్నికూడా ఒక్కడే. వర్ణంకూడా ఒక్కటే ఉండేది. త్రేతాయుగ ప్రారంభమందు పురూరవుడు వాటిని మూడుగా తన బుద్ధి విశేషంచేత కల్పించాడు. అలా వేదవిభాగం కల్పించి యాగంచేసి పురూరవుడు ఊర్వశి ఉన్న గంధర్వలోకానికి వెళ్ళాడు.

అతనికి ఊర్వశి వలన ఆయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుడు, జయుడు, విజయుడు అను ఆఱుగురు కొడుకులు కలిగారు. వారిలో శ్రుతాయువునకు వసుమంతుడు, సత్యాయువునకు శ్రుతంజయుడు, రయునకు శ్రుతుడు, ఏనకుడు అను ఇద్దరు, జయునకు అమితుడు. విజయునకు భీముడును జన్మించారు. ఆ భీమునకు కాంచనుడు కాంచనునకు హోత్రకుడు, హోత్రకునకు గంగా ప్రవాహాన్ని పుక్కిట పట్టిన జహ్నువు, జహ్నువునకు పూరుడు, పూరువునకు బాలకుడు, బాలకునకు అజకుడు అజకునకు కుశుడు, కుశునకు కుశాంబుడు, మూర్తయుడు, వసువు, కుశనాభుడు అను నల్గురును జన్మించారు. వారిలో కుశాంబునకు గాధి అనువాడు పుట్టాడు. అతనికి సత్యవతి అను కూతురు కలిగింది. అతడు రాజ్యపాలన చేస్తూండగా ఋచికుడను ఒక బ్రాహ్మణుడు వచ్చి సత్యవతిని తనకిమ్మని గాధిని అడిగాడు.

గాధికి ఇష్టంలేదు. అందుచే "ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! ఒకచెవి మాత్రం నలుపు తక్కిన శరీరం అంతా తెలుపు గల గుఱ్ఱాలు వేయింటిని నీవు నా కన్యకు శుల్కంగా తెచ్చి ఇస్తే నేను ఆ కన్యకను నీ కిస్తా"నన్నాడు. ఋచికుడు అతని అభిప్రాయాన్ని గ్రహించి వరుణుని అర్థించి గుఱ్ఱాలు తెచ్చి గాధికిచ్చాడు. గాధి అనిన మాటప్రకారం సత్యవతిని ఆ విప్రునకిచ్చి వివాహం చేశాడు. ఒకనాడు తన భార్యా, అత్తా ఇరువురూ వచ్చి తమకు పుత్ర సంతానం కలిగించమని ఋచికుని కోరగా ఆ ముని బ్రహ్మ మంత్రాలతో ఒక చరువు*ను క్షత్రియ మంత్రాలతో ఒక చరువును సిద్ధం చేసి స్నానానికి వెళ్ళాడు. అతడు

* హోమ నిమిత్తం వండిన అన్నం.

స్నానానికి వెళ్ళాక తల్లి అడిగిన మీదట సత్యవతి బ్రహ్మ మంత్రాలతో తనకు ప్రేల్పించిన చరువు తల్లికిచ్చి, క్షాత్రి మంత్రాలతో తల్లికి ప్రేల్పించిన చరువు తాను గ్రహించింది. ఆ ముని స్నానం చేసివచ్చి చరువులు తారుమారు అవటం చూచి భార్యకిలా అన్నాడు-

"తల్లి చరువు నీవుతిని నీ చరువును నీ తల్లి కెందుకిచ్చావు? నీకు క్రూరుడు పుడతాడు. మీ అమ్మకు బ్రహ్మవిదుడు జన్మిస్తాడు" అనేసరికి సత్య వతి భయపడి భర్తకు మ్రొక్కి వినయంగా ప్రార్థించేసరికి అతడు ప్రసన్నుడై నీ కొడుకు సాధువై నీ మనుమడు క్రూరుడవుతాడని అనుగ్రహించాడు. సత్య వతికి జమదగ్ని పుట్టాడు. సత్యవతి అనంతరం కౌశికీ నదిఅయి లోకాలను పావనం చేస్తూ ప్రవహించింది. జమదగ్ని రేణువు కూతురైన రేణుకను వివాహమై వసుమనాది కొడుకులను కన్నాడు.

శ్రీహరి అంశంలో జమదగ్నికి పరశురాముడు జన్మించి తన గండ్ర గొడ్డలితో రాజుల శిరస్సులను ఇరువది ఒక్కమార్లు ఖండించి రాజవంశాన్ని నిర్మూలించాడు - అని శుకుడు పలుకగా పరీక్షిత్తు "మునీంద్రా! పరశురాముడు క్షత్రియులను అన్నిమారులు గాలించి గాలించి ఎందుకు చంపాడు? వారేం తప్పు చేశారు? అతడు బ్రాహ్మణుడైయుండిన్నీ రాజస తామస గుణాలను ఎందుకు పొందినట్లు? భూభారం ఎలా తగ్గింది? వినాలని కుతూహలంగా ఉంది" అన్నాడు. అప్పుడు శుకుడిలా చెప్పటం మొదలుపెట్టాడు.

పరశురాముని చరిత్ర

రాజేంద్రా! విను. అర్జునుడనువాడు హైహయరాజు. అతడు రాజులలో ఉత్తముడు. అతడు శ్రీహరి అంశాంశుడైన దత్తాత్రేయుని ఆరాధించి అతని వలన వేయిచేతులు గడించాడు. అణిమాది సిద్ధులు సంపాదించాడు. శత్రు జయం, యశం, బలం, యోగీశ్వరత్వం, జితేంద్రియత్వం, ఓజస్సు, తేజస్సు, సిరి, సంపద పొందాడు. అతడు గాలిలాగా సకల లోకాలు తిరిగి రాగలడు- అతనికి పోరాని చోటుకాని, రారాని చోటుగాని లేదు. అతని ఆజ్ఞకు అడ్డు లేదు. వినువీథిని సూర్యుడులాగా అతడు భూమి మీద మహాతేజస్సుతో ప్రకాశిస్తున్నాడు.

అతడొకనాడు తన భార్యలతో గూడి రేవానది యందు జలక్రీడలాడుతూ తన వేయి చేతులతో ఆ నదిని బంధించాడు. అపుడానదీ జలం పొంగి దిగ్విజయార్థంవచ్చి సైన్యాలతో ఆ నదీతీరాన విడిసి ఉన్న రావణుని శిబిరాన్ని ముంచి వేసింది. రావణుడు అదిసహింపక కార్తవీర్యార్జునునితో పోరాటానికి సిద్ధం అయ్యాడు. అపుడు అర్జునుడు అతనిని బంధించి కొంతకాలానికి విడిచి పెట్టాడు. అతడు సిగ్గుపడి వెళ్ళిపోయాడు.

అలా ఉండగా కార్తవీర్యార్జునుడు ఒకనాడు దైవయోగం చేత అడవికి వేటకి వెళ్ళాడు. అతనికి అక్కడ అమితమైన ఆకలి అవటంచేత అలసి అచ్చటకి సమీపమునందున్న జమదగ్ని ఆశ్రమానికి వెళ్లాడు ఆ మునీంద్రుడు రాజును పూజించి ఆ రాజునకు అతని అనుచరులకు తన హోమధేనువుచేత ఇష్టాన్నాలు కురియించి పెట్టాడు. రాజునకు ఆ దేనువుపై మనస్సుపోయింది. ఎన్ని సంపదలున్నా నిష్ప్రయోజనం. ఈ ఆవు ఒకటి చాలు. ఇలాంటి గోవును ఎన్నడూ చూడలేదు" అని దానిని పట్టి తెండని తన భటులకాజ్ఞాపించాడు.

అప్పుడా భటులు రాజాజ్ఞననుసరించి దీనంగా అరుస్తున్నా వదలక సవత్స అయిన ఆ దేనువును రాజధానియగు మాహిష్మతీ పురానికి తీసుకొని వెళ్ళారు. అనంతరం కొంత సేపటికి పరశురాముడు ఆశ్రమానికి వచ్చాడు జరిగిన వృత్తాంతం అంతా విన్నాడు ఔరా! ఇంట అన్నం తిని నా తండ్రి వద్దన్నా వినకుండా క్రొవ్వుతో రాజు ఆవును తీసుకొని పోయాడా? నేను రాముడనగుట ఎరుగడేమో?- అని మండిపడ్డాడు.

వెంటనే గొడ్డలి తీసుకొన్నాడు ధనుర్బాణాలు గ్రహించాడు. అమ్ముల పొది ధరించాడు. కవచం దాల్చాడు ప్రళయాగ్నిలాగా మదపుటేనుగును విదళించటానికి పరువులిడెడి సింహంలాగా భూమి క్రుంగగా అతడు ఆ రాజు వెంట పడ్డాడు. మాహిష్మతీ పురం చేరి పుర ద్వారాన భీకరంగా నిలబడ్డాడు. కార్తవీర్యుడు అతన్ని చూచాడు. అతని చేతుల్లో ధనుర్బాణాలు, గొడ్డలి ఉన్నాయి. వీపున అంబుల పొది. వ్రేలాడుతోంది. కోపంతో అతని బొమ్మ ముడిపడ్డది. కనుకొలకులు ఎఱ్ఱబారాయి. లేడి చర్మం, అక్షమాల ధరించాడు. కార్తవీర్యుడు అతని సంరంభం చూచి ఆగ్రహించాడు

'ఇతడు పసివాడు. వెర్రి బాపడు. బ్రాహ్మణుడు లాగానే ఉండకుండా భయం లేకుండా మహాబల సంపన్నులైన రాజులతో కయ్యాకు కాలు దువ్వుతున్నాడు. ఇతన్ని మనం ఏమి చేసినా పాపం లేదు. లెండి లెండి. మనం సహింప వలసిన పనిలేదు. ఈ బ్రాహ్మణ్ణి వధించండి" అని దండ నాయకులను పురికొల్పాడు వారున్నూ లెక్కకు పదియేడు అక్షౌహిణుల సేనా వాహినితో ఎదురు వెళ్ళారు. నానావిధ శస్త్రాస్త్రాలతో అతన్ని నొప్పించారు. అప్పుడాతడు మహోద్రేకంతో మిట్టిపడి కనుకొలకుల నుండి నిప్పులుకుప్పలుగా కురిపిస్తూ యజ్ఞోపవీతం సవరించుకుంటూ కఠోరమైన కుఠారాన్ని (గొడ్డలి) సారించి ఆ సేనలపై కురికాడు.

తొలకరి ముఖాన క్రొత్త బీటి నేలల్లో చెట్ల వేళ్ళను నరికివేయు కర్షకుని లాగా వారి పాదాలను నరుకుతున్నాడు. అరటి చెట్లను మధ్యకు నరికెడి తోట మాలిలాగా వారి మధ్య ప్రదేశాలను (నడుములను) త్రుంచివేస్తున్నాడు. చెట్లెక్కి తాడి పండ్లను రాల్చేవాని లాగా వారి శిరస్సులను ఖండిస్తున్నాడు.

మృగాలను వండటానికి కోసెడి వంటవాని లాగా వారి అవయవాలను చెక్కి వేస్తున్నాడు. అంతటితో తృప్తి చెందక విలయ కాలాగ్ని కీల లాగా మంటలు కురిపిస్తున్నాడు. విల్లు తీసుకొని పిడుగుల వర్షం కురిపించే మేఘాల్లాగా అంతు లేని బాణ వర్షం కురిపిస్తున్నాడు. శత్రు సైనికులకు దైన్యం కల్పిస్తున్నాడు. బాణ వర్షపాత మనెడి నేతితో ఆశ్వికుల కోపాగ్నిలో వ్రేలుస్తున్నాడు. తురంగాలను అంగరహితంగా చేస్తున్నాడు. రథాలను విరుగగొట్టి నిరుపయోగంగా చేస్తున్నాడు. ఏనుగులను రథాలపై పడద్రోస్తున్నాడు. ఈరీతిగా పరశురాముడు కార్తవీర్యుని సేనలను శర వర్షంతో ముంచి రూపుమాపాడు. అప్పుడు భూత జాలం చిందులు త్రొక్కటం మొదలుపెట్టాయి. యుద్ధరంగం మాంసంతోనూ, క్రొవ్వుతోనూ నిండిపోయింది.

అప్పుడు కార్త వీర్యార్జునుడు "ఔరా! ఈ బ్రాహ్మణుడు ఒక్కడే సేనా సమూహాన్ని సర్వ నాశనం చేశాడు. ఇక సహింపరాదు. నా భుజబలంతో ఈతని నేలపై పడగూలుస్తాను" అని పల్కి ఐదు వందల చేతులతో ధనువులు తీసుకొన్నాడు. మరొక ఐదు వందల చేతుల్లో మహోగ్రాలైన అస్త్రాలు ధరించాడు. "బ్రాహ్మణుడా! నిన్నూ నీ గొడ్డలిని నేల కూలుస్తాను చూడు" అని గర్జించి పరశురాముని మీద ఒకదానివెంట నొకటి బాణాలు కురిపించాడు. ఇలా ఐదు వందల ధనువులతో బాణ ప్రయోగాలు చేస్తున్న ఆ రాజు పరివేషం[1] మధ్య తీక్ష్ణ కిరణాలతో ప్రకాశించెడి సూర్యుడు లాగా ఉన్నాడు.

అర్జునుడు ఈ రీతిగా బాణ విలాసం చూపేసరికి పరశురాముడు క్రుద్ధుడై దుష్కరమైన ధనువొకటి తీసుకొని బాణం సంధించి వేసేసరికి అతని ధనువులన్నీ ఒక్క పెట్టున తునాతునకలై పోయాయి అయినా వాడంతటితో పోక చెట్లను నరికి పరశురాముని పైకి విసిరే సరికి ఆ మహా వీరుడు తన గండ్ర గొడ్డలితో ఆ చెట్లనే కాక అతని వేయి చేతులను కూడా నరికి వేశాడు. ఇక అతని శిరస్సు ఒక్కటి పర్వత శిఖరం లాగా మిగిలింది. భార్గవుడు తన పరశువుతో (గొడ్డలితో) ఆ శిరస్సును కూడా త్రుంచివేశాడు కార్తవీర్యుడు అలా పడిపోయే సరికి అతని పదివేల మంది కొడుకులూ కూడా అదలి అతనిని తాకలేక తొలగి పోయారు. అప్పుడు పరశురాముడు ధేనువును దూడతో కూడా తీసుకొని నిజాశ్రమానికి వెళ్ళాడు.

ఇలా హోమ ధేనువును మరల తెచ్చి ఇచ్చి తన పరాక్రమాతిశయాన్ని తండ్రికి, తోబుట్టువులకూ తెలియ జెప్పగా జమదగ్ని పరశురామునికిలా అన్నాడు- కుమారా! దేవతలందరూ తమ తమ శక్తులను కూర్చి రాజును చేస్తారు. అనగా రాజు సర్వ దేవమయుడు అటువంటి రాజును నీవు క్రుద్ధుడవై

1. సూర్యుని తలచుట్టూ ఉండెడి కాంతిరేఖ.

చంపి మహా పాపం చేశావు. మనం బ్రాహ్మణులం. రాజస కర్మలు చేయటం మన ధర్మం కాదు. మనకు శాంతి ముఖ్యం. అదే ధర్మ తత్వానికి మూలం. బ్రాహ్మణులకు శాంతి సహనాలు కలవని తెలిసి ఈశ్వరుడు మనచేత బ్రహ్మ పదాన్ని పాలింప చేస్తున్నాడు. క్షమా గుణం ఉంటే, సిరి, వాక్కు, సకల సౌఖ్యాలు లభిస్తాయి. దయా సముద్రుడైన శౌరి శమదమాది సంపదలు కలవానిని మెచ్చుకొంటాడు. కట్టలుకతో పట్టపు రాజును చంపటం బ్రాహ్మణుని చంపటం కంటే కూడా పాపం. కనుక ఈ పాప పరిహారార్థం నీవు అటు ఇటు అనకుండా తీర్థ యాత్రలు సేవించు"- అని ఉపదేశించాడు.

పరశురాముడు తండ్రి ఆజ్ఞను మహా ప్రసాదమని శిరసావహించి వెంటనే బయలుదేరి వెళ్ళాడు. ఒక ఏడు తీర్థాటనం చేసి తిరిగి వచ్చాడు.

ఒకనాడు రేణుక జలాహరణార్థం గంగా నదికి వెళ్ళింది. గంధర్వ రాజు చిత్రరథుడు మెడలో పద్మమాల ధరించి అప్సర స్త్రీలతో ఆ నదీ ప్రవాహమందు జల విహారాలు చేస్తున్నాడు. అలా జలక్రీడలాడుతున్న గంధర్వ రాజును చూచి రేణుక మనస్సు చలించింది. ఆ కారణంచేత అక్కడే కొంత సేపు ఆలస్యం చేసింది. కొంతసేపటికామె పశ్చాత్తాపంతో "అయ్యో! నేను వచ్చి చాలా సేపయింది. హోమవేళ అతిక్రమిస్తోంది. నేనిక్కడ ఇలా ఉండి పోయాను. మునీశ్వరు దేమంటాడో!"- అని వెంటనే జల కుంభాన్ని నెత్తిన పెట్టుకొని ఆశ్రమానికి వచ్చింది. పతికి మ్రొక్కి చేతులు మోడ్చి నిలబడ్డది. జమదగ్ని ఆమెను ఎగాదిగా చూచాడు. ఆమె ఆలసించిన వృత్తాంతం దివ్య దృష్టితో గ్రహించాడు కొడుకులను పిలిచి కామవశ అయిన ఆమెను చంపుడని ఆజ్ఞాపించాడు. కాని వారెవ్వరూ అంగీకరించలేదు. అప్పుడు జమదగ్ని తన కడగొట్టు బిడ్డ అయిన పరశురాము నుద్దేశించి- తన ఆజ్ఞను పెడచెవిన పెట్టి తన భార్యను చంపని కొడుకులనూ, భార్యనూ చంపుమని ఆజ్ఞాపించే సరికి అతడు తండ్రి పాదాలకు నమస్కరించి తల్లినీ, అన్నలనూ చంపివేశాడు.

అతడు అలా చేయకపోతే తండ్రి తనను శపిస్తాడు. చేస్తే మహర్షి మెచ్చి వారిని పునర్జీవితులను చేస్తాడు అనే ఊహతో భార్గవుడు తల్లినీ, తోబుట్టువులనూ చంపాడు కాని లేకపోతే వారిని చంపటానికి అతనిచేయి ఆడుతుందా! తనమాటకు అడ్డం చెప్పకుండా పరశురాముడు తన కొడుకులను, భార్యను అక్కడే గొడ్డలితో నరకటం చూచి జమదగ్ని తలయూచి మెచ్చుకొన్నాడు. అప్పుడు పరశురాముడు అలా మెచ్చిన తండ్రిని ఉద్దేశించి "తండ్రీ! తపోధనుడవు, దయాజలధివి అయిన నీవు వీరిని పునర్జీవితులను గావించు' మని మ్రొక్కేసరికి ముని సంతోషించి అలాగే అన్నాడు. వారందరూ ఎప్పటిలాగా తిరిగి లేచారు. పరశురాముడు తపోనిధి అయిన తన తండ్రి మృతులైనవారిని

మరల బ్రతికింపగలడని భావించి వారిని చంపాడు. అలా అని అందరూ జనకాజ్ఞ పాటించి అన్నలనూ, తల్లినీ చంపటం తగదు.

పరశురాముని చేత ఓడిపోయిన కార్తవీర్యుని పుత్రులు తండ్రి మృతికి ప్రతీకారం చేయటానికి తగిన అదనుకోసం ఎదురు చూస్తున్నారు. ఇంతలో ఒక నాడు వారికి పరశురాముడు అన్నలతోగూడి ఒక అడవిలో తటస్థించాడు. ఇదే తగిన సమయమని వారు భావించి వారందరూ జమదగ్ని ఆశ్రమానికి వెళ్ళి, అగ్నిగృహంలో ధ్యానమగ్నుడై ఉన్న ఆ మహర్షిని అందరూ పొదివి పట్టుకొని రేణుక అడ్డం వచ్చి గగ్గోలు పెడుతున్నా వినకుండా అతని తల ఖండించి వెళ్ళిపోయారు.

రేణుక 'కార్తవీర్యుని కొడుకులు తమ తండ్రిని మీరు చంపినందుకు పగబట్టి ప్రతీకారంగా నీ తండ్రిని చంపారు. శత్రువులను శాసించటానికి రమ్మని" కొడుకులనుద్దేశించి ఆక్రోశిస్తూ భర్త మృతదేహంపై వ్రాలి తలను ఇరువది ఒక్కమారులు మోదికొన్నది. అప్పుడు తల్లి మొరవిని జమదగ్ని కుమారులువచ్చి "తండ్రీ! కొడుకులు రాకుండగా నీవెప్పుడు ఇంటివాకిలి విడిచి వెళ్ళవు. అలాంటి వాడవు రాకుమారులచే పీడింపబడి నీవు దేవలోకానికి వెళ్ళావా! మేమెవ్వరం లేకుండా వెళ్ళటానికి నీకు కాళ్ళు ఎట్లా ఆడాయి" అని గోడుగోడున ఏడ్చారు.

అలా విలపిస్తున్న అన్నలను చూచి రాముడు "అన్నలారా! ఎందుకు ఏడ్వటం? తండ్రి మృత శరీరాన్ని మీరు ఏమరకుండా కాపాడండి. నేను వారిపై పగ తీర్చుకొని వస్తాను" అని మహోగ్రుడై మహిష్మతీ పురానికి వెళ్ళి బ్రహ్మఘాతుకులైన అర్జునకుమారులందరినీ పట్టి వధించాడు. వారి తలలు నరికి కొండలుగా ప్రోగులు పెట్టాడు. రక్తం నదులుగా పొంగి ప్రవహించింది. ఆ దారుణ యుద్ధంలో శత్రురాజులందరూ భయాక్రాంతులయ్యారు.

పరశురాముడు అంతటితో ఊరుకొనక తనతల్లి భర్త మృతదేహంపై బడి ఇరువది ఒకమారులు తల మోదుకొనటం వలన ఇరువది ఒక్కమారులు రాజులను వెదకి వెదకి చంపాడు. లోకంలో రాజనేవాడ్ని లేకుండా చేశాడు. ఆరీతిగా పగసాధించలేని కొడుకు కొడుకా! అనంతరం అతడు శమంతక పంచకం అనేచోట తన చేతిలో మృతులైన రాజరక్తంతో తొమ్మిది మడుగులు కావించాడు. తండ్రి శిరస్సుతెచ్చి శరీరంతో సంధించాడు. అతడు తాను సర్వ దేవమయుడు కనుక తననుద్దేశించి యాగంచేసి హోతకు తూర్పు, అధ్వర్యునకు పడమటి దిక్కు, ఉద్గాతకు ఉత్తర దిశ, మిగిలిన యాచకులకు అవాంతర దిశలు ఇచ్చాడు. బ్రహ్మకు దక్షిణదిక్కు, కశ్యపునకు మధ్యదేశం, ఉప ద్రష్టకు ఆర్యావర్తం సదస్యులకు మిగిలిన ప్రదేశాలు దానంగా ఇచ్చాడు.

బ్రహ్మనది అయిన సరస్వతియందు అవభృథస్నానం* చేసి మబ్బు నుండి విడివడిన సూర్యుడులాగా పాపవిముక్తుడై ప్రకాశించాడు. అప్పుడు జమదగ్ని తన పుత్రునివలన తిరిగి తనువును పొంది తన తపోబలంచేత ఆకాశాన సప్తర్షిమండలంలో ఏడవవాడై ప్రకాశిస్తున్నాడు. తామరరేకులాంటి కన్నులు గల ఆ పరశురాముడు మహాఖ్యాతిగాంచాడు. భగవంతుని ఆవేశావతారమైన అతడు రాబోవు మన్వంతరంలో బృహద్వేదాన్ని ప్రవర్తింపచేసి వేదఋషుల్లో ఒకడవుతాడు. రాజేంద్రా! భగవంతుడైన శ్రీహరి భృగుకులంలో పుట్టి భూభారం పోగొట్టటానికి రాజులపై పగబట్టి పలుమారు వధించాడు. ఆ రాజులనందరినీ వధించాక పరశురాముడు శాంతుడై గంధర్వులతోనూ, సిద్ధులతోనూ నుతింపబడుతూ మహేంద్ర పర్వతం మీద ఉన్నాడు.

గాధికి అగ్నితేజుడైన విశ్వామిత్రుడు జన్మించాడు. అతడు తన తపోబలం చేత రాజధర్మం వదిలి బ్రహ్మర్షి అయ్యాడు. అతడు అలా బ్రహ్మర్షి కావటానికి కారణం అతని తల్లి బ్రహ్మ మంత్రపూరితమైన చరువును తినటమే. విశ్వామిత్రునకు నూరుగురు కొడుకులు పుట్టారు.

ఆకాలంలో భృగువంశీయుడైన అజీగర్తి అను నొక బ్రాహ్మణునకు శునశ్శేపుడను కుమారుడున్నాడు. అతడు తల్లితండ్రులచేత యాగపశువుగా అమ్మబడి పురోహితుని వెంటపోతూ మార్గమధ్యంలో విశ్వామిత్రుని కలిసికొని తన వృత్తాంతం చెప్పి శరణువేడాడు. విశ్వామిత్రుడు అతనిని కరుణించి తన కొడుకులతో 'నేను ఈతని దీనదశ కళ్ళారా చూచాను. నా మనస్సు ద్రవించింది. నేను ఈతనిని నా జ్యేష్ఠపుత్రునిగా భావిస్తున్నాను. మీరు కూడా ఈతనిని మీ అన్నగా గ్రహించి ఆదరించండి' అనేసరికి పరిహాసంగా "ఓహోహో! ఇతడు మా అన్నట! మా జన్మ తరించింది" అనేసరికి విశ్వామిత్రుడు ఆగ్రహించి తన కొడుకులను మ్లేచ్ఛులు కండని నిష్కారుణంగా శపించాడు.

అతని కొడుకులు నూరుగురిలో మధ్యముడు మధుచ్ఛందుడు అతడు తన తండ్రి శాపానికి భయపడి తన ఏబది మంది తమ్ములూ తానునూ తండ్రికి నమస్కరించి అతడు చెప్పిన చొప్పున శునశ్శేపుని తమ అన్నగా గ్రహించటానికి అంగీకరించాడు. అపుడు విశ్వామిత్రుడు సంతసించి మంత్రదర్శి అయిన శునశ్శేపుని వారియందు పెద్దవానినిగా చేసి మధుచ్ఛందునితో "ఓయీ! ఈనాడు మీ మూలాన నాకు మరి ఒక కొడుకు కల్గాడు మీరు ఇతనితో గూడి కొడుకులను కనండి" అన్నాడు శునశ్శేపుడు బంధ విముక్తుడు కావటానికి దేవతల అనుగ్రహం కూడా కారణం అందువలన అతనికి దేవరాతుడనే

* యజ్ఞదీక్షాంతాన చేసెడి స్నానం.

పేరుకూడా వచ్చింది. మధుచ్ఛందుడు మొదలైన ఏబది మంది ఆ దేవరాతునికి తమ్ములయ్యారు. మధుచ్ఛందుని కంటే పెద్దవారైన అష్టకుడు, హారీతుడు, జయంతుడు, సుమదుడు మొదలైన యాబదిమంది వేరైపోయారు. ఈవిధంగా విశ్వామిత్రుని కుమారులు రెండుగా చీలిపోవటంచే కౌశిక గోత్రం నానా విధాలైంది—అని శుకుడు ఇంకా ఇలా అన్నాడు.

రాజేంద్రా! పురూరువునకు కొడుకైన అయువు వంశాన్ని వర్ణిస్తాను విను. ఆయువునకు నహుషుడు, క్షత్రవృద్ధుడూ, రజియు, రంభుడు, వీర్య వంతుడు అను ఐదుగురు కొడుకులు పుట్టారు. వారిలో క్షత్రవృద్ధునకు సుహోత్రుడనువాడు జన్మించాడు. సుహోత్రునకు కాశ్యుడు, కుశుడు, గృత్స్నమదుడు అనెడి ముగ్గురు కొడుకులు పుట్టారు. ఆ గృత్స్నమదునకు శునకుడు, శునకునకు శౌనకుడు, ఆ మహాత్మునికి బహ్వృచప్రవరుడు' జన్మించారు. ఆ బహ్వృచప్రవరుడు తపోనియతుడై వెళ్ళిపోయాడు. కాశ్యునకు కాశి, కాశికి రాష్ట్రుడు, రాష్ట్రునకు దీర్ఘతపుడు జనించారు.

ఆ దీర్ఘతపునకు శ్రీహరి వంశంలో ఆయుర్వేదజ్ఞుడైన ధన్వంతరి పుట్టాడు. అతన్ని కీర్తిస్తే దుఃఖాలు పోతాయి. వాసుదేవాంశ సంభూతుడైన ధన్వంతరి యాగభాగానికి అర్హుడు. ఆ ధన్వంతరికి కేతుమంతుడు, కేతుమంతునకు భీమరథుడు, అతనికి దివోదాసుడని ప్రఖ్యాతిగాంచిన ద్యుమంతుడు పుట్టారు ఆ ద్యుమంతునకు ప్రతర్దనుడు అనువాడు జన్మించాడు. అతనికి శత్రుజిత్తు అని, ఋతధ్వజుడని కూడా పేర్లున్నాయి. అతనికి కువలయాశ్వుడనే మహానుభావుడు జన్మించాడు. కువలయాశ్వునకు అలర్కుడు అను పుణ్యాత్ముడు జన్మించాడు. అతడు అరువదిఆరువేల సంవత్సరాలు భూమిని పాలించాడు. అంత దీర్ఘకాలం భూమిని పాలించిన రాజు వేరొకడు లేడు.

అలర్కునకు సన్నతి, అతనికి సునీతుడు, అతనికి సుకేతనుడు, అతనికి ధర్మకేతువు, అతనికి సత్యకేతువు, అతనికి ధృష్టకేతువు, ఆ ధృష్టకేతువునకు సుకుమారుడు, సుకుమారునికి వీతిహోత్రుడు, వీతిహోత్రునకు భర్గుడు, భర్గునకు భర్గభూమి అనువాడు జనించారు. రాజేంద్రా! వీరందరూ క్షత్రవృద్ధుని వంశంవారు. భర్గభూమి తుదివాడుగా కాశ్యుడు మొదటివాడుగా గలవారలు కాశులని ప్రఖ్యాతి చెందారు.

క్షత్ర వృద్ధుని రెండవ కొడుకు కుశునికి ప్రీతియు, వానికి సంజయుడు, సంజయునకు జయుడు, జయునకు కృతుడు, కృతునికి హర్యశ్వకుడు, వానికి సహదేవుడు, సహదేవునకు భీముడు, భీమునకు జయత్సేనుడు, జయత్సేనునకు సంకృతి, సంకృతికి జయుడు, జయునకు క్షత్ర ధర్ముడూ, ధర్ముడూ పుట్టారు. వీరు క్షత్ర వృద్ధుని వంశంలోని రాజులు.

రంభునికి రభసుడు, రభసునికి గంభీరుడు, గంభీరునికి కృతుడు కల్గారు. ఆ కృతునకు బ్రహ్మ కులం పుట్టింది. ఆయువు కొడుకులలో కడపటి వాడైన వీర్యవంతునకు అనేనసుడు, అతనికి శుద్ధుడు, శుద్ధునకు సుశిచి, సుశిచికి బ్రహ్మసారధి అయిన త్రికకుత్తును జనించారు. అతనికి శాంతరజుడు పుట్టాడు. ఆ శాంతరజుడు విజ్ఞానవంతుడు. కృతకుత్యుడు విరక్తుడయ్యాడు.

ఆయువు కుమారుడగు రజీకి అమిత తేజోవంతులైన అయిదు వందల మంది కొడుకులు పుట్టారు. దేవతల అభ్యర్ధనపై ఆ రజి రాక్షసులనేకులను నేలగూల్చి స్వర్గలోకాన్ని దేవేంద్రునకు ఇచ్చాడు. కానిదేవేంద్రుడు ప్రహ్లాదునకు భయపడి స్వర్గ లోకాన్ని తిరిగి ఆ రజికే ఇచ్చి తన రక్షా భారం అంతా అతనిమీద ఉంచాడు. కొంతకాలానికి రజితుడు స్వర్గతుడు కాగా వాని కొడుకులు స్వర్గ రాజ్యాన్ని వశం చేసుకొని యాగ భాగాలు స్వీకరిస్తూ ఇంద్రుడు వచ్చి యాచించినా వారు ఏమీ ఇయ్యలేదు.

ఇంద్రుడప్పుడు బృహస్పతితో ఆలోచించి అతనితో అభిచార హోమం చేయించాడు: వెంటనే ఇంద్రుడు తన వజ్రాయుధంతో రజి కొడుకుల నందరినీ సంహరించి స్వర్గ రాజ్యాన్ని తిరిగి కైవశం చేసుకొన్నాడు.

## నహుష వంశం

నహుషునకు యతి, యయాతి, సంహాతి, ఆయాతి, వియతి, కృతి అను ఆరుగురు కొడుకులు పుట్టారు. వారిలో పెద్దకొడుకైన యతి రాజ్యం పాపహేతువని బుద్ధిమంతులు కూడా అధికార మదంతో మైమరచి పోతారని రాజ్యంలో పూజ్యులైన వారిని గౌరవించరని భావించి విరక్తుడై రాజ్యం విడిచి వెళ్ళిపోయాడు నహుషుడు నూరు యాగాలు చేసి ఇంద్ర పత్ని అయిన శచీదేవి పొందుగోరి ఆమె అభీష్టానుసారం మునీంద్రులు మోసిన శిబికపైనెక్కి త్వరగా నడవండని వారిని తన్నేసరికి వారు ఆగ్రహించి శపించారు. ఆ శాప వశంచేత అతడు సర్పమై నేల కూలాడు.

తనతండ్రీ, అన్నా, అలా రాజ్యహీనులయ్యే సరికి అనంతరం యయాతి మహీపతి అయ్యాడు. భూమండలం అంతా చక్కగా పరిపాలించాడు. తమ్ము లకు పాలుపెట్టాడు. శుక్రాచార్యుని కూతురునీ, వృషపర్వుని కూతురునీ భార్యలుగా గ్రహించాడు. అతడు మహానీతికోవిదుడు - అని శుకుడనేసరికి పరీక్షిన్నరేంద్రుడు - మునీంద్రా! యయాతి క్షత్రియుడు కదా! బ్రహ్మర్షి అయిన శుక్రుడు అతనికి మామ కావటం ఏమిటి? క్షత్రియుడు క్షత్రియ కన్యనే పరిణయమాడాలి కాని, విప్రకన్యను పెండ్లాడటం ధర్మమా? - అనగా శుకుడిలా చెప్పటం మొదలుపెట్టాడు.

రాక్షసేంద్రుడైన వృషపర్వుని కూతురు శర్మిష్ఠ ఒకనాడు తన వేయి మంది చెలికత్తెలతో కూడి వనవిహారానికి బయలుదేరింది. వెంట అసుర గురువైన శుక్రాచార్యుని కుమార్తె దేవయాని కూడా ఉంది. వారందరూ ఆడుతూ పాడుతూ విరబూసిన ఒక పూలతోటలో విహరిస్తూ ఒక మామిడిచెట్టు చేరువయందున్న కొలనుకు చేరారు. ఆ కొలనులోని తామరపువ్వుల్లో తేనియలు త్రాగుతూ, చొక్కుతూ తుమ్మెదలు శ్రవణశుభగంగా ఝుంకారాలు చేస్తుంటే విని పరవశించిపోయారు. వారికప్పుడు కొలనులో జలక్రీడలు ఆడాలని కుతూహలం కల్గింది. వెంటనే వారందరూ తమ వలువలూడ్చి గట్టుపై పెట్టి సరోవరంలో జలకేళి సలపటం మొదలుపెట్టారు.

అదే సమయంలో అచ్చటికి శివుడు తనజటాజూటంలో ఉన్న చంద్రుని కాంతులు నలువైపులా వ్యాపిస్తూండగా పార్వతీదేవితో కూడి ఆ దారిన వచ్చాడు. అప్పుడు ఆ పద్మాకరంలో జలకేళీ విహారం చేస్తున్న యువతులందరూ సిగ్గుపడి తత్తరపాటుతో ఎవరిబట్టలు వారు తీసుకొని కట్టుకున్నారు. రాకుమారి శర్మిష్ఠ పొరపాటున దేవయాని దుస్తులను ధరించింది. దేవయాని అది చూచి ఆగ్రహంతో ఇలా అన్నది.

ఔరా! బ్రాహ్మణకులం లోకేశ్వరుని ముఖం నుండి పుట్టింది. బ్రాహ్మణులు జ్యోతిస్వరూపమైన బ్రహ్మాన్ని ఉపాసిస్తారు. లోకాలకు శుభప్రదమైన వైదిక మార్గాన్ని ఉపదేశించేది వారే. అందుచేత బ్రహ్మకులం ఉత్తమమైనది. అందులో భార్గవులు సాటిలేని సచ్ఛీలురు. వారిలో శుక్రాచార్యుని మించినవారు లేరు. నేను మహానుభావుడైన ఆ శుక్రుని కూతురను. ఓసీ! నీవు రక్షోజాతవై యుండిన్నీ భూసుర కన్య అయిన నా వలువను ధరించటం తగునా? మహిమాన్వితలైన బ్రాహ్మణ స్త్రీల వస్తువులు పెరమగువలు గ్రహింపవచ్చునా? బంగారపు గొలుసులతో కట్టినా కుక్కలకు హవిస్సులో పాలు పంచుకొనే అధికారం ఉండదు. నీ తండ్రి మాకు శిష్యుడు. మేము మీకు గురువులం. దుష్టురాలా! ఈమాత్రమైనా గ్రహింపక నావలువ ధరించి నన్ను అవమానం చేస్తావా! - అని దేవయాని ఒడలుమరచి తన ఇష్టం వచ్చినట్లు ప్రేలేసరికి శర్మిష్ఠ కాలభుజంగంలాగా నిట్టూరుస్తూ పెదవులు కొరుకుతూ దేవయానితో ఇలా అన్నది

ఓసీ! బిక్షుకీ! నీ వృత్తం తెలుసుకోక నోటికి వచ్చినట్లు వదరుతున్నావా? మీ తండ్రి బిచ్చగానిలాగా మా తండ్రి కడ చేయిచాస్తే అతడు కరుణించి మిమ్మల్ని రక్షిస్తున్నాడు అది మరచి నీవేదో రాజకన్యలాగా రాకుమారినైన నన్ను పరిభవిస్తావా?- అని ఆమె తన చెలికత్తెలను పిలిచి దేవయానిని ఆ ప్రక్కనే ఉన్న నూతిలో త్రోయమని ఆజ్ఞాపించింది. అపుడు వారు దేవయానిని పొదివి పట్టుకొని ఆ నూతిలో పడవేశారు. శర్మిష్ఠ ఆమె వలువ ఇయ్యలేదు.

అందుచే ఆమె నూతిలో దెనమొులతోనే ఉండి కుమిలి కుమిలి శోకిస్తోంది. శర్మిష్ఠ తన చెలికత్తెలతో రాజప్రాసాదానికి తిరిగి వెళ్ళిపోయింది.

ఇంతలో దైవవశంచేత యయాతి భూపాలుడు వేటాడుతూ ఆ నూతి దగ్గరకు వచ్చాడు. ఆ నూతిలో జలమగ్నయైన దేవయాని బంధువులను సహాయార్థం కేకలు వేస్తోంది. ఆ కేకలు రాజేంద్రుని చెవినపడగా అతడు వెంటనే నూతి దగ్గరకు పోయి దేవయానిని చూచాడు. ముందు అతడు తన ఉత్తరీయాన్ని ఆమె కందించాడు ఆమె అది ధరించింది. అపుడాతడు చతుస్సముద్ర పరీత అయిన ధాత్రికన్యను దాల్చేడి దీర్ఘమైన తన దక్షిణ బాహువును చాచి దేవయానిని నూతిలో నుండి వెలుపలకి లాగాడు. ఆమె భయంతో వణకిపోతోంది. ఆమెకు చెమటలు పోశాయి. నూతి నుండి తనను వెలువరించిన ఆ రాజేంద్రునకు ఆమె ఇలా అన్నది-

రాజేంద్రా! నీవు నా ప్రాణిగ్రహణం చేసావు. కనుక నీవే నా భర్తవు. మన దాంపత్యం దైవకృతంకానీ మానవకృతం కాదు కనుక నిన్ను కాదని నేను ఇతరుని వరునిగా ఎలా కాంక్షిస్తానూ! కమలంలోని తేనియను త్రావెడి తుమ్మెద అన్యకుసుమం వంక కన్నెత్తి చూస్తుందా? మరొక రహస్యం చెబుతాను విను. నేను శుక్రుని కుమార్తె దేవయానిని. పూర్వం ఒకప్పుడు దేవాచార్యుడైన బృహస్పతి కొడుకు కచుడు మా తండ్రివలన మృతసంజీవినీ విద్య అభ్యసించే సమయంలో నేను అతన్ని కామించాను. కాని అతడు నిరాకరింపగా నేను ఆగ్రహించి అతడు నేర్చిన విద్య అతడు మరచిపోయేలాగా శపించాను. అతడు కూడా ఆగ్రహంతో నాకు బ్రాహ్మణుడు భర్తకాకుండా ఉండేలాగా ప్రతిశాపం ఇచ్చాడు. అందుచేత నేను బ్రాహ్మణుని పెండ్లాడటం పొనగదు. నీవే నా ప్రాణనాథుడవు, అని దేవయాని ఆర్ద్రమనస్సుతో అన్నది.

యయాతి హృదయం కూడా ద్రవించింది. ఆమెపై మోహం జనించింది-దైవయోగం కాక నా మనస్సు విప్రకన్యను వరిస్తుందా? ఇది వాస్తవంగా ఈశ్వరాజ్ఞయే. ఏది ఉచితం? అనే సందేహం వచ్చినపుడు ధీరులైనవారికి అంతఃకరణ ప్రవృత్తి ఒక్కటే ప్రమాణం - అని యయాతి దేవయానిని వరించి వెళ్ళిపోయాడు.

అనంతరం దేవయాని శుక్రుని దగ్గరకు వెళ్ళి రాకుమారి శర్మిష్ఠ చేసిన దురంత కార్యాన్ని వివరంగా చెప్పి కన్నీరు మున్నీరుగా ఏడ్వటం మొదలుపెట్టింది. అపుడు శుక్రాచార్యుడు మండిపడి క్రూరాత్ముల మందిరాల్లో పౌరోహిత్యం చేయటం కంటే పాపకృత్యం మరొకటి లేదు అంతకంటే పావురాల్లాగా రాళ్ళు తింటూ జీవయాత్ర చేయటం మేలు - అని శుక్రుడు కుమార్తెను వెంటపెట్టుకొని వృషపర్వుని నగరం విడిచి వెళ్ళాడు. ఆ వార్త

అసురేంద్రుడు విని "శుక్రుడు లేకపోతే తనకు దేవతలవలన ముప్పు తప్పదని భయపడి వెంటనే తాను శుక్రుని అనుగమించి అతని దారికి అడ్డుపడి అతని పాదాలమీద పడ్డాడు. శుక్రుడు ప్రసన్నుడై వృషపర్వునికిలా అన్నాడు.

రాజా! నీ కుమార్తె తన వేయి మంది చెలికత్తెలతో కూడి నా కూతురు దేవయానిని సేవిస్తే నా కోపం తీరుతుంది. నీవు అలా చేస్తానంటే నేను ఆమెను తీసుకొని తిరిగినగరానికి వస్తాను. అనగా రాజు తనకుమార్తెను ఆమె చెలులను దేవయాని కొలువు చేయటానికి నియమించాడు. రాకుమారి శర్మిష్ఠ కూడా రాక్షసలోక శ్రేయం ఆలోచించి మారాడక తన చెలికత్తెలతో గూడి కోపాగ్నితో క్రుగ్గిపోతున్న దేవయానికి దాస్యం చేయటం మొదలు పెట్టింది.

అనంతరం శుక్రాచార్యుడు తన కుమార్తె దేవయానిని వినీతుడైన యయాతికిచ్చి వివాహం చేశాడు. వివాహానంతరం శుక్రుడు యయాతిని పిలిచి "నీవు ఎన్నడూ శర్మిష్ఠతో సంగమం చేయరా"దని శాసించాడు. కాలక్రమంలో యయాతికి దేవయాని వలన యదుతుర్వసులను కుమారులు కలిగారు. ఒక రాత్రి చెరగుమాసి దేవయాని వెలుపలనుండగా శర్మిష్ఠ అవకాశం కోసం ఎదురుచూస్తూ ఏకాంతంగా ఉన్న యయాతి దగ్గరకి వెళ్ళి కామాక్రాంతయైన మనోభావాన్ని వ్యక్తంచేసింది. యయాతి రాజేంద్రుడుకూడా ఆ జవ్వనిని చూచి మనస్సు ఆపుకోలేక పోయాడు. కామార్తుడయ్యాడు! పూర్వం శుక్రుడు ఆడినమాటలు స్మరించాడు. అయినా మోహోద్ధతుడై ఆమెను మన్మదకేళిలో తేల్చాడు. దైవయోగం తప్పించటం ఎవ్వరి తరమూ కాదు. అతడు రాజు. అది ఏకాంత సమయం. ఆమె రూపవతి అయిన రాకుమారి. అతడు మోహతుడు కాకుండా ఎలా ఉంటాడు? శర్మిష్ఠకూడా గర్భవతి అయ్యింది. ఆమెకు క్రమంగా ద్రుహ్యుడు, అనువు, పూరువు అను ముగ్గురు కొడుకులు కలిగారు.

దేవయానికి ఈ సంగతి తెలిసింది. ఆమె క్రోధ మూర్ఛితయైంది. వెంటనే తండ్రి దగ్గరకి బయలుదేరింది. అప్పుడు యయాతి ఆమె వెంటపడి దేవీ! ఈ మాట మామకు చెప్పటం దేనికి? నేను రాకుమారిని కలిసి తప్పు చేశాను. కామాతురుడనైన నన్ను కరుణించు. తండ్రిమాటకంటే పతిమాట వినటం స్త్రీకి ధర్మం కాదా? అని ఆమె పాదాలపై పడ్డాడు. కాని ఆమె అంగీకరించలేదు. శాంతించలేదు శుక్రునికి ఈ వృత్తాంతం తెలిసింది. ఆగ్రహంతో యయాతిని పిలిచి - ఓయీ! నీవు నా మాటను త్రోసివేసి దానవాంగనతో సాంగత్యం చేశావు. ఇది నీకు న్యాయమా? చపలచిత్తులైన కాముకులకు ఒక మాట, ఒకరూపం ఉండదు - అని పలికి "నిన్ను స్త్రీజన హేయమైన ముదిమి పొందుగాక!" అని శపించేసరికి యయాతి దీనంగా మామా! నాపై నీకుకోపం తగదు. నీ పుత్రికయందు నాకింకా కామవాంఛ తీరలేదు. నన్ను అనుగ్ర

హించు. ఆమెతో నేను ఇష్టోపభోగాలు మనసారా అనుభవించాక వార్ధక్య భారాన్ని వహిస్తాను అని పలికి శుక్రుని ఆజ్ఞకొని దేవయానిని వెంటపెట్టు కొని నిజ నగరానికి వెళ్ళాడు.

యయాతి అప్పుడు తన పెద్దకొడుకు యదువును పిలిచి- "కుమారా! నీ తల్లిని కనిన శుక్రుడు నన్ను వృద్ధుడవు కమ్మని శపించాడు. నాకింకా నీ తల్లిమీద మక్కువ తీరలేదు. ఆమెతో ఇంకా భోగం అనుభవించాలని కుతూహలపడుతున్నాను. కనుక కొంతకాలం నీవు నా వార్ధక్యాన్ని వహించి నీ యవ్వనాన్ని నా కర్పించు" అని అర్థించగా యదువు - తండ్రీ వార్ధక్యం కాంతాహేయం. అది దుర్నికారం. మనశ్చింతకు మూలం. అది నానా వ్యాధు లకు ఆకరం. శరీరం వాచిపోతుంది. దురద పుడుతుంది. చెమటలు పోస్తాయి. వణకుపుడుతుంది. దున్సహమైన అలాంటి ముదిమిని వహించి సకల భోగా లకు ఆస్పదమైన తారుణ్యాన్ని (పడుచుతనం) ఎవ్వరైనా తేరగా ఇస్తారా? అని యదువు నిరాకరించేసరికి యయాతి తుర్వసుని ద్రుహ్యుని అడిగాడు. వారుకూడా నిరాకరించగా రాజు తన కడగొట్టు కుమారుడైన పూరునకు ఇలా అన్నాడు

కుమారా! నీవు వయస్సులో అందరికంటే పిన్నవు. కాని బుద్ధిలో పెద్దవాడవు. నాయనా! రా. నా ఆజ్ఞ దాటవు కదా! నీవు వినీతుడవు. నీవు నీ అన్నల్లాగా నామాట త్రోసివేయకు. నా ముసలి తనాన్ని కొంతకాలం వహించి నీ తరుణిమను నాకు సమకూర్చు - అని దీనంగా తండ్రి అడిగే సరికి పితృభక్తి పరాయణుడైన పూరుడు ఇలా అన్నాడు.

తండ్రీ! నీవు నన్ను ఇలా దీనంగా వేడటమేమిటి? నీ కడుపున పుట్టిన నేను నీ ఆజ్ఞను కాదంటానా? నా కా మాత్రం న్యాయం తెలియదా? తండ్రి ఆజ్ఞ కాదనేడి కొడుకు కొడుకా? అతడు హేయమైన పురుగువంటి వాడు. కనుక నేను నీ వార్ధక్యాన్ని సంతోష పూర్వకంగా గ్రహించి నా యౌవనాన్ని ఇకిస్తాను. అదీకాక తండ్రీ! మానవుడు ముని వృత్తి అవలంబించి, తన శరీరాన్ని తపింపచేసుకోవటం దేనికి? పితృభక్తి పరాయణుడై పిత్రాజ్ఞ పాటిస్తే చాలు. అతని సుగతి కొంగుబంగారం అవుతుంది. తండ్రి ఆజ్ఞాపింపక ముందే తండ్రి కోర్కె తీర్చేడివారు ఉత్తములు. ఆజ్ఞాపించిన తరువాత చేసేవారు మధ్యములు. ఆజ్ఞాపించినా చేయకుండా మారుపలికే పుత్రుడు అధముడు- అని పలికి పూరుడు తండ్రి ముదిమిని తాను గ్రహించి తన లేబ్రాయాన్ని తండ్రి కిచ్చాడు

యయాతి తిరిగి యౌవనుడై ఏడు ద్వీపాలనూ ఏడు వాడలుగా ధరా తలమంతా పాలించాడు. దేవయాని వెంట రాగా సకల దేశాలూ తిరుగుతూ ప్రజా రక్షణం చేస్తూ ఆమెతో మన్మథ సుఖం ఎంతో అనుభవించాడు. మహా

సాధ్వి అయిన దేవయాని కూడా తన ప్రాణేశుని మనోభీష్టానికి అనుకూలంగా త్రికరణాలతో అతనిని మెప్పించింది. అతడు ఆకాశంలో మేఘపంక్తి ఒకప్పుడు దట్టంగా ఒకప్పుడు సన్నగా, ఒకప్పుడు దీర్ఘంగా అనేక రూపాలతో కన్పడి తుదకు అణగిపోవునట్లు ఏ దేవుని గర్భంలో లోకాలు జనిస్తూ, మెలగుతూ లోపిస్తాయో ఆ దేవుని గూర్చి అనేక యజ్ఞాలు చేశాడు.

అతడు తన చెలికాండ్రనూ, సంపదలనూ, గజ రథ హయ, భట సమూహాన్నీ, స్వప్నగత సంపదలతో సమంగా చూస్తూ భార్యతో పెక్కు వేల సంవత్సరాలు కామ భోగ ప్రవాహంలో మునుగుతూ తేలుతూ ఉండి తృప్తి చెందక ఒకనాడు ఆకస్మికంగా ఆత్మజ్ఞానం పొంది కాంతా నిమిత్తంగా తాను మోసపోవటం గ్రహించాడు. అపరిమితమైన విషాదం చెందాడు. దేవయాని నుద్దేశించి ఒక ఉపాఖ్యానం చెప్పాడు. దేవీః మన చరిత్ర లాంటిదే ఒక ఇతిహాసం ఉంది అది చెబుతా విను. వృద్ధులూ, మునులూ కూడా ఆ ఇతిహాసాన్ని మెచ్చుకొంటారు. నీవున్నూ దాన్ని అంగీకరించు.

## యయాతి దేవయానికి బస్తోపాఖ్యాన మనెడి వ్యాజంబున స్వ వృత్తాంతంబు దెలుపుట

అడవిలో ఒక మేక తిరుగుతూ కర్మవశం చేత నూతిలో జారిపడిన ఒక ఆడు మేకను చూచింది అది కామాతురయై కొమ్ముతో ఆ నూతి గట్టును కూలదోసి ఆ ఆడు మేకను వెడలించింది. అప్పుడా ఆడుమేక ఆ మగమేకను భర్తగా వరించే సరికి అది కూడా అంగీకరించింది. అప్పుడా మేకల జంట క్రీడిస్తూ స్వేచ్ఛగా తిరుగుతూ ఉండటం చూచి ఆడు మేకలెన్నో ఆ మగ మేకను కామించి దాని వెంట పడ్డాయి. అప్పుడా మేక వాటిని కాదనకుండా వానిని రతి క్రీడల్లో తేల్చి సొమ్మసిల్లి పోయింది. మన్మథుని పూవుటమ్ముల తాకిడికి లోబడిపోయి మోహాతురుడై సతులయందు నిరంతరం సక్తుడైన మూర్ఖునకు బుద్ధి ఎక్కడ ఉంటుంది? ఆ మగ మేక వెంట పడిన వాటిల్లో అందమైన మేక ఒకటి ఉంది. మగ మేక దానిని విడువకుండా దానితో క్రీడిస్తూండటం చూచి నూతిలోబడి వెలువడిన మేక తన పతి తన యెడల అనురాగం చూపకుండా ఉండటం చేత దుఃఖిస్తూ తన మనస్సులో ఔరా ఎన్నో మాటలన్నాడు. అవి అన్నీ ఏమయ్యాయో? ఇప్పుడు క్రొత్త కాంతను చూచి కనులు మూసుకుని దానివెంట పడ్డాడు. నిలిచిన చోట నిలువడు. నిలువెల్లా కపటమే! కాముకుడెక్కడ? సత్యమెక్కడ?

అని పలికి తనను విడిచి పోయే సరికి ఆ మగమేక రతికేళీ లోలుడై "మిసి, మిసి" అను శబ్దం చేస్తూ ఆ ఆడు మేక వెంటపడి పోయింది. దాని నెంతో బ్రతిమాలుకుంది. కాని అది అంగీకరించలేదు: అప్పుడు ఆ ఆడు మేక

యజమాని అయిన బ్రాహ్మణుడు ఆ మగ మేకను రతి సమర్థం కాకుండా చేయటానికి దాని వృషణాలను త్రెంచి వేశాడు. అప్పుడా మేకపోతు ఆ బ్రాహ్మణుని పాదాలపై బడి వేడుకునే సరికి అతడు యోగవిదుడు కాన కరుణించి దాని వృషణాలను తిరిగి సంధించాడు. వృషణాలు అలా తిరిగి కలిసే సరికి ఆ మేకపోతుకు తిరిగి రతి సామర్థ్యం లభించింది. ఎప్పటియట్ల అనేక దినాలు ఆ ఆడు మేకతో విషయ సుఖాలు అనుభవిస్తూన్న ఆ సుఖానుభూతికి ఎక్కడా తుది కనపడకుండా ఉంది.

ఈ రీతిగా యయాతి/దేవయానికి నిజవృత్తాంతం కథా రూపంలో ఎరిగించి ఇంకా ఇలా అన్నాడు అబలా! వాడి అయిన నీ కడగంటి చూపులనెడి బాణాలతో ప్రబలమైన నా మనస్సు ఛిన్నమై పోయింది. నేను నా బుద్ధిని కోల్పోయాను. మన్మథుడు అజేయుడు. అతని బారిపడి నేనెలా శమించగలను? బండె కత్తిలాగా పాపపు తృష్ణ నన్ను విడువకుండా ఉన్నది. ఈ తృష్ణకు అంతం లేదు. ప్రాణాలు పోతున్నా కూడా అది పోదు. ఎలాగైనా ఈ తృష్ణను త్రెంచి వేయాలి. నీతో కలిసి వేయేండ్లు అయింది. అయినా ఈ కామ సుఖానికి అంతులేదు. అంతకంతకు ఇంకా అది కొనలు వేస్తోంది. పండ్లు ఊడిపోయాయి. వెంట్రుకలు తెల్లబడ్డాయి. శరీరానికి వార్ధక్యం అలముకొన్నది. అయినా మునలి తనం అంటనివి రెండు మిగిలాయి. బ్రతుకుతీపి, విషయభోగాశక్తి. ఆ శాపానికి అంతు లేదు. దాని అంతం కానరాదు. దాని అంతాన్నే చూడగల్గితే ఈ సంసారం యొక్క అంతాన్ని చూచినట్లే. మణి కాంచన భూషణాలు, రథ, గజ, తురంగాలు, వధువులు, ధన ధాన్యాదు కూళాదులు ఎన్ని ఉన్నా ఆశాలతను ఖండించలేవు. కామోపభోగ సుఖాలు పురుషుడు ఎడతెగకుండా అనుభవిస్తూన్నప్పటికీ వానికి శాంతిలేదు. అగ్నిలో నేతిని కురిపించినా అది చల్లారుతుందా! ఇంకా వృద్ధి చెందుతుంది.

పురుషుడు ఎపుడూ తల్లితో కానీ, తోబుట్టువుతోకానీ, అక్కా చెల్లెళ్ళతో కానీ, కూతురుతో కానీ ఏకాంతంలో ఏకాసన పై కూర్చుండరాదు. మహాయోగినైనా బలిష్ఠమైన ఇంద్రియాలు ఆకర్షింప మానవు ముక్తిని కాంక్షించేవాడు అంగనలతో సాంగత్యం పెట్టుకోరాదు. కనుక నేటినుండి నేను విషయ సుఖాలను విడిచి ఆశాలతను త్రెంచివేసి అహంకారం విడిచిపెట్టి మృగాకీర్ణమైన అరణ్యంలో సంచరిస్తాను. పరబ్రహ్మమందు చిత్తాన్ని పరాయత్తం చేస్తాను. బ్రహ్మనిష్ఠ మానవులకు అశాంతివారకం. అందుచేత నేను ఆ బ్రహ్మ నిష్ఠయందు ఆసక్తి వహించి ఆహారనిద్రాది యోగాలను పరిహరిస్తాను. ఆత్మ విదుడై సంసారంనుండి బయటపడినవాడే విద్వాంసుడు అని పలికి పూరునికి యవ్వనం అతనికిచ్చి తన ముదిమిని తాను స్వీకరించాడు. భోగాన్ని విడిచిపెట్టాడు. నిజబాహుబలంతో పాలించిన భూమండలాన్ని

విభజించి ద్రుహ్యునకు పూర్వభాగం, యదువునకు దక్షిణభాగం, తుర్వసునకు పశ్చిమదిక్కు, అనువునకు ఉత్తర దిగ్భాగం ఇచ్చి భూమండలం అంతకునూ బాలార్క తేజుడైన పూరువునభిషేకించి అన్నలనందరనూ అతనికి ఆధీనులుగా చేశాడు అనంతరం అతడు అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ నతడు, అనేక సంవత్సరాలు అనుభవించినా తరగని ఇంద్రియ సుఖాలు రెక్కలు వచ్చిన పక్షి గూటిని విడిచినట్లు క్షణమాత్రంలో విడిచి కరుణా సింధువైన శ్రీహరి కృపచేత అతడు అరిషడ్వర్గాన్ని గెలిచాడు. భగవత్కృపలేనిదే ఇంద్రియ సుఖాలను జయించటం ఎవరి తరమూకాదు. యయాతి ఆ రీతిగా సకల సంగాలు విడిచి సత్వరజస్తమో గుణాలు విడనాడి పరమమైన భాగవత గతిని పొందాడు.

దేవయాని భర్త చెప్పిన కథ విని స్త్రీ పురుషుల పరస్పర స్నేహంచే కల్గిన వికారాన్ని పరిహాస పూర్వకంగా చెప్పినా అది తననుద్దేశించి చెప్పిన కథగానే భావించింది పానశాల యందలి పాంథుల సంబంధంలాగా ఈశ్వ రాధీనులైన, పతి పుత్రాదుల సంబంధంకూడా భగవన్మాయా విరచితమని గ్రహించి ఐహిక సంబంధాలన్నీ స్వప్నంలాగా అనిత్యమైనవిగా భావించి సర్వసంఘాలూ విడిచి హరిపదాధీనచేతయై పరమ పదం చెందింది-అని ఈ రీతిగా యయాతి చరితాన్ని చెప్పి శుకుడు సర్వభూతనివాసుడు, శాంతుడు, వేదమయుడు అయిన వాసుదేవునకు నమస్కరించి ఇలా అన్నాడు.

పరీక్షిన్నరేంద్రా! నీవు పుట్టిన పూరుని వంశంలోని తేజోధనులైన వారి చరిత్రలు చెబుతాను విను. పూరునకు జనమేజయుడు, జనమేజయునకు ప్రాచీన్వాంసుడు. ఆ ప్రాచీన్వాంసునకు ప్రవీరోధమన్యువు, ఆతనికి చారువు పుట్టారు. ఆ చారువునకు సుద్యువు, సుద్యువునకు బహుగతుడు, బహగతునకు శర్యాతి, శర్యాతికి సంయాతి, సంయాతికి రౌద్రాశ్వుడు, రౌద్రాశ్వునకు ఘృతాచి యను అప్సరయందు ఋతేపువు, కక్షేపువు, స్థలేపువు, కృతేపువు, జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, సత్యేపువు, వ్రతేపువు, వనేపువు అను పదిమంది కొడుకులు జగదాత్మభూతుడైన ప్రాణునకు ఇంద్రియాల్లాగా జన్మించారు.

వారిలో ఋతేపువుకు అంతిసారుడు, అంతిసారునకు సుమతి, ధ్రువుడు అప్రతిరథుడు అను ముప్వురు పుట్టారు. వారిలో అప్రతిరథునికి కణ్వుడు కణ్వునకు మేధాతిథి, అతనికి ప్రస్కందుడు మొదలైన బ్రాహ్మణులు జన్మించారు. సుమతికి రైభ్యుడు పుట్టాడు. రైభ్యునకు దుష్యంతుడు పుట్టాడు.

సముద్ర పర్యంతమైన భూమండలాన్ని ఏకచ్ఛత్రాధిపత్యం క్రింద పాలిస్తూ దుష్యంత నరేంద్రుడు ఒకనాడు వేటయందు అభిరతుడై సింహ శార్దూలాది క్రూరమృగాలతో నిండిన అడవులకు వెళ్ళాడు. చప్పుళ్ళుచేస్తూ, నీళ్ళల్లో వెదుకుతూ, వలలు పన్నుతూ, బాణాలు ప్రయోగిస్తూ అతడు తమకంతో

మృగయూధాలను తరిమి తరిమి వేటాడుతున్నాడు. అతనివెంట నిపుణులైన వేటగాండ్రుకూడా ఉన్నారు.అతడు అలా వేటాడుతూ వచ్చివచ్చి దైవయోగం చేత కణ్వమహర్షి తపోవనం చేరాడు. ఆ కణ్వవనంలో నానావిధ జంతుజాలం పరస్పర వైరం మరచి శాంతంగా సఖ్యంగా ఉంటున్నాయి. కాలసర్పాల జంటలకు నెమళ్లు పింఛాలతో విసరుతున్నాయి. మదజలధారతో గూడిన ఏనుగు గున్నలకు సింహాలు మేతలుపెట్టి ముద్దాడుచున్నాయి.

క్రూరమృగాలను కాపుగాపెట్టి మగజింకలు లేళ్ళతో రతిక్రీడలు సాగిస్తున్నాయి. పెద్దపులులు హోమధేనువుల కంఠాలను దువ్వుతూ ఆడుకొంటున్నాయి. నిరంతరం కలహించెడి పిల్లులు ఎలుకలు కూడా పరస్పర స్నేహభావంతో వర్తిస్తున్నాయి.జాతివైరం విడిచి ఈరీతిగా కలిసి క్రీడిస్తూన్న మృగాలను చూచి దుష్యంతుడు విస్మయావిష్టుడయ్యాడు. 'ఈరీతిగా మృగజాతులు కలిసి మెలసి చరించటం మే మెక్కడా చూడలేదు. ఔరా! దీనికి కారణం కణ్వమహర్షి తపోమహియే కాని మరేమికాదు" అని రాజేంద్రుడు మనస్సులో ఆ మహర్షిని ప్రశంసించాడు. ఆ తపోవనంలో నానావిధాలైన పువ్వులతో నిండిన కొలకులున్నాయి. ఆ కొలకులమీదుగా వీచెడి సుగంధ వాయువులకు దుష్యంతుడు మహానందం చెందాడు.

దుష్యంతుడలా ఆశ్రమాభిముఖంగా వస్తూండేసరికి అతనికి తుమ్మెదల ఝంకారాలు కర్ణపేయంగా వినవచ్చాయి. "ఇందు ఇందిరను (లక్ష్మి) మించిన సుందరి ఉన్నది. ఆమె తలవెంట్రుకలు ఇందిందిరాలను (తుమ్మెదలను) మించి నల్లగా ఉంటాయి. ఇందు వంశాగ్రణీ! ఇందు (ఇచ్చట) శుభం కలుతుంది" అని ఇందిందిరాలు ఇందీవరపీథిని (తామరపువ్వుల పంక్తుల్లో) విహరిస్తూ ధ్వనిస్తున్నట్లు అతనికి తోచింది. అలాగే మాకందాగ్రములందు (మామిడిచెట్ల చివుళ్ళయందు) కోకిలలు మా, కందర్పుని (మా మన్మథుని బాణాలు) మా కందములవటంచేత అవి మాకు అందాలు అన్నట్లుగా కూస్తున్నాయి. అపుడు దుష్యంతుడు కణ్వమహర్షి దర్శనం కాంక్షించి తన అనుచరులను అక్కడే నిలిపి తాను వంటరిగా ఆశ్రమంలోనికి వెళ్ళాడు

ఆ ఆశ్రమంలో ఒక తామర కొలకు దగ్గర లేమావి సీదలో కల్పలతల నడుమ మనోహరమైన పూపొదరింటిలో పువ్వులు పరచినచోట నేలపై వ్రేలాడుతూ నాట్యం చేస్తూన్న కుంతలాలు (వెంట్రుకలు) గల శకుంతలను చూచాడు. ఆమె కొప్పు దట్టంగా ఉంది. చనుగవ సమున్నతంగా ఉంది. మిఱుమిఱు చూపులతో చూస్తూ ఆమె మనోహరంగా ఉంది. ఆమె నడుము అల్లల్లాడుతోంది. అధరం తేనియలు స్రవిస్తోంది. ఆమెను చూచీ చూడగానే కామోద్రేకంతో ఆ రాజేంద్రునిమనస్సు ఉవ్విళ్ళూరింది. అప్పుడాతడు మన్మథుని పుష్పబాణాలకు లొంగిపోయి ఇలా అనుకొన్నాడు.

వన్యాహారాలతో జితేంద్రియుడై తపశ్చర్యలో మునిగి తేలెడి కణ్వుడు ఈ కన్యారత్నాన్ని ఎలా కన్నాడు? ఈ మీనాక్షి ఆ ముని కడుపున పుట్టినది కాదు. ఈమె తప్పక ఏ రాచకన్యో అయి ఉంటుంది. లేకపోతే పురువంశ సంజాతుడైన నా చిత్తం అన్యాయంగా క్షత్రియేతర కాంతయందు ఆసక్తమౌతుందా!

అడిగితే ఒకవేళ తాను క్షత్రియాంగనను కాదంటే ఏమికావాలి? అలా అని అడగటమా? మానటమా? అని కొంతసేపు అతడు తడబడ్డాడు. కాని తుదకు తన మనోభావమే సత్యమవుతుందని స్థిరీకరించుకొని - జవ్వనీ! నీవు జనపాలకన్యవని నా మనస్సు నీపై నాటుకుంది. నీ వారు ఏరీ? నీ పేరేమి? ఈ నిర్జన ప్రదేశంలో తిరగటం నీకు తగునా! - అని పలికిన రాజకుమారుని ముఖచంద్రికను నేత్ర చకోరాలతో త్రాగుతూ ఆమె విభ్రాంతి చెంది మౌనంగా ఉండిపోయింది. అప్పుడు మన్మథుడు అదే అదను అని ఆ కన్యకపై తన కుసుమాస్త్రాలు కురిపించాడు. ఆ పుష్పబాణాల వేడిమికి తాళిమి కోల్పోయి ఆమె ఇలా అన్నది.

రాజేంద్రుడైన విశ్వామిత్రునకు మేనకవలన జనించిన దానను నేను. మేనక నన్ను విడిచిపోగా ఈ అరణ్యంలో కణ్వమహర్షి నన్ను పెంచి పెద్ద దానను చేశాడు. ఆ మునీంద్రునకు సమస్తం తెలుసు. నేడు ఇచ్చట నా అదృష్టవశం చేత నిన్ను చూచాను. నా జీవితం చరితార్థమైంది. నీ ప్రజలో నేనుకూడా ఒక్కతెను. కనుక నేను నీ దాననే. ఈ పూట మా ఇంటనుండి మా ఆతిథ్యం స్వీకరించండి. మేమిచ్చే నీవారాన్నం గ్రహించండి - అని ఆమె అనేసరికి రాజేంద్రుడు ఆమె మనోభావం గ్రహించి - రాకుమారీ! అయితే నీవు నీకు తగిన రాకుమారుని పరిణయమాడటం తగును కదా! అని- మధురోక్తులతో ఆమె నంగీకరింపచేసి గాంధర్వ విధిని ఆ వన మధ్యంలో ఆమెను పెండ్లియాడాడు.

భరతుని చరిత్ర

ఆ రాచపట్టి అమోఘవీర్యుడు. కనుక ఆమె వెంటనే గర్భం ధరించింది. రాజేంద్రుడు మర్నాడు తన నగరానికి వెళ్ళిపోయాడు. కొంతకాలానికి ఆమె కొడుకును కన్నది. కణ్వమునీంద్రుడు ఆ రాచబిడ్డకు జాత కర్మాది మంగళాచారాలు చేశాడు. ఆ బాలుడు క్రమక్రమంగా బాలచంద్రునిలాగా పెరుగుతూ చిననాడే మొక్కవోని పరాక్రమంతో కణ్వాశ్రమంలో చరించెడి సింహకిశోరాల కంఠాలను బట్టి అణచేవాడు. తిరిగి విడిచేవాడు.

ఒకనాడు కణ్వమునీంద్రుడు శకుంతలను చూచి ఇలా అన్నాడు. "నీ మగడు పట్టపు రాజు. నీ కడుపున పుట్టిన వీడు అతనికంటెనూ ఘనుడు.

కనుక నీవు అక్కడికే వెళ్ళి పట్టపురాణివిగా ఉండటం ధర్మం. ఈ అరణ్యంలో తాపసులతో బాధలు పడుతూ ఉండవలసిన పనిలేదు. కనుక నీవు నీ అత్త వారింటికి తరలివెళ్ళు. వనితలు పుట్టిన ఇండ్ల దీర్ఘకాలం ఉండటం తగదు-అని మునిపుంగవుడు అనగా శకుంతల ఆ పిల్లవానిని వెంటపెట్టుకొని భూపాలుని సభామండపానికి వెళ్ళి నిలబడ్డది. ఆ కుమారుని ఎడమచేతిలో చక్రరేఖ ప్రకాశిస్తోంది. రెండు పాదాల్లోనూ పద్మరేఖలు కాంతులు చిమ్ముతున్నాయి. ఆ పిల్లవాడు రమాధవుడు లాగా వెలిగి పోతున్నాడు. మన్మథాకారుడైన ఆ రాకుమారుని కళ్ళారా చూచి కూడా రాజేంద్రుడు ఏమీ పలకకుండా మౌనంగా ఉన్నాడు. శకుంతల అది చూచి విభ్రాంతి చెందింది.

అప్పుడు ఆకాశవాణి - రాజేంద్రా! ఈమె నీ సతి. ఈ పిల్లవాడు నీ కుమారుడు. వీరిని తిరస్కరించటం తగదు. ఆనాడు నీవు కణ్వ వనంలో ఈమెను గాంధర్వ విధిని చేసిన ప్రాణిగ్రహాన్ని మనస్సులో ఊహించుకో. శకుంతల మాటలను మన్నించు. కృపతో ఆమెను భరించు అని పల్కింది. ఇలా అశరీరవాణి సర్వభూతకోటికి తేటపడేలాగా 'భరించు'మని పల్కటంచేత ఆ కుమారుడు "భరతు"డయ్యాడు అనంతరం రాజు శకుంతలను, కుమారుని చేకొని కొంతకాలం రాజ్యపాలన చేశాక పరలోక గతుడయ్యాడు

అనంతరం భరతుడు రాజ్యభారం వహించి రెండవ హరిలాగా పాలించాడు. అతడు మహాబలవంతుడు అజేయుడు. యుద్ధ రంగంలో అతని ఎదుట నిలువజాలిన వాడు ఎవ్వడూ లేడు. అతడు చక్రవర్తి అయ్యాక యమునా తీరాన దీర్ఘతపుడను ముని పురోహితుడుగా డెబ్బది ఎనిమిది అశ్వమేధ యాగాలు చేశాడు. అలాగే గంగాతీరాన ఏబది అయిదు యాగాలు చేశాడు. ఇలా నూట ముప్పది మూడు అశ్వమేధయాగాలు చేసి బ్రాహ్మణులకు అపార దక్షిణలు ఇచ్చాడు. దేవేంద్రవైభవంతో భరతుడు అతిశయిస్తూ సవత్సాలైన లక్షల కొలది ధేనువులను అలంకరించి వేయిమంది బ్రాహ్మణులకు దానం ఇచ్చాడు. మష్కార తీర్థతీరమందు ఒక పుణ్యదినాన బ్రాహ్మణులకు కాంచన భూషణ శోభితాలు, తెల్లని దంతాలుగల పదునాలుగు లక్షల నల్లని ఏనుగులను విప్రముఖ్యులకు దానం ఇచ్చాడు. దిగ్విజయకాలంలో అతడు శకులు, శబరులు బర్బరులు, కిరాతకులు, హూణులు, మ్లేచ్ఛులు మొదలగువారిని అణచివేశాడు. రసాతలంలో రాక్షస కారాగృహాల్లో ఉన్న దివ్యాంగనలను విడిపించి వారి భర్తలకడకు పంపించాడు. త్రిపురాసురులను జయించి నిర్జరులను నిజమందిరాల్లో నిలిపాడు. అతని పరిపాలనలో భూమ్యాకాశాలు ప్రజలు కోరిన కోర్కెలన్నీ ఇచ్చేవి.

భరతుడు ఆ రీతిగా మహావైభవంతో లోకపాలకులను కూడా మించి ఇరవది ఏడువేల సంవత్సరాలు ధరణీపాలనం చేశాడు. అర్థసంపదలో అతడు

కుబేరుని కూడా అతిశయించాడు. అంతటి శౌర్యవంతుడు ముల్లోకాల్లో ఎవ్వడూ లేడనిపించుకొన్నాడు. అయినా అతడు అర్థప్రాణాలు వ్యర్థాలని భావించి విరక్తుడయ్యాడు. అతనికి ముప్పురు భార్యలు. వారు పుత్రులను కన్నారు. కాని వారు తమభర్త భరతునితో సరిరారని వారి శిరస్సులు ఖండించేశారు. విదర్భ రాజపుత్రికలైన ఆ ముప్పురూ శిశువులను అలా చంపివేసేసరికి భరతుడు పుత్రహీనుడయ్యాడు.

అనంతరం అతడు పుత్రార్థి అయి 'మరుత్ స్తోమం' అను యాగంచేసి దేవతలను మెప్పించి వారి వలన భరద్వాజుడనే కొడుకును పొందాడు. రాజేంద్రా! ఆ భరద్వాజుడెలా పుట్టాడో వానికి భరద్వాజుడనే పేరు ఎలా వచ్చిందో చెబుతాను విను.

బృహస్పతికి ఉచద్యుడను సోదరుడు ఉన్నాడు. అతని భార్య మమత. ఆమె గర్భవతి అయి ఉండగా బృహస్పతి ఆమెను మోహించి సంభోగించటం మొదలు పెట్టాడు. అపుడు గర్భస్థ శిశువు భయపడి 'వద్దు, వద్దు' అని మొర పెట్టినా బృహస్పతి వినక ఆ బాలుని అంధుడవు కమ్మని శపించి బలాత్కారంగా బీజాన్ని విడిచాడు. ఆ బాలుడు అలిగి తల్లియోనిలో పడిన ఆ వీర్యాన్ని కాలితో తన్నివేయగా అది నేలపైబడి బిడ్డ అయింది. మమత భర్తకు భయపడి బాలుని విడిచి పోతుండగా బృహస్పతి ఇతడు కూడా నీకు పుట్టిన వాడే కదా. వీనిని కూడా పెంచుకో అన్నాడు. అప్పుడు మమత నిరాకరించి ఈ ద్వాజుని* నీవే భరించుము అన్నది. ఇలా వారిద్దరూ వివాదించుకొని ఇరువురూ వానిని విడిచి వెళ్ళిపోయారు. కనుక వానికి భరద్వాజుడనే పేరు వచ్చింది. దేవతలు వానిని తీసుకొని వచ్చి భరతునికి ఇచ్చారు. వితథమైన భరత వంశానికి కర్త అవటం చేత అతనికి వితథుడు అనే మరొక పేరు కూడా వచ్చింది. ఆ వితథునికి మన్యువు, మన్యువునకు బృహత్క్షత్రుడు, జయుడు, మహావీర్యుడు, నరుడు, గర్గుడు అను ఐదుగురు కొడుకులు పుట్టారు. వారిలో నరునికి సంకృతి, సంకృతికి గురువు, రంతిదేవుడు అను ఇద్దరు కొడుకులు జన్మించారు.

## రంతిదేవుని చరిత్ర

రాజేంద్రా! రంతిదేవుడు మహా యశస్వి. అతని చరిత్ర నెఱుగని వారు ఎవ్వరూ లేరు. అయినా చెబుతాను విను. అతని దాతృత్వానికి మితిలేదు.

---

* మమతా బృహస్పతుల ఇరువురకూ పుట్టినవాడు. వారిరువురూ నీవే భరింపుమని ఒకరొకరిని పలికిన కారణం చేత అతడు భరద్వాజుడయ్యాడు. వితథం అయిన భరతుని వంశం నిలిపాడు. కనుక అతనికి వితథుడు అని పేరు వచ్చింది.

అతడు తాను గడించిన విత్తం అంతా దీనులకిచ్చి నిరుపేద అయ్యాడు. తిండానికి కూడు లేదు. అతడు సకుటుంబంగా అథమమైన యాచ్ఞావృత్తి నవలంబించి నలువది యెనిమిది రోజులు తిరుగగా ఒకనాడు ఉదయం అతనికి ఘృతపాయసాలు, నీరూ లభించాయి. వారందఱు ఆకలితో నకనక లాడిపోదుతున్నారు. ఆ అన్న పానీయాలు చూచేసరికి వారికి ప్రాణాలు లేచి వచ్చాయి. అవి తినడానికి ఉద్యుక్తులయ్యే సరికి ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చి అన్నమడిగాడు.

రంతిదేవుడు ఆ అతిథిని పూజించి 'హరి సమర్పణం' అని అన్నంలో సగభాగం ఇచ్చేసరికి అతడది భుజించి వెళ్ళిపోయాడు. వెంటనే శూద్రుడొకడు ఆహారార్థియై వచ్చాడు. రంతిదేవుడు కాదనకుండా తన దగ్గఱ ఉన్న అన్నంలో సగం ఈయగా అతడు దానిలో తృప్తిచెంది వెళ్ళాడు. ఆ వెనువెంటనే కుక్కలను వెంటబెట్టుకొని మఱొకడు వచ్చి అర్థించాడు. రంతిదేవుడు నిస్సంకోచంగా అన్న శేషం అతనికిచ్చి మ్రొక్కి పంపాడు.

ఇంతలో చండాలుడొకడు వచ్చి- రాజేంద్రా! నేను హీనుడను. చండాలుడను. ఆకలి దప్పులతో అలమటించి పోతున్నాను. అవలకు అడుగు వేయలేకుండా ఉన్నాను. నీ దగ్గఱ ఉన్న నీరు నాకు పోసి నన్ను బ్రతికించు- అని దీనంగా అర్థించాడు అతని దీనాలాపాలకు రంతిదేవుని హృదయం చలించింది "ఓయీ! అన్నంలేదు తియ్యని నీళ్ళు మాత్రం కొద్దిగా ఉన్నాయి. రా. త్రాగు. దేహధారులకు ఆపద వచ్చినపుడు ఆ యాపదను మాన్పి వారికి సుఖాన్ని కల్పించడం కంటే ఉత్తమమైనది వేఱే ఏమీలేదు- అన్నాడు. తానూ తన ఆలుబిడ్డలు పిడికెడు అన్నం కోసం, గ్రుక్కెడు నీళ్ళ కోసం తపించి పోతున్నారు. అయినా అణుమాత్రం కూడా అలయకుండా ఆ చండాలుని మనస్తాపాన్ని పోగొట్టడానికి నిశ్చయించుకొని సర్వేశ్వరాధీనుడై అతని పాత్రంలో తన దగ్గఱ ఉన్న నీళ్ళన్నీ పోశాడు.

రంతిదేవుని అపార త్యాగానికి మెచ్చి బ్రహ్మాదిదేవతలు నిజాకారాలతో వచ్చి అతని ముందట నిలబడి- రాజా! నీ ధైర్యాన్ని పరీక్షించడానికి విష్ణు మాయచే శూద్రాదిక రూపాలు ధరించి వచ్చాం- అనగా ఆ నరేంద్రుడు వారందఱికి నమస్కరించాడు. అంతేకాని వారినతడు ఏమీ అర్థించలేదు. అతని మనస్సంతా నారాయణ భక్తితో నిండి పోయింది. అతడు మాయాపారజ్ఞుడు. మహాధీరుడు. అతడు నిస్సంగంగా కొంతకాలం గడపి పరమపదం చెందాడు. ఆ రాజర్షిని కొలిచిన వారందఱు అతని యోగ ప్రభావం చేత నారాయణ చింతనులై యోగీశులై సిద్ధపదం చెందారు.

రాజేంద్రా! ఇక గర్గ వంశక్రమం చెపుతాను విను. గర్గునకు శిని అనువాడు జన్మించాడు. అతనికి గార్గ్యుడు కలిగాడు. అతని నుండి బ్రాహ్మణ

కులం పుట్టింది. మహావీర్యునికి ఉరుక్షయుడు, ఉరుక్షయునకు త్రయ్యారుణి, కవి, పుష్కరారుణి అను ముగ్గురు కొడుకులు పుట్టారు. వారునూ బ్రాహ్మణులయ్యారు. బ్రహ్మక్షత్రునికి సుహోత్రుడు, సుహోత్రునకు హస్తి యనువాడు కలిగారు. ఆ హస్తియే తన పేర హస్తినాపురం నిర్మించాడు. ఆ హస్తికి అజమీఢుడు, ద్విమీఢుడు, పురుమీఢుడు అను ముగ్గురు పుట్టారు. వారిలో అజమీఢుని వంశంలో ప్రియమేధాదులు కొందరు పుట్టి బ్రాహ్మణులయ్యారు. అజమీఢునికి బృహదిషువు, అతనికి బృహద్ధనువు, అతనికి బృహత్కాయుడు, అతనికి జయద్రథుడు, అతనికి విశ్వజిత్తు, విశ్వజిత్తునకు సేనజిత్తు, సేనజిత్తునకు రుచిరాశ్వుడు, దృఢ హనువు, కాశ్యుడు, వత్సుడు అనెడి నలుగురు జనించారు.

వారిలో రుచిరాశ్వునకు ప్రాజ్ఞుడు, అతనికి పృథుసేనుడు, పృథుసేనునకు పారుడు, వానికి నీపుడు కలిగారు. నీపునికి నూరుగురు కొడుకులు పుట్టారు. అతడు శుకుడు కుమార్తె అయిన కృత్వితిని పెండ్లియాడాడు. ఆమె వలన నీపునకు మహాయోగీ, విజ్ఞానవంతుడూ, ఉదార చిత్తుడూ అయిన బ్రహ్మదత్తుడు కలిగాడు.

ఆ బ్రహ్మదత్తుడు జైగీషుని ఉపదేశంవల్ల యోగతంత్రంతోఆరితేరాడు. అతని భార్య గోదేవి. ఆమెవలన అతనికి విష్వక్సేనుడను కుమారుడు కల్గాడు. విష్వక్సేనునకు ఉదక్సేనుడు, ఉదక్సేనునకు బల్లాదుడు జనించారు. వీరు బార్హదిషవులను రాజులయ్యారు. ద్విమోఢునకు యమీనరుడు, యమీనరునికి కృతిమంతుడు, కృతిమంతునకు సత్యధృతి, సత్యధృతికి దృఢనేమి, దృఢనేమికి సుపార్శ్వకృత్తు, అతనికి సుపార్శ్వుడు, సుపార్శ్వునకు సుమతి, సుమతికి సన్నతిమంతుడు ఉద్భవించారు.

సన్నతిమంతుని కొడుకు కృతి అనువాడు హిరణ్యనాభుని వలన యోగ మార్గం తెలుసుకొని శోకమోహాలు విడిచి తూర్పుదేశంలో సామసంహిత వరించాడు. ఆకృతికి ఉగ్రాయుధుడు, ఉగ్రాయుధునకు క్షేమ్యుడు, క్షేమ్యునకు సువీరుడు, సువీరునకు పురంజయుడు, పురంజయునకు బహురథుడు కల్గారు. హస్తి కొడుకు పురుమీఢునకు సంతతి లేదు. అజమీఢునికి నళిని అను భార్య వలన నీలుడు పుట్టాడు. నీలునకు శాంతి, వానికి సుశాంతి, వానికి పురుజుడు వానికి అర్కుడు, అర్కునకు భర్మ్యాశ్వుడు, భర్మ్యాశ్వునకు ముద్గలుడు, యవీనరుడు, బృహదషువు, కాంపిల్యుడు, సృంజయుడు అను ఐదుగురు కొడుకులు పుట్టారు. అతనికి ఐదు దేశాలున్నాయి. అతడు విషయవాంఛలను విడిచి పెట్టి ఆ ఐదు దేశాలను అయిదుగురు కొడుకులకు ఇచ్చాడు అందుచేత వారికి పాంచాలు రనెడి పేరు వచ్చింది.

ముద్గలుని వలన బ్రహ్మణవంశం ప్రబలి ముద్గల గోత్రంగా ప్రఖ్యాతి చెందింది భర్మ్యాశ్వ పుత్రుడైన ఆ ముద్గలునికి దివోదాసుడు, అహల్య అను

కన్యకయు పుట్టారు. ఆ అహల్యయందు గౌతమునికి శతానందుడు జన్మించాడు. శతానందునకు ధనుర్వేద విశారదుడైన సత్యధృతి కల్గాడు అతడొకనాడు అడవిలో ఊర్వశిని చూచేసరికి అతనికి వీర్యస్ఖలనం అయింది. అది రెల్లు దుబ్బులో పడి మిథునంగా (స్త్రీ పురుష జంట) గా అయింది.

ఆ సమయంలో శంతనుడనే రాజు అడవికి వేటకు వచ్చి కృపతో ఆ శిశువుల జంటను చూచాడు. వారికి కృపి, కృపుడు అనే పేర్లు పెట్టి ఇంటికి తీసుకొనివచ్చి పెంచాడు. ఆ కృపి ద్రోణునికి భార్య అయింది. దివోదాసునకు మిత్రాయువు, మిత్రాయువునకు చవనుడు, చవనునకు సుదాసుడు, సుదాసునకు సహదేవుడు, సహదేవునకు సోమకుడు, సోమకునకు సుజన్మకృత్తు పుట్టాడు. సుజన్మకృత్తునకు నూరుగురు కొడుగులు కల్గారు. వారిలో జంతువనువాడు జ్యేష్ఠుడు. పృషదుడు కనిష్ఠుడు పృషదునకు ద్రుపదుడు, ద్రుపదునకు ధృష్ట ద్యుమ్నాదులైన కొడుకులునూ, ద్రౌపది అను కూతురునూ కలిగారు. ధృష్ట ద్యుమ్నునకు ధృష్టకేతువు పుట్టాడు. వీరందరూ పాంచాల రాజులు.

అజమీఢుని పుత్రుడు ఋక్షుడు. ఋక్షునకు సంవరణు డనువాడు పుట్టాడు. అతనికి తపతి యనెడి సూర్యకన్యయందు కురువు జన్మించాడు. ఆ కురువు పేరుతోనే కురుక్షేత్ర మయింది. ఆ కురువునకు పరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషదుడు అను నల్గురు కొడుకులు పుట్టారు. వారిలో పరీక్షిత్తు కొడుకులు లేకుండానే చనిపోయాడు. సుధనువునకు సుహోత్రుడు, సుహోత్రు నికి చ్యవనుడు, చ్యవనునకు కృతి, కృతికి వసువు, వసువునకు బృహద్రథుడు, కుశాంబుడు, మత్స్యుడు, ప్రత్యగ్రుడు, చేధిషుడు మొదలైనవారు పుట్టారు. వారిలో బృహద్రథునకు కుశాగ్రుడు, కుశాగ్రునికి ఋషభుడు, ఋషభునికి సత్యహితుడు, సత్యహితునికి పుష్పవంతుడు, పుష్పవంతునకు జహ్నువు, జన్మించారు.

ఆ బృహద్రథునకు వేరొక భార్యయందు రెండు శిశుఖండాలు పుట్టాయి. కాని తల్లి వానిని పారవేసింది. అప్పుడు జర యనెడి ఒక రాక్షసాంగన ఆ రెండు ఖండాలను సంధించింది. అతడే జరాసంధుడు. అతడు గిరివ్రజ పురాన్ని పాలించాడు. అతనికి సహదేవుడూ, సహదేవునకు సోమాపి, వానికి శ్రుతశ్రవుడు కలిగారు. కురుపుత్రుడైన పరీక్షిత్తునకు సంతతిలేదు. వానితమ్ము డైన జహ్నువునకు సురథుడు, సురథునకు విదూరథుడు, వానికి సార్వ భౌముడు, వానికి జయత్సేనుడు, వానికి రాధికుడు. రాధికునకు ద్యుమంతుడు, ద్యుమంతునకు క్రోధనుడు, క్రోధనునకు దేవాతిథి, దేవాతిథికి ఋక్షుడు, ఋక్షునకు దిలీపుడు, దిలీపునకు ప్రతీపుడు, ప్రతీపునకు - దేవాపి, శంతనుడు, బాహ్లికుడు, అను ముగ్గురు కొడుకులు పుట్టారు. వారిలో దేవాపి రాజ్యపాల

నానికి అంగీకరించక విరక్తుడై తపస్సు చేసుకోనేందుకు అడవికి వెళ్ళిపోయాడు. అనంతరం శంతనుడు రాజయ్యాడు.

శంతనుడు పూర్వజన్మంలో మహాభిషుడు అను పేరుతో ప్రఖ్యాతి చెందాడు. అతడీ జన్మంలో వృద్ధులను స్పృశించి వారికి యవ్వనం అలవడ చేసి వారికి శాంతిని కల్గించటం వలన అతనికి శంతనుడను సార్థకనామం కల్గింది. అతడు రాజ్యపాలనం చేస్తుండగా ద్వాదశవర్ష క్షామం సంభవించింది. అతడు బ్రాహ్మణులను పిలిచి క్షామ హేతువును గూర్చి ప్రశ్నించగా "అన్న ఉండగా తమ్ముడు అగ్నిని భార్యను గ్రహిస్తే అతనిని పరివేత్త అంటారు. కనుక నీవు పరివేత్తవయ్యావు. అది కారణంగా అన్నయుండగా తమ్ముడు రాజ్యార్హుడు కానేరడు. నీవు మీ అన్నకు రాజ్యం ఇస్తే అనావృష్టి దోషం పోతుంది' అనేనరికి శంతనుడు అడవికి వెళ్ళి దేవాపిని రాజ్యస్వీకారం చేయమని అర్థించాడు.

అయితే అంతకు పూర్వమే శంతనుని మంత్రి అశ్మరాదుని ఆదేశానుసారం బ్రాహ్మణులు అడవిలో ఉన్న దేవాపికి పాషండమతం ఉపదేశించారు. దేవాపి పాషండమతాన్ని ఆశ్రయించి వేదాలను నిందించటం మొదలుపెట్టాడు. ఆ పాపంవలన దేవాపిరాజ్యానికి అనర్హుడయ్యాడు. అది శంతనుడు తెలుసుకొని నగరానికి తిరిగి వచ్చాడు. ఇపుడు శంతనుని దోషం ఏదీలేదు కనుక వర్షం కురిసింది.

రాజేంద్రా! దేవాపి యోగియై ఇప్పుడు కలాప గ్రామంలో ఉన్నాడు. కలియుగాంతంలో నశించిన చంద్రవంశాన్ని అతడు కృతయుగాదిలో తిరిగి విస్తరింపచేస్తాడు. బాహ్లికుడనువానికి సోమదత్తుడు, సోమదత్తునకు - భూరి, భూరిశ్రవుడు, శలుడు అనువారు ముప్వురు పుట్టారు. బ్రహ్మశాపవశం చేత మానుషత్వం ధరించి గంగను వరించి భీష్మని కన్నాడు. అతడు మహాజ్ఞాని, ధర్మవిదుడు. పరమభాగవతోత్తముడు. వీరాగ్రగణ్యుడు. పరశురాముని కూడా యుద్ధంలో నోర్చిన యోధాగ్రేశరుడు. అతడు దేవసముడు. ఆ శంతనునకు దాశకన్యక అయిన సత్యవతి యందు చిత్రాంగద, విచిత్రవీర్యులను ఇరువురు పుట్టారు. వారిలో చిత్రాంగదుడు గంధర్వరాజుచే నిహతుడయ్యాడు.

సత్యవతి శంతనుని పెండ్లియాడుటకు పూర్వమే పరాశరమహర్షి సాంగత్యం వలన ఆమెకు కృష్ణద్వైపాయనుడు జన్మించాడు. అతడే వేదాలను విభజించి వ్యాసుడని ప్రఖ్యాతి చెందాడు. ఆ వ్యాసుడు సాక్షాత్తు భగవంతుడు. అనఘుడు పరమరహస్యమైన భాగవతాన్ని తన శిష్యులకు కూడా చెప్పకుండా పుత్రుడనైన నాకు ఉపదేశించాడు.

భీష్ముడు కాశీరాజు కూతురులైన అంబికను అంబాలికను బలాత్కారంగా తెచ్చి విచిత్ర వీర్యునికి వివాహం చేశాడు. అతడు మత్తుడై వారితో

నానావిధ శృంగార క్రీడలతో మునిగి తేలుతూ తుదకు క్షయవ్యాధి పీడితుడై మరణించాడు. అనంతరం తల్లి అయిన సత్యవతి ఉపదేశానుసారం వ్యాసుడు తన సోదరుని భార్యలతో సంగమించి అంబికయందు ధృతరాష్ట్రుని అంబాలిక యందు పాండుని, దాసియందు విదురుని కన్నాడు.

ధృతరాష్ట్రునికి గాంధారి యందు దుర్యోధనాదులను కొడుకులు నూరు గురునూ దుశ్శలయను కన్యకయు జన్మించారు. మృగశాపభయంచేత భార్యను పొందటానికి వెరచిన పాండురాజునకు కుంతీదేవునియందు ధర్ముని ప్రసాదం చేత యుధిష్ఠిరుడు, వాయువు వలన భీముడు, ఇంద్రుని వలన అర్జునుడు జనించారు. మాద్రియను మరొక భార్యవలన అశ్వినుల ప్రసాదంచేత నకుల సహదేవులు జనించారు. అలా పాండురాజునకు ఐదుగురు కొడుకులు పుట్టారు. ఆ అయిదుగురికీ ద్రుపదరాజ పుత్రియైన ద్రౌపదియందు క్రమంగా ప్రతి వింధ్యుడు, శ్రుతసేనుడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతకర్ముడు అనెడి ఐదుగురు కొడుకులు పుట్టారు. యుధిష్ఠిరునకు పౌరవి యను భార్యయందు దేవకుడు జన్మించాడు. భీమునకు హిడింబ యందు ఘటోత్కచుడు, కాశియను భార్య యందు సర్వగతుడు జన్మించారు. సహదేవునకు విజయ యను ఆమెయందు సహోత్రుడు పుట్టాడు. నకులునకు కరేణుమతియందు నిరమిత్రుడనువాడు జన్మించాడు. అర్జునునకు ఉలూపియందు ఇరావంతుడు చిత్రాంగదయందు బభ్రువాహనుడు, సుభద్రయందు నీ తండ్రియగు అభిమన్యుడు జన్మించారు.

వారిలో బభ్రువాహనుడు అర్జునుని ఆదేశానుసారం మాతామహుని గోత్రానికి వంశకర్త అయ్యాడు పరీక్షిన్నరేంద్రా! నీ జనకుడైన అభిమన్యుడు మహావీరుడు. అతను ధనుర్యుద్ధంలో శత్రురాజులను చీల్చిచెండాడు. అతడి పేరు చెబితేచాలు కురుసైన్యం గజగజ లాడేది. అతడు కురువంశానికి కర్త అయ్యాడు. ఆ అభిమన్యునకు ఉత్తరయందు నీవు జన్మించావు

నీవు నీ తల్లి కడుపులో ఉండగా ద్రోణుని కొడుకు అశ్వత్థామ బాణాగ్నికి ప్రాణావశిష్టుడవైన నీవు శ్రీహరి కృపచేత బ్రతికావు. నీ కొడుకులు నలుగురు. జనమేజయుడు, శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు అనువారు. వారిలో జనమేజయుడు, నీవు 'తక్షకాహిచే నిహతుడవయ్యావని రోషంతో లోకంలోని సర్పాలన్నీ సంహరించాలనే కాంక్షతో సర్పయాగం చేస్తాడు. అనంతరం ఆ జనమేజయుడు సమస్త భూమండలాన్ని జయించి కావషేయుడు పురోహితుడుగా అశ్వమేధయాగం చేస్తాడు వానికి శతానీకుడు జన్మించి యాజ్ఞవల్క్యుని వలన వేదాలను కృపాచార్యుని వలన అస్త్రవిద్యను, శౌనకుని వలన ఆత్మ జ్ఞానాన్ని అభ్యసిస్తాడు ఆ శతానీకునకు సహస్రానీకుడు, వానికి అశ్వమేధజుడు, వానికి అసీమకృష్ణుడు, వానికి నిచకుడు జన్మిస్తారు.

హస్తినగరం గంగానదిలో మునిగిపోగా అతడు కౌశాంబి నగరంలో నివసిస్తాడు. అతనికి ఉక్తుడు, ఉక్తునికి చిత్రరథుడు, చిత్రరథునకు శుచిరథుడు, శుచిరథునకు వృష్టిమంతుడు జన్మిస్తారు. వృష్టిమంతునకు సుషేణుడు, వానికి సుపీతుడు, వానికి నృచక్షువు, వానికి సుఖానిలుడు, వానికి పరిప్లవుడు కలుగుతారు.

పరిప్లవునకు మేధావి, మేధావికి సునయుడు, సునయునకు నృపంజయుడు, నృపంజయునకు దూర్వుడు, దూర్వునకు నిమి, నిమికి బృహద్రథుడు, బృహద్రథునకు సుదాసుడు, సుదాసునకు శతానీకుడు, శతానీకునకు దుర్దమనుడు, దుర్దమనునికి విహీనరుడు, విహీనరునకు దండపాణి, దండపాణికి మితుడు, మితునకు క్షేమకుడు, క్షేమకునకు బ్రహ్మక్షత్తు పుడతారు. అతడు అపుత్రుకు డవటంచేత అతని వంశం అంతటితో నశిస్తుంది. కాని దేవర్షుల అనుగ్రహం చేత అతనికి క్షేమకుడనే కొడుకు పుడతాడు. ఆ వంశం తిరిగి కలి యుగంలో ఏర్పడుతుంది.

రాజేంద్రా! ఇకమీద పుట్టబోయెడి మాగధరాజులను గూర్చి చెబుతాను విను జరాసంధునకు సహదేవుడు, సహదేవునకు మార్జాలి, మార్జాలికి శ్రుతశ్రవుడు, శ్రుతశ్రవునకు ఆయుతాయువు, ఆయుతాయువునకు నిరమిత్రుడు, నిరమిత్రునకు సునక్షత్రుడు, సునక్షత్రునకు బృహత్సేనుడు, బృహత్సేనునికి కర్మజిత్తు. కర్మజిత్తునకు శ్రుతంజయుడు, శ్రుతంజయునకు విప్రుడు, విప్రునకు శుచి, శుచికి క్షేముడు, క్షేమునకు సువ్రతుడు, సువ్రతునకు ధర్మనేత్రుడు, ధర్మనేత్రునకు శ్రుతుడు, శ్రుతునకు ధృఢసేనుడు, ధృఢసేనునికి సుమతి, సుమతికి సుబలుడు, సుబలునకు సునీతుడు, సునీతునకు సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు, విశ్వజిత్తునకు పురంజయుడు జన్మిస్తారు - అని చెప్పి శుకుడు ఇంకా ఇలా అన్నాడు రాజేంద్రా! విను. మగధ దేశాధిపతులు జరాసంధాదులు మహాకీర్తి శీలురు. వీరి వంశం కలియుగంలో ఒక వేయి సంవత్సరాల పర్యంతం నిలిచి తరువాత నశిస్తుంది.

## అనుని వంశం-యదు వంశం

యయాతి నాల్గవ కొడుకు అనునకు సభానరుడు, చక్షువు, పరోక్షుడు అను ముగ్గురు పుట్టారు. వారిలో సభానరునకు కాలనాభుడు, వానికి సృంజయుడు, సృంజయునకు జనమేజయుడు, వానికి మహాశాలుడు, వానికి మహామనుడు, వానికి ఉశీనరుడు, తితిక్షువు అను ఇద్దరు కొడుకులు జన్మించారు. వారిలో ఉశీనరునకు శిబి వనుడు, క్రిమి దర్పుడు అను నల్గురు కొడుకులు పుట్టారు. వారిలో శిబికి వృషదర్పుడు, సువీరుడు, మద్రుడు, కేకయుడు అను నల్గురు సుతులు కల్గారు.

ఉశీనరుని సోదరుడగు తితిక్షువునకు వృషద్రథుడు, వానికి హేముడు, హేమునకు సుతపుడు, సుతపునకు బలి, వానికి అంగుడు, వంగుడు, కళింగుడు, సింహుడు, పుండ్రుడు, అంధ్రుడు అను ఆరుగురు జన్మించారు. వానిలో అంగునకు ఖనపానుడు, వానికి హవిరథుడు, వానికి ధర్మరథుడు, వానికి ధర్మరథుడు, వానికి చిత్రరథుడు కల్గారు. ఆ చిత్రరథునకు రోమపాదుడను మరొక పేరు కలదు. అతనికి సంతానం లేకపోవటం చేత విచారిస్తూండగా అతని మిత్రుడగు దశరథుడు తన కూతురు శాంతను అతనికి సంతతిగా ఇచ్చాడు.

కొంతకాలానికి రోమపాదుని రాజ్యంలో అనావృష్టి ఏర్పడింది. విభాండక సుతుడైన ఋశ్యశృంగుడు వస్తే వర్షం కురుస్తుందని పెద్దలు చెప్పారు. ఆ ఋశ్యశృంగుడు మహారణ్యంలో ఘోర తపోనిష్ఠలో ఉంటాడు. అతడు పుట్టినప్పటి నుండి స్త్రీజాతిని చూచి ఎరుగడు. రోమపాదుడు అతన్ని తీసుకొనిరావటానికి అందకత్తెలైన వార స్త్రీలను పంపించాడు. వారు అడవిలో గోచి బిగియకట్టుకొని తిరుగుచున్న ఆ బ్రహ్మచారిని చూచారు. అతని మనస్సు ఎలాగైనా చలింపచేయాలని వారు ఆడుతూ పాడుతూ సవిలాసంగా అతని దగ్గరకి చేరారు.

ఋశ్యశృంగుడు ఎన్నడూ స్త్రీముఖం చూచిన వాడు కాకపోవటంచేత తుమ్మెద ఝూళ్లాగా ఉన్న వారి కేశభారాలను మునులు ధరించెడి జటలనుకున్నాడు. వారు ధరించిన చీనిచీనాంబరాలు చూచి అవి చర్మవస్త్రాల్లో ఒక భేదమనుకొన్నాడు. వారలంకరించుకొన్న మణికాంచన హారాలను రుద్రాక్ష మాలలుగా భావించాడు. వారు అలదికొన్న చందనం, కస్తూరి మొదలైన మైపూతలను నానా విధాలైన విభూతి పూతలనుకొన్నాడు. వారు చేస్తున్న మధురగానం శ్రుతి సహితమైన మంత్రాలనుకొన్నాడు వారు చేదాల్చిన వీణెలు యోగదండాలని భ్రమించాడు. వనితాకారాలను ఎన్నడూ చూడని కారణం చేత ముగ్ధుడైన ఆ తపసి వటుడు వారిని తాపసులుగా గణించి వారికి నమస్కరించాడు.

అలా వచ్చి నమస్కరించిన ఋశ్యశృంగుని చూచి వారు చిఱునవ్వు నవ్వుతూ అతని దగ్గఱకు వచ్చారు. క్షేమమేకదా! అని వారు కర్కశాలైన స్తనాలు అతని రొమ్మునకు గుచ్చుకొనేలాగా అతనిని గాఢంగా కౌగిలించుకున్నారు. అయ్యో! చిర తపశ్చర్య వలన ఎంత అలసిపోయావు? అని ముఖాన్ని, కంఠాన్ని, నాభిని కలియ తడిమారు. ఇవి క్రొత్తదీవెనలు సుమా! అని చెవుల దగ్గర నాలుకలతో చప్పుళ్ళు చేశారు. ఇవి మా తపోవనంలోని పండ్లు తినుమని నానావిధ భక్ష్యాలు ప్రేమతో ఇచ్చారు "ఇదో క్రొత్త లేడి చర్మం. మృదువుగా ఉంటుంది. దీన్ని ధరించు" అని గోచి ఊడదీసి సన్నని చీనాంబరాన్ని కట్టారు. ఆ విధంగా అతనిని వశం చేసుకొని మా తపోవనా

నికి రమ్మని వెంటబెట్టుకొని తీసుకొని పోయారు.

అడు లేడికి పుట్టి ఎన్నడూ ఆడదానిని చూడని ఋశ్యశృంగుడు ఈ రీతిగా కాంతాకటాక్షపాశాలచేత బద్ధుడై ఆ వేశ్యల వెంటబడి రోమపాదుని దగ్గరకు వెళ్ళాడు. రోమపాదు డాతని సాదరంగా ఆహ్వానించి అతనికి శాంత నిచ్చి పెండ్లిచేసి తన యింటనే ఉంచుకున్నాడు. అతడు రాగానే వర్షం కురి సింది. రోమపాదునకు పుత్రసంతతి లేదు. అది తెలిసికొని ఋశ్యశృంగుడు ఆ రాజుచేత ఇంద్రునిగూర్చి యజ్ఞం చేయించేసరికి అతడు పుత్రవంతు డయ్యాడు. ఆ మునీంద్రుని అనుగ్రహంచేతనే కౌన్నాళ్ళకు దశరథుడు కూడా పుత్రకామేష్టి చేసి సంతానవంతు డయ్యాడు.

రోమపాదునకు చతురంగుడు, చతురంగునకు పృథులాక్షుడు, పృథు లాక్షునికి బృహద్రథుడు, బృహత్కర్ముడు, బృహద్భానుడు అనువారు ముగ్గురు పుట్టారు. వారిలో బృహద్రథునకు బృహన్మనసుడు, బృహన్మనసు నకు జయద్రథుడు, జయద్రథునకు విజయుడు, విజయునకు సంభూతియను భార్యయందు ధృతి యనువాడునూ జన్మించాడు. ఆ ధృతికి ధృతవ్రతుడు, ధృతవ్రతునకు సత్యకర్ముడు, సత్యకర్మునకు అతిరథుడు జన్మించారు.

కుంతి చిన్నతనంలో చపలత్వంతో కోరి సూర్యుని పొందేసరికి ఆమెకు ఒక కొడుకు పుట్టాడు. ఆమె ఆ పిల్లవానిని పెట్టెలో పెట్టి గంగనీటిలో విడిచింది. అతిరథుడు ఆ పిల్లవానిని చూచి ఇంటికి తీసుకొనిపోయాడు. అతనికి కర్ణుడను నామకరణం చేశాడు. ఈ రీతిగా కన్యకు పుట్టిన కర్ణుడు అతిరథునకు కొడుకయ్యాడు - కర్ణునకు వృషసేనుడు పుట్టాడు.

యయాతి కొడుకైన ద్రుహ్యునకు బభ్రుసేతువు, బభ్రుసేతువునకు ఆరబ్ధుడు, ఆరబ్ధునకు గాంధారుడు, గాంధారునకు ధర్ముడు, ధర్మునకు ఘృతుడు, ఘృతునకు దుర్మదుడు, దుర్మదునకు ప్రచేతసుడు పుట్టారు. ప్రచేతసునకు నూరుగురు కొడుకులుపుట్టి మ్లేచ్ఛాధిపతులై ఉత్తర దిక్కును ఆశ్రయించారు. యయాతి ద్వితీయ పుత్రుడైన తుర్వసునకు వహ్ని, వహ్నికి భర్గుడు, భర్గునకు భానుమంతుడు, భానుమంతునకు త్రిసానువు, త్రిసానువుకు కరంధముడు, కరంధమునకు మరుత్తును కలిగారు. యయాతి శాపంచేత మరుత్తు అపుత్రకుడయ్యాడు.

రాజేంద్రా! ఇక యదువంశ చరిత్ర చెబుతాను విను. యయాతి పెద్ద కొడుకైన యదువు మానవాకృతిలో జనించిన సాక్షాత్తు శ్రీ విష్ణువు. ఆ యదు వంశ చరిత్ర విన్నా, చదివినా ముక్తి కరతలా మలకలం అవుతుంది.

యదువునకు సహస్రజిత్తు క్రోష్టువు, నలుడు, రిపుడు అను నలుగురు కొడుకులు పుట్టారు? వారిలో పెద్దవాడైన సహస్రజిత్తునకు శతజిత్తు కల్గాడు. ఆ శతజిత్తునకు మహాహయుడు, వేణుహయుడు, హేహయుడు, అను ముగ్గురు

పుట్టారు. వారిలో హేహయునకు ధర్ముడు, ధర్మునకు నేత్రుడు, నేత్రునకు కుంతి, కుంతికి మహిష్మంతుడు, మహిష్మంతునకు భద్రసేనుడు, భద్రసేనునకు దుర్మదుడు, దుర్మదునకు ధనికుడు, ధనికునకు - కృతవీర్యుడు, కృతాగ్ని, కృతకర్ముడు, కృతౌజుడు అను నల్గురు జన్మించారు. వారిలో కృతవీర్యునకు మహాబుద్ధిశాలి అయిన అర్జునుడు జన్మించాడు.

అతడు శ్రీహరి అంశంలో జన్మించిన దత్తాత్రేయుని సేవించి యోగసిద్ధి పొందాడు. అనేక యజ్ఞాలు, యాగాలు, తపస్సులు చేశాడు - అతడు సకల దిక్కులు జయించాడు. అతడు నిరంతర హరినామ స్మరణచేస్తూ ఉదార వృత్తితో అపార ధనం గడించాడు. ఎనుబదిమైదువేల సంవత్సరాలు భూమండలాన్ని పరిపాలించాడు. వార్ధక్యం లేకుండా నిత్యయౌవనుడై కార్త వీర్యుడని ప్రఖ్యాతి గాంచాడు. ఆరీతిగా అంతకాలం రాజ్యపాలనం చేసినవాడు లేడు. అతనికి వేయిమంది కొడుకులు. వారిలో జయధ్వజుడు, శూరసేనుడు, వృషణుడు, మధువు, ఊర్జితుడు, అను ఐదుగురు పరశురాముని బారినుండి తప్పించుకొని బ్రతికారు.

జయధ్వజునకు తాళజంగుడు, తాళజంగునకు ఔర్యముని తేజస్సు వలన నూరుగురు కొడుకులు కల్గారు. వారిలో ప్రథముడు వీతిహోత్రుడు. మధువునకు వృష్ణుడు పుట్టాడు. ఆ వృష్ణునకు నూరుగురు కొడుకులు పుట్టారు. వారిలో మొదటివాడు వృష్ణి. ఆ వంశస్థులు మాధవులని, వృష్ణులని, యాదవులని ప్రఖ్యాతి చెందారు. యదుపుత్రుడైన క్రోష్టువు అనువానికి వృజినంతుడు, వృజివంతునకు శ్వాహితుడు, శ్వాహితునకు భేరుశేకుడు, భేరు శేకునకు చిత్రరథుడు చిత్రరథునకు శశిబిందువు పుట్టారు.

శశిబిందువు మహాయోగి. అతనికి పదివేలమంది భార్యలు. వారి వలన అతనికి పదివేల లక్షల పుత్రులు పుట్టారు. అతడు సప్తద్వీపాలనూ నిరాటంకంగా పరిపాలించాడు. అతడు నీతిశాలి. పూర్ణచంద్రుడులాగా మహాతేజోనిధి. అతడు చతుర్దశరత్నుడు*. అతని కొడుకుల్లో ముఖ్యులు ఆరుగురు. వారిలో పృధుశ్రవుడు ఒకడు. పృధుశ్రవునకు ధర్ముడు, ధర్మునకు ఉశనుడు పుట్టాడు. ఉశనుడు నూఱు అశ్వమేధయాగాలు చేశాడు. ఉశనునకు రుచికుడు పుట్టాడు. ఆ రుచికునకు పురుజిత్తు, రుక్ముడు, రుక్మేషువు, పృదువు, జ్యామఘుడు అనే ఐదుగురు పుట్టారు.

జ్యామఘుని భార్య శైబ్య. అతనికి సంతానం లేదు. శైబ్యమీద ప్రేమాతిశయంచేత అతడు సంతానహీనుడైనా మరొక భార్యను స్వీకరించటానికి

* ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు, అస్త్రాలు, బాణాలు, నిధులు, మాలికలు, వస్త్రాలు, మణులు, శక్తులు, పాశాలు, విద్రుమాలు, ఛత్రాలు, విమానాలు అను ఈ పదునాల్గు వస్తువులు కలవానిని చతుర్దశ రత్నుడని అంటారు.

అంగీకరించలేదు. కాని కొంతకాలం అయ్యాక అతడు తన శత్రువులను జయించి వస్తూ వారికి చెందిన ఒక కన్యను బలాత్కారంగా రథంపై ఉంచి తీసుకొని వస్తున్నాడు. శైబ్య వారిద్దరినీ చూచింది. ఆమెకి పట్టరాని కోపం వచ్చింది. పతి నుద్దేశించి మాయకాడా నేనుండగా ఈ పడచును రథంమీద కూర్చుండబెట్టి తీసుకొని వస్తావా! అని కటువుగా పలికేనరికి అతడు భయపడి "దేవీ! ఈ లతాంగి నీ సవతికాదు. కోడలు కాగలదు. ఇది సత్యం." అన్నాడు. శైబ్య తనకు పుత్రోదయం కాగలదని సంతోషించింది. విశ్వేదేవతలు, పితృదేవతలు కూడా సంతోషించారు. వారి అనుగ్రహంచేత కొంతకాలానికి శైబ్యకు విదర్భుడు అనే కొడుకు పుట్టాడు. జ్యామఘుడు తాను తెచ్చిన కన్య, విదర్భునకు ఇచ్చి పెండ్లి చేశాడు. విదర్భునకు ఆమెయందు కుశుడు, క్రథుడు, రోమపాదుడు అను ముగ్గురు కల్గారు.

వారిలో రోమపాదునకు బభ్రువు, బభ్రువునకు విభువు, విభువునకు కృతి, కృతికి ఉశికుడు, ఉశికునకు చేది, చేదికి చైద్యాదులు పుట్టారు. క్రథునకు కుంతి, కుంతికి దృష్టి, దృష్టికి నిర్వృతి, నిర్వృతికి దశార్హుడు, దశార్హునకు వ్యోముడు, వ్యోమునకు జీమూతుడు, జీమూతునకు వికృతి, వికృతికి భీమరథుడు, భీమరథునకు నవరథుడు, నవరథునకు దశరథుడు, దశరథునికి శకుని, శకునికి కుంతి, కుంతికి దేవరాతుడు, దేవరాతునికి దేవక్షత్రుడు, దేవక్షత్రునకు మధువు, మధువునకు కురువశుడు, కురువశునకు అనువు, అనువునకు పురుహోత్రుడు, అతనికి అంశువు, అతనికి సాత్వతుడు, సాత్వతునకు-భజమానుడు, భజి, దివ్యుడు, వృష్ణి, దేవా వృధుడు, నందకుడు, మహాభోజుడు అను ఏడుగురు పుట్టారు. వారిలో భజమానునకు మొదటి భార్యయందు నిమ్రోచి, కంకణుడు, వృష్ణి అను ముగ్గురును రెండవ భార్యయందు శతజిత్తు, సహస్రజిత్తు, అయుతజిత్తు అను ముగ్గురునూ పుట్టారు. వారిలో దేవావృధునికి బభ్రువు జనించాడు. ఆ తండ్రి కొడుకుల ప్రభావం పెద్దలు శ్లోకరూపంలో పలిస్తారు. ఆ శ్లోకార్థం ఏమిటంటే- 'వారిని గురించి దూరాన ఉండి మనం ఏమి వింటూంటామో దగ్గరికి వచ్చినప్పుడు అదే చూస్తాం. మానవ సమూహంలో వారిరువురికంటే అధికులైన వారు ఎవ్వరూ లేరు."వారి వంశంలో పదునాలుగు వేల అరుపది అయిదుమంది పుట్టారు. వారందరూ దేవావృధు బభ్రువుల మహిమ వలననే ముక్తి చెందారు.

సాత్వతుని కొడుకు మహాభోజుడు. అతి ధర్మాత్ముడు. వాని వంశంవారు భోజులని ప్రఖ్యాతి చెందారు. వృష్ణికి సుమిత్రుడు, యుధాజిత్తు అను ఇద్దరు కొడుకులు జన్మించారు. యుధాజిత్తునకు శిని, అనమిత్రుడనువారు పుట్టారు. అనమిత్రునకు నిమ్నుడు పుట్టాడు. నిమ్నునకు సత్రాజితుడు, ప్రసేనుడు, అను ఇరువురు పుట్టారు. అను మిత్రునకు శినియనువాడు వేరొకడు

క్లాడు. అతని కొడుకు సత్యకుడు. సత్యకునకు యుయుధానుడను పేరు గాంచిన సాత్యకి,ఆ సాత్యకికి జయుడు,జయునకు కుణి, కుణికి యుగంధరుడు పుట్టాడు.

అనమిత్రునకు వృశ్ని అను వేరొక కొడుకున్నాడు. వానికిశ్వఫల్కుడు, చిత్రకుడు అను ఇద్దరు పుట్టారు. వారిలో శ్వఫల్కునకు గాందిని యను భార్య యందు అక్రూరుడు, అనంగుడు, సారమేయుడు, మృదుకుడు, మృదువచ్ఛి వుడు, వర్మదృక్కు,దృష్టవర్ముడు, క్షత్రోపేక్షుడు,అరిమర్దనుడు, శత్రుఘ్నుడు, గంధమాదనుడు, ప్రతిబాహువు అను పన్నెండుమంది కొడుకులునూ,సుచారువు అను కన్యకయు జన్మించారు. వారిలో అక్రూరునకు దేవలుడు, అనుపదేవుడు పుట్టారు.

చిత్రకునకు పృదుడు, విదూరథుడు మొదలైన పెక్కండ్రు పుట్టారు. కుకురుడు, భజమానుడు, శుచి, కంబళబర్హిషుడు అను నలుగురు అంధకునకు పుట్టారు. కుకురునికి వృష్ణి, వృష్ణికి విలోమతనయుడు, విలోమ తనయునకు కపోతరోముడు, కపోతరోమునకు తుంబురుని సఖుడైన అనువు, అనువునకు దుందుభి. దుందుభికి దవిద్యోతుడు, దవిద్యోతునికి పునర్వసువు, అతనికి అహుకుడు అనుకొడుకు అహుకి యను కూతురు కల్గారు. ఆ అహుకునకు దేవకుడు, ఉగ్రసేనుడు అను ఇద్దరు జన్మించారు. వారిలో దేవకునికి దేవలుడు, అనుపదేవుడు, సుదేవుడు, దేవవర్థనుడు అను నల్గురు పుట్టారు. వారికి ధృతదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి అను తోబుట్టువులు ఏడుగురు కల్గారు. సౌందర్యరాశులైన దేవకి మొదలైన వారందరినీ వసుదేవుడు పెండ్లియాడాడు.

అహుకుని రెండవకొడుకు ఉగ్రసేనునకు - కంసుడు, న్యగ్రోధుడు, కహ్వుడు శంకుడు, సుహువు, రాష్ట్రపాలుడు, విసృష్టుడు, తుష్టిమంతుడు అను కొడుకులునూ కంస, కంసవతి, కంక, శూరభువు, రాష్ట్రపాలిక అను కుమార్తెలునుజన్మించారు.వారిని వసుదేవుని సోదరుడు దేవభాగాదులువరించారు

అంధకుని కుమారుడగు భజమానునకు విదూరథుడు పుట్టాడు. విదూరథునకు శిని, అతనికి భోజుడు-భోజునకు కుండుడు పుట్టాడు. వారిలో హృదికునకు దేవమీఢుడు, శతధనువు, కృతవర్మ అను కొడుకులు కల్గారు. ఆ దేవమీఢునకు శూరుడను పేరుకూడా ఉంది. శూరునకు మారిషయను భార్యయందు వసుదేవుడు, దేవభాగుడు, దేవశ్రవుడు, ఆనకుడు, సృంజయుడు శ్యామకుడు, కంకుడు, అనీపుడు, వత్సకుడు, వృకుడు అను పదిమంది కొడుకులూ-పృధ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవస, రాజాధిదేవి అనుఐదుగురు కుమార్తెలును పుట్టారు.

## వసుదేవుని వంశక్రమాను వర్ణనం

వసుదేవుడు పుట్టే సమయంలో ఆకాశాన అనకములు (ఉరుములు), దుందుభులు మ్రోగాయి. అందుచేతనే అతనికి ఆనకదుందుభి అను పేరు వచ్చింది. ఇతనికి శ్రీహరి కుమారుడై పుడతాడని గ్రహించి దేవతలు ఆనందించారు- వసుదేవుని తండ్రి అయిన శూరుడు తన చెలికాడగు కుంతి భోజుడు అపుత్రకుడైనందువలన అతనికి తన కుమార్తెయైన పృథను ఇచ్చాడు. కుంతిభోజునికి ఇయ్యబడటంచేత పృథకు కుంతి అను పేరు వచ్చింది.

ఒకనాడు దుర్వాసుడు కుంతిభోజుని ఇంటికి వచ్చాడు. కుంతి ఆ మహర్షికి కొన్ని దినాలు పరిచర్యలు చేసి అతని వలన "దేవహూతి"* అను విద్య నేర్చుకొన్నది. ఆ విద్యా ప్రభావం తెలుసుకోవాలని ఆమె ఒకనాడు ఏకాంతాన సూర్యుని పిలిచేసరికి అతడు ఆమె దగ్గరకు వచ్చాడు. ఆమె భయ పడ్డది. "దేవా! మంత్ర ప్రభావాన్ని పరీక్షించటానికి నిన్ను పిలిచాను. కాని నిన్ను కామించి కాదు. నా తప్పు క్షమించి తిరిగి వెళ్ళు." అని ప్రార్థించిన కుంతికి సూర్యుడు ఇలా అన్నాడు.

సుందరీ! నీ ఊహ అదే అగుకాక! దేవతలను ఆహ్వానించటం పరి హాసానికా! దేవ దర్శనం ఎప్పుడూ వ్యర్థం కాదు. కనుక నీవు గర్భవతివై కొడుకును కంటావు. నీ కన్యాత్వం చెడకుండా నేను వరం అనుగ్రహిస్తాను. నువ్వు భయపడకు. సిగ్గిలకు- అని ఆమెను అంగీకరింపజేసి ఆమెతో సంగ మించి ఆకాశానికి వెళ్ళిపోయాడు. అనంతరం ఆమె రెండవ సూర్యుడా అన్నట్లు మహా తేజస్కుడైన కుమారుని కన్నది. కాని లోకాపవాదు భీతితో, ఆ పసిబిడ్డను గంగా ప్రవాహంలో విడిచి తాను తన ఇంటికి వెళ్ళింది.

ఆ కుంతిని నీ ప్రపితామహుడైన పాండురాజు వివాహ మాడాడు. ఆమెకు పాండురాజువలన ధర్మజ, భీమార్జునులు పుట్టారు. ఆమె చెల్లెలైన శ్రుతదేవను కరూషకుడైన వృద్ధ శర్మ పెండ్లియాడాడు. వారిద్దరి ముని శాపంచేత దంతవక్త్రుడను దానవుడు జన్మించాడు. ఆమె తోబుట్టువగు శ్రుత కీర్తిని కేకయ రాజైన ధృష్టకేతుడు పెండ్లియాడాడు. ఆ దంపతులకు ప్రతర్దనుడు మొదలైన ఐదుగురు కొడుకులు పుట్టారు. ఆమె చెల్లెలు రాజాధి దేవిని జయత్సేనుడు పరిణయమాడాడు. ఆ దంపతులకు విందాను విందులు జన్మించారు. చేది దేశాధిపతి అయిన దమఘోషుడు శ్రుతశ్రవసను పరిగ్ర హించాడు. వారికి శిశుపాలుడుదయించాడు.

వసుదేవుడి తమ్ముడైన దేవభాగునికి కంస యందు చిత్రకేతువు, బృహద్బలుడు అను ఇరువురు పుట్టారు. అతని తమ్ముడు దేవశ్రవుడను వానికి కంసవతియందు వీరుడు, ఇషుమంతుడు అను ఇద్దరు కొడుకులు

---

*దేవతలను పిలిస్తే దగ్గరకి వచ్చేలా చేసెడి విద్య.

పుట్టారు. ఆ దేవశ్రవుని సోదరుడు కంసునికి కంకయను నామె యందు బకుడు, సత్యజిత్తు, కురుజిత్తు అనువారు కల్గారు. అతని తమ్ముడైన సృంజయు నకు రాష్ట్రపాలియందు వృషుడు, దుర్మరుణుడు మొదలైన వారు ఆవిర్భ వించారు. వాని అనుజుడైన శ్యామకునకు శూరభునందు హరికేశుడు, హిరణ్యా క్షుడు పుట్టారు. వాని తమ్ముడైన వత్సుడు మిశ్రకేశియను అప్సర యందు వృకాది సుతులను కన్నాడు.

వాని తమ్ముడైన వృకునకు దుర్వాక్షియందు దక్షుడు, పుష్కరుడు, సాళ్వుడు మొదలైనవారు కల్గారు. వాని అనుజుడైన అనీకునకు సుదాముని అనునామెయందు సుమిత్రుడు, అనీకుడు, ఖాణుడు మొదలైన కొడుకులు పుట్టారు. వారి అనుజుడైన యానకునకు కర్ణికయందు ఋతధాముడు, జయుడు అనువారు కల్గారు.

వసుదేవునికి పౌరవి, రోహిణి, భద్ర, మదిర, రోచన, ఇళ, దేవకి అను ఏడుగురు భార్యలున్నారు. వారిలో రోహిణి యందు బలరాముడు, గదుడు, సారణుడు, దుర్మదనుడు, విపులుడు, ధ్రువుడు, కృపుడు జనించారు. పౌరవి యందు సుభద్రుడు, భద్రబాహుడు, దుర్మదుడు, భద్రుడు, భూతుడు మొదలగు పన్నెండుమంది పుట్టారు. మదిరయందు నందుడు, ఉపనందుడు, కృతకుడు, శ్రుతుడు, శూరుడు మొదలైనవారు ఉద్భవించారు. కౌసల్యయందు కేశి, రోచనయందు హస్తహేమాంగాదులు, ఇళయందు యదుముఖ్యులైన ఉరువల్కాలాదులు, ధృతదేవయందు త్రిపృష్ఠుడు, శాంతిదేవ యందు ప్రశ్రమ, ప్రశ్రితాదులు, ఉపదేవయందు కల్పవృష్ట్యాదులు పదిమంది, శ్రీదేవయందు వసువు, హంసుడు, సుధనుడు మొదలగు ఆరుగురు, దేవరక్షితయందు గదాదులు తొమ్మండుగురు సహదేవయందు పురూడుడు, శ్రుతుడు మొదలైన ఎనమండుగురు, దేవకియందు కీర్తిమంతుడు, సుషేణుడు, భద్రసేనుడు, ఋజువు, సమదనుడు, భద్రుడు, సంకర్షణుడు అను ఏడుగురును పుట్టారు.

దుష్టులను నిగ్రహించటానికి, శిష్టులను అనుగ్రహించటానికి దేవకి అష్టమ గర్భాన విష్ణుదేవుడు పుట్టాడు. విష్ణువు జన్మించాక ఆ దేవకికి సుభద్ర పుట్టింది. ఆమె అర్జునుని భార్య అవటం చేత నీకు మాతృవ అవుతుంది.

ఎప్పుడు ధర్మక్షయం అవుతుందో, ఎప్పుడు పాపం ప్రవృద్ధం అవుతుందో అపుడు విశ్వేశ్వరుడైన శ్రీహరి అవతరిస్తాడు. సమస్తానికి కారణం ఈశ్వరమాయ. సృష్టి సంహారాలకు, కలిమికి, మోక్షానికి, జీవునకు ఆ మాయా విలసనమే మూలం. అలాంటి సర్వేశ్వరునకు జననాదిపరతంత్ర భావం ఏలా కల్గుతుంది? అక్షౌహిణుల కొలది రాక్షసులు అవనియందు జన్మించి జనులను బాధిస్తూంటే వారిని శాసించటానికి శ్రీహరి బలరామునితో అవతరించి ఎన్నో కర్మలు ఆచరించాడు. మానవుల దుఃఖాలన్నింటినీ పోగొట్టాడు.

భూభారం వారించాడు తన నిర్మల కీర్తిని దశదిశలా వెదజల్లాడు.

శ్రీహరి కీర్తియనెడి గంగామృతాన్ని కర్ణపుటాలతో ఏమాత్రం తావినా కర్మబంధాలు తొలగిపోతాయి. ఆ కమలాక్షుని మందస్మితం కర్ణకుండలాలచే దీప్తములైన చెక్కిళ్ళతోకూడిన ముఖం స్త్రీలూ పురుషులు కూడా కనురెప్ప వాల్చకుండా అవ్యవహితంగా చూడాలని కాంక్షిస్తారు. కాని మానవులకు అనిమిష భావం (రెప్పపాటు లేకుండా ఉండడం) లేదు కదా!

పరీక్షిన్నరేంద్రా! శ్రీహరి ఆ రీతిగా భూలోకంలో అవతరించాడు. గోవకులంలో పెరిగాడు. శత్రువులనేకులను వధించాడు. ఎందఱో వనితలను చేబట్టాడు ఒక్కొకరిత యందు నూర్గురేసి కొడుకులను కన్నాడు. ఆది పురుషుడైన తనను గూర్చియే అనేక క్రతువులు చేశాడు. కౌరవపాండవ యుద్ధంలో శత్రువులందఱినీ నమయించి అర్జునునకు విజయం చేకూర్చాడు. ఉద్ధవునకు తత్త్వోపదేశం చేశాడు. మగధ పాండవ భోజాంధకాదిరాజన్యులచే సంపూజ్యుడయ్యాడు. భూభారం హరించాడు. అనంతరం తన అవతారం చాలించి నిజమూర్తిలో లీనమయ్యాడు.

నగు మొగంతో నల్లని శరీరంతో, సన్నని నడుముతో లక్ష్మికి ఆటపట్టయిన వక్షస్థలంతో ఎత్తైన బుజాలతో, కనకకుండలాలంకృతాలైన కర్ణయుగంతో మదగజయానంతో,నీలవేణితో, కృపారసం చిందెడి కడగంటి చూపులతో, ముగ్ధమోహనంగా ఉండెడి శ్రీ కృష్ణుడు కనులు మూసినపుడూ, విచ్చినపుడూ నాకు ప్రత్యక్షమగుగాక—అని పలికి శుకయోగీంద్రుడు ఆనందపారవశ్యం చెందాడు.



# ఎమెస్కో వచన మహాభాగవతం

## (నాల్గవ సంపుటం)

శ్రీ పోతన మహాభాగవతమునకు అనుకృతి

## అయినంపూడి గురునాథరావు

శతావధాని కీ॥శే॥ శ్రీ కోట వీరాంజనేయ శర్మగారి ఎమెస్కో వచన రామాయణం ప్రచురణ పూర్తి కాగానే– అనూహ్యంగా శ్రీదేవీ భాగవతమును వచన రూపంలో వెలువరించాలని సంకల్పం కలిగింది.

ఈ సంకల్పము కలుగుటయే తరువాయి– మా చూపులు సంస్కృతాంధ్ర ఆంగ్ల, హిందీ భాషా చతుర్ముఖులు అయిన విద్వాన్ శ్రీ అయినంపూడి గురునాథ రావుగారి దెస ప్రసరించాయి. శ్రీ గురునాథరావుగారు మా కోరిక ననుసరించి- శ్రీదేవీ భాగవతమును ఆంధ్రీకరణములో సంస్కృత మూలమునకు తీసిపోకుండా సరళ వచన రచనములో ధారాళముగా రచన గావించారు. ఆ రచనను పూర్తిగా మూడు సంపుటాలుగా వెలువరించి యున్నాము.

ఎమెస్కో రామాయణమును సమాదరించినట్లుగా శ్రీ గురునాథరావుగారి రచన శ్రీదేవీ భాగవతమును పాఠకులు సహృదయముతో భక్తి పూర్వకముగా సమాదరించియున్నారు. ఈ సమాదరణ-మమ్ములను ఆయనచే-బమ్మెర పోతన శ్రీ మద్భాగవతమును ఆంధ్రలోకమునకు సరళవచనములో అందించ తలంపునకు పురికొల్పినది.

బమ్మెర పోతన భాగవతము అనగానే భక్తి ప్రపూరితమైన గాథలు- గజేంద్ర మోక్షము, ప్రహ్లాద చరిత్ర, వామన చరిత్ర, రుక్మిణీ కళ్యాణం, అంబరీషోపాఖ్యానము-ఈ భక్తమణుల మూల సూత్రమైన వాసుదేవతత్వమూ మదిలో పొంగి పొరలుతుంది. హరికీ, యోగివరులకూ అభిలషితమైన భాగవత గాథలు మధుర భక్తిలో ముంచి పచ్చల తురాయిని కూర్చిన బమ్మెర పోతన తెలుగు కావ్యం భాగవతగాథను సంపూర్ణముగా సరళ తెనుగు వచనంలో అందజేస్తున్నాము.

ఈ సంపుటములను కూడా పాఠకులు భక్తి ప్రపత్తులతో సమాదరించగలరని మా భావన.


## యం. శేషాచలం అండ్ కంపెనీ

మచిలీపట్నం - సికింద్రాబాదు.

COVER PRINTED AT : JYOTHI PRINTERS : METTUGUDA. SECUNDERABAD-17. PHONE : 74228